# ప్రజాకవి వేమన

## సిద్ధాంత గ్రంథం

డా॥ ఎన్. గోపి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

# PRAJAKAVI VEMANA (Ph.D Thesis) *By Dr N Gopi*


ప్రచురణ నెం 2350/2209R

ప్రతులు 1000

వి పి హెచ్ ప్రథమ ముద్రణ ఏప్రిల్, 2000

వి పి హెచ్ ద్వితీయ ముద్రణ జూలై, 2005





టైటిల్ డిజైన్ రాజా

టైటిల్ పై వేమన చిత్రం శీలా వీర్రాజు

వెల : రూ. 125-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
అబిడ్స్, హైదరాబాదు - 500 001
E-mail visalaandhraph@yahoo.com
విశాలాంధ్ర బుక్ హౌస్
(అబిడ్స్ /సుల్తాన్ బజార్) హైదరాబాదు
విజయవాడ విశాఖపట్నం, గుంటూరు
అనంతపురం తిరుపతి హనుమకొండ కాకినాడ





ముద్రణ: సరస్వతి ప్రింటర్స్, హైదరాబాద్ ఫోన్ 27612180

# అంకితం



నా అర్ధాంగి

అరుణకు....

# మూడో ముద్రణ సందర్భంగా...

ఇరవయ్యేళ్లుగా పరన పారనాల్లో నలుగుతున్న గ్రంధమిది. దీని తర్వాత వేమనపైన కొన్ని గ్రంధాలు వెలువడ్డా దీనిలోని అంశాలను ఉపయోగించుకొని చర్చ చేసినవే ఎక్కువ. దేశంలోని వేమన పద్యాల అముద్రిత, ముద్రిత గ్రంధాల ఆధారంగా త్వరలో నేను ప్రకటించబోయే "వేమన పద్యసర్వస్వం" అనే బృహత్ గ్రంధానికి ఒక రకంగా ఈ గ్రంధం భూమిక వంటిది. వేమన పద్యాలను అనేకకోణాల్లో పరిశీలించి చేయబోయే నిర్ధారణలకు కావలసిన ప్రాతిపదికలన్నీ ఈ గ్రంధంలో ఉన్నాయి. వేమన విజ్ఞానానికి (Vemana Lore) ఇదో మంచి ప్రారంభమని నా వినయపూర్వక అవగాహన.

1980 లో తొలి ముద్రణ వెలువడినప్పటి నుంచి ఈ పుస్తకానికి మంచి ఆదరణ వుంది. తొలి ముద్రణ ప్రతులు 6 నెలల్లో చెల్లిపోయాయంటే నాకు ఇప్పటికీ ఆశ్చర్యమే వేమన కోసం నేను చేసిన అప్పులన్నీ ఆ ముద్రణ తీర్చింది. ఈ లోపల వేమన పుస్తకం కావాలంటూ వేలాది ఉత్తరాలు వచ్చాయి కాని ధనాభావం వల్ల నేనాసాహసం వెంటనే చేయలేకపోయాను. 12 యేళ్ళ తర్వాత రెండో ముద్రణ వెలువడింది. ఆ ప్రతులు కూడా చెల్లిపోయి ఐదేళ్ళుదాటింది. ఇక నాకు మళ్ళీ ప్రచురుంచుకునే స్తోమత సమకూరలేదు.

ఈ సన్నివేశంలో విశాలాంధ్ర వారు తాము మూడో ముద్రణ వేస్తామని అడిగారు. వారి ప్రచురణల సంపాదకవర్గం ఆ మేరకు ఈ నిర్ణయం తీసుకుంది. ముఖ్యంగా విశాలాంధ్ర ప్రచురణాలయం సంపాదకులు డా॥ ఏటుకూరి ప్రసాద్ గారు, మేనేజర్, ఆత్మీయమిత్రుడు పి రాజేశ్వరరావుగారి చొరవ దీనికి కారణం నేను ఆనందంగా అంగీకరించాను ఎందుకంటే ప్రజల దగ్గరకు ఉత్తమ సాహిత్యాన్ని తీసికెళ్ళటంలో విశాలాంధ్ర ప్రచురణాలయానికి చరిత్ర ఉంది

ఈ గ్రంధాన్ని మునుపటిలాగానే ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

హైదరాబాదు
తేది. 9-3-2000

(ఎన్.గోపి)

# రెండో ముద్రణ సందర్భంగా...

పదకొండేళ్ళ తర్వాత రెండోముద్రణం వెలువడుతున్నది. 1980 లో అచ్చైన తొలిముద్రణం కాపీలు యేడాదిలోపే అయిపోయాయి. ఇన్నాళ్ళూ కాపీలు కావాలని ఎందరో అడుగుతున్నారు. వందలకొద్ది ఉత్తరాలు వస్తూనే ఉన్నాయి. వాటిని నిశ్శబ్దంగా అందుకున్నానే తప్ప మళ్ళీ ముద్రణకు ధైర్యం చెయ్యలేదు. మిత్రులూ శ్రేయోభిలాషుల వొత్తిడివల్ల ఇప్పుడీపనికి పూనుకున్నాను. ఈ ముద్రణకోసం నేను పడ్డ కష్టాలు చెప్తే తీరేవి కావు.

ఇది తొలి ముద్రణకు యధాతధ ప్రచురణ. రివిజన్ జోలికి పోలేదు. కారణం ఏమీలేదు. ఈ సిద్ధాంతవ్యాసం తరువాత వేమన్నపై నా వ్యాసంగాన్ని ఆపలేదు. వేమన్న వాదం (వ్యాఖ్యానం), వేమన పద్యాలు (పారిస్ ప్రతి పరిష్కరణ) ఇంకా అనేక వ్యాసాలు వచ్చాయి. అవి ఒక రకంగా దీనికి కొనసాగింపుగానే ఉన్నాయి. అంతేకాక దీనిలోని ప్రతిపాదనలు చాలావరకు కాలపరీక్షకు తట్టుకొని నిలబడ్డాయి. ఇవి నా తొలి ఆలోచనలకు గుర్తుగా, నా కృషికి క్రమవికాసంగా కూడా ఉంటాయని నా అభిప్రాయం.

ఈ గ్రంధముద్రణకు శ్రీ చెన్నూరి ఆంజనేయరెడ్డిగారు, మిత్రుడు శ్రీనివాస్ (పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత) గార్ల ప్రోత్సాహం మరువరానిది

ఈ గ్రంధాన్ని మునుపటిలాగానే అఖిలాంధ్రలోకం ఆదరిస్తుందని ఆశిస్తూ

(ఎన్.గోపి)

10-10-1991

తొలి ముద్రణ పీఠిక:

# మనసులోని మాటలు

## సంజాయిషీ:

ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి 1979లో డాక్టరేట్ డిగ్రీ పొందిన సిద్ధాంత వ్యాసం ఈ గ్రంథం. నా ఆరేండ్ల కృషిఫలం. వేమనను గురించి ఏవో కొత్త సంగతులు కనిపెట్టి లోకానికి చెప్పాలనే తాపత్రయంతో, ఆరాటంతో ఈ ప్రయత్నం చేశాను. ఫలితం అంతులేని అసంతృప్తి చేరవలసిన గమ్యాలు ఇంకెంతో దూరంలో ఉన్నాయి ఇసుకలో నూనె తీయటంలాగే పరిణమించింది నా పరిశ్రమ. అందుకే గ్రంథంచివర చెప్పవలసిన మాటలను ఆరంభంలోనే చెపుతున్నాను. "వేమన పద్యానికి ఎదురులేదు" అని రాయలసీమలో ఇప్పటికీ వినిపించే సామెత కాని వేమనపద్యాలను పరిశోధించి చేసే సిద్ధాంతాలకు ఎదురులేని కాలం ఇంకా రాలేదు

నేటికి 52 సంవత్సరాల క్రితం ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారి ఆధ్వర్యంలో వేమన్నను గూర్చి గంభీరమైన పరిశోధన జరిపి ఏడు ఉపన్యాసాలిచ్చిన రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు ఈ క్రింది మాటలన్నారు

*"శక్తిలో లోపములు చాల గలిగినను శ్రద్ధలో లోపము లేకుండ ప్రయత్నించితినిగాని, దూరదేశమందుండుటచే, తగిన సహాయసంపదలేక నాకే తృప్తిగా ఈ కార్యమును నెరవేర్పలేక పోయితిని "*

ఈ మాటలు రాళ్ళపల్లివారి వినయ సౌభాగ్యాన్నే కాక, విషయంలోని జాటిల్యాన్నీ, అగమ్యాన్నీ తెలియజేస్తాయి

వేమన్నలో ఎదురయ్యే చిక్కులను విప్పటానికి వారు రెండు సూచనలు చేశారు.

1 "కడప, కర్నూలు మండలములలో సావకాశముగా సంచారము చేసినగాని, వేమన కాల దేశములు నిర్ణయముగా చెప్ప వీలులేదు "

2 "పెక్కు వ్రాతప్రతులను చూచి పద్యములన్నియు సంగ్రహింపనిది యతని సిద్ధాంతముల నికరముగా ఏర్పరుప వీలులేదు "

1 నిజమే కడప, కర్నూలులోనే కాదు మొత్తం రాయలసీమ జిల్లాలే పర్యటించాలి దీనివలన ఎంతో కొంత ప్రయోజనం చేకూరవచ్చు దానికంటే ముందు కనీసం దొరుకుతున్న ఆకరాలలోని అవకాశాలన్నింటిని ఉపయోగించుకున్నామా అన్నది ప్రశ్న ముందు వేమన పద్యాల తాళపత్ర ప్రతుల వయస్సును నిర్ణయించడం తక్షణ కర్తవ్యం తారీఖులు వ్రాసిపెట్టి వున్నవి పోగా మిగిలిన వాటి మాటేమిటి? బ్రౌన్ సేకరించిన మద్రాసులోని ఓరియంటల్ లైబ్రెరీ ప్రతులేకాక తంజావూరు సరస్వతీ

మహల్‌లోనివి అతి ప్రాచీన ప్రతులని జనశ్రుతి అవి ఆ లైబ్రరీలోనికి ఎప్పుడు, ఎవరివల్ల వచ్చాయి అనే ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగిన రికార్డులుగాని, ఇతర సాక్ష్యాలుగాని కానరావు. ముందు లైబ్రరీ చరిత్ర స్పష్టంగా తెలిస్తేగాని ఈ ముడి విడదు

రాయలసీమ జిల్లాల్లో పర్యటిస్తే ఈ చిక్కు ఎట్లా తొలిగిపోతుంది? ఉన్న వాడుక కథలకు తోడు మరికొన్ని వాడుక కథలు పోగుచేయగలుగుతాము వాటికి ప్రాధాన్యమూ, వాటివలన ప్రయోజనమూ లేదనను కాని వాడుక కథలన్నింటిని క్రోడీకరించిన తర్వాత కూడ దానినుండి పిండిన చరిత్ర ఎంత స్పష్టంగా ఉంటుందనేది సందేహమే

అసలు చిక్కంతా మనకు సరియైన చరిత్ర లేకపోవటంలోనే ఉంది ఏవో సామ్రాజ్యాల గురించి, అదయినా భిన్నాభిప్రాయాల మధ్య కొంత తెలుస్తున్నది కాని స్థానిక చరిత్రల గురించి మనకేమీ తెలియదు ఇప్పటికయినా స్థానిక చరిత్రల మీద శాస్త్రీయ దృక్పథంతో పరిశోధన జరగవలసిన తక్షణావసరం ఎంతో ఉంది పల్లెల, జిల్లాల చరిత్ర ఆధారంతోనే సామ్రాజ్యాల చరిత్రను నిర్మించుకోవలసి ఉంది ఈమధ్య కావలిలోని జవహర్ భారతి కాలేజీ "నెల్లూరు జిల్లా స్థానిక చరిత్ర" మీద సెమినారు జరిపి ఈ ప్రయత్నానికి శ్రీకారం చుట్టింది ఈ మార్గంలోనే స్థానికులైన చారిత్రక వేత్తలు అన్ని జిల్లాల చరిత్రలపైన ఎంతో పరిశోధన చెయ్యవలసి వుంది

వేమనను గూర్చి పరిశోధించడం అంటే ఏదో ఒక ప్రత్యేక రంగంలో శిక్షణపొందిన వ్యక్తి చేయగలిగిన కార్యంకాదు వేమనపద్యాల్లో ఉన్నది అగాధమైన జీవితం ఆ జీవితం కూడ వేమన్నచేత అన్ని దృక్కోణాల నుంచి దర్శించబడినట్టిది చరిత్ర, సాంఘిక శాస్త్రం, తత్త్వశాస్త్రం మొదలైన అనేక శాస్త్రాల క్షుణ్ణమైన పరిచయం ఆధారంగా ఇంకెంతో పరిశీలన జరగవలసి ఉంది వేమన ఆశుకవితా సంప్రదాయానికి చెందినవాడు కాబట్టి అతని కాలప్రాంతాలు తెలియటం కష్టం అనే అభిప్రాయమొకటుంది ఆ మార్గంలో ప్రత్యేకంగా పరిశోధన జరిగితే తప్ప ఏ విషయాన్నీ తీర్మానించలేము అయితే ప్రస్తుత పరిస్థితుల్లో నాకు దొరికిన ఏ ప్రాచీనప్రతిని వేమన్న కాలనిర్ణయంలో ఏ కొంత సాక్ష్యంగా వాడుకున్నాను

2 పెక్కు వ్రాతప్రతులను చూచి పద్యాలన్నింటిని సంగ్రహించినప్పటికీ వేమన సిద్ధాంతాలను నికరంగా నిర్ధారించటం కష్టం నేనా పని కొంత చేశాను బహుముఖాలుగా సాగిన చర్చల్లో అనేక విషయాల నుదేప్పుట ప్రయత్నించాను అయితే ఇప్పటికయినా ఈ చిక్కుముడి సాంతంగా విడిపోతుందా అనేది ప్రశ్న అసలు వేమనను ఒక సిద్ధాంతపు చట్రంలో బిగించడం, లేక ఒక ప్రత్యేక దృక్పథాన్ని బలవంతంగా సాధించడం అవసరమా అన్నది ఎదురు ప్రశ్న!

ఒక కవికి విశిష్టమైన ఉద్దేశం ఉండాలి తప్పదు కాని వేమనలాంటివాడి విషయంలో కచ్చితమైన అభిప్రాయాన్ని ఆశించడం ఎంతవరకు సబబు? ఆశుకవితా సంప్రదాయ లక్షణాలతో, యథేచ్ఛగా పద్యాలు చెప్పినవాడిలో వస్త్వైక్యం కోసం తాపత్రయపడటంలో పరిశ్రమ ఉన్నంతగా ప్రయోజనం ఉంటుందా అనేది సందేహం!

ఒకానొక చారిత్రక పరిస్థితుల్లో, ప్రత్యేకమైన వ్యక్తిత్వంతో విమర్శలో, ఉపదేశాలో చేసినవాడు ఏ మతం వాడవుతాడు? జీవితాన్నీ, లేక జీవితంలోని సర్వవ్యవహారాలను, అభిప్రాయాలను విధానబద్ధం చేయటం సాధ్యంకాదు. పరిశోధకుడు ఎంత అదుపు చేయాలనుకున్నప్పటికీ కొన్ని ఆటంకాలు తప్పవు. విధానబద్ధం చేసేటప్పుడు, జీవితంలో కొంత భాగం మానవుని యధేచ్ఛా ప్రవర్తనకు చెంది ఉంటుందని విస్మరించరాదు. బహుశాస్త్రవేత్త, దార్శనికుడూ అయిన బెట్రండ్ రస్సెల్ "Democracy and Scientific Technique" అనే వ్యాసంలో ఈ భావాన్నే వెలిబుచ్చాడు.

"All activities must not be systematised or controlled Some part of life - perhaps the most important - must be left to the spontaneous action of individual impulse, for where all is system, there will be mental and spiritual death."

అయితే పరిశోధకుడు వీలయినంతలో విధానబద్ధతకొరకు ప్రయత్నించకూడదని నా అభిప్రాయంకాదు కాని అదే తిరుగులేని తుది నిర్ణయం కాకూడదు వేమన్న వెలిబుచ్చిన వివిధాభిప్రాయాల్లో ఒక సామాన్య లక్షణాన్ని గుర్తించవచ్చు. అదే మానవతా దృష్టి. వేమన్నను మానవతావాదిగా నిరూపించడంలో ఇబ్బందులేమీ లేవు. పైగా అదే అన్నింటికన్న ఉత్తమ పద్ధతిగా తోస్తున్నది సామాజిక నేపథ్యం వెలుగులో వేమన పద్యాలను గురించి నేను చేసిన పరిశీలనలో ఎంతవరకు కృతకృత్యుణ్ణయినానో సహృదయులే చెప్పాలి.

జరగవలసిన పని:

పరిశోధన ఒక నిరంతర కార్యక్రమం ఎప్పటికీ మారని, కదలని మొండి శిలలమీద నాకు నమ్మకం లేదు మైలురాళ్ళను ప్రేమిస్తాను పూర్వుల భుజాలమీద నిలబడి మరికొంత ఎక్కువదూరం చూశానని చెప్పకోవటానికి వినయం అడ్డురావటంలేదు సత్యాన్వేషణ నా ధ్యేయం వేమనలోని చిక్కుసమస్యలను అనేకసార్లు శక్తికొలది ధైర్యంగా ఎదుర్కొన్నాను సహృదయులందరూ ముందు ముందు చర్చల్లో పాల్గొని వేమన పరిశోధనను మరింత సుసంపన్నం చెయ్యాలని నా ఆశ విషయదృష్టితో నాలోని లోపాలను, పొరపాట్లను ఎవరెత్తిచూపినా దిద్దుకోవటానికి సిద్ధంగా ఉన్నాను

దేశంలో వేమన పద్యాల అముద్రిత ప్రతులు 70కి పైగా లభిస్తున్నాయి లభించినంతవరకు వివరాలు గ్రంథంలో ఇవ్వబడ్డాయి మద్రాసులో 54 ప్రతులు వున్నాయని మొదటినుంచి అందరు చెప్తున్న సంఖ్య నిజానికి అవి 56 రెండురెండు ప్రతులు ఒక్కొక్కటిగా కలిసిఉన్న ప్రతులు రెండున్నాయి (డి 1730, డి 1731, డి 1760, డి 1761) వాటిని ఒక్కొక్కటిగా లెక్కించి ఉంటారు క్యాటలాగులో 58 ప్రతులున్నాయి మిగిలినవి నాకు దొరకలేదు మద్రాసులోని తాటాకుప్రతులు తిరుపతికి తరలించబడ్డాయి బ్రౌన్ తయారుచేయించిన పట్టికా గ్రంథాలను, పద్య సూచికను నేను కాగితం ప్రతుల్లో చేర్చలేదు అనేక కారణాలవల్ల ఇంకా నా దృష్టికిరాని ప్రతులు కొన్ని ఉండిఉంటాయి లైబ్రరీల్లోనేకాక వ్యక్తులవద్దకూడా ప్రతులు

దొరకవచ్చు వీటన్నింటిని సేకరించి వేమన పద్య సర్వస్వాన్ని అంతా ఫోటోస్టాట్ కాపీలు తీయించి ఒక కప్పుకిందికి చేరిస్తే పరిశోధన సులువవుతుంది. ఇవేకాక ప్రజల నాలుకలమీద ఉన్న పద్యాలను టేపులద్వారా సేకరించి భద్రపరచాలి. పారిస్ నేషనల్ బిబ్లియోతికాలో ఓ తాటాకు ప్రతి ఉన్నదని తెలిసింది. దాని మైక్రోఫిల్మ్ పంపించడానికి కాలిఫోర్నియాలోని నారాయణమూర్తిగారు ప్రయత్నిస్తున్నారు. బంగోరె సారథ్యంలో "వేమనయోగి విజ్ఞాన కేంద్రం" మెటీరియల్ కలెక్షన్ కార్యక్రమం చేపట్టింది అది ఫలప్రదమయితే భవిష్యత్తులో వేమనమీది పరిశోధన కెంతో మేలు కలుగుతుంది.

నిస్వార్థపరులూ, పరిశ్రమశీలురూ, విషయదృష్టి కలిగినవారూ అయిన జిజ్ఞాసువుల పర్యవేక్షణలో వేమన పద్యాల సంశోధిత ముద్రణం వెలువడితే చిరకాలంగా వేధిస్తున్న చిక్కుముడులు చాలావరకు విడిపోవచ్చు.

## పునరుజ్జీవన ప్రయత్నాలు: రెండవ దశ

వేమన పద్యాలు తెలుగులో ఉండటంవల్ల ఆ తెలుగు నా మాతృభాష అయినందుకు నేనెంతో గర్విస్తున్నాను. రాతిబాటల్లో జాతిరత్నాలు వెదజల్లిన మహాకవి వేమన. నీతుల నీరనిధులు పొంగించిన సామాజిక ప్రవక్త వేమన పద్యాల్లోని వేమన సుదీర్ఘరోగానికి చేదుమందులిచ్చే వైద్యుడిగా, తీరాన్ని గానంచేసే నావికుడిగా సాక్షాత్కరిస్తాడు

విషమ పరిస్థితుల్లో, విషఘడియల్లో సమానత్వాన్ని కోటి చేతులెత్తి, కోటి గొంతుల్తో చాటిన వేమనలాంటి సాహసవంతులు ఏ దేశంలోనయినా అరుదుగానే కనిపిస్తారు దిక్కులు మోగేటట్లు పద్యాలతో అరిచి గీపెట్టిన సుకుమార హృదయం, హృదయాంతరాళాల్లోంచి సూటిగా చీల్చుకొని పూచిన మాటల మందారాలు వేమన్నకే చెల్లుతాయి వేమన్న పెలుసుతనానికి నొచ్చుకునేవాళ్ళకు నాదొక్కటే మనవి వేమన్న శాపాలుపెట్టే దుర్వాసుడు కాడు ఖండనకూ, దూషణకూ మధ్య గిరిగీయని తొందరపాటు మనది వేమన్న ఖండన అహంకార రహితం, సహేతుకం వేమన పద్యాలు "చదువ చదువ" మాధుర్యవంతాలు, స్వతంత్రాలు, సమయస్ఫూర్తి భరితాలు తెలుగుభాష చేసుకున్న అదృష్టంవల్ల వామనరూపాల్లో, త్రివిక్రమస్ఫూర్తితో మన వెయ్యేండ్ల పరిమిత వాఙ్మయం ఇముడ్చుకోలేనంతగా విస్తరించాయి

వేమన్నను అభిమానించటం అంటే వేమన్న భావాలను చాలావరకు అంగీకరించటం అని నా అభిప్రాయం వేమన్న చెప్పినదానితో ఏకీభవించకుండా, అతని భావాలకు విరుద్ధమైన మనస్తత్వంతో వేమనపట్ల ఆనవాయితీ – మెచ్చుకోలును ప్రదర్శిస్తే అది ఆశ్చర్యపడవలసిన సంగతి.

అరవైయేళ్ళక్రితం తెలుగునాట మొదలైన వేమన పునరుజ్జీవన ప్రయత్నాల్లో రెండోదశ (Second phase) ఇప్పుడు ప్రారంభమయిందని తోస్తున్నది 'కవిత్వ తత్త్వవిచారం'లో సి ఆర్ రెడ్డి వేమనను గూర్చి వ్రాసినవి 24 పంక్తులే అయినా ఆ గొంతు ఇప్పుడు 24 వేల పంక్తులుగా పురివిప్పింది ఆధునిక కవులు తమ

గొంతును వేమన్నలో వెతుక్కుంటున్నారు. ముఖ్యంగా కవిత్వం ప్రజల దగ్గరికి పోవాలనే అంశానికి సంబంధించి వేమన్న ఆధునికులను బాగా ఆకర్షిస్తున్నాడు.

అనేకులు వేమన్న సామాజిక, తాత్త్విక చింతనను గురించి ఆలోచిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు వేమన పద్యాలపైన సమగ్రమైన పరిశోధన జరిపించాలనే ఉద్దేశంతో "వేమనయోగి విజ్ఞానకేంద్రం" స్థాపించారు. విజయవాడలో శ్రీ త్రిపురనేని వేంకటేశ్వరరావు 'వేమన వికాస కేంద్రాన్ని' ఏర్పరచారు. యునెస్కో వారికోసం కాలిఫోర్నియాలోని డాక్టర్ జె యస్. ఆర్ ఎల్. నారాయణమూర్తి వేమనపద్యాలను ఇంగ్లీషులోనికి అనువదించే బృహత్కార్యం చేపట్టారు. కర్నూలు జిల్లా వెలిగోడులోని శ్రీ గుత్తం వెంకటరెడ్డి వేమన్న సామాజిక దృక్పథాన్ని గురించి గ్రంథ రచనకు సన్నాహాలు చేస్తున్నారు ఈమధ్య శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు వేమన పీఠాన్ని (Vemana chair) ఏర్పాటుచేశారు. బెంగళూరు (బెళహళ్ళి) లో గుల్జార్ అలీ అనే ఓ మహమ్మదీయ వేమన భక్తుడు వేమన ఆశ్రమం పెట్టాడు. రంగూన్‌లోని వేమన సమాజాలను గురించి వార్తలందుతున్నాయి. పత్రికల్లో పాఠక లేఖల సంచలనం మొదలయింది. ఇవన్నీ సంతోషించదగ్గ సంగతులే కాని, ఇక్కడే ఒక్కక్షణం నిలిచి ఆలోచించాలి మనం 60 ఏళ్ళనుంచి వెలువడిన వేమన విమర్శ సాహిత్యం సామాజిక అవసరాలను దృష్టిలో పెట్టుకొని పరిశీలించింది కాదు నిష్పాక్షికమైన అధ్యయనం లోపించిన సందర్భాలు కూడ ఉన్నాయి. కొన్ని అనారోగ్యకర ధోరణులకు బీజాలు పడ్డాయి.

వేమన్నను బ్రాహ్మణులు అణగదొక్కారని మొన్నటివరకు గగ్గోలు జరుగుతూనే ఉంది అయితే ఆ తర్వాత బ్రాహ్మణేతరులు వేమన్నను భుజాల కెత్తుకున్న తీరుకూడ వేమన్న ఔన్నత్యాన్ని పెంచేదిగాలేదు రెడ్డిరాణి సంచికలు చూసిన వారికి ఆ సంగతి స్పష్టమవుతుంది వేమన జయంతుల్లో 'వేమన పూజ, వేమన భిక్ష' అనే పేర్లతో చందాలు పోగుచెయ్యాలనే సూచనలు వచ్చేవి ఇదంతా ఎందుకు? అంటే "కులాభిమానము రేకెత్తించుటకు" (రెడ్డిరాణి, డిశంబరు 1928) అని స్పష్టంగా పేర్కొనబడింది కులాలే వద్దని గొంతుచించుకున్న వాడిపట్ల ఇదెంత అపచారమో సహృదయులే చెప్పాలి విగ్రహారాధనను వ్యతిరేకించినవాడి విగ్రహ ప్రతిష్ఠాపనకు సన్నాహాలు జరిగాయి ఇదంతా వేమనకు ప్రచారం కోసం అని సరిపెట్టుకోలేము. అందరికీ తెలిసినవాడికి ప్రచారం అనవసరం "కాయకంబె తొడిమె మెండు" అనే సామెత ప్రకారం వేమన్న ఉద్దేశాలను పక్కకునెట్టి వేమన్నను వాడేసుకోవటం జరిగింది వేమన్నకు గతంలో కొంత అన్యాయం జరిగినమాట వాస్తవమే! చరిత్రను కాదనలేము కాని ఎవరో కొందరు చాదస్తపు పండితులు ఈసడించుకున్నంత మాత్రాన వేమన పద్యాల నిరంతర కెరటాలను ఎవరాపగలిగారు? ఇవి ఇరవయ్యో శతాబ్దం చివరి రోజులు, తొలి దినాలు కావు ఇక్కడే, ఈ చారిత్రక సంధ్యలోనే మన అభిరుచులను సరిదిద్దుకోవ వన్నెపెట్టుకోవలసిన అవసరం ఏర్పడుతున్నది

వ్యతిరేకుల నుండేకాదు, భక్తులనుంచి కూడ వేమన పద్యాల అసలు తత్త్వానికి హాని జరగకుండా చూడాలి వేమన్నకు లేని వెర్రిని మనం ఇప్పుడు కొత్తగా

కల్పించనవసరం లేదు. ఆ వెల్తి మనలోనే ఉంది. దేశానికిప్పుడు పెద్ద కొదవ చిత్తశుద్ధి ఏ ఉద్యమస్ఫూర్తినయినా, ఉద్యమ ప్రయోజనాన్నయినా దెబ్బతీసేది ఇదే నేడు వేమన పద్యాల్లోని దిశనీ, భావావేశాన్నీ ప్రచారంచేసి దీనిని ఎత్తిచూపించటం సహృదయుల కర్తవ్యం. సకల మతసామరస్యం, సకల నీతిసారం, పదునైన తర్కం, అపారమైన, అనిర్వచనీయమైన జనరంజకశక్తి వేమన పద్యాల సొత్తు. అన్నిరకాల ప్రజలకు సమానంగా ఒకే పాత్రలో వడ్డించిన పద్యాలు వేమనవి.

## నివేదిక: కృతజ్ఞతలు

వేమన పద్యాలపట్ల నాకున్న ప్రత్యేకాభిమానం నన్నీ పరిశోధనకు పురికొల్పింది. 1974లో వెళ్ళి నా అభిలాషను వ్యక్తపరచగానే వెన్నుతట్టి చిరునవ్వుల చేయూత నిచ్చారు డా. సి నారాయణరెడ్డిగారు. పరిశోధనకు అవకాశం కల్పించారు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు డా॥ బి. రామరాజుగారు.

అపురూపమైన తమ ఇంటి గ్రంథాలయాన్ని చూడటానికి అనుమతించి "అముద్రితాలైన వేమన పద్యాలన్నీ చూడనిది వేమన్న మీద పరిశోధన ఏమిటి?" అని నన్ను రెచ్చగొట్టారు ఆరుద్రగారు. ఇక మద్రాసు ఓరియంటల్ లైబ్రేరీలో బ్రౌన్ సేకరణల పరిశీలన ప్రారంభించాను అక్కడ 38 తాళపత్ర ప్రతులకు బ్రౌన్ కాపీ చేయించి వ్రాయించిన కాగితం ప్రతులున్నాయి మూడు దఫాలుగా వెళ్ళి మద్రాసులో దాదాపు 70 రోజులుండి, సుమారు 15 వేల పాఠాంతరాలతో సహా మూడువేల పద్యాలను మూడువేల కార్డులమీద కెక్కించాను చాలావరకు వేమన పద్యాలన్నీ నా దగ్గరున్నాయన్న ధైర్యం చేకూరింది పద్యాల కార్డులున్న పెట్టెను ఆరుద్రగారికి చూపిస్తే "go ahead" అని ఆశీర్వదించారు

అయితే ఈ ధైర్యం ఎంతోకాలం నిలువలేదు తంజావూరు సరస్వతీ మహల్‌లోనే 5 తాటాకు ప్రతులున్నాయని తెలిసింది వెళ్ళి నా దగ్గరున్న పద్యాలతో వాటిని సరిపోల్చి చూచి కొత్త పద్యాలు వ్రాసుకుని వచ్చాను కాకినాడ గవర్నమెంటు ఆర్కివ్స్ అండ్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (ఇదివరకు ఆంధ్రసాహిత్య పరిషత్తు)లో మరో 7 తాటాకు ప్రతులున్నాయని విన్నాను అక్కడ కూడ కొన్ని కొత్త పద్యాలు దొరికాయి "తాటాకుల కెక్కకుండా, ముద్రిత ప్రతుల్లో లేకుండా ప్రజల నాలికలపైన ఉన్న పద్యాలు సేకరించావా?" అని అడిగారు డాక్టర్ రామరాజుగారు లేదు ఇక ఈ సేకరణకు అంతులేదు అనిపించింది ప్రవేశించాక తర్వాత దిక్కు తెలియలేదు తెలిసేసరికి అరణ్యమధ్యంలో ఉన్నాను

అయితే ఈ పద్యాలరాశిని, వెలలేని ఈ మణులమాగాణిని ఏం చెయ్యాలో తోచలేదు ఆయుధాలు లేనివాడికి యుద్ధం ఎదురైనట్టయింది నా పరిశోధన విషయంలో ఇవి ఏ మేరకు ఉపయోగిస్తాయి అని ఆలోచించక తలమున్కలుగా పరిశీలన మొదలుపెట్టాను సందిగ్ధ పరిస్థితిలో భయసందేహాలతో కొట్టుమిట్టాడుతున్నప్పుడు S M Katre రచించిన "An Introduction to Indian Textual Criticism" అనే గ్రంథం రక్షించటానికి వచ్చింది మహాభారత పరిష్కరణానుభవంలో నిగ్గుదేరిన

సూత్రాలతోఉన్న ఆ రచన అమూల్యమైనది. కొంత స్పష్టత ఏర్పడింది. ఇంతలో బ్రౌన్ చేసిన కృషి కొంత ఉపకరించింది. అకారాది క్రమంలో పేర్చుకున్న కార్డులు నా పనిని సులభతరం చేశాయి.

తాటాకు ప్రతుల పరిశీలనవల్ల కలిగిన ఫలితాలు నా సిద్ధాంత వ్యాసానికి భూమికను ఏర్పరిచాయి అదే మొదటి ప్రకరణంగా రూపుదిద్దుకున్నది. నా పరిశోధనలో చివరివరకు ఈ ఫలితాలే నా ప్రతిపాదనకు బలాన్ని ఇచ్చాయి.

ఇంతవరకు వేమన పద్యసంపుటాలు వందల సంఖ్యలో ముద్రించబడి ఉంటాయి. దాదాపు 90 పుస్తకాల జాబితా మాత్రం ఇవ్వగలిగాను మరీ పాత పుస్తకాల విషయంలో లైబ్రెరీలు నిస్సహాయతను ప్రదర్శించాయి. లైబ్రెరీలు దాకా రాకుండానే కాలగర్భంలో కలిసిపోయిన వెన్నో ఉంటాయి. ఈ సందర్భంగా ఎందరో మిత్రులను వారి ఇళ్ళ అటక లెక్కించాను. కొన్ని పుస్తకాలు లండన్, బ్రిటిషు మ్యూజియం లైబ్రెరీలో ఉన్నట్టు కేటలాగువల్ల తెలుస్తుంది వాటిలో చాలావరకు ఇక్కడనే దొరికాయి.

వేమన్నపైన మౌలికమైన పరిశోధనలు చేశారు వంగూరి సుబ్బారావు, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగార్లు. వారి కృషి నాకు అనేక విధాలుగా మార్గదర్శకమయింది. ఈ పరిశోధనలో నా దృష్టి ప్రధానంగా సాంఘికమైనది వేమన్నలోని కవిని, ముఖ్యంగా ప్రజాకవిని వెలికితీసి నిరూపించటం నా ధ్యేయం దీనిలోని ప్రకరణాలన్నీ ఈ లక్ష్యానికి ఉన్ముఖంగా నడిచాయి

విషయసేకరణ సందర్భంగా నేను సందర్శించిన గ్రంథాలయాలు ఈ విధంగా ఉన్నాయి మద్రాసు ఓరియంటల్ లైబ్రెరీ, కన్నెమెరా లైబ్రెరీ, అడయార్ థియోసాఫికల్ సొసైటీ లైబ్రెరీ, పెరియార్ రామస్వామి రేషనలిస్టు ఫోరమ్ లైబ్రరీ, మద్రాసు ఆర్కీవ్స్, కాకినాడ గవర్నమెంటు ఆర్కీవ్స్ అండ్ రిసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, తంజావూరు సరస్వతీ మహల్, తిరుపతి ఓరియంటల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్, వేటపాలెం సరస్వతీ నికేతనం, రాజమండ్రి గౌతమీ గ్రంథాలయం, వీరేశలింగం హితకారిణీ సమాజం, విజయవాడ రామమోహన గ్రంథాలయం, కావలి జవహర్ భారతి కాలేజి లైబ్రెరీ, శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం, శ్రీ వేమన ఆంధ్రభాషా నిలయం, స్టేట్ సెంట్రల్ లైబ్రెరీ, సిటీ సెంట్రల్ లైబ్రెరీ, ఉస్మానియా యూనివర్సిటీ లైబ్రెరీ, హైదరాబాదు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రెరీ, గవర్నమెంటు ఆర్కియాలజీ డిపార్టుమెంటు - పై సంస్థల అధికారుల తోడ్పాటు మరువరానిది

పరిశోధన సందర్భంగా ఆయా వ్యక్తులు చేసిన సహాయం కృతజ్ఞతలతో తీరనిది

మద్రాసులో ఉన్నన్ని రోజులూ తన తమిళనాడు హౌసింగ్ బోర్డు బ్యాచలర్ క్వార్టర్స్ రూములో నాకు ఆశ్రయమిచ్చి నా పరిశ్రమకు బాసటగా నిలబడ్డాడు మ్యాట్ సైన్సులో రిసెర్చి చేస్తున్న ప్రియమిత్రుడు ప్రకాశ్ పద్యాలన్నీ వ్రాసుకోడానికి రోజులు సరిపోవేమోనని సతమతమవుతున్నప్పుడు 'మేమున్నాం' అని ముందుకు వచ్చి వందలాది పద్యాలను నోటుబుక్కుల కెక్కించారు మిత్రులు జయసూర్య, మూర్తి కలిసినప్పుడల్లా [illegible], కందిరీగల్లాంటి సవాళ్ళను నాపైకి

విసురుతూ నా పట్టుదలకు మరింత జీవం పోశారు బంగోరె; తాము లండన్ బ్రిటిషు మ్యూజియం నుండి తెప్పించిన బ్రౌన్ 1829 నాటి వేమన పద్యాల తొలి ముద్రణం తాలూకు జిరాక్స్ కాపీని మళ్ళీ జరాక్సు చేసుకోడానికి అవకాశం కల్పించారు. ఆధార గ్రంధాల జాబితా వివరంగా ఇవ్వటానికి వారి సూచన స్ఫూర్తినిచ్చింది.

రెండు ఎండాకాలాలు నాకు ధారాదత్తంచేసి, విషయ సేకరణకై నేను వెళ్ళినచోటి కల్లా తోడునీడై వచ్చి రిసెర్చి చేసేది తానే అన్నంతగా తోడ్పడ్డాడు ప్రాణమిత్రుడు ఎం. హరిదాసు. బందరులో కలిసి తమ దగ్గరున్న పూర్ణయ్యాచారి వేమన సూక్తి రత్నాకరాన్ని బహూకరించారు నాదెళ్ళ పురుషోత్తంగారు (కీ.శే. నాదెళ్ళ పురుషోత్తంగారి మనుమడు). బ్రౌన్ నిఘంటువుల మీద పరిశోధన చేస్తున్న మిత్రుడు వి. చెంచయ్య (కావలి) తమ పరిశీలనలో ఎక్కడ వేమన ప్రసక్తి వచ్చినా నాకు వ్రాసి పంపారు; చివరిదాకా సహకార హస్తం చాచారు తాము వేమన్నపైన వ్రాసిన విలువైన అముద్రిత వ్యాసాన్ని ఇచ్చారు. వై. సి. వి. రెడ్డిగారు (కడప) రాయలసీమలోని వాడుక పదాల వివరాలను గురించి ఎప్పటికప్పుడు తెలియజేస్తూ ఎంతో సహకరించారు. మద్రాసు, తంజావూరు ప్రాచ్యలిఖిత గ్రంధాలయాల్లోని తెలుగు పండితులు తీర్థం శ్రీధరమూర్తి, విశ్వనాధంగార్లు కల్పించిన అనుకూల వాతావరణం అమూల్యమైనది

సమాచారనిధి జి కృష్ణగారు (ఆంధ్రప్రభ - ప్రత్యేక విలేఖరి) ఏ సందేహం వచ్చినా తీర్చేవారు, దారి చూపించేవారు, వెన్నెముకై నిలబెట్టేవారు ద్రావిడనాడు పత్రికలో కీ శే. అన్నాదురై వేమన్నమీద వ్రాసిన వ్యాసాన్ని కాపీచేయించి ఇచ్చారు బి ప్రభాకర్ (ఆంధ్రప్రభ · బులుసు వేంకట రమణయ్యగారి కుమారుడు) జె ఎస్ ఆర్ ఎల్ మూర్తితో దాదాపు రెండువేల వేమన పద్యాలను 20 రోజులపాటు కలిసి చదవటం ఓ అనుభవం వెంటనే అర్థంకాని మొండి పద్యాలతో పట్టిన కుస్తీల ఫలితంగా వేమన పద్యాల్లో [illegible]కొన్ని కొత్త వెలుగులు స్ఫురించాయి నారాయణమూర్తిగారు నా గ్రంధమంతా ఓపికతో చదివి చేసిన చక్కటి సూచనలు అక్కడక్కడ మార్పులు, చేర్పులకు దోహదం చేశాయి ప్రొఫెసర్ చేకూరి రామారావుగారు పూర్వ విద్యార్థినన్న అభిమానంతో 'వేమన కవిత్వం' ప్రకరణం చదివి సూచనలు చేశారు ఎల్లవేళలా వారు చూపిన వాత్సల్యం నాకెంతో ధైర్యాన్నిచ్చింది అయా సందర్భాల్లో సంభాషించినప్పుడు ప్రశ్నలడిగి నా [illegible]తును తెలుసుకోవడానికి తోడ్పడ్డారు డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ, డాక్టర్ భద్రిరాజు [illegible]ష్ణమూర్తి, డాక్టర్ జి ఎన్ రెడ్డి, డాక్టర్ తూమాటి దొణప్ప, డాక్టర్ [illegible], శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి, శ్రీ నేదునూరి కృష్ణమూర్తి, కాళోజీ, కె [illegible]శివ రెడ్డి, దేవిప్రియ, పి చెన్నకేశవరెడ్డి తదితరులు ఉత్తరాలు రాసి ఆశీర్వదించారు అనంతకృష్ణశర్మగారు

అవసరమైన ప్రతిసారీ చాకిరీదార్లుగా వ్యవహరించారు నా సోదరుడు చి॥ వేంకటేశం, నా శ్రీమతి అరుణ శుద్ధప్రతులు తయారుచేశాడు చి॥ నరసింహారెడ్డి బొమ్మలేసి ఇచ్చాడు బాల్యమిత్రుడు సత్యారాం వ్రాతప్రతుల దశ నుంచీ నామపద సూచిక తయారు చేసేదాకా అనేక విధాలుగా తోడ్పడ్డారు శ్రీమతి జె సులోచన ఎం ఏ నా పర్యటనలు, తదితర ఖర్చుల నిమిత్తం మూడు పర్యాయాలు దాదాపు

ఎనిమిదివేల రూపాయలదాకా అప్పు మంజూరు చేశారు మా కళాశాల క్రెడిట్ సొసైటీ నిర్వాహకులు. ఒకసారి రూ.400/- ట్రావెల్ గ్రాంటుగా ఇచ్చారు ఉస్మానియా యు. జి. సీ. యూనిట్ వారు. అందుబాటులో ఉన్న అవకాశాలను నాకోసం వినియోగించి ప్రోత్సహించారు మా ప్రిన్సిపాల్ సి. వి. రామకృష్ణారావు గారు. ఎన్ని విధాలుగానో బాసటగా నిలబడి, నా అలసత్వాన్ని మందలించిన మిత్రులు జి. చంద్రారెడ్డి ఎ. సి. ముత్తా, సత్యంసార్, రామానుజం గార్లు. ఈ వ్యాసంలోని ప్రతి అక్షరమూ ఓపికతో విని అవసరమైన తర్కంతో, అవధులులేని సహృదయంతో అత్యంత నిపుణంగా పర్యవేక్షించారు డాక్టర్ అమరేశం రాజేశ్వర శర్మగారు. నామీద అభిమానంతో థీసిస్ టైపింగ్ బాధ్యతంతా తనపై వేసుకొని అనితరమైన శ్రద్ధాసక్తులతో ఆ పనిని నిర్వహించాడు కవిమిత్రుడు టి. గౌరీశంకర్. నా విసుగును భరించి నేను కోరిన విధంగా ముఖచిత్రం వేసిచ్చారు అప్తులు శీలా వీర్రాజుగారు.

అతితక్కువ వ్యవధిలో అచ్చువేసి ఇచ్చారు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీనివాస్‌గారు. ముద్రణ సందర్భంగా నిపుణమైన సలహాలిచ్చారు చీమకుర్తి శేషగిరిరావు.

ఇందరు సహృదయుల అండదండలతో నా కృషి కేవలం నిమిత్తమాత్రంగా పరిణమిస్తూ ఈ సిద్ధాంత వ్యాసం రూపొందింది.

అందరినీ ఆనందాశ్రువులతో గుర్తు చేసుకుంటున్నాను.

(ఎన్.గోపి)
1980

★ ★ ★

# విషయసూచిక

## ఫోటోలు, చిత్రాలు



* * *

# వేమన పద్య నిర్ణయం

## వేమన పద్యాలు - వేరువేరు ప్రతులు

వేమన పద్యాల ప్రతులను గూర్చి ముచ్చటించేటప్పుడు ఆంధ్రవాఙ్మయోద్ధారకుడూ, మహనీయుడూ అయిన సి పి బ్రౌన్‌కు చేయెత్తి నమస్కరించక తప్పదు తాళపత్ర ప్రతులను సేకరించి, వాటికి కాపీలు వ్రాయించి, పాఠభేదాలను పోల్చిచూచి, శుద్ధపాఠాలను నిర్ణయించడం ద్వారా ఆయన చేసిన కృషి అనితర సామాన్యమైనది

వేమన పద్యసంపుటాల ప్రతులు మద్రాసు ప్రాచ్య లిఖితగ్రంథాలయంలో 54 దాకా ఉన్నాయి[1] వాటిలో 38 తాళపత్ర ప్రతులు, 16 కాగితపు ప్రతులు ఈ 38 తాళపత్ర ప్రతుల్లో దాదాపు అన్నీ బ్రౌన్ సేకరించినవే[2] ఇవికాక తంజావూరు సరస్వతీమహల్ లైబ్రేరీలో 5 ప్రతులూ, కాకినాడ సాహిత్య పరిషత్తులో 7 ప్రతులూ ఉన్నాయి

### తాళపత్ర ప్రతులు

**బ్రౌన్ ప్రతులు:**

| క్రమ సంఖ్య | లైబ్రేరీలోని డి నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | డి 1728 | 878 | 'నాదెండ్ల గోపాలయ వ్రాసుకున్న వేమారెడ్డి పద్యాలు' | |
| 2 | డి 1729 | 1009 | 'వేమన్నగారి పద్యాల' ప్రతి | |
| 3 | డి 1730 | 557 | బెజవాడ వర్ణన ప్రతి | పద్యలేఖకుడు గ్రంథాదిని బెజవాడ పురవర్ణన చేశాడు |

---

1 లైబ్రేరీలో [illegible] [illegible] నెంబర్లు డి 1721 నుండి డి 1774 వరకు

2 ఈ తాళపత్ర ప్రతులన్నీ తిరుపతిలోని రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌కి తరలించబడ్డాయి డి 1739, డి 1769 నెంబర్లు గల ప్రతులు తిరుపతిలో లేవు వాటికి బదులుగా 2949, 2950 నెంబర్లతో ఉన్నాయి ఇవి కూడ బ్రౌన్ సేకరించినవే అని వాటిపైన దాఖలాలున్నాయి 38 తాళపత్ర ప్రతుల సంఖ్య 44 దాకా పెరిగింది అంటే తిరుపతిలో అదనంగా 6 తాళపత్ర ప్రతులు లభించాయి

| | | | | |
|---|---|---|---|---|
| 4. | డి 1731 | 246 | | 1730 నెంబరు గల ప్రతీ, ఇదీ ఒకే ప్రతిలోని భాగాలుగా ఉన్నాయి |
| 5. | డి.1732 | 790 [3] | 'కొణిదెనకోమటిపుస్తకం' ప్రతి | చాల శిధిలమైన ప్రతి |
| 6. | డి.1733 | 785 | 'రంగారావు పంపిన బిచా బసప్ప కరలిఖిత ప్రతి' వేమన చిన్న పద్యాలు | చాలావరకు చెదలపాలయిన ప్రతి. తప్పుల తడక. |
| 7. | డి.1734 | 293 | 'మాజేటి సర్వేశలింగం ఖాసాదస్తూరిని వ్రాసుకున్న వేమయ పద్యముల ప్రతి' | వయస్సు "తారణ సం॥ మార్గశిర శు॥ 15 ఆదివారం నాటికి వ్రాసిన తారీఖు" |
| 8. | డి.1738 | 123 | 'వేమయదేవర నీతి శతక' ప్రతి (జ్ఞానం) | ఈ ప్రతిలో గరుడాచల విలాసమను యక్షగానం, రామకీర్తనాదులు కూడ కలిసి ఉన్నాయి |
| 9 | డి 1739 | 354 | 'దరిశి అగ్రహారం కాపురస్తులయిన దరిశి కృష్ణయ్య వేమనశతకం ప్రొస్తుకం' | |
| 10 | డి 1740 | 459 | బ్రౌన్ తిరస్కరించిన ప్రతి | 'చూడవలసిన నిమిత్తం లేద'ని బ్రౌన్ దీనిని విడిచిపుచ్చాడు (ఎందుకో?) |
| 11 | డి 1741 | 189 | 'కోదండ రామయ్య తెచ్చిన' ప్రతి | |
| 12 | డి 1742 | 498 | 'గోపాలుని శేషయ వేమన పద్య పంచ శతకము' ప్రతి | |
| 13 | డి 1743 | 108 [4] | | |
| 14 | డి 1744 | 1083 | 'వేమయ పద్యములు' | |
| 15 | డి 1745 | 308 | 'మాజేటి సర్వేశలింగం వ్రాసుకున్న' ప్రతి | 1734 ప్రతికిది మాతృక ఇది వ్రాసిన 6 రోజులకే అది వ్రాయబడినది |
| 16 | డి 1746 | 605 | | |

3 లైబ్రెరీ వారి కేటలాగులో పద్య సంఖ్య 795 అని పొరపాటుగా వేశారు
4 కేటలాగులో 111 పద్యాలని తప్పుగా ఇచ్చారు

| | | | | |
|---|---|---|---|---|
| 17. | డి 1747 | 194 | 'వేమన శతకం' (రెడ్డి వారి పద్యములు) | |
| 18 | డి 1748 | 300 | గూడూరు ప్రతి | "ఇది భట్టిప్రోలు వెంక ట్రాయుడు వ్రాసినవి. అనగా సర్వేపల్లి తాలూకాలో చేరి గూడూరులో వుండే తహస్సీలుదారు బడి చదువుల అయ్యవారు వ్రాశ్నిది" |
| 19 | డి 1749 | 380 | | |
| 20 | డి 1750 | 608 | 'దర్శి సుబ్బయ్య వేమన శతకం' | |
| 21 | డి.1751 | 309 | వేమయ శతకం | |
| 22. | డి 1752 | 559 | వేమన పుస్తకం | |
| 23 | డి 1753 | 503 | వేమన శతకం | |
| 24 | డి.1754 | 152 | వేమన శతకం | |
| 25. | డి 1755 | 323 | రాంగోలుసుబ్బయ్యగ్రంధం | ఏప్రిల్ 1833లో బ్రౌన్ కందింది. |
| 26. | డి 1756 | 112 | మామిళ్ళదొరువు ప్రతి | 'నెల్లూరు జిల్లాలో చేరిన మామిళ్ళదొరువులో బ్రాహ్మణుడి కీతావున దొరికిన పుస్తకం' |
| 27 | డి 1757 | 200 | | |
| 28 | డి 2758 | 182 | 'గణపవరపు ప్రతి' | |
| 29 | డి 1759 | 149 | | |
| 30 | డి 1760 | 196 | | అత్యంత శిధిలం |
| 31 | డి 1761 | 600 | | డి 1760 ప్రతితో కలిసి ఉంది |
| 32 | డి 1763 | 401 | 'యుద్దనపూడి చిన్నం రాజు వ్రాసిన ప్రతి' | 'మర్తుచల్మయ్య కొమారుడు సర్వేశలింగానికి యుద్నపూడి చింన్నము రాజు శ్రీకృష్ణార్పణం గాను వేమనశతక నాల్గు వొందలవఖ పద్యసం పూర్ణాన్నాను వ్రాశి యిచ్చెను' |
| 33 | డి 1764 | 93 | | |

| | | | | |
|---|---|---|---|---|
| 34. | డి.1765 | 309 [5] | | ఈ ప్రతిలో కొన్ని ఆకులు కనిపించడంలేదు. |
| 35. | డి.1766 | 501 | | |
| 36. | డి.1767 | 320 | 'వీకారం అనే గ్రంథం' | |
| 37 | డి.1768 | 91 | | |
| 38 | డి.1772 | 505 | 'వేమన చరిత్ర' | చరిత్ర లేదు; వేమన పద్యాలే |
| 39 | డి.1881 | 446 | అలభ్యం | |
| 40. | డి.8832 | 702 | అలభ్యం | |
| 41. | డి.2949 | 997 | సూర్యనారాయణప్రతి | 'కంరు మహంత్తి వెంకయ్యవ్రాలు' |
| 42. | డి.2950 | 1000 | పులిచెరి ప్రతి | 'పులిచెరిలో మాజేటి సర్వేశలింగం వ్రాసినది' |
| 43. | డి.2984 | 110 | వేమయ పద్యాలు | |
| 44. | డి.1830 | 1000 | | |
| 45. | డి 1831 | 446 | | |
| 46. | డి.1833 | 702 | | |
| 47. | డి.1771 | 152 | | |

## తంజావూరు ప్రతులు[6]

| క్రమ సంఖ్య | లైబ్రెరీలోని నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | యం 406 | 340 | వేమన్న కవి పద్యాలప్రతి | తెలుగు లిపి ఆకులు 23 అపూర్తి 'సీతారామ స్వామీ సహాయం కర శ్వతమపరాధం. క్షంతు శ్రీ శ్రీ శ్రీ మహంత్తి సంత్తః'. |
| 2 | యం 407 | 170 | | అత్యంత శిధిలప్రతి |
| 3 | యం 408 | 300 | | 'గజేంద్ర మోక్షము' అనే [illegible] ప్రతితో కలిసి ఉంది |
| 4 | యం 457 | 215 [7] | | ఇందలి పద్యాల్లోని మకుటం 'విశ్వతాభి రాము వివరివేమ.' |

5 కొన్ని ఆకులు పోవటంవల్ల 240 పద్యాలే ఉన్నవి
6 ఈ ప్రతులు రాజా శరఫోజీ సరస్వతీ మహల్ లైబ్రెరీ, తంజావూరులో ఉన్నాయి
7 కేటలాగులో ఇచ్చినట్టు 15 – కాదు అది అచ్చు తప్పు మొత్తం పద్యాలు 215

| | | | | |
|---|---|---|---|---|
| 5 | యం 35 | 70 | 'వేమన కృతవైరాగ్య కథనమ్' ప్రతి | కాగితపు ప్రతి. దేవనాగరి లిపిలో ఉంది. |

## కాకినాడ ప్రతులు[8]

| క్రమ సంఖ్య | లైబ్రెరీలోని నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | 185/9 | 271 (72 ఆకులు) | వేమన పద్యాలు చిన్న సైజు ప్రతి | చాలా పాతది. వ్రాత చక్కనిది 'విరక్త పద్యాలు, వేమయ గారు చెప్పిన లోక నీతి' అని రెండు విభాగాలు చేయబడి వ్రాయబడ్డాయి. విభాగాలు చేసి వ్రాయడం తాళపత్ర ప్రతుల్లో అపూర్వం |
| 2 | 14/9 | 260 | | అత్యంత శిధిలప్రతి చెదలు తిన్న అక్షరాలచోట రంధ్రాలు ఉన్నాయి మిగిలి ఉన్న అక్షరాలు వెలిసి పోయాయి. |
| 3 | 75/9 (పొడవైన 14 ఆకులు) | 123 | | తప్పుల తడక |
| 4 | 29/7 | 195 (22 ఆకులు) | | చివరి ఆకులు పోయి ఉంటాయి పద్యాలు ముగియలేదు చక్కటి వ్రాత |
| 5 | 191/9 | 513 (147 ఆకులు) | | ప్రత్యేకత ఏమీలేదు |
| 6 | 172/9 | 1106 | | ప్రథమ, ద్వితీయ భాగాలుగా విభజించబడింది కాని విషయవిభజన కాదు "ఇది రాసినది కిష్నడు విక్రమసం...." శిధిలం తప్పుల తడక |
| 7 | 198/3 | 1179 | | |

8 ఈ ప్రతులు ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారిచే సేకరించబడి ప్రస్తుతం Andhra Pradesh State Government Museum & Research Institute, Kakinada వారి అదీనంలో ఉన్నాయి

# హైదరాబాద్ ప్రతులు

## తాళపత్ర ప్రతులు[9]

| క్రమ సంఖ్య | లైబ్రెరీలోని నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | 2291 | | వేమన పద్యములు | 8 ఆకులు మిగిలిన అసమగ్ర ప్రతి. సమగ్రంగా ఉన్న ప్రతిలో ఎన్నివందల పద్యాలుండేవో కానీ ఇప్పటికి (ఒక్క పాదం, రెండు పాదాలుగా మిగిలిన పద్యాలను కూడ లెక్కిస్తే) 66 మిగిలాయి ఆకులవారిగా పద్యాల వివరాలు. మొదటి ఆకులో 3వ పద్యం నుండి 9వ పద్యం వరకు; రెండో ఆకు 71 నుండి 77 వరకు, మూడో ఆకు 159 నుండి 168 వరకు, నాలుగో ఆకు 179 నుండి 187 వరకు, ఐదో ఆకు 205 నుండి 213 వరకు, ఆరో ఆకు 220 నుండి 230 వరకు, ఏడో ఆకు 242 నుండి 254 వరకు |
| 2 | 1497 | | వేమన పద్యములు | 7 ఆకులు బాగా శిథిలమైన ప్రతి 83 పద్యాలున్నాయి అసమగ్ర ప్రతి మొదటి ఆకు 291 నుండి 301 వరకు, రెండో ఆకు, 318 నుండి 328 వరకు, మూడు, నాలుగు, ఐదు, ఆరు ఆకుల్లో 371 నుండి |

9 ఈ మూడు తాటాకుప్రతులు డా॥ బి రామరాజు సేకరించినవి

| | | | | |
|---|---|---|---|---|
| 3. | 848 | | | 416 వరకు; ఏడో ఆకు 430 నుండి 443 వరకు. 9 ఆకులు. వరసలో ఉన్నాయి. అసమగ్రం.. 94 పద్యాలు. |

### కాగితం ప్రతులు[10]

| క్రమ సంఖ్య | లైబ్రెరీలోని నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1. | 3840 | | 'నాగలింగ శివయోగి ప్రతి' | 9 నుండి 16 వరకు మొత్తము 7 కాగితాలు (10 నెంబరు కాగితం లేదు) అంటే 14 పేజీలు 161 పద్యాలున్నాయి రాత అస్పష్టంగా ఉంది |
| 2 | 3866 | | 'నాగలింగ శివయోగి ప్రతి' | 1085 పద్యాలున్నాయి ఈ ప్రతి మరీ మొన్న మొన్నటి దానిలాగే ఉంది ప్రతిని సేకరించినవారు దీనిలో కొత్త పద్యాలు ఉన్నాయని రాశారు కాని ఇది నిజం కాదు |

## కాగితపు ప్రతులు (Paper Manuscripts)

### బ్రౌన్ వ్రాయించినవి:

| క్రమ సంఖ్య | లైబ్రెరీలోని డ నెంబరు | పద్య సంఖ్య | ప్రతి పేరు | రిమార్కులు |
|---|---|---|---|---|
| 1 | 1731 | 1165 | 1842 నాటి ప్రతి | 4 భాగాలుగా విభజించబడింది చివర పద్యముల అకారాది క్రమ సూచిక ఉంది. |
| 2 | 1722 | 1165 | 1842 నాటి క్రొత్తప్రతి | 4 భాగాలుగా విభజించబడింది చివర అకారాది క్రమసూచిక ఉంది |

10 ఈ ప్రతులు హస్నాబాద్ (మహబూబ్ నగర్ జిల్లా ?) నివాసి నాగలింగయోగి వద్దనుండి సేకరించబడినవి

| | | | | |
|---|---|---|---|---|
| 3 | 1723 | 1116 | బెండమూడిలంక ప్రతి | అంటే, బెండమూరి లంక ప్రతికిది పొత్రిక. అకారాది క్రమసూచిక ఉంది. |
| 4 | 1724 | 306 | 'Q' ప్రతియొక్క పుత్రిక | వర్ణక్రమ సూచిక ఉంది. |
| 5 | 1725 | 869 | | "This is transcribed from TT 361 being the manuscript refered to as letter C." |
| 6 | 1726 | 686 | 1842 నాటిదే మరో ప్రతి | |
| 7 | 1727 | 675 | | ఈ ప్రతితో మరి రెండు ఇతర గ్రంథాలు కలిసి ఉన్నవి |
| 8 | 1735 | 1116 | బెండమూరిలంక ప్రతి | బెండమూరిలంక తాళ పత్ర ప్రతికిది పుత్రిక 1839 ఫిబ్రవరిలో పెనుగొండ నుండి వ్రాయించి తెప్పించినది |
| 9 | 1736 | 252 | | ఈ ప్రతితోపాటు చౌడప్ప శతకము, మరికొన్ని గ్రంథాలు ఉన్నాయి |
| 10 | 1737 | 1164 | | అకారాది క్రమ సూచిక ఉంది 4 ప్రకరణాలుగా విభజించబడింది |
| 11 | 1762 | 1154 | 1842 నాటిదే మరో క్రొత్తప్రతి | |
| 12 | 1769 | 936 | | |
| 13 | 1770 | 919 | | 1, 3, 11 భాగవత స్కంధాలతో కూడి ఉంది |
| 14 | 1773 | 3238 | బ్రౌన్ ఆంగ్లానువాద గ్రంథం | ఇది ఐదు సంపుటాలుగా ఏర్పడింది ఇందులో ఒక సంపుటం లాటిన్‌లోనికి అనువదింపబడింది |
| 15 | 1774 | 1300 | మరో ఆంగ్లానువాద గ్రంథము | improved edition |
| 16 | 1833 | (?) | | |

బ్రౌన్ తాను సేకరించిన 38 తాళపత్ర ప్రతులలోని పద్యాలన్నింటిని చక్కని వ్రాతగాండ్లచేత కాగితాలమీద కాపీ చేయించి భద్రపరిచాడు అవిధంగా ఏర్పడినవే పై 16 కాగితపు ప్రతులు 38 తాళపత్ర ప్రతులన్నింటిలోని పద్యాలసంఖ్య 16061 ఈ సంఖ్య వేమన పద్యాల మొత్తం సంఖ్య కాదు 38 ప్రతులలోని పద్యాలన్నింటిని కూడితే వచ్చిన రాశిసంఖ్య (Total quantity) అదేవిధంగా కాగితపు ప్రతుల్లోని రాశిసంఖ్య 15852 అంటే బ్రౌన్ కాగితాల కెక్కించకుండా వదిలివేసిన పద్యాలు స్వల్పం

38 తాళపత్ర ప్రతుల ఆధారంగా ఏర్పడ్డ ఈ 16 కాగితపు ప్రతులలోని పద్యాలనే నా పరిశోధనకు స్వీకరిస్తున్నాను ఈ 16 ప్రతులను చూస్తే 38 తాళపత్ర ప్రతులను చూసినట్టవుతుంది కాబట్టి నేను వీటిమీదనే ఎక్కువగా ఆధారపడుతున్నాను పాఠాలు విభేదించినప్పుడు, అదనపు వివరాలు అవసరమైనప్పుడు మాత్రమే తంజావూరు, కాకినాడ ప్రతులను సంప్రదిస్తున్నాను

అయితే కాగితపు ప్రతులన్నీ ఒక పూటలో ఏర్పడ్డవి కావు వీటివెనుక ఎంతో చరిత్ర ఉంది వీటికీ తాళపత్రప్రతులకీ ఉన్న సంబంధం, వీటిని వ్రాయించడానికి బ్రౌన్‌చేసిన నిరంతర పరిశ్రమా – ఇవన్నీ తెలుసుకుంటేగాని వేమన పద్యాలను గూర్చి ఒక అవగాహనకు రావడం కష్టం

వేమనను గూర్చి బ్రౌన్ మొదటిసారి 1824లో విని చదివాడు[11] విన్నదే తడవుగా గ్రంథసేకరణకు ఉపక్రమించాడు అప్పుడు అతడు మచిలీపట్నంలో ఉన్నాడు స్వస్థలంలోనే కాకుండా బళ్ళారి, కడప, నెల్లూరు, గుంటూరు, విశాఖపట్టణం నుండి తాళపత్ర గ్రంథాలను తెప్పించాడు[12] భౌగోళికదృష్టితో ఈ ప్రతులను రెండు తరగతులుగా విభజించవచ్చు 1 ఒక ప్రాంతంలో పుట్టి ఆ దరిదాపులలోనే సేకరించబడ్డవి ఉదా గూడూరు ప్రతి గూడూరులో పుట్టి నెల్లూరులో దొరికింది అదేవిధంగా మామిళ్ళ దొరువుకుచెందిన ప్రతి (డి 1756) కూడ నెల్లూరులోనే లభించింది కడప ప్రాంతంలో పుట్టిన మరో ప్రతిని (డి 1728) కూడ బ్రౌన్ కడపలోనే సేకరించాడు 2 ఇక రెండవతరగతి ప్రతులు పుట్టినప్రదేశానికి సుదూరప్రాంతాల్లో సేకరించబడ్డాయి ఉదా బెండమూరిలంక (తూర్పుగోదావరి జిల్లా)కు చెందిన ప్రతి (డి 1735) బ్రౌన్‌కు పెనుగొండ (అనంతపురం జిల్లా)లో దొరికింది[13] ఒంగోలు జిల్లాలోని దర్శి తాలూకాకు

---

11 In the year 1824 when I first read Vemana, my learned assistant Venkatasiva Sastri, interpreted it fully Brown Dictionary Notes- p 312, No D 1391, Vol 3

12 These were collected from Bellary, Cuddapa, Madras, Vizagapatam Preface - D 1773 Vol 4 After collecting such copies were to be found at Masulipatam where I was then stationed, I gradually procured others from Vizagapatam, Nellore Guntur, Cuddapa and Madras - Preface Verses of Vemana (Printed in 1829)

13 The original MS was found at Penugonda I had this copy made in Feb 1824 -Brown's remakes on MS No D 1735

చెందిన ప్రతిని, తూర్పు గోదావరిజిల్లాలోని యానాంకు చెందిన ప్రతిని (డి 1754) బ్రౌన్ ఇతర ప్రాంతాలలోనే సేకరించాడు అదేవిధంగా తమిళ దేశంలో బ్రౌన్‌కు దొరికిన ప్రతులన్నీ ఆంధ్రదేశంలో పుట్టి దేశాంతరయానం చేసినవై ఉంటాయి బ్రౌన్ ప్రతులు సేకరించిన ప్రదేశాలు ఎక్కువగా తూర్పు సముద్రతీర ప్రాంతాలు విశాఖపట్నం నుండి నెల్లూరుదాకా ఉన్న ముఖ్యమైన పట్టణాలన్నింటిలో బ్రౌన్ గ్రంథసేకరణ కార్యక్రమం నిర్వహించాడు ఉద్యోగరీత్యా కడపలో ఉన్నప్పుడు కూడ రాయలసీమలో అనేక ప్రతులు సంపాదించాడు బ్రౌన్ దాదాపు ఆంధ్రదేశపు అన్ని మూలలనుండి (తెలంగాణా తప్ప) బ్రౌన్ వేమన పద్యాలను సేకరించాడు దీనివలన వేమన పద్యాల ప్రాచుర్యపరిధి ఎంత విశాలమైందో తెలుస్తుంది

ఈ ప్రతులలో వేయి పద్యాలకు మించి ఉన్న ప్రతులు చాలా తక్కువ, వందల సంఖ్యలో పద్యాలున్న ప్రతులే ఎక్కువ వీటిలో అత్యధికసంఖ్యలో పద్యాలున్న ప్రతి డి 1744 దీనిలో 1083 పద్యాలున్నాయి అతి తక్కువ పద్యాలున్న ప్రతి డి.1768 దీనిలో 91 పద్యాలున్నాయి

## కాగితపు ప్రతులు (Paper Manuscripts):

కాగితపు ప్రతులన్నీ బ్రౌన్ వ్రాయించినవే వాటిలో అత్యధిక పదాలున్న ప్రతి డి 1773 ఇందలి పద్యసంఖ్య 3238 అతి తక్కువ పద్యాలు కలిగిన ప్రతి డి 1724 దీనిలో 306 పద్యాలున్నాయి

తాళపత్రప్రతుల నుండి వేమనపద్యాలను ఎత్తి వ్రాయించడంలో బ్రౌన్ అవలంబించిన పద్ధతులనుబట్టి కాగితపు ప్రతులను మూడు విభాగాలు చేయవచ్చు 1 అకారాది క్రమంలో వ్రాయబడ్డ పద్యాలు గలవి (డి 1723, డి 1724, డి 1727) 2 విషయాన్ని బట్టి విభాగాలు చేయబడ్డవి (4 భాగాలు డి 1721, డి 1722, 3 భాగాలు, డి 1737) 3 యథామాతృకగా వ్రాయబడ్డవి అకారాదిక్రమాన్ని తన 'తెలుగు ఇంగ్లీషు నిఘంటువు'లో ఎలె క-గ-ల వర్ణక్రమంలో కాకుండా మనకు ప్రసిద్ధంగా ఉన్న వరుసనే పాటించాడు బ్రౌన్ విషయాన్ని బట్టి బ్రౌన్ వేమన పద్యాలను మత, నీతి, అధిక్షేప, చిల్లర విభాగాలుగా వర్గీకరించాడు విభజనను గూర్చి వ్రాస్తూ ఇంగ్లీషులో కూడ వేమన పద్యాల వంటివి ఉన్నాయనీ, వాటిని సంగ్రహపరిచేటప్పుడు మాలలు (Garland), శతకములు (Centuries) అని విభజించనవసరం లేదని అభిప్రాయపడ్డాడు[14] విషయాన్నిబట్టి

---

14 A miscellaneous collection of unconnected verses, like the present, is generally denominated a Satakam which answers to the Garland or Centuries composed by English poets in old days, being a series of verses which are similar in metre subject and Chorus They are generally numbered in separate hundreds, but it appeared unnecessary to retain either that arrangement or that title in the present volume which more nearly resembles the Anthologies collected in Greek and Latin literature

Verses of Vemana
Preface (1829)

విభజించడం గ్రీకు, ల్యాటిన్ మొదలైన భాషలలో ఉందని వ్రాశాడు విషయాన్నిబట్టి విభజించే పద్ధతి మనకు అపూర్వం కాకున్నా వేమన పద్యాలను మొట్టమొదటిసారి నిర్దుష్టంగా విభజించి ప్రకటించిన ఘనత బ్రౌన్ దే

బ్రౌన్ ఈ ప్రతులలో పద్యాలను యేరుకొని, సంస్కరించి, 3238 పద్యాలను ఇంగ్లీషులోనికి (ఒక సంపుటం ల్యాటిన్ లోనికి) అనువదించి ఐదు సంపుటాలుగా వ్రాయించాడు (డి 1773, సంపుటాలు, 1,2,3,4,5) వీటిలో మత, నీతి, అధిక్షేప, మర్మ విషయాలున్న నాలుగు భాగాలు ప్రధానమైనవి పైనాలుగు విషయాల్లో దేనిలోనూ చేరనివి చిల్లర విభాగంలో చేర్చబడ్డాయి బ్రౌన్ ఈ విభాగాలను ప్రథమగ్రంధము (First book) ద్వితీయగ్రంధము (Second book) . అని వ్యవహరించాడు భాగం అనికూడా పిలిచాడు **"తెలుగులో నుండి ఇంగ్లీషులోనికి అనువదించబడిన పుస్తకములలో ఇదియే విస్తృతమైన ప్రథమ గ్రంథము"** అని డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు వ్రాశారు[15] పైన చెప్పిన ఐదు సంపుటాలే కాక వాటిలోనుండి మరో 1300 పద్యాలు ఏరుకొని ఆంగ్లానువాదం చేసిపెట్టాడు (డి 1774) దీనిని అచ్చుకొరకు సిద్ధపరచినట్టున్నది దీనిని సాహిత్య అకాడమీవారు "Verses of Vemana" అనే పేరుతో ప్రకటించారు

అనేక తాళపత్ర ప్రతుల చివర పాఠకుల సౌకర్యార్థం బ్రౌన్ అకారాది పద్యప్రథమ పాద సూచికలు వ్రాయించాడు వేమనపద్యాలకు సంబంధించినంతవరకు బ్రౌన్ ప్రారంభించిపోయిన ఈ సత్సంప్రదాయాన్ని అనంతర పరిష్కర్తలూ, ముద్రాపకులూ పాటించకపోవడం గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది[16]

## ప్రతుల పరస్పర సంబంధం:

ప్రతి నెంబరు డి 1735లో 1116 పద్యాలున్నాయి ఇన్ని పద్యాలు ఏ తాళపత్ర ప్రతిలోనూ లేవు అసలు ఏ తాళపత్ర ప్రతిలోని పద్యసంఖ్య కూడ వేయిని మించలేదని చెప్పవచ్చు దీనిని బట్టి బ్రౌన్ వ్రాయించిన అనేక లిఖిత (కాగితపు) ప్రతులకు ఏకైక మాతృక అనేది లేదని తెలుస్తున్నది బ్రౌన్ ఒక ప్రణాళిక ప్రకారం లేక తనకు నచ్చిన ఒకానొక పద్ధతి చొప్పున తాళపత్ర ప్రతుల నుండి పద్యాలను తోడుకున్నాడనిపిస్తుంది డి 1735 ప్రతికి మాతృకను (?) ఆయన పెనుగొండ నుండి తెప్పించాడు దాని సొంతదారుడు ముందు 'దానిని ఇవ్వడానికి అంగీకరించలేదు'[16a] డి 1735ను పోలిన మరో ప్రతిని బ్రౌన్ వ్రాయించాడు (డి 1723) ఏవో రెండుమూడు పద్యాలు తప్ప పద్యసంఖ్యా, క్రమమూ ఒకేరకంగా ఉన్నాయి కాబట్టి డి 1735కు డి 1723 ప్రతి పుత్రిక అనడానికి అటువంటి ఆటంకాలు లేవు ఇక ఈ రెండింటికీ మూలమైన పెనుగొండ ప్రతి దొరకలేదు డి 1721, డి 1722 ప్రతులు కూడా ఒకే కుదుట పుట్టిన బిడ్డలుగా భావించడానికి అవకాశాలున్నాయి ఇవి ఏ దృష్టితో చూసినా అతి ముఖ్యమైన ప్రతులు

---

15 "సి పి బ్రౌన్" డా॥ కొత్తపల్లి వీరభద్రరావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణ, 1963

16 సాహిత్య అకాడమి ప్రతిలో అకారాది క్రమసూచి లేదు

16a The original MS was found at Penugonda and the owner was not wishing to lend it I had this copy made in Feb 1834 - Notes on MS by Brown, No D 1735

ఈ రెండూ 1842లో వ్రాయించినవే డి 1721 పైన రిమార్కు వ్రాస్తూ "ఇది ఒక పండిత కవి చేత పరిష్కరించబడినద"ని బ్రౌన్ పేర్కొన్నాడు ఇందులో 'పద్యాల క్రమం కూడా కొంత మారింది' అన్నాడు కాని ప్రతులను పోలుస్తూ పరిశీలిస్తే ఆ మార్పు ఏమీ కనపడదు "The volume contains 1165 stanzas Selected out of " అని అర్థాంతరంగా ఆగిపోయాడు బ్రౌన్ 3000 పద్యాలలో నుండి ఇవి ఎంచబడినట్టుగా తెలుస్తున్నది డి 1722 ప్రతిపై రిమార్కు వ్రాస్తూ "అనేక ప్రతుల ఆధారంగా పెంచబడిన, సరిదిద్దబడిన ప్రతి"[17]గా దానిని వర్ణించాడు అందులోనికి ఎత్తి వ్రాసినవి మాత్రమే "ప్రచురణార్హములు" అని బ్రౌన్ అభిప్రాయం ఇంకా 2000 పద్యాలు మిగిలిపోయాయి అవి ముఖ్యంగా అన్వయం కుదరని మార్మిక పద్యాలని బ్రౌన్ అభిప్రాయపడ్డాడు గ్రంథారంభంలో "This is the new edition of Vemana, 1842" అనికూడ బ్రౌన్ వ్రాశాడు వేటికన్న కొత్తదో తెలియాలి ఏమైనా పై రెండూ అభేదప్రాయంగానే ఉన్నాయి

తాళపత్రప్రతులూ, లిఖిత ప్రతులూ రెండూ పక్కపక్కన పెట్టుకొని చూసినా మాతృకలను కనిపెట్టడం అంత సులభంకాదు[18] ఇక్కడ మాతృకలను కనిపెట్టడానికి మనకు స్థూలంగా కనిపించే ఏకైక సాధనం పద్యక్రమం లేదా వరుస మాత్రమే (Order of poems) అయితే దీనినిబట్టి ఏ రెండు ప్రతుల్లోని పద్యసంఖ్యాసమానత మీద మనం ఆధారపడలేము ఎందుకంటే ఒక్కొక్క లిఖితప్రతికి అనేక తాళపత్ర మాతృకలుండవచ్చు ఇక ఈ పద్యక్రమాన్ని అంకెల (Numerals)తోనే గుర్తించాలి అంకెలులేనిచోట పద్యాలు లెక్కబెట్టుకోవాలి కాని మూలప్రతులలోని పద్యాల వరుస పుత్రికలు చాలావాటిలో మారిపోయింది అట్లా మారడానికి బహుశా ఈ కింది కారణాలు ఎంతవరకు దోహదం చేసినాయో ఆలోచించాలి

1 లేఖకుల అశ్రద్ధవలన తాళపత్ర ప్రతులలో దొర్లిన దోషాలు ఉదా వ్రాసిన పద్యాలే మళ్లీ వ్రాయడం, అంటే వచ్చిన నెంబర్లే మళ్ళీ వస్తాయి 100, 101, 102, 103 తరువాత మళ్ళీ 100, 101 మొదలుకావడం

2 (I) శ్రీకరముగ వేమన (II) శివకవులకు నవకవులకు ఈ రెండు పద్యాలు చిన్నచిన్న క్రమభేదాలతో ప్రతి ప్రతి మొదటా వస్తాయి లిఖితప్రతులు కొన్నింటిలో వీటిని తొలగించి, కొన్నింటిలో తొలగించకపోవడం వలన నెంబర్ల క్రమం కూలిపోయి చెల్లాచెదురయినది

3 ఇతర ప్రతులను వ్రాయించేటప్పుడు ఆకులను విడదీసి నలుగురికి పంచి వ్రాయించడం వలన, వ్రాసిన తరువాత వాటిని యథేచ్ఛంగా కలపడంవలనకూడా మూలవ్యతిరేకమైన క్రమం ఏర్పడి ఉండవచ్చు

అయినప్పటికీ కొన్ని మాతృకలను కనిపెట్టడంలో మనం సఫలమౌతాము వాటి వివరాలు ఈక్రింద ఇవ్వబడ్డాయి

---

[17] A New edition, enlarged and corrected by the aid of numerous manuscripts
- D 1722

[18] సాదికారంగా మాతృకలు, పుత్రికలను గూర్చి చెప్పడం అసాధ్యం కాదుగాని ఒక్కొక్క ప్రతిని మిగిలిన ప్రతులతో పోల్చినప్పుడుమాత్రమే ఒక నిర్ణయానికి రావడానికి వీలవుతుంది

| క్రమ సంఖ్య | మాతృకలు | పుత్రికలు | పౌత్రికలు |
|---|---|---|---|
| 1 | డి 1728 తాళపత్ర ప్రతి | డి 1725 లిఖిత ప్రతి | |
| 2 | డి 1744 తాళపత్ర ప్రతి | డి 1770 లిఖిత ప్రతి | |
| 3 | బెండమూరి లంక ప్రతి (?) | డి 1735 లిఖిత ప్రతి | డి 1721[19] డి 1722 డి 1723 డి 1762 డి 1737(?) ఇవి అన్నీ లిఖిత ప్రతులు |

# వేమన పద్యాల పరిష్కరణ - బ్రౌన్ కృషి - ప్రథమ ముద్రణ

వేమనను గూర్చి మొట్టమొదటిసారి 1824లో బ్రౌన్ విన్నాడని తెలుసుకున్నాము విన్నదే తడవుగా వేమననుగూర్చి అక్కడక్కడ విచారించడం ప్రారంభించాడు అభినివేశానికి అధికారం తోడయ్యింది 1824లో బ్రౌన్ మచిలీపట్టణంలో ఉన్నాడు. వేమన పద్యయాగానికి నాంది అక్కడే జరిగింది వేమన పద్యాల తాళపత్రప్రతులు వివిధ ప్రాంతాలనుండి వచ్చి చేతిలో వ్రాలాయి మచిలీపట్నం, విశాఖపట్నం, నెల్లూరు, గుంటూరు, కడప, మద్రాసుల నుండి సంపాదించాడు బ్రౌన్[20] 1824 నవంబరు నాటికే 15 ప్రతులదాకా సంపాదించగలిగాడని "An index to the Verses of Vemana Musulipatam, Nov 1824"[21] వలన తెలుస్తున్నదంటే బ్రౌన్ కార్యదీక్ష ఎటువంటిదో అర్థమవుతుంది ప్రతులనయితే సాధించాడుగాని వాటిలో బ్రౌన్‌కొక దుర్గమారణ్యమే ఎదురయింది లిపిదోషాలు, ఛందోభంగాలు, అర్థాన్వయ కాఠిన్యం మొదలైనవాటితో

19 డి 1762, డి 1722, డి 1721 ప్రతులు విభాగాలుగా వ్రాయబడినప్పటికి ఒకే కుదుట్లో పుట్టాయనడానికి ఆధారాలు లభిస్తాయి

20 Such an enquiry in the year 1824 regarding Telugu, made me acquainted with verses collected in the present volume Several manuscripts of VEMA or VEMANA (for both names are used) were put into my hands, which I perused and translated in such hours of leisure as my public commitments allowed After collecting such copies to be found in Masulipatam where I was then stationed, I gradually procured others from Vizagapatam, Nellore, Guntur, Cuddapa and Madras

21 No D 3098 Government Oriental Manuscripts' Library, Madras

# వేమనపద్యములు.

THE VERSES

OF

# VEMANA,

*MORAL, RELIGIOUS AND SATIRICAL*

Translated

BY CHARLES PHILIP BROWN,

OF THE MADRAS CIVIL SERVICE

*MADRAS*

PRINTED AT THE COLLEGE PRESS.

1829.

బ్రౌన్ వేమన పద్యాల తొలిముద్రణం ముఖపత్రం

వేమన పద్యాల పరిష్కరణ - బ్రౌన్ కృషి - ప్రథమ ముద్రణ

అంతా చిక్కులమయంగా ఉంది[22] ఏ రెండు ప్రతులలోని పద్యక్రమాలూ ఒకేరకంగా లేవు పైగా వాటిని పోల్చిచూస్తే 200 నుండి 800ల వరకు సంఖ్యలో విభేదిస్తున్నాయి.[23] అల్లుకుపోయివున్న ఈ అవ్యవస్థా పరిస్థితిలో ఒక స్పష్టత కొరకు వీటితో బ్రౌన్ పెద్ద యుద్ధమే చేయవలసి వచ్చింది చెల్లాచెదురై ఒక అరాచకస్థితిలో ఉన్న పద్యాలకు ఒక వ్యవస్థను కల్పించి 'న్యాయమూర్తి'గా వాటికొక 'తీర్పు' చెప్పవలసి వచ్చింది 1824లోనే బ్రౌన్ 15 ప్రతులను సేకరించగలిగాడని చెప్పాను వీటిలో 9 ప్రతులను మాత్రమే బ్రౌన్ పరిష్కరణకు ఆధారంగా ఎన్నుకున్నాడు[24] ముందుగా పండితులను నియమించి తన పర్యవేక్షణలో పాఠభేదాలన్నింటిని సంకలనం చేయించాడు[25]

(Theming the place each verse occupies in each of nine collected manuscript copies, compiled under the direction of Charles Philip Brown, Civil Service)

ఒక్కొక్కదానిలో పద్యం స్థానం వేరువేరు ప్రతులలో ఎక్కడుందో పద్య సంఖ్యలతో సూచిస్తూ ఒక పట్టిక తయారుచేశాడు[26] వేమన పద్యాల సంస్కరణ కిది తొలిమెట్టు. దీని ఫలితంగానే 1829లో వేమన పద్యాల మొట్టమొదటి ముద్రణం వెలువడింది మళ్ళీ ఒక దశాబ్దం తర్వాత 1839లో రెండవ ముద్రణం వెలువడింది అనేక విధాలుగా అత్యంత శ్రేష్ఠమైన తొలి ముద్రణానికి ఉపయోగపడిన 9 నేపథ్య ప్రతులను గూర్చి ఆరా తీయడం అతి కష్టమని అనుభవం నేర్పుతుంది బ్రౌన్‌చేత సేకరించబడి ప్రస్తుతం మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలోగాని, తిరుపతి రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో గాని భద్రపరచిన సామగ్రిలో ఇవి ఉన్నాయా? ఉన్నట్టయితే, వీటికి ఉన్న సంబంధ బాంధవ్యాలు యెటువంటివి అని అన్వేషించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది దారి పొడుగునా లభించే ఇటువంటి చెదురుమదురు వాస్తవాల దారిబత్తెం ఉంటేగాని పద్యాల సంస్కరణలో బ్రౌన్ లక్ష్యం మనకు ప్రత్యక్షం కాదు బ్రౌన్ ఈ 15 ప్రతులకు కొన్ని

---

22 They proved to be full of errors of every kind in orthography, metre, and meaning

23 no two copies followed the same arrangement and they varied in extent from two to eight hundred epigrams

24 About six of the manuscripts of Vemana I now possess have not been read or examined - C P Brown, D 1773, Vol 3

25 Meantime I persisted in reading and translating all the manuscripts of Vemana that I could collect and when I had gone through the whole I formed an edition of the work arranged in nine books

-June 1828, Sketch of the origin of my Dictionary, No D 1391, Vol 9

26 ఈ పట్టికా గ్రంథం రెండు సంపుటాలుగా (డి 3098, డి 3094) అతి శిథిలావస్థలో ఇప్పటికే అక్షరాలకన్న ఎంద్రాలే అధికమై ముడితే పొడిపొడి అయ్యే స్థితిలో ఉంది

సంజ్ఞలు తగిలించాడు[27] వీటిలో కొన్ని కాగితపు ప్రతులు కూడ ఉన్నాయి[28] ఈ సంజ్ఞలు ఏ ప్రతుల పేర్లో (కొన్నింటిపై ప్రస్తుతం ఆ గుర్తులు లేకున్నా), మనకు లభిస్తున్న సామగ్రిలోనుండి, కనిపెట్టి వెలికితీయడంలో కొంతవరకు సఫలమవుతాము ఇవికూడ స్థలాంతరాలలో పేర్కొన్నదానినిబట్టి వేటిపేర్లో కనుక్కొనే అవకాశం కలిగింది వాటిలో కొన్నింటిని ఈ కింద చూడవచ్చు.

C = D 1728
D = D 1733
Y = D. 1771
N = D. 1765
F = D 2949
K = D 1741

ఈ సంజ్ఞలను ప్రతులకు పేర్లుగా పెట్టడం కేవలం సౌకర్యం కొరకు అనేకాక వాటికొక అర్థంకూడ ఉందేమో పరిశీలించాలి

ఉదా K=D 1741 "కోదండరామయ తెచ్చినది" కావున గుర్తు 'K' అని పిలిచి ఉండవచ్చు C="కడపప్రతి", Y="యానాంలో అందిన పుస్తకం" అదేవిధంగా G గుంటూరులో సంపాదించింది కావచ్చు కాని ఈ మంత్రం అన్నింటికి పని చెయ్యదు[29]

ఉదా B='కనకాద్రి ప్రతి' D="రంగరాయని తాటిఆకు ప్రతి", E="రంగరాయనిదే రెండో ప్రతి", F="సూర్యనారాయణ అంపిన ప్రతి", R=దఫా కడప ప్రతి[30] ఇక ఈ ప్రతులను గురించి ఇతర వివరాలు కూడ సరిగ్గా తెలియవు A="వేంకటశివుని ప్రతి"గా దీనిని అభివర్ణించాడు బ్రౌన్[31] ప్రస్తుతం లభ్యమివుతూ ఉన్న ప్రతులలో ఇది ఉన్నట్టు కనరాదు దీనిలో 1155 పద్యాలు ఉండేవని తెలుస్తుంది C=ఇది డి 1728 నెంబరు గల ప్రతి దీనికే కడప ప్రతి అని పేరు దీనిలో 878 పద్యాలు ఉన్నాయి ఇక A, C ప్రతులు ఆధారంగా పరిష్కరించి తయారుచేస్తే ఏర్పడిందే B ప్రతి అంటే ఒకదానిలో వచ్చిన పద్యాలు రెండవదానిలో వస్తే వాటిని పరిహరిస్తూ ఏర్పరచిన ప్రతి B దీనికి 'కనకాద్రి' ప్రతి అని పేరు దీనిలో 1028 పద్యాలు ఉన్నాయి

---

27 కళ్ళల్లో వొత్తులు పెట్టుకొని అన్వేషిస్తే ఈ సంజ్ఞలను తగిలించుకున్న అసలు ప్రతులు కొన్ని బయటపడ్డాయి భావి పరిశోధకుల సౌకర్యార్థం (?) బ్రౌన్ అక్కడక్కడ కొన్ని వివరాలు వ్రాసిపెట్టుకున్నా కొన్నిచోట్ల పూర్వోత్తర విరుద్ధంగావుండి బయటపడిందనుకున్న సత్యం సంశయాస్పదంగా మారుతుంది (ఉదా E, F లకు ఒకేరకమైన వివరాలు వ్రాశాడు) మొత్తంమీద ఆ సంజ్ఞలివి A, B, C, D, E, G, H, F, , K, Y, R, N, k, Q, V (N-ఇది నకారం అనే గ్రంథం V=ఇది వీకారం అనే గ్రంథం)

28 G, H

29 An index to the verses of Vemana D 3090

30 An index to the verses of Vemana D 3090

31 "A is Venkatsiva's original copy" డి 3098 వెంకట శివుడు (తిప్పాభొంట్ల వేంకట శివశాస్త్రి) బందరులో బ్రౌన్ సబ్‌జడ్జీగా ఉన్న కాలంలో కోర్టులో పని చేసేవాడు దిట్టమైన పండితుడు గ్రంథ పరిష్కరణ వ్యాపారాలలో బ్రౌన్ కు చేదోడువాదోడు 20 డి 3090

వేమన పద్యాల పరిష్కరణకు బ్రౌన్ ఈ ప్రతినే ఆధారంగా ఎన్నుకున్నాడు[32] ఇక 'Q' అనే ప్రతి డి 1724 ప్రతికి మాతృక.[33] D ప్రతిలో 785 పద్యాలు ఉన్నాయి ఇది డి 1733 నెంబరు ప్రతిగా తేలుతున్నది ఇంకా F=2949గా, Y=1771గా, N=1765గా గుర్తించబడ్డాయి వీటిలో వరుసగా 997, 152, 309 పద్యాలు ఉన్నాయి. అదే విధంగా Eలో 572, Gలో 875 పద్యాలు ఉన్నాయని తెలుస్తుంది H అనే మరో ప్రతిని కూడా బ్రౌన్ ఉపయోగించుకున్నాడు గాని అది పోయిందని తెలుస్తుంది[34] V, Q అనే గ్రంథాల కొరకు కూడ వెతకగా పరిశీలనలో అవి డి 1767, డి 1752 ప్రతులుగా తేలాయి బ్రౌన్ మరికొన్ని ఏవో గుర్తులు వ్రాసి పెట్టుకున్నాడు కాని అవి ఇప్పుడు మనకు అర్థంకావు[35] కారణం అవి తన స్వోపయోగం కొరకు, గుర్తుకోసం వ్రాసుకుని ఉండడమే ప్రతులు చేతిలో పడగానే బ్రౌన్‌కొక గహనారణ్యం ఎదురైందని మొదటే మనవి చేశాను దేనినీ వేమన పద్యాల సమగ్ర ప్రతిగా గాని, కవిదేనని విశ్వాస పాత్రమైన ప్రతిగా గాని భావించడానికి వీలులేని సందిగ్ధ పరిస్థితి అది ఏది ప్రాచీనమో, ఏది అర్వాచీనమో నిర్ణయించలేని నిస్సహాయ స్థితి దీనికి కారణాలు రెండు 1. వేమన సాహిత్యం ఒక కథాకావ్యం కాక ముక్తక ప్రాయమైన పద్యాలు కావడం 2 ఒక ప్రత్యేక కవిచేత రచించబడినప్పటికి వేమనపద్యాలు జానపద సాహిత్యంలాగ మౌఖిక ప్రచారంతో వ్యాప్తిచెందడం

వీటిని గూర్చి కొంచెం వివరిస్తాను వేమన పద్యాల సమగ్రతకు హద్దులు నిర్ణయించడం సులభసాధ్యమైన పనికాదు[36] గాలి, నీరు, వెలుతురులాగ దేశమంతా నిండివున్న ఈ పద్యాల ప్రారంభాన్ని, అంతాన్ని ముడివేయడానికి లభించే సాధనాలు సంతృప్తినిచ్చేవి కావు శిష్ట సాహిత్యపు నిర్భరకావ్య పరిపాకాలనుండి చాలావరకు వైదొలగి సామాన్య జనాలను సమీపించిన అనేకానేక శతకాలతోకూడ ఈ ఇబ్బంది లేదు శతకాలకున్న నిర్ణీతమైన సంఖ్యానియమం వేమన పద్యాలకు కానరాదు శిష్టసాహిత్యంలోని కావ్యాలను నిర్ణయించడానికి కావ్యపీఠిక, ఇతివృత్తం, రచనాప్రణాళిక మొదలైనవి ఉపకరిస్తాయి కాని వేమన పద్యాలు కుదురుగా ఒకచోట కూర్చొని వ్రాసినవి కావు ఊరూరా సంచరిస్తూ నోటికి వచ్చినప్పుడెల్లా చెప్పినవి

బ్రౌన్ పైసమస్యలను కొంతవరకు గుర్తించాడు కాబట్టి వేమన పద్యాల పరిష్కరణలో తన సొంత అభిరుచులపైన ఆధారపడకుండా, ఆంధ్ర సాహిత్యంలో అప్పటికి అపూర్వమైన పాశ్చాత్య పద్ధతిలో ఒక శాస్త్రీయరీతికి శ్రీకారం చుట్టి ఎన్నటికీ ముగియబోని పరిష్కరణ మహాయజ్ఞాన్ని ప్రారంభించాడు బ్రౌన్

32 This supplement contains such verses as were excluded from the Ms "B", which I adopted as the basis of my edition It is compiled from manuscripts A and C D 1773 Vol 5

33 Copied from Ms 'Q' (IETT VI 387 - Part 2nd) D 1724

34 అక్షరాల తాత్పర్యము D 3090 "Lost" D 3090

35 కొన్ని తాళపత్ర ప్రతుల మీద "దీని శీతా గ్రంథంలో చేర్పడమయినది" అని వ్రాసివుంటుంది దీనికి అర్థం చెప్పినవారు నాకింతవరకు తటస్థపడలేదు

36 It is perhaps impossible to meet with a complete copy of this poet, a manuscript of antiquity The principal copies from wich this edition is compiled are nine D 1773 Vol 4

శ్రమపడి సంపాదించిన 16 ప్రతుల్లో తొమ్మిదింటిని మాత్రమే మేలైనవిగా బ్రౌన్ ఎన్నుకున్నాడని చెప్పాను. అవి A, B, C, E, G, H, J, T (?) అనే గుర్తులున్న ప్రతులు. వీటిలో కొన్నింటిలో 500 పద్యాలవరకు ఉన్నవి ఉన్నాయి. ఏ ప్రతిలో కూడ 700 పద్యాలను దాటిన సంఖ్య లేదు. వేరువేరు ప్రతులలో పద్యాలు బయటి ప్రతులలో ఉన్నవీ, లేనివీ కూడ ఉంటాయి. అందుకే ఈ తొమ్మిది ప్రతులను పక్కపక్కన పెట్టుకొని, పునరావృతమయ్యే పద్యాలను పరిహరిస్తూ లెక్కించి 2100 పద్యాల దాకా సాధించాడు బ్రౌన్.[37]

బ్రౌన్ 9 గళ్ళను నిలువుగా గీసి ఒక్కొక్క గడిలో ఒక్కొక్క ప్రతిలోని పద్య స్థానాన్ని గుర్తిస్తూ పోయిన 'నమూనా'ను ప్రక్క పుటలో చూడవచ్చు.

| ఉదా: | B | J | E | T | G | H | A | (?) | C |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | 38 |

ఈవిధంగా అనవసర పద్యాలను యేరివేసి మార్గాన్ని సుగమం చేశాడు బ్రౌన్ తర్వాత ఈ 2100 పద్యాలను విషయాన్నిబట్టి తొమ్మిది ప్రకరణాలతో 5 భాగాలుగా విభజించాడు

| | | |
|---|---|---|
| 1–5 | 1100 | నీతి[39] |
| 6 | 200 | హాస్యము |
| 7 | 200 | భక్తి |
| 8 | 300 | గూఢార్థతత్త్వము |
| 9 | 300 | చిల్లర |
| వెరశి | 2100 | |

37 few of these copies contain about five hundred verses, none comes upto seven hundred, the number, however, that I have succeeded in collecting is 2100 D 1773 Vol 4

38 D 3090

39 D 3090

పై పద్యాల ఆధారంగా 1829లో బ్రౌన్ ప్రథమముద్రణాన్ని వెలువరించాడు. కాని పై ఐదు సంపుటాలలో రెండింటిని (4,5 ప్రకరణాలు) నిరుపయోగమనీ, 'విద్యార్థులకు' నచ్చక పోవచ్చుననీ భావించి పరిహరించాడు.40 అంతేకాకుండా అర్థం సంశయాస్పదంగా ఉన్నవీ, ఎంతకూ అన్వయం కుదరని మొండి పద్యాలను కూడా పరిహరించాడు. కాని కొన్ని మార్మిక (Mystic) పద్యాలకున్న ప్రాచుర్యాన్ని గుర్తించి తొలగించలేదు. మరింకెన్నింటినో తొలగించి వేయాలనుకున్నాడు కాని ప్రజల నాలుకలమీద వాటికున్న చెలామణి వలన అట్లాగే ఉంచవలసి వచ్చింది. ఈవిధంగా 693 పద్యాలతో బ్రౌన్ ప్రథమ ముద్రణం వెలువడింది. 693 పద్యాలను అనువాద సహితంగా అచ్చువేయడానికి ఫోర్ట్ సెంట్ జార్జి కాలేజీ వారికి అర్జీ పెట్టుకున్నాడు బ్రౌన్. 1827 జులై 23న కాలేజీ బోర్డు కార్యదర్శి హెచ్. హార్క్‌నెస్, చీఫ్ సెక్రటరీకి సిఫారసు చేశాడు.41 మొత్తంమీద 1829లో కాలేజీ బోర్డువారిచేత మొట్టమొదటిసారి వేమన పద్యాలను ప్రకటింపజేశాడు.42 ఈ ముద్రణం అనేకవిధాలుగా విశిష్టమైనది. గ్రంథాంతంలో బ్రౌన్ ఏర్పరచిన గ్లాసోరియల్ ఇండెక్స్ (Glossarial Index), ప్రథమ పాదవర్ణ క్రమసూచిక (Index to first lines), అధోభాగాలలో బ్రౌన్ లఘువ్యాఖ్య, పాఠాంతరాల గుర్తింపు – ఇన్నింటితో వెలువడింది.

## ద్వితీయ ముద్రణం

ఇంత చేసినా బ్రౌన్ వేమనపద్యాలసేకరణ ఆపలేదు. 1830లో మరికొన్ని తాళపత్ర ప్రతులను సేకరించగలిగాడు. పై తొమ్మిది ప్రతులలో లేని కొత్త పద్యాలు వీటిలో కనిపించాయి. కాని వాటిని సులభంగా కనుక్కోవడానికి వీలులేకుండా ఒక క్రమంలో లేకపోవడం వలన బ్రౌన్ ఆ ప్రతుల మీద విసుక్కున్నాడు.43 తరువాత 1834లో పెనుగొండలో మరొక ప్రతిని సేకరించాడు బ్రౌన్.44 దాని స్వంతదారుడు దానిని అమ్మడానికి ఇష్టపడలేదు కాబట్టి బ్రౌన్ దానిని కాపీచేయించి తెప్పించాడు ఈ ప్రతి పేరు 'బెండమూరి లంక' ప్రతి. బ్రౌన్ సేకరించిన ప్రతులన్నింటిలో నికి ఈ ప్రతి చాలా ప్రాముఖ్యం వహిస్తున్నది డి 1735 నెంబరు గల లిఖిత ప్రతికిది మాతృక.

---

40 The two, last of these form more than half the work, but are omitted in the present volume because of interest and utility - Verses of Vemana, 1829

41 బ్రౌన్ లేఖలు, బంగోరె 1976 బ్రౌన్ ప్రాజెక్టు శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ

42 My first edition of Vemana with the english translation was printed at Madras 1829 MDCCC XXIX, D 3101, Vol I

43 New verses of Vemana found in copies produced in 1830 and which cannot be traced and not satisfactorily adjusted - D 1773 Vol IV

44 The original Ms found at Penugonda and the owner not willing to sell it I had this copy made in February 1834 - D 1735

దీనిలో 1116 పద్యాలు ఉన్నాయి దీనికి అనేకమైన ప్రతులను వ్రాయించాడు బ్రౌన్ (డి.1737, డి.1762, డి.1723, డి.1722, డి.1721). బ్రౌన్ ప్రథమ ముద్రణ నాటికి బ్రౌన్‌కు బెండమూరి లంక ప్రతి తెలియనే తెలియదు. తర్వాత దశలోని వేమన పద్యాల పరిష్కరణలో అతి ప్రాధాన్యం వహించిన ఈ ప్రతియొక్క ప్రమేయం లేకుండానే ఆయన తొలి ముద్రణం వెలువడిందని మనం గుర్తించవలసి ఉన్నది.

కాలేజీ బోర్డువారు బ్రౌన్ తొలి ముద్రణాన్ని 500 కాపీలు ముద్రించారు. బ్రౌన్‌కు 50 కాపీలు ఇవ్వబడ్డాయి. కాని మిగిలిన 450 కాపీలు కాలేజీలోనే అదృశ్యమైపోయాయి. పదేళ్ళ తరువాత కాలేజీ లైబ్రరీలో చిత్తుకాగితాలలో తద్గ్రంథ శిథిలాలు దృష్టికి వచ్చాయి. అప్పుడిక వెంటనే బ్రౌన్ ద్వితీయ ముద్రణానికి సన్నాహాలు ప్రారంభించాడు.[45]

1829 నాటి గ్రంథం రూపుదిద్దుకోవటానికి నేపథ్యంలో బ్రౌన్ ఒక మహాయజ్ఞమే నిర్వహించాడు. కాని, ఇంతటి నిర్దుష్టమైన గ్రంథంకూడా బ్రౌన్‌కు ఏమాత్రం సంతృప్తిని కలిగించలేదు 9 ప్రతుల ఆధారంగా, మరో 6 ప్రతుల సహాయంతో దాదాపు ఐదేండ్లు (1824–1829) పరిశ్రమించి వెలువరించిన ఈ ముద్రణాన్ని బ్రౌన్ కేవలం ఒక "ఎంచిన పద్యాల"[46] సంపుటిగా భావించడం, ముందు ముందు వేమన పద్యాలను గూర్చి ఆయన చేయాలనుకొన్న కృషితో దానిని పోల్చుకోవడమే కారణం కావచ్చును

తర్వాత బ్రౌన్ వేమన పద్యాల తాళపత్ర సేకరణ 16 నుండి 30 దాకా పెరిగింది. కొత్త పద్యాలెన్నో వచ్చి చేరాయి ఉన్నవాటికి పాఠాంతరాల సంఖ్య పెరిగింది. తాళపత్రాలన్నింటిలోని 'పద్య సంఖ్య' 2500 దాకా తేలింది మరికొన్ని ప్రతులు వచ్చిచేరగా పద్య సంఖ్య 300 దాకా పెరిగింది (బహుశా 40 ప్రతులు). కాని 1164 పద్యాలను యేరుకొని మాత్రమే బ్రౌన్ రెండవ ముద్రణాన్ని 1839లో వెలువరించాడు[47] కాని పదేళ్ళతరువాత రావలసిన విధంగా ఈ గ్రంథం లేదని బ్రౌన్ మళ్ళీ అసంతృప్తిని ప్రకటించాడు[48] తొలిముద్రణం కన్న 471 పద్యాలను అదనంగా చేర్చడం,[49] అక్కడక్కడ శుద్ధపాఠాలతో పోల్చిచూసి పద్యాలను సరిదిద్దడం, అనువాదం, లఘువ్యాఖ్యానం పరిహరించబడడం ఇందులో జరిగిన కొత్తకార్యాలు, అదనంగా

45 About 50 copies were given to me, and 450 disappeared After ten years, I discovered these rolled up as waste paper in the library I then took steps to publish Vemana, the book became popular among those who were learning either Telugu or English It was juvenile effort and I have since remodelled several pages - Literary life of Charles Philip Brown - C P Brown, London, 1872, P 17 "బ్రౌన్ లేఖలు"

46 That was merely a selection D 3101 Vol I

47 ఈ పద్యసంఖ్యా నిర్ణయంలో ఏర్పడిన కొన్ని చిక్కులను గురించిన చర్చ యోగివేమన విజ్ఞానకేంద్రంవారి పునర్ముద్రణం పీఠికలో చూడవచ్చు (వేమన పద్యాలు - పేజీలు XI-XXXIV)

48 The second edition printed in 1839, though years later, is only an extended selection with the text occasionally amended D 3101 Vol I

49 కొత్తగా చేర్చిన పద్యాల్లో చాలాభాగం వేదాంత పద్యాలే కావడం గమనార్హం

జేర్చుకోబడిన 471 పద్యాలలో దాదాపు అన్నీ మత, నీతి విభాగాలలోకి చేరిపోయాయి.[50] బ్రౌన్‌కు ద్వితీయముద్రణం కూడ తృప్తినివ్వకపోవడానికి ఆయనే ఉటంకించిన ఓ ఉదంతాన్ని కూడా ఒక కారణంగా ఊహించవచ్చు 1834 వరకు దాదాపు 3000 పద్యాల వరకు సేకరణ జరిగింది. వీటితో కొత్త ముద్రణ కొరకు ప్రతిని తయారుచేసే పనిని ఓ పండితునికి అప్పగించడం జరిగింది కాని ఆ పద్యాలను తన ఇష్టం వచ్చినట్టు దిద్దడం, కొన్ని పాదాలకు పాదాలే తీసివేసి స్వకపోల కల్పిత పద్యాలు చేర్చడం సాగించే తీరు బ్రౌన్ దృష్టికి వచ్చింది[51] అప్పటికి నాలుగోవంతు పనిమాత్రమే జరిగింది. బ్రౌన్ వెంటనే అతనిని ఆ పనిలోనుంచి తీసివేశాడు

ద్వితీయముద్రణానికి కృషి చేసేటప్పుడే వేమనపద్యాలను గూర్చి కొన్ని ఆసక్తికరమైన విషయాలను బయటపెట్టాడు ముప్పైకిపైగా (అనగా దాదాపు నలభై) తాళప్రతులను పరిశీలించగా, పోల్చిచూడగా తేలిన అంశాలివి:

1. అన్ని ప్రతులలోను సామాన్యంగా కనిపించే పద్యాలు 40 మాత్రమే.
2 అత్యధిక సంఖ్యాకమైన పద్యాలు (అనగా మొత్తం పద్యాలలో ఎక్కువభాగం) దాదాపు పదిహేనుకన్న తక్కువ ప్రతుల్లో ఉన్నాయి
3 కొన్ని పద్యాలు రెండు మూడు ప్రతులలోతప్ప రావు
4 ఒక నూరు పద్యాలు మాత్రం ఒక ప్రతిలోనే కనిపిస్తాయి[52]

1839 నాటి ద్వితీయ ముద్రణం తరువాత కూడ బ్రౌన్ తన ఉద్యమాన్ని కొనసాగిస్తూనే ఉన్నాడు. కొన్ని కొన్ని క్రొత్త ప్రతులను సేకరించినట్టుగా కూడ తెలుస్తున్నది

---

50 బ్రౌన్ ద్వితీయ ముద్రణం ఎక్కడా లభ్యం కాలేదు దానిని చూసినానని చెప్పినవాడు, దానిని సమీక్షించిన "మ్యాక్‌డోనాల్డ్" ఒక్కడే కనిపిస్తున్నాడు అయితే ఈమధ్య లండన్ బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీ నుండి దీని "మైక్రోఫిల్మ్" కాపీని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖవారు తెప్పించారు దీనిని యోగివేమన తెలుగు విజ్ఞానకేంద్రంవారు జులై 1980లో పునర్ముద్రించారు (చూడు ఆధార గ్రంథాలు) కాని దీనికి ప్రతిబింబాలుగా పేరు చెప్పకుండా అచ్చు వేసుకున్న ముద్రణలు రెండు ఇటీవల బయటపడ్డాయి అవి 1879 నాటి వావిళ్ళ ముద్రణం, 1900లో కంభంపాటి వెంకటరత్నం వేసిన ముద్రణం బ్రౌన్ ప్రతిలో లేని 8 పద్యాలు అదనంగా చేర్చడం తప్ప (ద్వితీయ భాగంలో 7 తృతీయభాగంలో ఒకటి) దానికి దీనికి తేడా ఏమి లేదు

51 In the year 1839 I delivered the present volume to a learned brahmin who undertook to prepare a new edition, but he disappointed me, for the attempted to expurge every rustic phrase and malignant rhyme even striking out whole lines and substituted others of his own composing He went through only about a quarter of the work for and on (?), finding what he had done I put a stop to his edition and dismissed him -D 3101 Vol I

52 More than thirty manuscripts (Total) were examined and exactly collected for this new edition but there are only about forty verses which occur in all these Most of them were found in less than fifteen manuscripts Some only in two or three, and a few, about a hundred rest on only a single authority - D 3101 Vol I

బెండమూరిలంక ప్రతి ఆధారంగా విభాగాలు చేసిన రెండు పుత్రికలను (1721–1722) 1842లో వ్రాయించాడు కాని బ్రౌన్ కలలుగన్న సమగ్రమైన పరిష్కృత ముద్రణం ఆయన జీవితకాలంలో వెలువడనే లేదు.

ఇప్పటివరకు తెలుసుకున్న వేమన పద్యాల ప్రతులను, వాటితో బ్రౌన్ గావించిన విశేష పరిశ్రమను పరిశీలిస్తే కొన్ని ముఖ్యాంశాలు మన గ్రహింపుకు రాకమానవు:

బ్రౌన్ తాళప్రతులకు శుద్ధమైన ప్రతులను (కాగితపు) వ్రాయించాడు. విభాగాలు చేసి ప్రతులను పుట్టించడం వలన మాతృకలను కనిపెట్టడం కష్టసాధ్యమైన కార్యంగా మారింది వేమనపద్యాలనుగూర్చి బ్రౌన్ 18 ఏండ్లు శ్రమించాడు. ఇంతటి సుదీర్ఘమైన కృషిలో కూడ బ్రౌన్ రెండు ముద్రణలు మాత్రమే వెలువరించగలిగాడు. కాని పాశ్చాత్య పద్ధతిలో నిర్దుష్టంగా వెలువడిన శ్రేష్ఠమైన ప్రతులివి. దాదాపు నలభైకి పైగా తాళపత్రప్రతుల ఆధారంగా బ్రౌన్‌కు లభించిన పద్యసంఖ్య 3000 లను మాత్రమే మించివున్నది అన్ని ప్రతులలో ఉన్న సామాన్యపద్యాలు కనీసం 40 కనిపించాయి. వేమన అపార పద్య ప్రపంచంలోంచి ముద్రణ ప్రతులను రూపొందించడానికి బ్రౌన్ ఒకానొక విధానాన్ని అవలంబించాడు. వేమనపద్యాల పరిష్కరణలో రెండు ప్రధానమైన అంశాలపైన బ్రౌన్ అవసరమైనంత శ్రద్ధాదృక్కులు సారించలేదు. 1. వేమన పద్యాలు జానపద సంప్రదాయంతో పుట్టి మౌఖిక ప్రచారంతో పరివ్యాప్తం కావడం; 2. వేమన పద్యాలేవీ? కానివేవీ? అనే ప్రశ్నను ఎక్కువగా పట్టించుకోకపోవడం (అయితే దీనికి బ్రౌనును తప్పుపట్టనవసరం లేదు ఆయన దృష్టి వేరు అని చెప్పడానికే)

మొదటిదానికి కారణం స్పష్టమే బ్రౌన్ పరిష్కరించిన అనేకానేక తాళపత్ర ప్రతులలో వేమనపద్యాలు ఒక చిరుభాగం మాత్రమే ఇతివృత్త సహితమై, గంభీరమై రసప్రధానంగా కావ్యభాషలో రచించబడి వర్ధిల్లిన ఇతర కావ్యాలకన్న భిన్నమైన ప్రత్యేకమైన స్థానాన్ని – ముక్తకప్రాయమై, సునీతి బోధకమై, సామాజిక ప్రవాహంలో నిమగ్నమై, సులభ సుందరంగా వెలువడిన వేమన పద్యాలకు ఇచ్చినట్టు లేదు కాకపోతే తెలుగు రాని ఆంగ్లేయులకు సుబోధకంగా ఉన్నాయనే అంశాన్ని బ్రౌన్ ఎక్కువగా అభిమానించాడు. వేమన్న భావాలు, వాటిపైన వాడుకలో ఉన్న వాదవివాదాల జోలికి బ్రౌన్ ఎక్కువగా పోలేదు వేమనను వెలుగులోనికి తేవడం స్థానికులైన పండితమండలికి అరుచికరమైన కార్యమని గమనించినా తన ఉద్యమాన్ని ఎప్పుడూ విడనాడలేదు వేమనపట్ల ఆయనదృష్టి ఎక్కువగా భాషాపరమైనది అనేవాదం ఖండించడానికి వీలుకానిది ఏమైనా పాండితీమండితమైన తన పరుసవేది చేతులతో వేమనపద్యాలను తాకి తెలుగులోగిళ్ళలో బంగారాన్ని కుప్పవోశాడు బ్రౌన్

ఇక రెండవది దీనిని స్పృశించడం అంటే యక్షప్రశ్నలకు సమాధానం చెప్పడానికి సిద్ధపడడమే కాని, "వేమన పద్యాలేవీ? కానివేవీ?" అనే దృష్టి బ్రౌన్‌కు పూర్తిగా లేదనలేము వేమన పద్య సంచయంలో సుమతి, భాస్కర, తిరుమలేశ పద్యాలు ఉన్నాయని మొదట గుర్తించినవాడు బ్రౌనే "ఇది వేమనపద్యం కానట్టు తోస్తున్నది" అనే Notes కూడ క్వాచిత్కంగా కనిపిస్తూ ఉంటుంది కృతకమైన కందాది పద్యాలను మాత్రం బ్రౌన్ ఉదారంగా చూసి గ్రంథాలలోనికి చేదుకున్నాడు 1842లో వేమన పద్యాల వ్యాసంగాన్ని బ్రౌన్ వదిలివేసినట్టు కనిపిస్తున్నది 1880 దాకా ఆంధ్రసాహిత్యమథనం చేసిన బ్రౌన్ వేమనపద్యాలను మధ్యలోనే వదిలివేయడానికి కారణాలు తెలియవు

ఎందుకంటే 1839లో ద్వితీయ ముద్రణం తర్వాతకూడ మరో సుపరిష్కృత ముద్రణం కొరకు కలలు కన్నట్టుగా తానే వ్రాసుకున్నాడు. ఏమైనా బ్రౌన్ సేకరించిన వేమన పద్యాల అపారనిధులే చాలు ఆయనకు మనం ఆచంద్రార్కం ఋణపడి ఉండడానికి.

## వేమన పద్యాలేవి? కానివేవి?

### I. ఉపోద్ఘాతం:

"ఈ పద్యం వేమన చెప్పినదేనా?"
"ఈ పద్యం వేమనది కాదనిపిస్తున్నది."
"ఈ పద్యంమాత్రం అచ్చంగా వేమన చెప్పిందే."

వేమన పద్యాలను గూర్చి మాట్లాడేవాడికి ఇటువంటి ప్రశ్నలూ, వ్యాఖ్యలూ ఎదురుపడడం సర్వసాధారణవిషయం. వేమన దృక్పథాన్ని గురించో, వేదాంతాన్ని గురించో, వివిధ విషయాల మీద వేమన్న అభిప్రాయాలను గూర్చో చెప్పవలసి వచ్చినప్పుడు పండితులు గొప్పచిక్కుల్లో పడిపోతున్నారు. ఒక విషయాన్ని సమర్థించడానికీ, అదేవిషయాన్ని ఖండించడానికి కూడ వేమనలో పద్యాలు దొరుకుతున్నాయి. తమకు నచ్చని పద్యాలను వాదం కోసమైనా వేమనవి కాదనే ప్రమాదం వేమన్న పద్యాల్లో ఉంది ఇప్పటివరకు వేమన పద్యాలను పరిశీలించిన వారందరికీ ఈ ప్రమాదం తప్పలేదు. అది వారి తప్పు కాదు నిజానికి అంతకన్న గత్యంతరం కూడ లేదు. ఇక సామాన్య ప్రజానీకానికి ఈ గొడవే పట్టలేదు వేమన్న పేరుతో ఉండి నోటికి ఒదిగిపోయే ప్రతి పద్యాన్ని వేమనపద్యంగానే మనసారా పాడుకున్నారు ఇది వేమన పలికిందేనా అనే మీమాంస వారికి కలగనేలేదు అయితే వేమన పద్యాలేవి? కానివేవి? అనే జటిలమైన ప్రశ్నకు సమాధానమే లేదా? వేమన పద్యాల ద్వారా ఆయన దృక్పథం స్పష్టమైన రేఖలతో వెలువడే అవకాశమే లేదా? అనేవి పరిశోధకుల్ని నిరంతరం వేధించే ప్రశ్నలు కాబట్టి ఈ ప్రశ్నలకు సమాధానాల కొరకు నేను అన్వేషించదలుచుకున్నాను నా అన్వేషణలో లభించే ప్రమాణాలపునాదుల పైననే నేను ప్రతిపాదించబోయే విషయాలను చెప్పాలనుకుంటున్నాను నా ప్రమాణాలు నేనే కొత్తగా కనిపెట్టిన చిట్కాలు కాకపోయినా బహుముఖాలుగా సాగిన చర్చలో నిగ్గుతేర్చడానికి ప్రయత్నించాను నా సాధనాలు నన్ను గమ్యం చేర్చినాయా అనేదానికంటే గహనారణ్య పరిస్థితిలో నాకు మార్గాన్ని మాత్రం ఏర్పరచినాయనీ, వేమనను గూర్చి నేను చేయబోయే వ్యాఖ్యలకు కనీసం ఆసరాగా నిలుస్తాయనే ఆత్మవిశ్వాసంతో ప్రారంభిస్తున్నాను

### II. గతంలో జరిగిన కృషి

ఇప్పటివరకు వేమన్నను గూర్చి పరిశ్రమ చేసిన వారందరినీ 'వేమన పద్యాలేవీ, కానివేవి' అనే యిబ్బంది కలవరపెట్టింది 1922లో 'వేమన సంపూర్ణ జీవిత చరిత్రము – బోధనలు' అనే గ్రంథాన్ని రచించిన వంగూరి సుబ్బారావుగారు ఈ సమస్యను తాను పరిష్కరించుకున్న విధానాన్ని గూర్చి కొంత చెప్పారు (పుటలు 11–12)

"ఏ గ్రంథముకైన నంతఃపరీక్ష, బాహ్యాపరీక్షయని రెండు విధములు. వేమన పద్యములలో గల్పితములనేకములున్నవను వాదముండుటచే నంతఃపరీక్ష బాహ్యాపరీక్షలకు భేదమంతగా గనపడదు. అంతఃపరీక్షయనగా గ్రంథస్థ విషయములనే పరీక్షించి సత్యము ఋజువుచేయుట. బాహ్యాపరీక్ష యనగా గ్రంథమును గూర్చి యితరుల వ్రాతలు, మాటలు, నిదర్శనముల నాధారపఱచుకొని సత్యమును నిర్ధారించుట పైన జూపిన బాహ్యాపరీక్ష కనువగు 10 సాధనములను సంఖ్య ననుసరించి యీ గ్రంథమునందు జూపుచుందును.[53] ఇదిగాక గ్రంథమునందున్న వాక్యముల గూడ జూపెదను. కావున పద్యముల గ్రంథప్రతి సరియైనది సాధ్యమైనంత వరకు నిరూపించుకొనవలయును. 1825 సంవత్సరము నాటికి బ్రౌను దొరగారు భిన్నదేశ ప్రతులను సంపాదించి, వాని నకారాదిగా విభజించి సూచిక ప్రకారము భాగముల ప్రకటించి యున్నారు. ఈ ప్రతి యిప్పటికి 100 సంవత్సరముల నాటిది. ఎక్కువగా ప్రతులలో సర్వసామాన్యముగ నున్న పద్యముల జేర్చినది. 100 సంవత్సరములకేవల ప్రకటించిన ప్రతులలో 'గులాభిమాను' 'అభిరామయ్య కథలు' తదనుగుణమగు పద్యములు చేర్చిన చేర్చి యుండవచ్చును. కొందరు బైరాగి వేదాంతులు కొన్ని పద్యములు జేర్చియుండవచ్చును. కావున నీ విమర్శనమునందు బ్రౌను దొరగారి ప్రతినే నేను వాడియున్నాను. గ్రంథము నందలి పద్యసంఖ్యను గూర్చి చర్చించిన భాగములు జూచిన దీనిపై చర్చ తెలియగలదు. ఓరియంటల్ లైబ్రరీలోని 52 ప్రతులును, పరిషత్తులోని 5 ప్రతులును, పరిశోధక మహామండలిలోని 2 ప్రతులును, ముద్రిత ప్రతులును నేను చూచియుంటిని. ఇందు నేనుదాహరణముగ తీసుకొనిన పద్యములు చాలావరకు తాటియాకు ప్రతులలో నధమము రెండు మూడు ప్రతులలోనైన నున్నవని నేను స్వయముగ జూచినవేయని తెలుపుచున్నాను. కొన్ని పద్యముల వ్రాతప్రతులలో లేనివి యే గ్రంథము నందున్నవో ఆ ప్రతుల సంఖ్య తెలిపియున్నాను."

దీనివలన వంగూరివారు తమ విమర్శన గ్రంథంలో ఉదాహరించిన వేమన పద్యాలకు ప్రామాణికతను సంతరించడానికి కొన్ని ఆధారాలను సాధించారు 1 అప్పటికి (1922 నాటికి) నూరేండ్లు క్రిందటిదీ, అన్నింటికంటె ప్రాచీనమైనదీ కాబట్టి బ్రౌన్ దొర తొలిముద్రణం 2 కనీసం రెండు మూడు ప్రతుల్లో ఉన్న పద్యాలు 3 వ్రాత ప్రతుల్లో లేని పద్యాలు

శాస్త్రీయ దృష్టితో పరిశీలిస్తే వంగూరివారు ఏర్పరచుకొన్న ప్రమాణాల్లో తర్కసహం కాని అంశాలు గోచరిస్తాయి వేమన పద్యాల మొట్టమొదటి ముద్రణం కాబట్టి బ్రౌన్ దొర 1829 నాటి గ్రంథాన్ని ఎన్నుకోవటం సమంజసమే కాని ఈ ముద్రణంలో ఉన్న పద్యాలన్ని వేమనవే అని విశ్వసించి, లేక తేర్చి ముద్రించినవి కావు ఎక్కువ ప్రతుల్లో ఉన్న పద్యాలన్నీ ఇందులో చేర్చబడినా, లేని పద్యాలు కూడా అనేకం

53 1 వేమన చరిత్ర (ద్విపద కావ్యము) 2 క్యాంబెలు దొర ఆంగ్లవ్యాసము 3 బ్రౌన్ తొలి ముద్రణం 4 వేదాంత సిద్ధాంతము 5 బందరు ప్రతి 6 The Age of Vemana 7 వేమనయోగి జీవితము 8 వేమన (రాళ్ళపల్లి) 9 వేమన కవి (చిలకమర్తి) 10 లక్ష్మణరావుగారి అముద్రిత వ్యాసం

ఉన్నాయి ఇందులో చేర్చిన పద్యాలు బ్రౌనుకు నచ్చిన పద్యాలే కాని వీటి ఎన్నికలో బ్రౌన్ పాటించిన ప్రత్యేక సూత్రాలేమీ లేవు. ఆయనే ఈ ముద్రణాన్ని గూర్చి 'It is mere selection' అని వ్రాసుకున్నాడు. కాబట్టి బ్రౌన్ ముద్రణం ప్రాచీనమైనదే కాని ఈ విషయంలో ప్రామాణికమైనది కాదు

ఇక రెండు మూడు ప్రతుల్లో ఉన్నంతమాత్రాన అవి వేమన పద్యాలే అని నిర్ధారణ చేయడంకూడ సమంజసం కాదు. వంగూరివారు చెప్పిన లెక్క ప్రకారమే 59 ప్రతులున్నాయి. ఇన్ని ప్రతులున్నప్పుడు రెండు మూడు ప్రతులపైనే ఆధారపడలేము పైగా ఆ రెండు మూడు ప్రతుల విలువ యేమిటి? వాటిని ఎన్నుకున్న పద్ధతులేమిటి? అనేవి కూడ విచారణీయాంశాలు. తర్వాత, వ్రాతప్రతుల్లో లేని పద్యాలను కూడ ఏ పద్ధతుల ప్రకారం చేర్చుకున్నారో తెలియదు.

వంగూరి వారికన్న అధికతర స్పృహతో వేమన పద్యాలను గూర్చి శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ 'వేమన' అనే తమ ఏడు ఉపన్యాసాల గ్రంథంలో చర్చించారు. వేమననుగూర్చి వెలువడిన గ్రంథాలలో ఇంతటి మౌలికమైనదీ, విపులమైనదీ మరొకటి లేదు. వేమన్నపై పరిశోధనకొక బలమైన నేపథ్యాన్ని ఏర్పరచి వివృతం కావలసిన అనేక పరిష్కార ద్వారాలను మొదటిసారి తన ప్రశ్నాపరంపరలతో తట్టిన ప్రతిభ రాళ్ళపల్లివారిది.

ఉపోద్ఘాతరూపమైన మొదటి ఉపన్యాసంలో "– వేమన పద్యములను జదివి యందుమూలమున నతని వివిధ సిద్ధాంతములను నిర్ణయించుటకు బూనుకొంటిమేని మనకు కొన్ని కష్టములున్నవి వానిలో మొదటిది అతని పద్యములేవి, కానివేవి యని నిర్ణయించుట "

"వేమన" గ్రంథ రచనలో శ్రీ రాళ్ళపల్లికి ఉపకరించిన గ్రంథాలు దాదాపు తొమ్మిది ఉన్నాయి అయన ఉదహరించిన పద్యాలన్నీ బందరువారు ముద్రించిన 'వేమనసూక్తి రత్నాకరం' లోనివే పాఠభేదాలు సంభవించినప్పుడు మాత్రమే తక్కిన ముద్రితాముద్రిత ప్రతుల్లోని పద్యాలను ఉదహరించారు ప్రాథమికంగా శర్మగారి 'వేమన' గ్రంథరచనకు బందరువారి ముద్రణమే మూలాధారం. దీనిలో నాలుగువేల పద్యాలున్నాయి కాని ఈ పుస్తకాన్ని కూడ రాళ్ళపల్లివారు సంపూర్ణంగా విశ్వసించలేదు నాలుగువేల దాకా పెరిగిపోయిన వేమన్న పేరుతో ఉన్న పద్యసంచయంలో వేమన్న పద్యాలను గూర్చి అయన చేసిన అన్వేషణలో ఈ క్రింది పరిశీలనలు బయటపడ్డాయి

1 విమర్శించి చూసి అచ్చుప్రతుల్లో నుండి కనీసం వేయి పద్యాలైనా తొలగించివేయవలసి ఉంటుంది
2 పద్యాల రూపాంతరాలను పాఠాంతరాలుగా పరిగణించడం వల్ల పద్యసంఖ్య పెరిగింది కాబట్టి వాటిని వేరుగా లెక్కించరాదు
3 బలమైన హేతువు లభించనంతవరకు ఆటవెలదులు కాని పద్యాలు – అంటే కందాలు, చంపకాదులైన వృత్తాలు, పాటలు, వచనాలను వేమనకృతాలుగా నమ్మరాదు
4 మూలపాఠాన్ని గుర్తించవలసిన అవసరం ఉంది
5 దిద్దుబాట్లు తొందరవలన అర్థం చెడివుంటుంది కాబట్టి అర్థభావాల మీద ఆధారపడరాదు ప్రక్షేపాల నిర్ణయంలో పద్యరచనా స్వరూపంపై ఆధారపడాలి

మొత్తంమీద అనేక ముద్రితాముద్రిత ప్రతులను సేకరించి, సంప్రదించి సవిమర్శక దృష్టితో పరిశీలిస్తేతప్ప ఏ నిర్ణయమైనా సాధ్యం కాదని భావించినారు సహేతుకమైన

సాక్ష్యాలు దొరకనంతవరకు కొన్ని నమ్మకాలు ఏర్పరచుకొనక తప్పదు, కొన్ని సందేహాలు వెలిబుచ్చకా తప్పదు అని అభిప్రాయపడ్డారు. వేమన పద్యాలను గూర్చి హేతుబద్ధంగా మౌలిక చర్చ చేసినవారిలో శ్రీ శర్మగారే ప్రథములు. కాని ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే – వేమన పద్యాల నిర్ణయంలో సమర్థవంతమైన పై సాధనాలను ప్రకటించిన శర్మగారు తమ గ్రంథరచనలో వీటిని అంతగా పాటించలేదు. ప్రాచ్యలిఖిత భాండాగారంలోని 50 వ్రాతప్రతులను చూసినామని చెప్పినా, 19 సంపుటాల నుండే ఉదాహరణలను ఇచ్చారు.

ఆటవెలదులుకాని పద్యాలను నమ్మలేనన్న శర్మగారే దీనికి విరుద్ధంగా అనేక కందాది పద్యాలను తమ గ్రంథంలో వాడుకున్నారు. మూలపాఠాన్ని నిర్ణయించవలసిన అవసరాన్ని గుర్తించి కూడా ప్రాచీనప్రతి కొరకు ప్రయత్నించలేదు. ఇటీవలి 20వ శతాబ్దపు ప్రారంభంలోని బందరు ముద్రిత ప్రతినే తమ పద్యాలకు ఎన్నుకొని, పాఠాలు విభేదిస్తున్నప్పుడు మాత్రమే వ్రాతప్రతుల్లోని పద్యాలను ఉదాహరించారు. కనీసం వంగూరివారివలె ముద్రితప్రతుల్లో పాతదైన బ్రౌన్‌దొర ముద్రణాన్నికూడ వారు ఎన్నుకోలేదు. బ్రౌన్‌దొర ముద్రణంపట్ల గౌరవం లేక కాదు. వారే దానిని ప్రశంసించారు కూడ. **"కావుననే అందందు యనావశ్యకమైన సవరణలున్నను, చిన్నదైనను, ఇప్పటికిని బ్రౌన్‌దొర ముద్రణమే సర్వోత్తమమని చెప్పుటకు సిగ్గుచున్నది"** (పేజీ 20). బ్రౌన్‌దొర ముద్రణంలో సవరణలున్నాయని దానిని నిరాకరించి ఉంటే, కులాభిమాన దృష్టితో ప్రక్షిప్తాలకు గురిచేయబడిందని అన్నవారు, పూర్ణయాచారి బందరు ముద్రణాన్ని కూడ పరిహరించవలసి ఉంది. మొత్తంమీద నాలుగువేలదాకా లభిస్తున్నా వేమన పద్యాలలో మూడు వేలే వేమనవిగా మిగుల్తాయని అభిప్రాయపడుతున్నారు శర్మగారు ఇది ఉజ్జాయింపు లెక్కే కాని కచ్చితంగా లెక్కపెట్టి చెప్తున్నది కాదు

## III. ముద్రితాముద్రిత గ్రంథాల్లో వేమన పద్యాలకు జరిగిన హాని

### (i) అముద్రిత ప్రతులు (తాళపత్ర, కాగితపు ప్రతులు)

బ్రౌన్ తనకు లభించిన తాళపత్ర ప్రతుల పరిస్థితిని ఇట్లా వర్ణించాడు "They proved to be full of errors of every kind, in orthography, metre and meaning, no two copies followed the same arrangement, and they varied in extent from two to eight hundred epigrams"[54]

వేమన పద్యాల లేఖకులలో చాలామంది పండితులు కారు కనీసపు భాషాపరిజ్ఞానం లేనివారు కూడ ఉన్నారు లిపిదోషాలు అసంఖ్యాకం లేఖకులు సాధారణంగా చేసే దోషాలనుగూర్చి చెప్పే ఓ శ్లోకాన్ని బ్రౌన్ సేకరించి భద్రపరచారు దానిని ఉదహరిస్తున్నాను

54 Verses of Vemana, C P Brown 18-9

బిందు, దుర్లిపి, విసర్గ, దీర్ఘికా
శృంగ, పంక్తి పద – భేద దూషణం,
హస్త వేగజ, మబుద్ధి పూర్వకం,
క్షంతు మర్హథ నిరీక్ష్య సజ్జనాః.55

వేమన పద్యాల ప్రతుల్లోని వ్రాత చాలావరకు చక్కనిది వీటిలో జరిగిన లోపాలు కూడ ఒక క్రమపద్ధతిలో జరిగినట్టు తోస్తున్నది ఉదాహరణకు 'స' వచ్చినచోటులలో దానికి బదులుగా తరచుగా 'శ'ను వ్రాశారు. పదాది, పదమధ్యం, పదాంతం అనే భేదం లేకుండా ఈ పద్ధతి కనిపిస్తున్నది. పదాదిని అచ్చులైన అ, ఇ లకు బదులుగా హల్లులైన యకార, యికారాలను మరియు 'ఉ, ఒ' లకు బదులుగా 'వు, వొ' లు వాడబడినాయి శకటరేఫం ఎక్కడోకాని ప్రత్యక్షం కాదు శ, ష లు ఊష్మాలు. వాటికి ఉచ్చారణాసామ్యం అధికం. ఇప్పటికీ కొన్ని ప్రాంతాలలో, ముఖ్యంగా తెలంగాణా గ్రామీణ వ్యవహారంలో 'శ'కు బదులుగా 'ష' ఉచ్చరించబడడం కనిపిస్తుంది పదాదిని అచ్చుకు బదులు హల్లును ఉచ్చరించడం వింటాం. దీనినిబట్టి వేమనపద్యాలను వ్రాసిన వ్రాయసగాండ్ర లేఖనం మీద వారి ఉచ్చారణ ప్రభావం గాఢంగా ఉన్నదని చెప్పవచ్చు. వేమన పద్యాలను వ్రాసినవారు పండితులు కారు అనడానికి దీనినికూడ నిదర్శనంగా చూపవచ్చు.

వేమన పద్యాలలో సీసపద్య గంధిలమైన ఆటవెలదులు అనేకం ఉన్నాయి. ఒక ఆటవెలది పాదం, తర్వాత తేటగీతి పాదం, తర్వాత రెండు ఆటవెలది పాదాలు – ఈ విధంగా పెనవేసుకుపోయి పద్యాలు కోకొల్లలు. అరణ్యంలో గచ్చపొదలలాగా అల్లుకుపోయిన ఈ పద్యాలను వేరుచేసి ఒక ఉద్యానంగా తీర్చిదిద్దవలసి ఉన్నది ఈ పద్య సాంకర్యం ఈ రెండు పద్యభేదాలతోనే ఆగిపోలేదు తరలం, మత్తకోకిలలు కూడ కనిపిస్తాయి పామరులైన లేఖకులు వేమన పద్యాలను "అబుద్ధిపూర్వకంగా" నైనా చాలా చెరిచారు. తమ మిడిమిడి జ్ఞానంతో వేమన పద్యాలను దిద్దడానికి వెనుదీయలేదు స్థలవిస్తరణ భీతితో ఇక్కడ ఉదాహరణల జోలికి వెళ్ళడంలేదు నిజానికి ఎన్ని ఉదాహరణలిచ్చినా తక్కువే చెప్పకోదగిన విషయమేమిటంటే – తమ పరిమిత లేక స్వల్ప పరిజ్ఞానంపట్ల లేఖకులకు కూడ నమ్మకంలేదు తమ దోషాలపట్ల భయమున్నది అందుకే గ్రంథాంతంలో –

*వ్రాత తప్పు వలన వాచకు లలగక*
*తప్పు గల్గెనేని తగినయెడల*
*వలయునక్షరములు వర్ణించి వ్రాయుడీ*
*సుకవులైనవారు సురుచిరముగా* *(డి 1728)*

అని వ్రాసుకున్నారు మకుటంలేక రక్షింపబడిందిగాని ఈవరకిది వేమన పద్యసంచయంలో చేరిపోయేదే లేఖకులు గావించిన ఇటువంటి 'సొంత కవిత్వాలకు' వీటిలో లోటు లేదు వ్రాస్తూ వ్రాస్తూ ఏ పదునైన వేమన పద్యమో వచ్చినప్పుడు దానికి ప్రతిస్పందనగా తామూ స్వకపోలజనితమైన సరుకును చేర్చడానికి సందేహించలేదు లేఖకులు ప్రతుల పైన తమ 'హస్తలాఘవా'న్ని చూపే దుస్సంప్రదాయం పరిశోధకులందరికీ అనుభవైకవేద్యమే

55 D 3142 C P Brown's dictionary notes on Compbell's Dictionary of Telugu language Vol II Page 47

తాళపత్ర ప్రతుల్లో జరిగిన అనేక అవకతవకలను గూర్చి సందర్భం వచ్చినచోటులలో నిరూపిస్తాను.

ఇక కాగితపుప్రతుల్లో కొన్నిశ్లోకాలు కూడ ఎంత విచిత్రంగా చేర్చబడ్డాయో ఆశ్చర్యం వేస్తుంది ఈక్రింది ఉదాహరణ చూడండి.

మహమ్మదు కులానందన తిర్యోజ్యోతి త్రిలోక బహామనీ
తీరతో మక్కా పవిత్రం గోవు మాంస పాపవిమోక్షణం
బలహీల హోయిలతా మహమ్మదు రసులల్లా!
కహో విరపర వేమా (1725, 92)

ఇటువంటి చెత్తనంతా వేమన పద్యాలలో నుండి ఊడ్చి పారెయ్యవలసి ఉన్నది.

## (ii) ముద్రిత ప్రతులు

### (ఎ) వావిళ్ళవారి కడపటి ముద్రణం[56]

వావిళ్ళవారి వేమన పద్యాల చిన్నసైజులో ఉన్న లావుపాటి గ్రంథం 1922లో వెలువడింది ఇందులో 2728 పద్యాలున్నాయి నాలుగువేల పద్యాలతో వెలువడిన పూర్ణయాచారి బందరు ముద్రణం తర్వాత మూడేళ్ళకు ఇది ముద్రించబడింది. దీనిలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారి పీఠికా, శేషాద్రి రమణ కవుల 'వేమన జీవితము' ఉన్నాయి దీనికి తాత్పర్యం వ్రాసినవారిపేరు లేదు దీనికన్న ముందు వావిళ్ళవారే అచ్చువేసిన వేమన పద్యాలను పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు పరిష్కరించి తాత్పర్యాలు వ్రాశారు ఇందులో వేమన పద్యాలు 19 విభాగాలు చేయబడ్డాయి వేమన పద్యాలను ఇన్ని భాగాలుగా విభజించి ప్రకటించడం ఇదే మొదటిసారి కాని దీనిని ముద్రించడంలో అనేక లోపాలు జరిగాయి చాలా పద్యాలకు నెంబర్లే అచ్చుకాలేదు దాదాపు 20 పద్యాలు రెండుసార్లు వేరువేరు విభాగాల్లో వస్తాయి "ఒక పద్ధతిలో జేరవలసిందింకొక పద్ధతిలో జేరుట, ఇట్లు వ్యత్యయముగలుగకుండ జూచుట కడుంగడు శ్రమావహము" అని పరిష్కర్త చెప్పుకొన్నా, పద్యాలను ఆయా విభాగాల్లో చేర్చేటప్పుడు "గందరగోళము" నకు గురయ్యారు కాబట్టే ఒక పద్యం రెండుచోట్ల సాక్షాత్కరిస్తున్నది ఒక పద్యాన్ని రెండుచోట్ల ముద్రించినప్పటికీ రెండో దానిని అదనపు సంఖ్యగా చేర్చుకోవడం అనుచితమైనపని ఇందులో మొత్తం 2728 పద్యాలు ఉన్నాయని చెప్పినా అది పరిష్కర్త పొరపాటువల్ల ఏర్పడిన సంఖ్య మాత్రమే నిజానికి ఇందులో 2718 పద్యాలే ఉన్నాయి అంతేకాక 300 లకు పైగా పద్యాలు కొద్దిపాటి మార్పులతో మళ్ళీ మళ్ళీ వచ్చాయి పరిష్కర్తల లేక ముద్రాపకుల పొరపాట్లవలన వేమన పద్యసంఖ్య కెట్లా ముప్పు వాటిల్లుతూ వస్తున్నదో చూపడానికిదొక మంచి ఉదాహరణ

56 వావిళ్ళవారు వేమన పద్యాలను ముద్రించటం ఎప్పుడు ప్రారంభించారు, మొత్తం ఎన్ని ముద్రణాలు తెచ్చారు అనేది ఇంకా పరిశోధించవలసి ఉంది 1879 నాటి 1157 పద్యాల ముద్రణం బహుశా మొదటిది కావచ్చు కాని ఇది బ్రౌన్ 1839 నాటి వేమన పద్యాలు ద్వితీయ ముద్రణకు నకలు ముద్రణేతప్ప వేరుకాదు దీనికే 1910, -16, -19, -28 లలో పునర్ముద్రణలు వెలువరించారు ఇవిగాక 1911, 1917 (దీనికే శ్రీ రాళ్ళపల్లి పీఠిక రాశారు) -22, -25, 55 లలో వివిధ పద్యసంఖ్యల్తో వెలువడినవి కనపడుతున్నాయి

బ్రౌన్ తొలిసారి 693 పద్యాలతో వేమన పద్యాలను ముద్రించాడు. పదేళ్ళ తరువాత ఆయన 1164 పద్యాలతో రెండవ ముద్రణాన్ని వెలువరించాడు. బ్రౌన్ రెండవ ముద్రణం తర్వాత 84 ఏళ్ళకు, అంటే 1913లో పూర్ణయ్యాచారి బందరు ముద్రణం నాలుగువేల పద్యాలతో వెలువడింది. అచ్చులో ఎక్కువ పద్యాలతో వెలువడిన మొదటిప్రతి ఇదే. వావిళ్ళవారి ప్రతి బ్రౌన్ ముద్రణంకన్నా ఎక్కువ పద్యాలతో, బందరు ప్రతికన్నా తక్కువ పద్యాలతో ముద్రించబడింది. కాబట్టి పద్యసంఖ్య విషయంలో ఈ ముద్రణం ప్రదర్శించిన ప్రత్యేకత ఏమీ లేదు.

సాయపడిన వారికి కృతజ్ఞతలు చెప్పడం, ఆధారాలను తమ గ్రంథాలలో పేర్కొనకపోవడం మనవారికి అబ్బని మంచిసంప్రదాయాలు వేయి సంవత్సరాల క్రితం ఆదికవి నన్నయ నారాయణభట్టును తన మహాభారతంలో పేర్కొన్నా, తెలుగువాడి దళసరి చర్మాన్ని అది ఏమాత్రం స్పర్శించలేకపోయింది. వావిళ్ళవారి ప్రతిలోకూడ పద్యాలను యెత్తి వ్రాసుకోవడంలో ఉపకరించిన ప్రతులను పేర్కొనడం జరగలేదు. ఎందుకు పేర్కొనలేదు? దానికి కారణాలేమిటి? అనే వివాదంలోనికి ప్రస్తుతం నేను వెళ్ళదలచలేదు. కాని వారు పేర్కొననిదానిఫలితంగా పరిశోధకుని పరిశ్రమ అధికమయింది. వావిళ్ళవారు పేరు చెప్పకుండా అచ్చువేసుకున్న పద్యాల్లో చాలాభాగం బ్రౌన్ సేకరించిన తాళపత్ర ప్రతులు మరియు ఆయనే వ్రాయించిన కాగితపు ప్రతులలోనివే. ముఖ్యంగా ఓరియంటల్ లైబ్రరీలోని డి 1721, డి 1723, డి 1725, డి 1728, డి.1735 మొదలైన నెంబర్లుగల ప్రతులలోనివే ఇవేకాక బ్రౌన్ సేకరణలలో లేక బందరు (?) ప్రతిలో ఉన్న పద్యాలు దాదాపు రెండువందల దాకా ఉన్నాయి

ఈ గ్రంథంలో వేమనపద్యాలను పరిష్కరించినవారు పండితులు. వారి లక్షణ విధేయత, సాంప్రదాయకదృష్టి ఈ పరిష్కరణలో కొట్టొచ్చినట్టు కన్పిస్తున్నాయి వేమన పద్యాలకు అరసున్నాలు చేర్చిన ఘనతకూడ వీరికి దక్కుతున్నది వీరి చేతిదెబ్బలకు వేమన పద్యాలు కాళ్ళు విరిగి కుంటివైపోయాయి దిద్దుబాట్ల తొందరలో అనవసరమైన కొత్త మార్పులతో వేమన కవిత్వ స్వభావాన్నైనా గమనించకుండా వీరు చేసిన సవరణలు వేమన పద్యాలను నిలువెల్లా చెరిచాయి

వ్రాతప్రతులను దగ్గరుంచుకొని ఇందులో చేయబడ్డ కొన్ని మార్పులను చూస్తే ఇచ్ఛానుసారంగా ఎట్లా దిద్దిపారేశారో తెలుస్తుంది

| ఆకరాలు | వావిళ్ళ ప్రతి |
|---|---|
| 1 ఈతగింజ వంటి యిసుమంత యోనికి<br>ఆశపడును నరుడు అవనిలోన<br>తోయజాక్షుల మాయ తోయనెవ్వరి<br>వశము<br>(డి 1725) | 1 ఈతగింజ వంటి దెరిగియు దానికే<br>యాసపడును మూర్ఖుడవనిలోన<br>దోయజాక్షి జూసి తొలగంగ వశమౌనె<br>(11) |

2. గాడ్దెమేని నిండ గంధంబు బూసిన
యేమి యెరుగలేక యెగశి తన్ను
నీడుకాని దానికిష్టమీలాగురా
(డి.1721)

3. మంత్రమెల్ల మరచి మధురాధరము
దల్గు
నేవిధమున భక్తుడేమగు నిన్ను యోని
జూచి పరమ యోగంబు మరతురా
(డి.1721,– 73)

4. ఉత్పత్తిశూద్రుండు వృత్తమోత్తము
డెటు
సతికి శూద్రత్వంబు సర్వదాను
తల్లి శూద్రురాలు తానెట్లు బ్రాహ్మడో
(డి.1723)

5. చార్వాక మతమున జగతిలో భవకోటి
శక్తిశైవంబని చెలగియుండి
చండాలసేవకు చెలువంది చెడుదురు.
(1723)

6. వెర్రినక్కలవలెను వేదములు జదివేరు
వేదసారమంత వేమన యెఱుగును
(1721)

7 స్వానుభూతి లేక శాస్త్రవాసనలచే
సంశయంబు చెడదు సాధకునకు
చిత్రదీపమందు చీకటి చెడనట్లు
(1769)

8. ఇంచుకంతయోని కీగెడు జనులు
కంచముకడ పిల్లి గాచునట్లు
పంచబాణునింట బానిస కొడుకులు
(172)

9 పడుచు నిచ్చువాని పద్యమిచ్చినవాని
కడుపు చల్లజేసి ఘనతజేసి
నడువనేరనివాడు నాబుల్ల గుడవనా
(డి 1723)

2. గాడ్దెమేని నిండ గంధంబు బూసిన
బూదిలోన బడును బొరలు మరల
మోటువారి సొగసు మోస్తరియ్యది
సుమా
(26)

3. మంత్రమెల్ల మరచి మధురాధరము
గ్రోలి
ఎట్లు మొఱకు డొడ నెఱుగగలడు
ఉవిద జూచి పరమ యోగంబు మర
చును.

4. ఉదయమందు శూద్రుడుత్తమోత్తము
డెటు
సతికి శూద్రతనము సత్యమే కద
తల్లి శూద్రమయ్యె తానెట్లుబాపడు

5. చాలాదయ్యె యింక చార్వాక మతరలి
శక్తిశైవ మనుచు జొలనమ్మి
సరశిమిగిలిచెడును చండాలసేవచే
(86)

6 వేనవేలు చేరి వెఱ్ఱి కుక్కల వలె
అర్థహీన వేద మఱచు చుంద్రు
కంఠశోషకంటె కలిగెడి ఫలమేమి?
(115)

7. స్వానుభూతిలేక శాస్త్రవాసనలందు
సంశయంబు లేని సాధనమున
చెలగుదీపమట్లు చిత్స్వరూపమునందు
(177)

8 ఇంచుకంత సుఖమె యీరేడు జగ
ములు
కంచమునకు బిల్లి కొలిచినట్లు
పంచబాణుబారి బడలుచు
(406)

9. పడుచునిచ్చినతని బత్తెమిచ్చినవాని
గడుపు చల్లజేసి ఘనతజేసి నడుప
నేర
నతడు నాలిముచ్చేగదా
(1148)

ఇంకెన్నో ఉదాహరణలు చూపవచ్చు. గ్రంథంలో నాలుగింట మూడువంతులు ఇదే పరిస్థితి. దిద్దబడినవన్నీ వేమన రచించిన పద్యాలే అని ఘంటాపథంగా నేను చెప్పడంలేదు. సలక్షణమైన కొలతలతో చూస్తే వాటిలో భాషాదోషాలు లేకపోలేదు. అశ్లీలపదాలు కూడ దొర్లినవి. కాని వేమనపద్యాలను కొలవడానికి కావలసిన ప్రమాణాలివి కావు. అయినా వావిళ్ళవారు తమ పరిష్కరణంలో అనుసరించిన పద్ధతులు కూడ యేమీ లేవు. ఈ పరిస్థితిని మనసులో పెట్టుకొనే శ్రీ శర్మగారు –

"వ్రాతప్రతుల స్థితి యిట్లుండగా అచ్చుప్రతులు మరింత యసహ్యముగా నున్నవి. అందును 'గుజిలి' ప్రతులకన్నా 'పరిశోధించి' వేసిన నవనాగరకుల ముద్రణములు చాల అశ్రద్ధను వెలిబుచ్చుచున్నవి. వేమన స్వభావము, మతము, కవిత్వ ధర్మము, భాష మొదలగు వానివేమియు గమనింపక, వ్రాతప్రతుల పాఠములను విచారింపక, అర్థ భావములకు వచ్చు ననర్థమును లక్ష్యపెట్టక, దిద్ది ముద్రించిన పాఠము లనేకములందు గలవు." (వేమన పేజీ 9)

వేమన పద్యాలు అచ్చుకు రాకమునుపే, వ్రాతప్రతుల స్థితిలో ఉన్నప్పుడే, ఈ దుఃవస్థ మొదలైంది. లేఖకుల అజ్ఞానంతో, దానిలో నుండి పుట్టిన స్వంత కవిత్వంతో బరువైన పండిత హస్తాల తాకిడిలో, తమ అభిరుచులకు వ్యతిరేకమైనప్పుడు పట్టుపట్టి పద్యాల తలలు గొరిగిన స్వార్థబుద్ధులతో వేమన కవితామూర్తి బాహ్యరేఖలు చెరిగి కలగాపులగమైనది

ఇక "దిద్దుబాట్ల తొందర" ఇట్లా ఉంటే "ప్రక్షేపాల పాపం" ఎట్లా పెరిగిపోయిందో చూద్దాం వావిళ్ళ ప్రతిలో దాదాపు వందపద్యాలు కొత్తవి చేర్చబడ్డాయి. బ్రౌన్ సేకరించిన తాళ పత్ర ప్రతులలోగాని అయనే వ్రాయించిన 16 కాగితపు ప్రతులలోగాని ఇవి కనిపించలేదు అనేక తాళపత్ర ప్రతుల ఆధారంగా తయారైన బందరు ప్రతిలో కూడ ఇవి కానరావు. మచ్చుకు ఒకటి మాత్రం చూపుతాను

బౌద్ధమతమువారు బుద్ధి దైవంబని
హెచ్చు తక్కువాడి తుచ్ఛమతిని
గాడ్దెల గుమివలె గ్రక్కున బడుదురు (71)

ఏ ప్రతిలోనూ లేనంతమాత్రాన అవి వేమనపద్యాలు కాకుండా పోతాయా, దేశంలో ప్రతులకెక్కక ప్రజలవాడుకలో ఉన్న పద్యాల సేకరణలు కావచ్చుగదా ఇవి? అని వాదించవచ్చు కాని దానికిట్లు సమాధానం చెప్పవచ్చు లభ్యమౌతున్న ముద్రితాముద్రితప్రతులనే సరిగా వాడుకోని పరిష్కర్త అంత శ్రమ తీసుకుంటాడని ఎవరూ నమ్మలేరు పైగా వేమన పద్యాలను గుర్తించడానికి మనం చర్చించబోయే ప్రమాణాలకు అవి ఒదిగితే వాటిని ఒప్పుకోవడంలో అభ్యంతరం ఉండదు

## (బి) బందరు ప్రతి:

'వేమన సూక్తి రత్నాకరము' అనే పేరుతో రాయవరపు పూర్ణయాచారి అనే బందరు వాస్తవ్యుని విశేషకృషి కారణంగా 1913లో వెలువడ్డ గ్రంథమిది పూర్ణయాచారి డిస్ట్రిక్ట్ పోలీసు ఆఫీసులో క్లర్కుగా చేరి మంచిపేరుతో 1900 సంవత్సరంలో రిటైరయ్యాడు

"పురాతన గ్రంథములను వెల్లడికి దెచ్చు కోర్కెతో ఇన్‌స్పెక్టర్ ప్రమోషన్ కూడ వదులుకొ"న్న ప్రజాహితశీలి ఈయన బందరులో శ్రీ శాంతా మల్లేశ్వరస్వామి ఆలయంలో విడిసిన శ్రీ లంక రామయోగిగారి ముఖతః వేమనపద్యాలను విని ఆకర్షితుడై వేమన పద్యాలసేకరణకు ఉద్యమించాడు. రామయోగిగారి వద్దనే ఒక ప్రతి దొరికింది. 1200 పద్యాలు కలిగిన ఓ బజారు ముద్రిత ప్రతితో[57] దీనిని 'కంపేరు' చేయగా తాళపత్ర ప్రతిలోని పద్యసంఖ్యకంటె ఎక్కువగా తేలింది బ్రౌన్ సేకరణల్లోగాని, మరే ఇతర తాళప్రతులలోగాని ఇన్ని పద్యాలు కలిగినప్రతి కానరాదు ఇక ఆఫీసుకు మూడునెలలు సెలవుపెట్టి విజయనగరంలోని మందూరి వీరయోగి, చెన్నపట్టణంలోని పెరంబాకం మునియాచారి, సిద్ధాంత సిద్ధయోగి, మందూరులోని కనగాల వీరయోగుల వద్దకు వెళ్ళి, వారివద్ద ఉన్న అనేక తాళపత్ర ప్రతులలోని వేమన పద్యాలను కాపీ చేసుకున్నాడు. అంతేకాకుండా, కొండవీడు, కర్నూలులలో కూడ కొన్ని ప్రతులను సంపాదించాడు. అన్నింటిని 'కంపైలు' చేయగా 4035 పద్యాలు తేలాయి. ప్రతులసంఖ్య చెప్పబడలేదుగాని బహుశా పదికి తక్కువగాని తాళపత్ర ప్రతుల ఆధారంగా సాధించబడిన పద్యసంఖ్య ఇది ఒక్కచేతిమీదుగా పూర్ణయాచారి కావించిన గొప్ప పరిశ్రమను పరికిస్తే వేమన పద్యాల సేకరణలో గాని, వాటితో అయన పడిన తంటాలలోగాని బ్రౌన్ తర్వాత ఈయన పేరే ఘనంగా చెప్పకోవాలి ప్రతులను 'కంపైలు' చేసిన పూర్ణయాచారి పరిష్కరణ బాధ్యతను శ్రీ నాదెళ్ళ పురుషోత్తమశాస్త్రులవారికి అప్పగించాడు 1910లో పని పూర్తయింది 1913లో తన విశేష కృషిఫలం ప్రజలకంటపడకముందే పూర్ణయాచారి కాలధర్మం చెందాడు ఆయన వాంఛితార్థాన్ని తెలిసిన ఆయన కుమారుడు రాయవరపు కుమారయ్య అదే సంవత్సరంలో దీనిని అచ్చువేయించి ప్రకటించాడు ఇది 350 పేజీల గ్రంథం దీనిలో 'వేమన యోగీంద్ర చరిత్రము' అనే 30 పేజీల వచన భాగముంది అందలి విషయాలను గూర్చి సందర్భానుసారంగా చర్చిస్తాను 5 పేజీల తప్పొప్పుల పట్టిక గ్రంథ ప్రారంభంలో చేర్చబడింది గ్రంథాంతంలో 'పద్యముల వివరము' అనే పేరుతో ఇందులో వాడబడిన వివిధ పద్యాలసంఖ్యలు ఇవ్వబడ్డాయి గ్రంథం మొదటా చివరా అభిముఖాసీనుడైన వేమన రేఖాచిత్రం ఉంది 4035 పద్యాలతో వేమన పద్యాలను వెలువరించిన మొట్టమొదటి ఘనత పూర్ణయాచారిదే ఇంత ఎక్కువ సంఖ్యలో అప్పటివరకు వేమన పద్యాల ముద్రణలు వెలువడలేదు 1906లో చెన్నపట్టణంలోని ముత్యాల నరసింహ యోగి 'వేమన జ్ఞానమార్గ పద్యములు' అనే పేరుతో 3002 పద్యాలను ప్రకటించాడు బందరు ప్రతికి పూర్వం ముద్రింపబడి దాని పద్యసంఖ్యకు సమీపంగా వచ్చిన ప్రతి ఇదొక్కటే ఇదే పద్యసంఖ్యతో లభ్యమౌతున్న మరో ముద్రితగ్రంథం టి గోపాలయ్య (మద్రాసు) ప్రకటించిన 'వేమన పద్యములు.' 1960లో నేదునూరి గంగాధరం 5000 పద్యాల ముద్రణాన్ని వెలువరించేదాకా బందరు ప్రతిలోని పద్యసంఖ్యయే అన్నింటికన్న మిన్న ఈ ప్రతిలోని పద్యములు అకారాది క్రమంలో పేర్చబడినవే కాని విషయ విభాగ పద్ధతిలో కూర్చబడినవి కావు 'పీఠిక' వంటి దానిలో పూర్ణయాచారి చెప్పకొన్నదాన్నిబట్టి వేమన పద్యాలను పరిష్కరించడానికి ఏర్పరచుకోవలసిన దృష్టి కనిపిస్తున్నది 1 బూతు పద్యములను పరిహరించాలి

---

57 బహుశా ఇది 1910లో వావిళ్ళవారు ప్రకటించిన 1173 పద్యాల గ్రంథం కావచ్చును

2 "వ్రాతప్రతుల పద్యములు అన్ని శుద్ధ తప్పులుగా కూడ ఉండవచ్చు" అని అనుకొని నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రిగారికి పరిష్కరణార్థం ఇచ్చేటప్పుడు తన అభిప్రాయాలను వారికి చెప్పి ఉంటాడు పూర్ణయాచారి



ఎందరు ప్రతికి కారకుడు రాయవరపు పూర్ణయాచారి

అదీగాక శాస్త్రిగారికి కూడ దీనికి భిన్నమైన దృష్టి లేదనడానికి గ్రంథమే నిదర్శనం పలుకుతుంది ఫలితంగా బూతుపద్యాల ఏరివేత కార్యక్రమం నిరాటంకంగా జరిగిపోయింది ఇం రెండవదానినిబట్టి "శుద్ధ తప్పు"లను "శుద్ధి ఒప్పు"లుగా దిద్ది తీర్చడం కూడ అనాయాసంగా జరిగిపోయింది శ్రీ రాళ్ళపల్లి ఈ ముద్రణాన్ని గూర్చి వ్రాస్తూ "బందరువారు ముద్రించిన 'వేమన సూక్తి రత్నాకరం'లో అతడు తన చరిత్రమును వ్రాసికొన్నట్లుండు పద్యములు నాకు జూడ వేమనవిగావు. ఇదివరకున్న యనేక ముద్రణములలోగాని, బ్రౌన్ దొర సంపాదించిపెట్టిన సుమారు ఏబది వ్రాతప్రతులలోగాని యవి లేవు."

తీరికగా పరిశీలిస్తే వేమన 'తన చరిత్రమును వ్రాసికొన్నట్లుండు పద్యములు' బ్రౌన్ ప్రతుల్లో కూడ దొరుకుతాయి. కాని బందరు ప్రతిలో ఉన్నంత పెద్దసంఖ్యలో కాదు. అంతేగాక బ్రౌన్‌ప్రతులలో కనిపించక బందరు ప్రతిలో ఉన్న అనేక పద్యాలు 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు'లోని తాళపత్ర ప్రతుల (185/9, 172/9)లో కనిపిస్తాయి. కాబట్టి బ్రౌన్ ప్రతులలోకాని, ఇతర ముద్రిత ప్రతులలోగాని లేని అనేక పద్యాలు దేశంలోని ఇతర తాళపత్ర ప్రతులలో ఉండడానికి అవకాశమున్నది. కాని శర్మగారు అభిప్రాయపడ్డట్టు బందరు ప్రతిలోని 'విశ్వకర్మ'లను గూర్చి చెప్పబడ్డ పద్యాలను తప్పకుండ సందేహించవలసిన అగత్యం ఉంది. ఏ తాళపత్ర ప్రతిలోను నాకు అవి నేను చూసినంత వరకు తటస్థపడలేదు. పదులకు పదులే విశ్వకర్మలను గూర్చిన పద్యాలు బందరు ప్రతిలో చేర్చబడ్డాయి[58] బలమైన సాక్ష్యం లభించేదాకా వాటిని వేమనకృతాలుగా అంగీకరించకుండా ఉండే హక్కు మనకున్నది. ఆ పద్యాల తీరు కూడా మన అభిప్రాయాన్ని సమర్థిస్తుంది. కాని ఎంగూరివారు అన్నట్టుగా పూర్ణయాచారి కమసాలి కులస్తుడు కాబట్టే ఇందలి పద్యాలన్నీ కులాభిమానంతోనే చేర్చబడ్డాయని భావించడం మరింత పరిశీలన వలననే తేలాలి.

ఇక ప్రతి తాళపత్ర ప్రతిలో ఉన్నవి, ప్రసిద్ధమైనవి అయిన (i) శివకవులకు నవ కవులకు (ii) శ్రీకరంబుగ వేమన చెప్పినట్టి అనే రెండు పద్యాలను గ్రంథప్రారంభంలో దైవస్తుతి పద్యాలలో చేర్చారు కాని అవి మిగిలిన పద్యాలతోబాటు లెక్కించబడలేదు ఇంతటి ప్రసిద్ధ పద్యాలకు చోటు లేకుండానే పద్యసంఖ్య యేర్పడింది వీటితోపాటు ఉన్న మరో పద్యం వేమనది కాదు గ్రంథానికి ప్రారంభ పద్యమిది

శ్రీమదుమాపతి యగునా
స్వామికి దాసుండ సంగజములు పొడగన్
వేమన యనెడు ధీరుడు
నేమంబున జెప్పె దీని నిక్కము వేమా

ఈ పద్యము వేమనది కాదనడానికి సాక్ష్యమేమీ అవసరం లేదు

## IV. కందాది పద్యాలు:

వేమన పద్యం అనగానే ఎవరికైనా శ్రుతిపుటాల్లో వినిపించేది ఆటవెలదే వేమన కవిత్వానికి ఆటవెలదితో ఉన్నంత అవినాభావ అనుబంధం ఏ కవికీ ఏ వృత్తంలో లేదు దానికి దాదాపు ఆయన కవిత్వమంతా ఆటవెలదులలో సాగడం మాత్రమే కాకుండా దానిలో ఆయన చూపిన అప్రయత్నశిల్పంకూడ కారణం అసంఖ్యాకమైన వేమన పద్యాలలో ఆటవెలదులేకాక కందం, తేటగీతి, సీసం, ఉత్పలమాల, మత్తకోకిల, ఉత్సాహ, సీసమాలిక, ధృవకోకిల, మధురగతిరగడ ద్విపద, పాట (తత్త్వపదము), అంత్యనియమ ఘటిత చిత్రపదము, వచనం మొదలైనవన్నీ ఉన్నాయి

ఆటవెలదులతో పోలిస్తే వీటిలో ఏ పద్యసంఖ్య కూడ గణనీయమైనది కాదు కాని

58. పద్యాలు 3543 నుండి 3551 వరకు

వీటిగురించి ఒక నిర్ణయానికి వచ్చేముందు ఏయే ప్రతుల్లో వీటి ప్రాచుర్యాలు ఏయే విధంగా ఉన్నాయో పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఆటవెలదులు కాని పద్యాల పరిశీలనకు నేను మూడు రకాల ప్రతులను ఎన్నుకుంటున్నాను: (1) బ్రౌన్ వ్రాయించిన 12 కాగితపు ప్రతులు (2) వావిళ్ళవారి కడపటి ముద్రణం (3) బందరు ప్రతి. దాదాపు దేశంలో లభ్యమౌతున్న తాళపత్ర ప్రతులన్నింటికీ చాలావరకు ఇవి ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. ఆటవెలదుల తర్వాత కందపద్యాలే పెద్ద సంఖ్యలో ఉన్నాయి. కాబట్టి వాటిని ప్రత్యేకంగా ముందు పరిశీలించి తర్వాత మిగిలిన వాటిని చూస్తాను.

## బ్రౌన్ కాగితపు ప్రతులు:

బ్రౌన్ కాగితపు ప్రతులు, బ్రౌన్ సేకరించిన తాళపత్ర ప్రతులకు పుత్రికలు కాబట్టి వీటినుండి లభించే ఫలితాలు వాటికీ అన్వయించుకొనవలసి ఉంటుంది. ఒక్కొక్క ప్రతిలోని కందపద్యాల సంఖ్యను ఈ కింద చూడవచ్చు:

### బ్రౌన్ ప్రతులు:

| ప్రతి నెంబరు | మొత్తం పద్యాలు | కందపద్య సంఖ్య |
|---|---|---|
| డి 1721 | 1165 | 116 |
| డి 1723 | 1116 | 159 |
| డి 1724 | 306 | 46 |
| డి 1725 | 869 | 114 |
| డి 1726 | 686 | 8 |
| డి 1727 | 675 | 75 |
| డి 1735 | 1146 | 56 |
| డి 1736 | 252 | 38 |
| డి 1769 | 936 | 107 |
| డి 1773 | 3238 | 131 |
| డి 1762 | 1154 | 26 |
| డి 1770 | 919 | 9 |

ఈ పన్నెండు ప్రతులలో నూటికి పైబడ్డ కందపద్యాలు నాలుగుప్రతుల్లో మాత్రమే ఉన్నాయి మిగిలిన 8 ప్రతులలోని కందాలు నూటికిలోపే ఉన్నాయి అన్నిటికన్న ఎక్కువ పద్యాలు (159) డి 1723లో ఉన్నాయి డి 1770లో 9 మాత్రమే ఉన్నాయి బ్రౌన్ ప్రతులన్నింటిలో తేలిన పద్యాల సంఖ్య మొత్తం మూడువేలు పైగా ఉంది వాటిలో మొత్తం కంద పద్యాల సంఖ్య 350 మాత్రమే; అంటే బ్రౌన్ ప్రతులలో దాదాపు 10% మాత్రమే కందపద్యాలు ఉన్నాయి

ఇక మిగిలిన పద్యాల వివరాలు ఈ కిందివిధంగా ఉన్నాయి.

| | | |
|---|---|---|
| సీసాలు | – | 24 |
| ఉత్పలమాలలు | – | 8 |
| చంపకమాలలు | – | 4 |
| మత్తకోకిల | – | 1 |
| పాటలు | – | 5 |
| ద్విపద | – | 1 |
| గీతాలు | – | 4 |

ఒకదానిలో ఒకటి పెనవేసుకుపోయిన పద్యాలను వేరుచేసి వీటిలో చేర్చలేదు కేవలం విడిగా ఉన్నవి మాత్రమే ఈ సంఖ్యలో చేరాయి

**బందరు ప్రతి:**

ఈ ప్రతిలో మొత్తం 4035 పద్యాలున్నాయి. వాటిలో 691 కందాలు ఉన్నాయి. దాదాపు 17% కందాలు మిగిలిన పద్యాల సంఖ్యలు ఈ క్రిందివిధంగా ఉన్నాయి

| | | |
|---|---|---|
| తేటగీతాలు | – | 324 |
| సీసములు | – | 28 |
| ఉత్పలమాలలు | – | 8 |
| చంపకమాలలు | – | 8 |
| వచనములు | – | 3 |
| మత్తకోకిలలు | – | |
| ఉత్సాహ వృత్తములు | – | |
| పాటలు | – | 2 |
| అంత్యనియమ ఘటిత చిత్రపదము | – | 1 |
| సీసమాలిక | – | 1 |
| ధృవకోకిల | – | 1 |
| మధురగతి రగడ | – | 1 |
| తత్త్వపదము | – | 1 |

**వావిళ్ళ ప్రతి:**

వావిళ్ళ ప్రతిలో మొత్తం 2718 పద్యాలు ఉన్నాయి వాటిలో 324 కందాలు ఉన్నాయి మొత్తం పద్యసంఖ్యలో కందాలు 12% మిగిలిన పద్యాల వివరాలు ఈ క్రింద చూడవచ్చు

| | | |
|---|---|---|
| తేటగీతులు | – | 156 |
| సీసములు | – | 10 |
| ఉత్పలమాలలు | – | 2 |
| చంపకమాలలు | – | 2 |
| గేయాలు | – | 1 |
| మత్తకోకిలలు | – | 3 |

అన్నింటికన్న బందరు ప్రతిలోనే కందాలధికం కందాలు మచ్చుకైనా లేని ప్రతి ఒక్కటికూడా లేదు చివరకు అత్యంత ప్రాచీనప్రతి అనడానికి వీలయిన డి. 1733లో కూడ ఆటవెలదులుకాని పద్యాలున్నాయి (దీనినిగూర్చి ముందు చర్చిస్తాను) కాబట్టి వేమన పద్యాలలో కందాలు మధ్యలో పుట్టినవి కావు

వేమన పద్యాలలోని కందాలన్నీ వేదాంత విషయపరంగా చెప్పబడినవే వీటి నడక ధారాళంగా ఉండదు

'కందాల కవి' కవి చౌడప్పలోని 'నల్లేరుపై బండి నడక' శైలి కూడా వీటిలో మృగ్యం వేమన ఆటవెలదులలో సహజంగా ఉండే అప్రయత్నతలేక విశ్రాంతిగా కూర్చొని మననం చేసి రచించినట్లనిపిస్తాయి

ఈ క్రింది ఉదాహరణలు చూడండి

దేహాభిమానముండగ
మోహాదులు జననవార్ధిముంచును కలగా
నిహారి విషయభావన
కూహాదులు బోలు మేలుకొన్నను వేమా

(డి 1721, –17, పాఠాంతరాలతో డి 1723, –744, డి 1835, – 744)

అవదన్యుడైనగానీ
కువలయపతి నివరమైన కొలువగు మేలే
యువరాజ్య పట్టమిచ్చిన
నవివేకుల కొల్చుటెల్ల యధమము వేమా (డి 1727, –113)

చిత్తము ప్రతిమలకైవడి
చిత్తమున వికల్పమరసి స్థిరతరబుద్ధిన్
చిత్తును తెలిసినవాడే
యిత్తరి సుజ్ఞానియండ్రు యిహమున వేమా (డి 1725, –117)

శ్రీముఖ పతి యంశంబున
తామరసఖు డెండ నెక్కి తగుచను వేళన్
శీమా భూములు దరిగిన
సామజపతి వారి భంగి జనురా వేమా (డి 1723, 1023)

(పాఠాంతరాలలో డి 1725, –105)

"బలమైన హేతువు లభించువరకును ఇప్పటి కంద గీతులలో ననేకము అతనివి గావని నేను నమ్ముచున్నాను" (వేమన, పేజీ 13) అని రాళ్ళపల్లి వారన్నారు

కందాలేగాక వేమన పద్యాలలో చేరిన ఒక మత్తకోకిల కూజితంకూడా వినవస్తుంది

కంజజుండు వ్రాయ జెల్లు కర్తయందు రంతకున్
కంజయోని నెత్తి శూలికై వెలుంగు జక్కగా
కంజమోని శార్ఙి నెత్తికర్మ వ్రాయుటెల్లరో
కంజ జారడ నాథుదోడుగా నెఱుంగు వేమనే

(డి 1727 –515, డి 1773, వాల్యూమ్ III 1353)

ఇది స్వచ్ఛమైన గడ్డిపూలలాంటి వేమన పద్యాలలో జారిపడిన పల్లేరుకాయలాంటిది.

మకుటాన్ని మినహాయిస్తే వేమన్న ఆటవెలదులకు మూడే పాదాలు సాధారణంగా ఈ మూడు పాదాల్లో ఆయన చెప్పదలచిన అనంతార్థం విత్తనంలోంచి మఱ్ఱివృక్షం పుట్టినట్టుగా వెలువడుతున్నది. కాని 'వేమా' అనే మకుట శకలంతో కూడ అనేక పద్యాలు కనిపిస్తాయి నాలుగో పాదం చివర ఈ చిట్టి మకుటాన్ని మినహాయిస్తే $3\frac{3}{4}$ పాదాల పద్యాలు వేమన పద్యాలలో వీటి సంఖ్య నాలుగైదు వందలకు మించి వుంటుంది వీటిలో 90% వేమన పద్యాలుగా తోచవు వేమన్న భావం మూడు పాదాలలో ముగియవలసిందే ఆటవెలదిపైన వేమనకున్న పట్టు అది. ఈ కింది పద్యాన్ని చూడండి - ఇటువంటి పద్యాలను ప్రక్షిప్తాలుగా అనుమానించవచ్చు

అప్పృథివి వహ్నిగ గననయ్యాఖ్యలెన్నో
పరగాను ప్రమాణముబట్టి బయలు
కార్మికాణ వమాయకాఖ్యలు దలంప
పరగగాను (9ఎ) ప్రమేయము బయలు వేమా (డి 1727 -84)

స్వభావరీత్యా వేమన ఆశుకవి కావున, ఆశుకవితా సంప్రదాయంనుండే మనకు హేతువులు లభించవలసి ఉంది ఈ అంశాల్నిగూర్చి ముందు చర్చిస్తాను వేమన పద్య నిర్ణయానికి శైలిని ఒక ప్రమాణంగా పరిగణించినప్పుడు కందాదులు వేమనకృతాలో కావో చెప్పడానికి శైలినే ప్రధానప్రమాణంగా గ్రహించడానికి అవకాశం ఉంది ఆటవెలదుల ద్వారా మనకు సుపరిచితమైన వేమన్నశైలి కందాదుల్లో మనకు వెతికినా కనిపించదు ఒకే కవికి రెండు రకాల శైలులు ఉండడం సంభవం కాదు **"శైలి, కర్తయొక్క ముఖం వంటిది"** అన్నారు శర్మగారు ఏ కారణంవల్లనైనా భేదం కన్పించినా సూక్ష్మంగా పరిశీలిస్తే ఆ రెండింటిలో కవియొక్క సహజముద్ర గోచరించక మానదు వయస్సు పెరిగినకొద్ది ఆలోచనలో పరిణతి భాషలో పరిణామం ఏర్పడినట్లే శైలిలో కూడ మార్పు కలగకూడదా అనే ప్రశ్న వచ్చినప్పుడు, వయస్సువలన పాండిత్యం, ప్రౌఢత్వం పెరగవచ్చునేమోగాని కవియొక్క స్వభావంతోనే ముడిపడివున్న శైలీవిన్యాసంలో మౌలికమైన భేదాలు కలుగవు అని సమాధానం చెప్పవచ్చును అంతేకాక వేమన్న శైలిని నిర్ణయించడానికి ఒక శాస్త్రీయమైన పద్ధతిని అనుసరించవచ్చును వేమన పద్యాలను గూర్చి బ్రౌన్ చేసిన సుదీర్ఘ సాహిత్య మథనంలో అమృతభాండంవంటి ఒక ఫలితాన్ని అందించిపోయాడు నలభైకి పైగా ప్రతులను సరిపోల్చి చూస్తే ప్రతి వ్రాతప్రతిలో తప్పకుండా ఉన్న పద్యాలు అరవైదాకా తేలినవి అవి ఏవోకాదు - **"ఉప్పు కప్పురంబు"** మొదలైన, నిత్యం నాలుకల మీద కదలాడే ప్రసిద్ధ పద్యాలే ఈ పద్యాలు వేమన్నవేనని చెప్పడానికి ఎవరి యుక్తియుక్తవాదాలూ అవసరంలేదు ఈ పద్యాలలోని శైలియే వేమన్న శైలి ఈ శైలీ విన్యాసంతో మిగిలిన పద్యాలను కొలవవలసి ఉన్నది కాబట్టి ఆటవెలదులతోనే వేమన్న వ్యక్తిత్వాన్ని పట్టుకునే ప్రయత్నం చేసినా నష్టంలేదు కందాదులు వేమన్నవి కావని తోసివేసినా ఆ ప్రజాకవికి వాటిల్లే నష్టం అసలే లేదు

కందాదులలో కొన్ని పాటలవంటివి కూడా ఉన్నాయి ఇవి తత్త్వపదాలు అంత్య ప్రాసల్తో కూడిన గేయాలవంటివికూడా కొన్ని ఉన్నాయి ఇవిమాత్రం వేమనవేనని తోస్తున్నది వీటిలో వేమన "కైవాడం" ఉన్నది ఆటవెలదులలోని అప్రయత్న గమనం

వీటికున్నది ఈ క్రింది ఉదాహరణలు చూడండి

## పాటలు

వేదము లన్నియు వాదము సుమ్మీ
వాదుల నోటికి బూదియె సుమ్మీ
వేదము గెల్చెను వేమన సుమ్మీ
మోదము దెల్పగ ముఖ్యము సుమ్మీ *(1725, -567, 1773, -11)*

వేదము శాస్త్రము వాదము సుమ్మీ
వేదము నోటికి బూడిద సుమ్మీ
వేదాతీతుడు వేమన సుమ్మీ
విసువక వెదకిన కందురు సుమ్మీ
చెప్పిన యవ్వరు శాయరు సుమ్మీ *(1769, -154)*

వేదాతీతుడు వేమనరా! వేమన మాటలు వేదమురా
వేదశాస్త్రము వాదమురా! వాదుల నోళ్ళను బూదియెరా
విసువక చదివిన విందురురా! విన్నవారు కనకెన్నరురా
కన్ననె చెప్పగ గడుగడురా! చెప్పిన నెవ్వడు జేయదురా
చేసినవాడే సిద్ధుడురా! సిద్ధుల మాట ప్రసిద్ధమురా
జాతర జాతర జాతరరా! జాతాతీతుడు వేమనరా!
(బందరుప్రతి - 3687)

అటవెలది దేశీయచ్ఛందస్సు, పేరుకు గేయంకాకున్నా తాళ లయాద్యమ గుణమైంది జానపద గేయాలలో అన్వేషిస్తే అటవెలదుల నీడలు దొరుకుతాయి కాబట్టి ఆశుకవితా సంప్రదాయానికి చెందిన వేమన నోటినుండి వెలువడే అవకాశం ఈ పాటలకున్నది. పైగా ఈ పదదర్పణాలలో వేమన్నవదనం స్పష్టంగా కనిపిస్తున్నది

## V. పద్యసంఖ్య

వేమన పద్యాలేవో, కానివేవో నిర్ణయించగలిగితే వేమన పద్యాల సంఖ్య తెలుస్తుంది బ్రౌన్‌దొర సేకరించిన పద్యాలు 3000ను మించలేదు కాని అయనే ఇంగ్లీషులోనికి అనువదించి ఐదు సంపుటాలుగా విభజించి, వ్రాయించిపెట్టిపోయిన గ్రంథంలో 3238 పద్యాలున్నాయి కించిద్భేదాలతో పెరిగిన పౌనఃపున్యాలవల్లనే ఈ సంఖ్య పెరిగింది పై గ్రంథం నుండి 693 పద్యాలను ఎంచి 1829లో తొలిసారిగా వేమన పద్యాలను అచ్చు వేయించాడు బ్రౌన్ మళ్ళీ ఒక దశాబ్దం తర్వాత, అంటే 1839లో 1164 పద్యాలతో ద్వితీయ ముద్రణాన్ని ప్రకటించాడు బ్రౌన్ అనంతరం వెలువడిన ముద్రణలలో అతి ప్రాచీనమైన వేమన పద్యాల పుస్తకాన్ని లండన్ మిషన్ ప్రెస్, విశాఖపట్నం వారు 1843లో అచ్చువేశారు దీనిలో 201 పద్యాలు మాత్రమే ఉన్నాయి దీని తర్వాత దేశీయులు ప్రకటించిన వాటిలో మొదటిదైన ముద్రణ మొకటి 1852లో వెలువడింది దీనిలో

1164 పద్యాలు ఉన్నాయి ఈ గ్రంథం వేంకట కృష్ణశాస్త్రులు గారిచే పరిష్కరించబడి ప్రభాకర ముద్రాక్షర శాలలో అచ్చువేయబడింది. 1164 పద్యాలు ఉండడంవలన అంటే సంఖ్య సమానమైనప్పటికీ బ్రౌన్ 1164 పద్యాలతో వేయించిన ముద్రణానికి ఇది 'కాపీ' కాదు 1879లో వావిళ్ళవారు 1172 పద్యాలతో ప్రకటించిన ముద్రణ 1839 నాటి బ్రౌన్ ముద్రణకు 'నకలు' బ్రౌన్ సేకరణలలోని డి 1737 నెంబరు తాళపత్ర ప్రతికిది యధామాతృక పమ్మి త్యాగరాయశెట్టి కంపెనీ, చెన్నపురివారు 1894లో 1172 వేమనపద్యాలను ప్రకటించారు క్రిక్కిరిసినట్లు ముద్రించబడ్డ 68 పేజీల గ్రంథంలో వేమన పద్యాలు మూడు విభాగాలుగా చేయబడ్డాయి 19వ శతాబ్దంలో వెలువడ్డ వేమన పద్యాల గ్రంథసంఖ్య వేళ్ళమీద లెక్కపెట్టదగినదే 20వ శతాబ్దం ప్రథమ పాదంలోనే వేమనపద్యాలు పుంఖానుపుంఖంగా వెలువడ్డాయి 1900లో కంభంపాటి వేంకటరత్నం 1172 పద్యాలతో వెలువరించిన ముద్రణ కూడ బ్రౌన్ ప్రతికి కాపీయే 1903లో 500 పద్యాలతో 'వేదాంత సిద్ధాంతం' వెలువడింది జ్ఞానానంద యోగి వీటిని సంతరించారు. దీనిలో త్యాగరాయ శెట్టి పీఠిక కూడ ఉంది 1906లో 'వేమన జ్ఞానమార్గ పద్యములు' అనే పేరుతో ముత్యాల నరసింహయోగి సంపాదకత్వంతో చెన్నపట్టణంలో 3002 పద్యాలతో ఒక గ్రంథం వెలువడింది ఇందలిపద్యాలు అకారాది క్రమంలో పేర్చబడ్డాయి బందరుప్రతికన్న ముందు మూడువేల పద్యాలతో ఎక్కువ సంఖ్యలో వెలువడిన తొలిముద్రణమిదే తర్వాత ఆర్ వేంకట సుబ్బారావు, మైలాపూర్, మద్రాసువారు 1908లో 200 పద్యాలతో, పార్థసారథి అయ్యవారు 1792 పద్యాలతో, 1173 పద్యాలతో 1910లో వావిళ్ళవారు వేమన పద్యాలను ప్రకటించారు ఇది కూడ మూడు విభాగాలు చేయబడింది 1916లో వావిళ్ళవారి ద్వితీయ ముద్రణం వెలువడింది వీటి తర్వాత అపూర్వమైన సంఖ్యతో 4035 పద్యాలతో, 1913లో పూర్ణయాచారి 'వేమన సూక్తి రత్నాకరం' వెలువడింది బ్రౌన్‌దికాక, పూర్వమైన అన్ని ముద్రణలకన్న ఇది విశిష్టమైనది ఇదివరకే దీనినిగూర్చి వివరంగా చర్చ జరిగింది బందరు ప్రతి తర్వాత 1915, 1922లలో సాంబశివరావు,[59], 1915లో కరూరు బంగారయ్య,[60], 1920లో రెంటాల వేంకట సుబ్బారావు,[61], 1921లో పార్థసారథి అయ్యవారు[62] మొదలైనవారు వేమన పద్యాలను ప్రకటించారు వీరి పద్యసంఖ్యలన్నీ బందరు ప్రతికన్న తక్కువే నాకు లభించిన ప్రతులలో కొన్నింటికి ఆద్యాలు, కొన్నింటికి అంతాలు, ఒకదానికి ఆద్యంతాలు శిధిలమవడంవల్ల పద్యసంఖ్యలు తెలియరాలేదు ఇక 1925లో (?) పద్యాలతో వావిళ్ళవారి ముద్రణం ప్రకటించబడింది దీనినిగూర్చిగూడ ఈ ప్రకరణంలోనే చర్చించబడింది దేశంలో ఈ ముద్రణానికి అత్యధిక ప్రాచుర్యం లభించింది ఇది 1955లో పునర్ముద్రణ పొందింది వావిళ్ళవారి ప్రతి తర్వాత వారి పద్యసంఖ్యను మించిన గ్రంథం 1960 దాకా

59 వేమన పద రహస్యార్థ తాత్పర్య బోధిని (!) వేమన వాక్యార్థానుభవ (?) శిరోమణి
60 వేమనార్య పద్యపద శబ్దార్థము
61 శతక రత్నావళి (200 పద్యములు - 3000 పద్యములనుండి ఏరినవి)
62 వేమన పద్యములు - పమ్మి త్యాగరాయశెట్టి కంపెనీ, చెన్నపట్టణము

వెలువడలేదు. 1925 అనంతరం 1928,[63] 1929, 1932,[64] 1933,[65] 1934,[66] 1935,[67] 1956,[68] 1957,[69] 1958,[70] సంవత్సరాలలో వరుసగా 1500, 1277 (?), 1200, 1000, 1200, 3200 (?), 1116 (?) పద్యాలతో గ్రంధాలు వెలువడినాయి. 1960లో శ్రీ నేదునూరి గంగాధరం 5000 వేమన పద్యాలను ప్రకటించాడు. అద్దేపల్లి అండ్ కో రాజమండ్రివారు దీని ప్రచురణకర్తలు. ఇంత పెద్దసంఖ్యలో వేమన పద్యాలు ఇంతవరకు వెలువడలేదు[71] ఇంకా వర్తమాన కాలంలో కూడ అనేకులు వేమన పద్యాలు వెలువరిస్తూనే ఉన్నారు

పై పరిశీలనవలన బ్రౌన్ ప్రతి, బందరు ప్రతి, వావిళ్ళ ప్రతుల ప్రత్యేకతను గమనించవచ్చు.

1829 నుండి ఇప్పటిదాకా జరిగిన వేమన పద్యాల 'ప్రకాశక' మార్గంలో పైప్రతులను మైలురాళ్ళుగా భావించవచ్చు ఇవి మైలురాళ్ళేకాని మేలిరాళ్ళుగా పరిగణించనక్కరలేదు. దాదాపు 150 సంవత్సరాలనుండి వెలువడిన వందలాది సంపుటాలలో ఒక్కటి కూడా సుపరిష్కృత ముద్రణంగా రూపొందలేదు. ఒకరకంగా బ్రౌన్ ముద్రణ ఒక్కటే విశిష్టమైనదని చెప్పవచ్చు **"- కావుననే అందందు కొన్ని యనావశ్యకమైన సవరణలున్నను, చిన్నదైనను, ఇప్పటికిని బ్రౌనుదొర ముద్రణమే సర్వోత్తమమని చెప్పటకు సిగ్గుచున్నది."**[72]

ఒకరిద్దరిని మినహాయిస్తే పై ముద్రాపకులందరిలోగూడ ఒక సామాన్య గుణమున్నది వీరెవ్వరూ తమ గ్రంధాలకు కారణాలైన ఆకరాలను చెప్పరు ఆ పద్యాలన్నీ ఆకాశం నుండి ఊడిపడ్డట్టు గుట్టుచప్పుడుకాకుండా అచ్చువేసుకొని అమ్మకాలు జరుపుకున్నారు కనీసం వ్యాపారదృష్టిలేని పరిష్కర్తలు కొందరికైనా ఆధారాలను స్మరించాలని తోచలేదు అనేక వ్యయ ప్రయాసలను సహించి బ్రౌన్ ఏర్పరచిపోయిన వేమన పద్యాల వెలలేని నిక్షేపాలను వాడుకొని ఒక ముక్కైనా ఆయననుగూర్చి వ్రాసిన పాపాన పోలేదు పోనీ

---

63 వేమన రత్నములు, కాకినాడ ముద్రాక్షరశాల, పసుపులేటి వెంకట్రామయ్య అండ్ సన్స్, రాజమండ్రి

64 వేమనయోగి పద్యరత్నములు, పబ్లిషర్స్ కొండపల్లి వీర వెంకయ్య, శ్రీ సత్యనారాయణ బుక్కుడిపో, రాజమండ్రి

65 వేమన పద్యములు, పబ్లిషర్స్ పులిపాటి రంగయ్య, శ్రీ రంగా బుక్కుడిపో, చీరాల

66 ఆర్ వేంకటరమణ శాస్త్రిగారిచే పరిష్కరణ చందా నారాయణశ్రేష్టి పబ్లిషర్

67 ఎన్ వి గోపాల్ అండ్ కో, మద్రాసు

68 కొండా వీరయ అండ్ సన్స్

69 వేమన నీతిపద్య రత్నావళి, సంపాదకుడు నేదునూరి వెంకటాద్రి, వేంకటరామానుజం, సి వి కృష్ణా బుక్ డిపో, మద్రాసు

70 తాత్పర్యం, నేదునూరి గంగాధరం, కొండపల్లి వీరవెంకయ్య, రాజమండ్రి

71 దీనిలో ఎక్కువ పద్యాలు ఉన్నాయి కాని ఈ సంఖ్య పట్టుపట్టి పెంచబడిందే చిన్న పాఠాంతరం కలిగినా దానిని వేరే పద్యంగా ముద్రించారు పద్యాల సంఖ్య పెంచడమే ధ్యేయంగా పెట్టుకొని ప్రకటించిన గ్రంధమిది "వ్యుత్పన్నతకన్న ఉత్సాహమే అధికప్రై ప్రతి"గా శ్రీ ఆరుద్ర దీనిని అభివర్ణించాడు నేదునూరివారి ఈ మంచి ఉద్యమం అభినం దదగినదే కాని, ఈ గ్రంధానికి వారు ప్రామాణికతను సంతరించలేకపోయారు

72 పేజీ 20, వేమన, రాళ్ళపల్లి

ఏ ప్రతులసాయము లేకుండా ప్రజల రసనాగ్రాలనుండే ఏరుకున్నారంటే – అదైనా చెప్పవచ్చు గదా!

చాలావరకు పై ముద్రిత ప్రతులన్నింటికి బ్రౌన్ తాళపత్ర ప్రతులు, కాకినాడలోని ఆంధ్రసాహిత్య పరిషత్తులోని తాళపత్ర ప్రతులు ఆధారాలు. ఆంధ్రసాహిత్య పరిషత్తులో లభిస్తున్న 7 ప్రతులు బ్రౌన్ ప్రతులకన్న కొంత వేరైనవి తంజావూరులోని 5 ప్రతులు పద్యరాశిలో చిన్నవైనా (ఐదు ప్రతులలోని మొత్తం పద్యాలు వేయిని కూడా మించవు) విలువైనవే వావిళ్ళవారి ముద్రణానికి ఆధారం కేవలం బ్రౌన్ ప్రతులే కాదు; కాకినాడ ప్రతులలోని పద్యాలుకూడా ఆ ముద్రణలోనికి వచ్చినట్టు కనిపిస్తున్నది ఇక బందరు ప్రతికి పద్యాలు ధారవోసిన తాళపత్ర ప్రతులు ప్రస్తుతం మనకు అలభ్యాలు కాని వాటిలోని పద్యాలు అనేకం కాకినాడ ప్రతులలో కనిపిస్తున్నాయి. బ్రౌన్ సేకరించిన 3,000 పద్యాల సంఖ్య ఆయన సేకరణలలోని ప్రతులకే పరిమితం బ్రౌన్ ప్రతులలో లేని పద్యాలెన్నో ఇతర ప్రతులలో కనిపిస్తున్నాయి ఉదాహరణకు బందరు ప్రతిలోని అటువంటి కొన్ని పద్యాల నెంబర్లు ఈ క్రింద యిస్తున్నాను

| | | | |
|---|---|---|---|
| 25 | 34 | 37 | 68 |
| 69 | 73 | 74 | 103 |
| 266 | 1112 | 1169 | 1211 |
| 1212 | 2784 | 3539 | 4035 |

పై పద్యాలేవీ బ్రౌన్ ప్రతులలో లేవు వావిళ్ళవారి ముద్రణంలో కూడ ఈ క్రింది నెంబర్లు గల పద్యాలను చూడవచ్చు 1716, –494, –495, 2507, 2677, 1699, 1399, 1801 ఇవి మచ్చుకు చూపిన ఉదాహరణలు మాత్రమే

వేమన్న కాలదేశాలను గూర్చి, మహమ్మదీయ పాలననుగూర్చి చెప్పే ప్రసిద్ధపద్యాలేవీ తంజావూరు ప్రతులలో లేవు "ఉప్పు కప్పురంబు" వంటి బహుళప్రచారంలో ఉన్న పద్యాలు ఉన్నా ఇంతవరకు తటస్థపడని పాఠభేదాలతో ఉన్నాయి 413/408 నెంబరు తాళపత్ర ప్రతిలోని 300 పద్యాలు మకుటభేదంతో ఉన్నాయి అందలి మకుటం "విశ్వదాభిరామ వినరవేమ." ఇక బ్రౌన్ ప్రతులలోగాని, కాకినాడ ప్రతులలోగాని లేని పద్యాలు తంజావూరు ప్రతులలో క్వాచిత్కంగా కనిపిస్తూనే ఉన్నాయి అన్ని ప్రతులను పక్కపక్కన ఉంచుకొని సరిపోలిస్తే బ్రౌన్ ప్రతులలో లేని పద్యాలు దాదాపు 500 దాకా తేలుతాయి వేమన పద్యాలలో తలాతోకాలేని పద్యాలు కూడా ఉన్నాయి రెండున్నర పాదాల పద్యాలూ, రెండు మూడు రకాల పద్యాల మిశ్రమంతో చెడిన పిచ్చి పద్యాలు అనేకం ఉన్నాయి ఉన్న కొన్ని కుంటిపాదాలలోకూడా అర్థాన్వయం అసాధ్యంగా ఉంది మరమ్మత్తు చేయలేని నికృష్ట స్థితిలో ఉన్న పద్యాలివి పంటచేనులో కలుపుమొక్కలవలె పెరిగిన ఈ పద్యశకలాలను ఏరివేయక తప్పదు ఈ పద్యాలన్నీ వేమన పద్యసంఖ్యలో చేరినవే కాబట్టి ప్రస్తుతానికి పైవాటిని తీసివేసి లెక్కిస్తే వేమన పద్యాలు 2,000ను మించవు అయితే ఈ లెక్కకూడా ఉజ్జాయింపేకాని దొరికిన ప్రతులన్నింటిని సరిపోల్చి పాఠభేదాలను గుర్తించి, పాఠాలను బహుముఖ చర్చలతో నిగ్గుతేల్చి నిర్ణయించి చెప్తున్నది కాదు ముద్రాపకుల పొరపాట్లవల్ల పద్యసంఖ్యల్లో ఎటువంటి తేడాలు రావడానికి అవకాశముందో చూపడం నా ఉద్దేశం

## VI. ప్రాచీన ప్రతి:

ఏదైనా కావ్యాన్ని పరిష్కరించేటప్పుడు లభ్యమౌతున్న అనేక ప్రతులలో ప్రాచీనప్రతి కొరకు అన్వేషణ జరపడం పరిష్కర్తలు సాధారణంగా చేసేపని దానికి కారణాలు రెండు

1 ఈ అనేక ప్రతులలో కవి స్వహస్త లిఖితమైన లేక కవితో ప్రత్యక్ష సంబంధం కలిగిన ప్రతి ఒకటి ఉండాలి మిగిలిన అన్ని ప్రతులకన్న సహజంగా ఇది ప్రాచీనమైనది కాబట్టి, అనంతర ప్రతులలో ఏర్పడిన ప్రక్షేపాదులు ఇందులో ఉండవు

2 అచ్చంగా కవి వ్రాసిన గ్రంథం లభ్యం కాకున్నా దొరికిన వాటిలో అతి ప్రాచీన ప్రతిని పరిష్కరణకు ఎన్నిక చేయడం అందరూ పాటించే ఒక శాస్త్రీయ పద్ధతి

అయితే ఈ ప్రాచీనతానిరూపణకు తోడ్పడే ఆధారాలేవి? ప్రతియొక్క శైథిల్యంపైన ఆధారపడి ఏ సిద్ధాంతం ప్రతిపాదించినా అది సాహసమే అవుతుంది కాబట్టి ప్రతిలోని ఆంతరంగిక సాక్ష్యాలే మనకు శరణ్యం కాని ఆ సాక్ష్యాలు కూడ తరచుగా అసమగ్రంగా లభిస్తుంటాయి ఆ సాక్ష్యాలు రెండు రకాలు 1 ప్రతుల చివరిఆకులలో లేఖకులు వ్రాసుకున్న తారీఖులు 2 ప్రతులను సరిపోల్చి చూసి పండితు[illegible]సే నిర్ణయాలు. తారీఖులు వ్రాయబడిన ప్రతు[illegible] పరిశోధకుని ముఖ్య సిద్ధాన్నమున్నట్లే, కాని వేమ[illegible] పద్యాలకు సంబంధించి [illegible] లేని ప్రతులే ఎక్కువగా దొరుకుతున్నాయి ఇక రెండవరకం సాక్ష్యాలను సంపాదించడానికి ఒక మహోద్యమమే సాగించవలసి ఉంది దేనికదే ఒక ప్రత్యేక బృహత్కార్యం

ఇటువంటి దృక్కులను వేమనపద్యాల ప్రతులపై ప్రసరింపజేస్తే కొన్ని మౌలిక సమస్య లెదురౌతాయి వాటిలో ప్రధానమైనది, అసలు వేమన పద్యాలకొక మూలప్రతి ఉండడం సాధ్యమా? అనేది కారణం – వేమన పద్యాలు నోటికి వచ్చినప్పుడెల్లా ఆశువుగా చెప్పబడినవేకాని ఒక గ్రంథంగా వ్రాయబడినవి కావు అనేక స్థలాలలో, అనేక కాలాలలో వివిధ వ్యక్తులముందు చెప్పబడి – వారిచేతనో, వేమన్న శిష్యులచేతనో తాటాకులపైన వ్రాయబడితే ఏర్పడినవే ఈ ప్రతులు ఒకచోట చెప్పిన పద్యాలు అదే రూపాలలోనో లేక పాఠభేదాలతోనో ప్రచారమును పొందాయి పద్యసంఖ్యలలో కూడ ఎక్కువ తక్కువ లేర్పడ్డాయి తొలి రోజుల్లో ఇలా జరిగినా అనంతర దినాలలో ప్రతులకు పుత్రికలు, పౌత్రికలను పుట్టించడం జరిగింది ఇక వేమన పద్యాల లేఖకులలో అత్యధికులు పాండిత్య వాసనలు లేనివారే కాబట్టి వారిలో ఏ కొందరోగాని గ్రంథాలలో తారీకులు వ్రాసిపెట్టుకోలేదు

ఇటువంటి పరిస్థితులలో ఈ ప్రతులకొక కాలక్రమ నిశ్రేణికను నిర్మించడం సులభసాధ్యమైన పనికాదు ఇక ప్రతులన్నింటిని సరిపోల్చి నిర్ణయాలు చేసే బృహత్కార్యం ఒకరిద్దరితో జరిగే పనికాదు ఈ ప్రతులు కూడ వివిధ ప్రాంతాలలో, వేరువేరు కాలాలలో సేకరించినవి కాబట్టి వాటిమధ్య ఏదో దూరపుబంధుత్వాన్ని కలుపవచ్చునేమోకాని ప్రత్యక్ష మాతృపుత్రికా సంబంధాన్ని ఆవిష్కరించడం కష్టం ఇక ప్రస్తుతానికి చేయగలిగింది, తారీకులను తగిలించుకున్న ప్రతులనుబట్టి ప్రాచీనప్రతిని నిర్ణయించడమే అంతేకాదు,

ప్రస్తుత పరిస్థితిలో **ఈ** ప్రతి చాల అమూల్యమైనది వేమనపద్య నిర్ణయ మహోద్యమంలో ఉపకరిస్తున్న అనేక ప్రమాణాలలో ఒక ప్రమాణంగా నిలబడగలిగిన సత్తా దీనికుంది. అంతేకాదు; వేమన కాలాన్ని మరీ పూర్వానికి లాగే వాదానికి ఇది బాధకంగా నిలుస్తుంది.

మనకు అందుబాటులో ఉన్నంతవరకు వేమన పద్యాల తాళపత్ర ప్రతుల సంఖ్య 63గా తేలింది. వాటి వివరాలు ప్రకరణారంభంలో ఇవ్వబడినాయి. ఈ 63 ప్రతులలో, 7,8 ప్రతులలో మాత్రమే లేఖకులు తారీకులు వ్రాసిపెట్టుకున్నారు. వాటిని ఇక్కడ వాటికి సమానమైన ఇంగ్లీషు తేదీలతోసహా యిస్తున్నాను.

| ప్రతి నెంబరు | తెలుగుకాలం | ఇంగ్లీషుకాలం |
|---|---|---|
| డి 2950 | విరోధి సం॥ భాద్రపద శు॥ 8 ఆదివారం | 6, జనవరి 1829 |
| డి 1730 | పార్థివ సం॥ మాఘ బ 14 జయవారం (మంగళ) | 7, మార్చి 1826 |
| డి 2949 | తారణ సం॥ భాద్రపద బహుళ చవితి భానువారం | 12, సెప్టెంబరు 1824 |
| డి 1745 | తారణ సం॥ మార్గశిర బ 9 జయవారము | 14, డిసెంబరు 1824 |
| డి 1764 | శ్రీముఖ నామ సం॥ కార్తీక శు॥ 15 సోమవారం | 8, నవంబరు 1813 |
| డి 1728 | సాధారణ నామ సం॥ నిజ ఆషాఢ శు॥ 12 శుక్రవారం | 23, జులై 1790 |
| డి 1733 | ప్రజోత్పత్తి సం॥ వైశాఖ శు॥ 7 శుక్రవారం | 24, ఏప్రిల్ 1691 |

పై ప్రతులలో నాలుగు 19వ శతాబ్దానికి చెందినవి బ్రౌన్ వేమన పద్యాలపైన కృషిచేస్తున్న కాలంలో పుట్టినవి ఐదవ ప్రతి కూడ బ్రౌన్ భారతదేశానికి రావడానికి మూడేళ్ళ ముందు మాత్రమే పుట్టింది ఇక చివరి రెండుమాత్రమే ప్రాచీనప్రతులు చివరిది మరీ ప్రాచీనమైనది (డి 1733) ఇప్పటివరకు దొరికిన ప్రతులలో అతి ప్రాచీనమైనదిగా సాక్ష్యాధారాలతో నిరూపించగలిగిన ప్రతి ఇదే చివరి ఆకుమీద లేఖకుడు ప్రతిని వ్రాసి ముగించిన తారీఖునుబట్టి దీనివయస్సును తెలుసుకొనడం సులభమైంది ఇది **"బిచా బసప్ప కరలిఖితం."** భౌతికంగా కూడా ఇది అత్యంత శిథిలప్రతి చాలా అక్షరాలను చెదలు తినేశాయి

ఈ ప్రతిలోని విశేషాలను పరికిద్దాం ఇందులో 785 పద్యాలున్నాయి వాటిలో 74 కందపద్యాలు, సీసాలు 3 (289, 582, 654), ఒక చంపకమాల (103), ఒక ఉత్పలమాల (2597), ఒక పంచచామరం (758), ఒక పాట (248) ఉన్నాయి

వేమన కాలదేశాలను గూర్చి తెలిపే కీలకమైన మూడు పద్యాలు ఇందులో ఉన్నాయి కాని ప్రసిద్ధమైన పాఠాలకు భేదంతో ఉన్నాయి

| ప్రసిద్ధ పాఠం | ప్రాచీన ప్రతిలోని పాఠం |
|---|---|
| 1 ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి మూకచింతపల్లి మొదటి ఇల్లు ఎడ్డెరెడ్డి కులమదేమని తెల్పుదు. | ఊరు కొండవీడు ఉనికి పశ్చిమవీధి మూక చింతపల్లి మొదటి యిల్లు అరణమాడ బయలు అది ముక్తిమార్గమో (19) |
| 2 పరగ రాయని కుల బాచని ధనమెల్ల భటులపాలు కపులపాలు తలపె ఒనర హీనజనునిధనము దాయాదులపాలు జారకాంత పాలు వేమ. | పరగ రాయని మంత్రి బాచన్న ధనమెల్ల భటకరి యాచక పరులపాలు పరగ ప్రబంధ కవిపాలు దయాళులపాలు జార స్త్రీల పాలు వేమ (698) |
| 3 మక్కాకు బోనేల మగుడతా రానేల యేకమైన – చిత్తమెందు గలదు అన్నిట పరిపూర్ణుడల్లా మహమ్మదు. | మక్కాకు బోనేల మరి తిరిగి రానేల యేకమైనకర్తయందు లేదో అన్నింట పరి పూర్ణుడల్లా మహాత్ముండు (110) |

# VII. నూతన ప్రమాణాల అన్వేషణ

## ఆశు కవితా సంప్రదాయం

ఇప్పటివరకు సాగిన చర్చలో రెండు ముఖ్య విషయాలు నిరూపించబడ్డాయి. స్థూలంగా అవి

1 ప్రక్షిప్త పద్యాలూ, కందాది పద్యాల పరిహరణవల్ల నిర్ణయించగలిగిన పద్యసంఖ్య

2 లభిస్తున్న తాళపత్ర ప్రతులతో అతి ప్రాచీన ప్రతిని వేమనపద్య నిరూపణకు మంచి సాధనంగా స్వీకరించడం

సాధారణంగా ఏ కావ్యం యొక్క మూలపాఠ నిరూపణకైనా పై ప్రమాణాలు సరిపోతాయి కాని వేమన పద్యాల విషయంలో మాత్రం సమగ్రతను ప్రదర్శించలేకపోతున్నాయి వేమన పద్యాలను గుర్తించడానికి ఇవి మనకు కొన్ని ఆధారాలను సంతరించి పెట్టినప్పటికీ వేమన పద్యాల నిరూపణలో ఎదురవుతున్న మౌలికమైన సమస్యలను ఇవి పరిష్కరించలేవు

అసలు ఈ పరిస్థితి వేమన పద్యాలకే ఎందుకు కలిగింది? ప్రాచీన కావ్యాదుల విషయంలో సత్ఫలితాల నిస్తున్న పైప్రమాణాలు వేమన పద్యాల విషయంలో ఎందుకు తిరుగులేని తీర్పును ఇవ్వలేకపోతున్నాయి?

ప్రక్షిప్తాలు మనకు కొత్తకాదు ఒక్క వేమన్న విషయంలోనే ఇది జరుగలేదు కాని వేమన్నతో పోలిస్తే ఇతర కవుల రచనలకు పట్టినగతి అంత లెక్కలోనిది కాదు వేమన్న తన పద్యాలను ఒక కథాకావ్యంగా వ్రాయక, ముక్తకప్రాయమైన పద్యాలుగా రచించాడు కాబట్టి ఈ పరిస్థితి ఏర్పడిందనుకుంటే ముక్తక ప్రాయమైన శతకాల మాటేమిటి? శతక సంప్రదాయంలో పుట్టి వేమన్నలాగే జనసామాన్యంలో ప్రచారానికెక్కిన సుమతిశతకకారుడూ, కవి చౌడప్పలకు ఇటువంటి పరిస్థితి లేదు ఉన్నా అతిస్వల్పం భారతం ఇరవైనాలుగువేల శ్లోకాలనుండి లక్ష శ్లోకాలకు పెరిగిందని అంటున్నా అది భారత రచనా ప్రణాళికనూ, ప్రధాన వ్యవస్థనూ కూల్చినట్టు కనపడదు

పరిమాణం పెరిగిందేమోకాని కథాక్రమం వస్త్వైక్యం ఎక్కడా దెబ్బతిన్నట్టు లేదు. ఇదే అభిప్రాయాన్ని రాళ్ళపల్లివారు వ్యక్తపరిచారు

**'ఇతరులు వ్రాసిన గ్రంథములలో మన మాటలు దూర్చుట మన అనాదియైన ఆచారము. వేదములు, ఉపనిషత్తులుగూడ నీయవస్థకు లోబడినవే; కావుననే యందందు వేదవాక్యముల సంఖ్యను నిర్ణయించు వాక్యములు వానిలో చేర్చబడినవి. ఇక పురాణములగతి యడుగ పనిలేదు. కాళిదాసాది కవుల కావ్యములకు కూడ నీయవస్థ దప్పలేదు. అట్లుండ వేమనను మాత్రము మనవారు మన్నించుటకు గారణము లేదు.'**73

"వేమనను మాత్రము" అనడంలో వేమన కాళిదాసాదుల కవిత్వ పద్ధతికన్న భిన్నమైన కవి అనే ధ్వని ఉన్నది. ఆ భిన్నత్వం లేక అతని ప్రత్యేకత ఎక్కడ ఉన్నదో వెతకవలసి వున్నది. అయన కవిత్వం ప్రాణస్పందన పొందిన ప్రక్రియ యేదో ఆ ప్రక్రియ స్వభావమేదో, దాని మూలహేతువులేవో మొదలైన అంశాలను గూర్చి పునాదులలోనికి దిగి పరిశీలించవలసి వున్నది.

మనకు తెలిసినంతవరకు వేమన కవిత్వం చెప్పినవాడే కాని వ్రాసినవాడు కాదు.

**".......మరియు వేమన యొక్క గ్రంథముగా వ్రాసినవాడు కాడని మొదలే చెప్పితిని"**74 అని రాళ్ళపల్లివారు వ్రాశారు వేమనది వాక్కు కందిన పద్యాలేకాని "వ్రాల" కందిన పద్యాలుకావు 75 వేమన పద్యాలను "చెప్పడం"లోనే, నన్నయాది ప్రాచీన కవులవలె ఒకచోట కుదురుగా కూర్చొని వ్రాయకపోవడంలోనే అయన ప్రత్యేకత అంతా ఇమిడివుంది. అయన ఆశువుగా పద్యాలు అల్లుతుంటే అతని శిష్యులో, అనుచరులో గుర్తుపెట్టుకొనో, లేక వ్రాసుకొనో వాటి ప్రచారానికి తోడుపడిఉంటారు ముందు విని, తర్వాత జ్ఞాపకం చేసుకొని వ్రాయడం, లేక వేమనచేత మెల్లమెల్లగా పలికించుకొని వ్రాసుకొని వుంటారు ఈ ఊహ ముందుకు సాగితే వేమన్న కవిత్వ వ్యక్తీకరణకు సంబంధించిన కొన్ని ప్రాథమికాంశాల నిర్ధారణకు దారితీసే విషయాలపైన చర్చకు అవకాశముంది అయితే ఇది ఊహ కాదని ఈ చర్చలో వెల్లడయ్యే నిజాలను బట్టి తేల్చడానికి అవకాశముంది "

ఏ సాహిత్యానికైనా వ్యక్తీకరణసాధనం భాష కాబట్టి ఈ భాష పుట్టుక ఏమిటో వ్యక్తీకరణ సాధనాల్లో భేదాన్నిబట్టి దానిలో ఏర్పడే ప్రత్యేక విభాగాలేమిటో స్థూలంగా తెలుసుకోవాలి

భాష చాలా ప్రాచీనమైనది ఎంత ప్రాచీనమైనదంటే మానవ సమాజమంత ప్రాచీనమైనది గుర్తు తెలియని కాలంనుండి మానవుని స్వరపేటికలోని ధ్వనులు ఒక వ్యవస్థను ఏర్పరచుకొని భాషగా రూపొందాయి భాషను వ్యక్తం చేయడానికి స్వరపేటిక,

73 వేమన, పేజీ 6

74 వేమన, పేజీ 6

75 "వేమన చెప్పిన" పద్యాలు అని "వ్రాలకందని" పద్యాలు అని చాలా పద్యాల్లో రావడమే కాకుండా చెవికి సరిపోయి గణాలు తప్పిన పద్యాలు కనిపిస్తాయి "మక్కాకు పోనేల మగుడ తారానేల?" అక్షర దృష్టిగల పండితులు "మక్కకు జననేల" అని తర్వాత దిద్దడం కనిపిస్తుంది ఇటువంటి అనేక ఉదాహరణలను పరిశీలిస్తే వేమన్న పద్యాలు "చెప్పిన"వాడే కాని వ్రాసినవాడు కాడని చెప్పవచ్చు

తాలువు మొదలైనవి యంత్రసామాగ్రి సాధనాలు జంతువులకు 'ధ్వని భాష' లేదు. జంతువులు ఒకే ధ్వనిని అనేకసార్లు సృష్టించగలవు కాని మానవుడు అట్లాకాదు. అనంతమైన శబ్దాలను చేయడంలో మానవునికి గల సామర్థ్యంలో భాష రూపుదిద్దుకున్నది. ఒకసారి ఉచ్చరించిన శబ్దాలను మానవుడు మళ్ళీ మళ్లీ ఉచ్చరించగలడు కాని గతంలో పలికిన మాటలను భద్రపరిచే సాధనాలు అతనివద్ద లేవు మరపు మనిషికి స్వాభావికమైనది. జ్ఞాపకముంచుకోవలసిన అవసరం, మరచిపోవడంవల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు మానవుడు లేఖనాన్ని కనిపెట్టడానికి దారితీశాయి భాష ఎంతో ప్రాచీనమైనదైనా లేఖనంమాత్రం నాలుగైదు వేల సంవత్సరాలక్రిందటే మొదలైంది

లేఖనం భాషలోని ధ్వనులకు చిహ్నాలను సమకూరుస్తుంది మాటకూ, వ్రాతకూ మధ్యన ఉన్నది చిహ్నచిహ్నిత సంబంధమేకాని మరెటువంటి నియత సంబంధం లేదు. అంతేకాక లేఖనం మాట్లాడే భాషతో పోలిస్తే చాలా అసమగ్రమైనది. ఉచ్చారణలోని ఊనిక, స్వరం మొదలైనవాటికి లేఖనంలో సంపూర్ణమైన ప్రాతినిధ్యం లభించకపోవచ్చును. మాట్లాడే భాషకు లేఖనాన్ని ఛాయామాత్ర రూపంగానే మనం భావించవచ్చు. కాని మాతృభాష వ్యవహర్తకు స్వాభావికంగా తన భాషలోని ఉచ్చారణారీతులపైన అధికారం వుంటుంది కాబట్టి లేఖనాన్ని చదువుకునేటప్పుడు ఈ అసమగ్రత అడ్డురాదు.

లేఖనం భాషకన్న సమగ్రమైనప్పటికీ దీనికి లేని సౌకర్యం లేఖనానికి వుంది మాట్లాడే భాష అప్రయత్న పరిణామశీలం సమాజంలో ఎవరి ప్రమేయం లేకుండానే భాష మారిపోతూ వుంటుంది కాని లేఖన విధానం ప్రయత్న పూర్వకంగా ఒకరు మారిస్తేతప్ప మారదు మాట్లాడిన మాటలు కాలగర్భంలో కలిసిపోయినా వాటి ప్రతినిధులుగా అక్షరాలు కలకాలముంటాయి లేఖనప్రక్రియ అందరూ చెయ్యలేని పని అంటే లేఖనాన్ని ప్రత్యేకంగా నేర్చుకోవలసిన ఆగత్యం వుంది మాట్లాడే భాష అట్లాకాదు మానవ సమాజ వ్యవహారంలో ఎవరి భాష వారికి వస్తుందే కాని లేఖనం లాగ శిక్షణ (Conscious effort) ద్వారా పొందే నైపుణ్యం కాదు మాట్లాడే భాష మానవుడికి ఒక సహజమైన సామర్థ్యం లేఖనం చిరాభ్యసనంవల్ల పట్టుపట్టి నేర్చుకునేది

భావ వ్యక్తీకరణకు భాష ఒక వాహిక అది లిఖితభాష కావచ్చును వాగ్రూపమైన భాష కావచ్చును దీనినే అలిఖిత భాష అని పిలువవచ్చు భాష భావవ్యక్తీకరణకు సాధనమైతే ఆ భాషను వ్యక్తీకరించడానికి మానవ ముఖయంత్రం సాధనం మాట్లాడిన భాషను భద్రపరచడానికి లేఖనం ఆధారమైతే ఆ లేఖనం ఎదుటలేనివారితోగాని, భావితరాలవారితోగాని మాట్లాడే మౌనభాష కాబట్టి పై అవగాహనతో భాషను రెండు బృహద్విభాగాలు చేయవచ్చు

1 అలిఖిత భాష

2 లిఖిత భాష

ఇదేవిధంగా 1 అలిఖిత సాహిత్యం 2 లిఖిత సాహిత్యం అని కూడ విభాగాలు చేయవచ్చు కాని భాషకు వర్తించే లక్షణాలు సాహిత్యానికి వర్తింపజేయడంలో ఇబ్బందులున్నాయని వెల్చేరు నారాయణరావుగారు వ్రాశారు[76] భాషకీ, అశు సాహిత్యానికీ (లేక కవిత్వం) సామ్యం చెప్పుకునేటప్పుడు ఒక విషయాన్ని దృష్టిలో

76. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, పేజీ 6

ఉంచుకోవాలి. నిత్య వ్యవహారంలో భాష అప్రయత్న సిద్ధం. భాషను వ్యవహరించే వాడికి ఆ భాషలోని వ్యాకరణస్పృహ ఉండదు కాని ఆశుకవిత్వం అప్రయత్నంగా వెలువడేది కాదు. కవితా ప్రక్రియకు సంబంధించిన అనేక విషయాలను అతడు చిరకాల శిక్షణవల్ల నేర్చుకోవాలి ఆశుకవిత, వ్యాకరణం మొదలైనవి అభ్యాసంవల్ల లేక అలవాటువల్ల రావాలి.

అంతేకాక "లేఖన విద్య కవిత్వానికి అక్షరరూపం ఇచ్చి వూరుకోలేదు అది కవితా స్వరూపాన్నీ పూర్తిగా మార్చేసింది"77 అని నారాయణరావుగారు వ్రాశారు కాబట్టి ఆశుదృష్టితో కవిత్వమంటే ఏమిటో తెలుసుకోవలసి ఉంది:

1 ఆశుకవిత్వమంటే కవిత్వ రచనకూ వ్యక్తీకరణకూ మధ్య వ్యవధానం లేకుండా ఉండడం అంటే ఆశుకవి కవిత్వాన్ని రచిస్తూ చెప్తాడు, చెప్తూ రచిస్తాడు.

2 "ఆశుసాహిత్యంలో పాదం ఒక మూర్తి (Unit) ఏ పాదానికాపాదం వేరుగా విడిపోతుంది దొంతులు పేర్చినట్టు అలాంటి పాదాలు పేర్చుకుంటూ వెళ్ళడం, సుకరంగా కావ్యం నిర్మితం కావడం ఇందులోని ప్రయోజనం పదం (Word) అంటే ఆశుసాహిత్యంలో కొన్ని ధ్వనులసంపుటి అక్షరదృష్టిలేని గాయకుడు ప్రకృతి ప్రత్యయనిర్మితమైన పదాలలో ఆలోచించడు ధ్వని సంపుటులలో ఆలోచిస్తాడు "78

అదేవిధంగా ఆశుకవిత్వంలోని పాదం విశ్రాంతి స్థానంలో తప్పనిసరిగా విరుగుతుంది ఆశుకవిత్వంలోని విశ్రాంతి లిఖిత సాహిత్యంలో యతిగా మారిందని నారాయణరావుగారు వ్రాశారు 79

3 "ఆశు సాహిత్యంలో మరొక లక్షణం పాదనిర్మాణంలో పడికట్టు పద్ధతి "80

అంటే ఈ ఆశుకవిత్వ రచనకు తోడ్పడే నియమ సంపుటిలో వైవిధ్యం ఉండదు ఒకేరకమైన (Stereotype), రచనాసూత్రాలతో ఆశుకవి అనేక పద్యాలు చెప్తాడు ఈ కావ్యనిర్మాణ పద్ధతి బహుముఖాలతో భాసించే సంప్రదాయ కవిత్వానికన్నా భిన్నమైనది ఒకసారి చెప్పినమూసలోనే మరో పాట తయారుకావడం ఆశుకవిత్వ ప్రధానలక్షణం అచంచలమైన ఈ పడికట్టు విధానంలో వచ్చిన మాటలే మళ్ళీ మళ్ళీ రావడం పరిపాటి అయితే ఈ పథకం (Formula) లేక రచనాసూత్రాలు ఒక్కొక్కరికి ఒక్కొక్కరకంగా ఉంటాయి

ఇంతవరకు చెప్పినవి ఆశుకవిత్వం యొక్క సామాన్య లక్షణాలు వీటిని గూర్చి మొట్టమొదటిసారి "తెలుగులో కవితా విప్లవాల స్వరూపం" అనే తమ సిద్ధాంత వ్యాసంలో శ్రీ వెల్చేరు నారాయణరావుగారు చర్చించారు నేసింతవరకు ఆశులక్షణాలను గూర్చి చేసిన పరిశీలన వారి 'ఆశుసాహిత్యం' అనే వ్యాసం ఆధారంగా చేసింది వారి చర్చకు మూలమైన అల్బర్ట్ సిలార్డ్ రచించిన సింగర్ ఆఫ్ టేల్స్ అనే గ్రంథం కూడా నాకు తోడ్పడింది

అయితే లిఖిత సంప్రదాయానికి చెందిన కవుల్లో కూడ ఆశువుగా చెప్పే పద్ధతి

---

77 తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - పేజీ 5
78 తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - పేజీ 7
79 తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - పేజీ 8
80 తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - పేజీ 8

ఒకటుంది (తిరుపతివేంకటకవులు మొదలైనవారు) అదీ ఇదీ ఒకటేనా? దీనికి సమాధానంగా నారాయణరావుగారే మరికొంత ముందుకు వెళ్ళి చర్చించారు

"ఆశు సంప్రదాయమూ, లిఖిత సంప్రదాయమూ రెండూ రెండు భిన్నవర్గాల వారివి కావడం ప్రపంచంలో చాలా దేశాలలో జరిగింది కాని తెలుగు దేశంలో అలా జరగలేదు. లేఖనం పెద్ద కులాలవారి విద్య అయినా, అటు పెద్ద కులంవారైన బ్రాహ్మణులూ, ఇటు తక్కువ కులాల వారైన మాలమాదిగలూ కూడ ఆశుసంప్రదాయాన్ని వాళ్ళ వాళ్ళ ప్రత్యేకతలతో కొనసాగించారు అంచేత దాదాపు ఇంగ్లీషు విద్యా సంస్కారమూ, అచ్చుయంత్ర ప్రభావమూ వచ్చేటంత వరకూ, ఇటు చదవనేర్చినవారూ, అటు చదవనేర్వని వారూ ఒక విధంగా ఆశు సంప్రదాయంలో ఉన్నవాళ్ళే అందుచేతనే పండిత విమర్శ పరిభాషలో ఉన్న సాహిత్యం, కావ్యం, రచన, గ్రంథం ఇలాంటి మాటలు అటు పండితుల లిఖితకావ్యాలకు ఇటు ప్రజల పుక్కిటి పాటలకి కూడా వర్తింపజెయ్యడంలో ఇబ్బంది కలుగదు కాగా ఇంగ్లీషుతో (Literature) అన్న పదము Letter (లిఖితాక్షరము) అన్న మాటనుంచి పుట్టింది అందుచేతనే వాళ్ళు ఆశుసాహిత్యానికి Oral Literature అని పరస్పర విరుద్ధ పదాలతో ఒక కొత్త పదబంధం సృష్టించుకోవలసి వచ్చింది "[81]

## వేమన్న ఆశుకవేనా?

వేమన్నను గూర్చిన అనేక సమస్యలు అపరిష్కృతంగా మిగిలిపోతున్నప్పుడే, వేమన్నను కొలవడానికి సాంప్రదాయకమైన (లిఖిత) ప్రమాణాలు పూర్తిగా చాలవేమో అన్న సందేహం కలుగుతుంది మరేవైనా కొత్త సూత్రాలు వర్తింపజేయాలేమో అని అనిపిస్తుంది

వేమన పద్యాలతో వచ్చిన చిక్కంతా అవి ఒక స్థిరమైన గ్రంథంగా లిఖించకపోవడం; ఆద్యంత సహితమై, ఒక కచ్చితమైన పద్యసంఖ్య లేకపోవడం

స్థిరరూప రాహిత్యం ఆశుకవిత్వానికి ఒక ముఖ్య లక్షణం ఇది మౌఖిక ప్రచారం ద్వారా వ్యాప్తి చెందుతూ వుంటుంది

మౌఖిక ప్రచార పద్ధతిలో జ్ఞాపకశక్తి బలహీనమవడం వల్ల, లేక పూర్తిగా మరచిపోవడంవల్ల గుర్తుచేసుకొని మళ్ళీ వ్రాయడంతో మూలంతో భేదించే పాఠాలు పుడతాయి

వేమన పద్యాల ప్రచారంకూడ మౌఖికంగానే ఎక్కువగా జరిగింది వేమన పద్యాల ప్రతులు వేమన్న స్వయంగా లిఖించినవి కావు అతని సమకాలంలోనూ, అనంతరకాలంలోనూ పుట్టి అట్లా పరంపరగా ప్రస్తరించాయి వేమన పద్యాల ప్రతులు దాదాపు దేశంలో అన్ని ప్రాంతాల్లో దొరకడమే దీనికి నిదర్శనం

నారాయణరావుగారు చర్చించిన ఆశుకవితాలక్షణాలన్నీ వేమన్నకు వర్తించవు ఆశుకవితా ప్రమాణాలవరకు చేరుకున్న వేమన పద్యాల పునాదులు నాటి పండితుల లిఖిత సాహిత్య సంప్రదాయంలోనే ఉన్నాయని చెప్పాలి అతడు వ్రాసినవి పాటలు కాదు అతనిది ఆటవెలది ఛందస్సు అయితే అది దేశీయ ఛందస్సు కావడం ఆశుదృష్టికి కొంత బలాన్ని యిస్తుంది వేమన్న పద్యాలు ఆటవెలదిలోనే 90 వంతులు సాగినాయి వేమన్న ఆటవెలది ఆశుకవుల మూసలాంటిది అదే విధంగా, భాషనుబట్టి, పడికట్టు మాటలను బట్టి వేమన పద్యాలలోని ఆశులక్షణాలను ఎన్నింటినో బేరీజు వేయవచ్చు

81 తెలుగులో కవితా విప్లవాల స్వరూపం – పేజీ 16, 17

ఆశుకవుల కాలం, ప్రాంతం మొదలైన కీలకాంశాల నిర్ణయం కూడ కష్టమే వారు వాడిన భాషను బట్టి ప్రాంతాన్ని కొంత ఊహించవచ్చునేమోగాని, దేశద్రిమ్మరులైన ఆశుకవుల భాషలో అనేక ప్రాంతాల భాష కలిసిపోయ్యే వీలుంది. అయితే వారు ఎక్కువగా తిరిగిన, ఎక్కువకాలం నివసించిన ప్రాంతాల ప్రభావమే వారిమీద ఉండవచ్చు. అయితే వేమన విషయంలో ఇతర ప్రాంతాల్లో వాడుకలో లేని రాయలసీమ పదాలు ఉండడంవల్ల అతణ్ణి ఆ ప్రాంతానికి ముడివేయవచ్చును

నేను వేమన్నను గూర్చి సామాన్యంగా ప్రసిద్ధమైన పరిశోధక పద్ధతిలోనే పరిశీలించాను. అయితే కొన్ని చిక్కులు ఎటూ తేలనప్పుడు మాత్రమే ఆశుకవితా సూత్రాలను సమన్వయింపజేసే అవసరాన్ని గుర్తించి కొంత చర్చించాను.

పాఠాంతరాల విషయంలో కొందరు ఆశుకవితా పరిశోధకుల సూచనలను నేను అనుసరించలేదు. మూలంతో భేదించే లేక దానికి వ్యతిరేకమైన పాఠాలు పుట్టినప్పుడు వాటిని మూల పాఠానికి పుట్టిన పుత్రికలుగా కాకుండా మరో నవ్యసృష్టిగా భావించాలని వారు అభిప్రాయపడ్డారు. అచ్చమైన ఆశుకవితా సంప్రదాయంలో కంఠస్థం చేసిన దాన్నే వల్లించడం కాకుండా పునఃసృష్టి మాత్రమే జరగడానికి అవకాశముంది. కాబట్టి వాటిని పాఠాంతరాలు అనడంకన్న బహుపాఠాలు అనడం సబబు అని వారు వివరించారు

కాని వేమన్నలో కొట్టొచ్చినట్లు కనిపించే లిఖిత కవితా సంప్రదాయ లక్షణాలు కూడ ఉండడం వలన వేమన్నకు వర్తింపజేయవలసిన ప్రత్యేక సూత్రాలకు మరికొంత స్పష్టత అవసరం అని నేను భావించాను వేమన్న ఆశుకవితా సంప్రదాయానికి దగ్గరవాడు అన్నది నిర్వివాదాంశం అయితే ఎంత దగ్గరివాడు? లిఖిత, అలిఖిత సంప్రదాయాల మధ్య అతని స్థానమెక్కడ? అతడు పైనుండి (లిఖిత) కిందికి (అలిఖిత) వస్తున్నవాడా? లేక కిందనుండి పైకి సాగుతున్నవాడా అనే ప్రశ్నలకు సమాధానాలు మరింత పరిశోధనల వలననే తేలవలసి ఉంది.82

'లిఖిత' దృష్టితోనే ప్రధానంగా నా పరిశీలన జరిగినప్పటికీ, అవసరమైన చోట్ల ఆశుదృష్టిని సహకారఅంగంగా వాడుకున్నాను అయితే ఈ రెండు దృష్టులూ కలిసిపోయి సందిగ్ధతను సృష్టించేంత గాఢంగా 'ఆశు' జోలికి పోలేదు

ఆ అధ్యాయాన్ని సశేషాలతో, సమస్యలతో, ప్రశ్నలతో ముగించవలసి వస్తున్నది తాళపత్ర ప్రతుల్లో తలదూర్చిన తర్వాత ఇది ఒక వ్యక్తి పరిమిత కాలంలో చేయగలిగిన కార్యం కాదని తెలిసివచ్చింది అయితే వేమన పద్యాలపైన బ్రౌన్ చేసిన పరిశ్రమను పరిశీలించడంవల్ల సమస్యలను స్పష్టంగా సాక్షాత్కరింపజేసుకున్నాననే తృప్తి మిగిలింది

అచ్చుప్రతుల్లో జరిగిన అన్యాయాల సంగతటుంచి తాటాకులదశలోకూడ పాఠాంతరాలు పుట్టడానికి మరిన్ని కారణాలను అన్వేషించాలి వేమన్న ఛత్రాన్ని (ఆటవెలది) ఉపయోగించుకుంటే తమ పద్యాలు ప్రసిద్ధికెక్కుతాయని బైరాగి, గోసాయి గుంపులు చేసిన పనా ఇది? మనకున్న గ్రంథ పరిష్కరణ మార్గంలో అంటే ప్రతులన్నింటిని సరిపోల్చిచూచి, పౌనఃపున్యాలను తీసివేసి, కొత్త పద్యాలను చేర్చుకొని లెక్కలు వేస్తే కూడ ఈ సమస్య నిర్వివాదంగా తెగుతుందని తోచదు ఈ పద్ధతిలో వేమన పద్యాల

82. ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పవలసిన బాధ్యత నామీద ఉన్నా, విషయంలోకి మరింత లోతుగా వెళ్ళి పరిశీలించే సూత్రాలు నావద్ద లేకపోవడంవల్ల, చేయవలసిన పరిశ్రమభారం తెలిసిన వాణ్ణవడంవల్ల ఇక్కడే ఆగిపోక తప్పడంలేదు

విషయంలో పాఠ నిర్ణయాలకు సామాన్య సూత్రాలను సంతరించే పని నిరపవాదంగా వీలుకాదు పాఠాంతరాన్ని మరో పాఠంగా ప్రతిపాదించే ఆశుకవితా మార్గంలో పరిశోధన జరగవలసి ఉంది.

ఇక వేమన పద్యశైలి విషయంలో రాళ్ళపల్లివారి వాదం నాకు సమ్మతంగా ఉంది కందాది పద్యాలను వేమనకృతాలుగా నేను నమ్మడంలేదు కారణాలు "వేమన్నశైలి" అనేచోట చర్చించాను

ఈ గ్రంథంలో ఉదహరింపబడిన పద్యాలన్నీ మనస్సులో స్పష్టాస్పష్టంగా ఉన్న ప్రమాణాలతో కొలిచి (ఎక్కువ ప్రతుల్లో ఉన్న సామాన్య పద్యాలు మొ॥) వేమన కృతాలుగా వాడుకున్నవే అయితే సామాన్య సూత్రాలను సాధించడానికి కావలసిన సాధనసంపత్తులు ప్రస్తుతానికి చాలకపోవడంవల్ల సోపపత్తిక నిరూపణలు, నిర్ణయాలను నా భవిష్యత్కృషికి వదలిపెడుతున్నాను

★ ★ ★

## మావద్ద లభించు డా. ఎన్. గోపి ఇతర రచనలు

| | | రు. |
|---|---|---|
| 1. | చిత్ర దీపాలు (1989) | 15 |
| 2. | గవాక్షం (1995) | 50 |
| 3. | గోపి సాహిత్య దర్శనం (1998) | 50 |
| 4. | కాలాన్ని నిద్రపోనివ్వను (1998) | 35 |
| 5. | నానీలు (1998) | 50 |
| 6. | సాలోచన (1998) | 60 |
| 7. | వ్యాసనవమి (1986) | 20 |

# వేమన కాలం, ప్రాంతం

## I. వాడుక కథలలో వాస్తవికతా భ్రాంతి:

వేమన జీవితాన్ని గూర్చి అనేక కథలు ప్రచారంలో ఉన్నాయి. వేమన పేరు చెప్పిన ఏ వ్యక్తిని కదిలించినా ఎన్నో 'అద్భుత' కథలు అతని నోటినుండి వెలువడుతాయి. అప్పుడప్పుడా కథలు చరిత్ర ముసుగును కూడ వేసుకుంటాయి. వాటిల్లో వచ్చే స్థలాలు, కాలం మనకు పరిచితమైనవే. కాని చారిత్రక నికషోపలం మీద గీచి చూస్తే అదంతా అభాసమని తేలుతుంది.

వేమన్న జీవితాన్ని గూర్చి ఎందరెందరు వ్యక్తులు ఎన్నెన్ని కథలు చెప్తున్నా మనకు లభ్యమౌతున్నంతవరకు అక్షరరూపంలో వాటిని మొట్టమొదటిసారి నిక్షిప్తం చేసింది పూర్ణయాచారే 1823లో ఆయన ప్రకటించిన **"వేమన్న సూక్తి రత్నాకరము"** ప్రారంభంలో **"వేమన యోగీంద్ర చరిత్రము"** అను పేర 29 పేజీల గొలుసు కథ ఉంది. ఈ "చరిత్రము"లో చరిత్రపాలు ఎంతో, అది ఎంతవరకు చారిత్రక ప్రమాణాలకు నిలుస్తుందో పరిశీలించవలసిన అవసరం ఉంది ఆ కథలను నా మాటలలో సంక్షిప్తంగా చెప్తాను

## 1. కోమటి వేమన్న కథ

రెడ్డిరాజులకు మూలపురుషుడైన దొంతి అలియరెడ్డి అనుమకొండ కాపురస్తుడు. వ్యవసాయదారుడైన ఈయన ధనవంతుడు కూడ ఈయన ధనవంతుడైన దానికి కారణంగా ఒక కథ చెప్తారు ఆ కాలంలో వేమన్న అనే కోమటి శ్రీశైల యాత్రకు వెళ్ళి, స్వామి దర్శనం తరువాత పాతాళగంగలోని పచ్చబండను చూడడానికి నిలబడ్డాడు అందరు వెళ్ళిపోగా మిగిలిన ఇతన్ని చూసి అచటి అర్చకుడు కారణమడిగాడు దానికి 'ఆరు నెలలు స్వామి సన్నిధిలో ఉండి సేవించుకోవాలని ఉన్నద'ని సమాధానం చెప్పాడు 'సరే, కాని ఉత్తర దిక్కు వైపు మాత్రం వెళ్ళవద్ద'ని హెచ్చరించాడు అర్చకుడు. కాని మానవునికి నిషేధించిన పనులే చేయబుద్ధి పుడుతుంది కదా! బయల్దేరాడు వేమన్న ఉత్తరంవైపు దారి మరచిపోకుండా నడిచినంత మేరా నువ్వులు చల్లుకుంటూ సాగినాడు ఒకచోట రెండురోజులాగి పరిశీలిస్తే పరుసవేది ద్రవం కనిపించింది. అర్చకుడెందుకు వెళ్ళవద్దన్నాడో అర్థమైంది. వెంటనే బయల్దేరిన చోటికి వెళ్ళి రెండు కుండలూ, కావడితో వచ్చి వాటినిండా పరుసవేదిని నింపుకొని బయల్దేరాడు

అనుమకొండ చేరేసరికి రాత్రయ్యింది అలసట తీర్చుకొని తెల్లవారి వెళ్ళవచ్చని దొంతిఅలియరెడ్డి ఇంటికి వచ్చి పండుకోవడానికి చోటడిగాడు. రెడ్డి గొడ్ల చావడి

చూపించాడు అందులోనాగళ్ళు మొదలైన పనిముట్లు ఉన్నవైపు కుండలను దాచి, గడ్డి కప్పి భోజనానికి వెళ్ళాడు. పరుసవేది దాపునే ఉన్న నాగలికి అంటడంవల్ల అది బంగారంగా మారి ప్రకాశించడం మొదలుపెట్టింది పరిపాటిగా అలియరెడ్డి గొడ్లను చూడడానికి చావడిలోనికి రాగా ఈ దృశ్యం కనబడింది బంగారపు వెలుగులో అలియరెడ్డి నిజాయితి వెలవెలబోయింది. వెంటనే పశువులను బయటకు తరలించి, కుండలను వేరొకచోట దాచి చావడికి నిప్పుపెట్టాడు. భోజనానికి వెళ్ళిన వేమన్న వచ్చేసరికి కనిపించినవి మంటలు. కావడికుండలు కూడ మంటలలో దగ్ధమైనాయని తన దౌర్భాగ్యానికి ఏడ్చి ఏడ్చి ఆ మంటల్లోకిదూకి మృతిచెందాదు ఆ తరువాత పరుసవేది మహిమవలన అలియరెడ్డి ఇనుమును బంగారంగా మార్చి విశేష ధనవంతుడయ్యాడు. ఇదీ కథ కాని ఇది ఇంతటితో ముగియలేదు. బలవన్మరణం పొందిన వేమన్న ఆత్మ అలియరెడ్డి కుటుంబాన్ని పీడించడం మొదలుపెట్టింది పుట్టిన బిడ్డలెవరు బ్రతకడంలేదు ఉపశమనంగా పుణ్యకార్యాలు చేయించి, శోకభారంతో నిద్రించిన రెడ్డికి కోమటి వేమన్న కలలో కనిపించి వారి కుటుంబంలో పుట్టే సంతతి అంతటికి తన పేరు పెట్టి కొలుచుకుంటె ఈ పీడ తొలగడమే కాక అతని వంశస్తులచేత నూరేండ్లు రాజ్యం పాలింపజేస్తానని అన్నట్టుగా అనిపించింది. వెంటనే అలియరెడ్డి వేమన్న బంగారుప్రతిమను చేయించి, అందరు చావగా మిగిలిన పిచ్చిపుల్లాయి అని పేరు పెట్టుకొన్న బిడ్డనికి పుల్లయవేమారెడ్డి అని నామకరణం చేశాడు ఆ వైశ్య వేమన్న మహిమ వలన శీఘ్రకాలంలోనే రెడ్ల సంతతి పెరిగింది

## 2. గొల్లడు, గోసాయి కథ

అనుపోత వేమారెడ్డి అలియరెడ్డి తమ్ముడు ఆయన తర్వాత రాజ్యానికి వచ్చిన వాడు ఆయన కాలంలో కొండవీటి కొండమీద ఒక గోసాయి ఉండేవాడు ఆ దాపుననే పశువులు మేపే గొల్లవాడొకడు ప్రతిదినం గోసాయికి పాలు సమర్పించుకొని సేవిస్తుండేవాడు గోసాయి ఒకనాడు గొల్లవానితో – "నాకు పాలిస్తే నీకేమి ప్రయోజనం, మానుకొమ్ము" అన్నాడు కాని ఈ మంచిపని ఫలితం వ్యర్థంగా పోదని నమ్మిన గొల్లవాడు ఆ సత్కార్యాన్ని కొనసాగిస్తూనే ఉన్నాడు గోసాయి దీనికి ప్రతిగా గొల్లవానికి మేలు చేస్తానని చెప్పి సమీపంలోని ఒక మట్టి దిబ్బ వద్ద రెండు గజాల లోతు గొయ్యిని త్రవ్వమని గొల్లవానికి ఆదేశించాడు గొల్లవాడు గొయ్యి త్రవ్వాడు తర్వాత ఆ గోసాయి ఆ గోతిలో ఎండు పుల్లలు వేసి నిప్పంటించి నీకు మేలు చేస్తానని గొల్లవానిని గొయ్యి దగ్గరగా తీసుకెళ్ళాడు ఏదో మాట్లాడుతూ గొల్లవాని మెడమీద చెయ్యివేసి గోతిలోనికి తోసివేయబోగా, గొల్లవాడు తప్పించుకొని, పెనుగులాటలో గోసాయినే గొయ్యిలో పడదోసి పారిపోయాడు గోసాయి మంటల్లో దగ్ధ మయ్యాడు మరునాడు గోసాయి ఏమయినాడో చూద్దామని గొల్లవాడు రాగా మనిషి నిలువెత్తువి రెండు బంగారు బొమ్మలు ప్రకాశిస్తూ కనిపించాయి వాడు ఆశ్చర్యపడి, తన కొడుకులను తోడ్కొని వచ్చి విగ్రహాలను ఇల్లు చేర్చాడు అవసరం కొద్ది ఒకప్పుడు కాలి వేళ్ళు, మరొకప్పుడు చేతి వేళ్ళు నరికి వర్తకుని కమ్ముకొని కాలక్షేపం చేస్తున్నాడు కర్ణాకర్ణిగా ఈ సంగతి రాజుగారి చెవిలో పడింది వెంటనే పరివారాన్ని పంపించి విగ్రహాలను కోటలోనికి తరలించాడు దీనివలన అనపోత వేమారెడ్డి అమిత శ్రీమంతుడయ్యాడు

## 3. వేమన్న వేశ్యాలోలత్వం

ఈ వేమన్న మన వేమన్నే. ఈయన కోమటి వెంకారెడ్డి అనే నామాంతరం గల అనువేమారెడ్డికి చిన్న తమ్ముడు. వేమన్న వదిన నరసాంబారాణి. వేమన్న రాజకీయాలలో జోక్యం కలిగించుకొనక, కోటలో భోజనం చేస్తూ, వెలుపల ఒక వేశ్యవలలో చిక్కుకొని ఉన్నాడు. పెండ్లి మాట తలపెట్టనీయడు. కోటలో తన చేతికి చిక్కినంత ధనాన్ని వేశ్యకు ధారబోసేవాడు. చిక్కనప్పుడు మాతృసమానురాలైన వదిననడిగి తెచ్చి ఇస్తుండేవాడు. ఎప్పుడైనా ఆమె **"రేపు ఇచ్చెద"**నన్నా అలిగి పస్తులుండి తన పంతం నెగ్గించుకొంటుండేవాడు.

ఒకనాడు వేశ్య తన ఇంటిపడకగదిలో వేమన్న నొక కోరిక కోరింది. రాణి నరసాంబ ధరించే ఆభరణాలు ధరించి అద్దంలో చూసుకోవాలని ఉన్నదని, కాబట్టి తెచ్చి యివ్వవలసిందని కోరింది వేమన్న అంగీకరించాడు కొన్నాళ్ళకు దసరా పండుగనాడు రాణి సాలంకృతియై ఉన్నప్పుడు వేమన్న ఆమెతో – **"అవి మీరు తీసివేసేటప్పుడు నాకిస్తే నా వేశ్యకు పెట్టి చూసి వెంటనే తెచ్చి ఇస్తాన"**ని పలికాడు నరసాంబ సంతోషించి **'బులాకీ'** తప్ప నగలన్నింటిని వేమన్నకిచ్చింది. ఆభరణాలు తెచ్చిన వేమన్నను వేశ్య **'బులాకీ'** యేదని అడిగింది

**"అది అమూల్యం, చీకట్లో కూడ దీపంవలె వెలుగుతుంది. అది నేనడుగలేన"**ని బదులు చెప్పాడు వేశ్య తనకదే కావాలని పట్టుపట్టి, లేకుంటే తనను వదులుకోవలసి ఉంటుందని హెచ్చరించింది వేమన్న కోటకువెళ్ళి ఖిన్నుడై ఉన్నాడు నరసాంబ కారణ మడిగింది వేమన్న చెప్పింది విని **"ఇస్తాను కాని నీ వేశ్య నగలూ, బులాకీ ధరించిన తర్వాత దాని నగ్న దేహాన్ని చూడమ"**ని షరతు విధించింది వేమన వేశ్య ఇంటికరిగి సాధారణమైన వేశ్యను **"వివస్త్రవు కమ్మ"**ని కోరాడు వేశ్య దిగంబరంగా వేమన్నకు కనిపించింది అలంకార సహితంగా, వస్త్రరహితంగా కనిపించిన స్త్రీ దేహాన్ని చూసి వేమన్నకు రోతజనించింది మగువపైన ఆసక్తి చచ్చింది వెంటనే కోటకు తిరిగిపోయి ఒక గదిలో పడుకున్నాడు **"జ్ఞానము కుదిరిన"**దని అతనిని లేపమని భటులకు ఆజ్ఞ చేసింది రాణి

## 4. అభిరామయ్య కథ

వేమన్న కాలంలో కొండవీటి అభిరామయ్య అనే విశ్వబ్రాహ్మణుడుండేవాడు అతని తమ్ముని పేరు లక్ష్మయ్య వారు కులవృత్తితో జీవించేవారు వేశ్యావిముక్తుడై పనిలేని వేమన్న కోటలోనే బంగారపు పని జరిగే దుకాణంలో కూర్చుండేవాడు ఒకనాడు అభిరామయ్య లేడు **"మీ అన్న యేడ"**ని అడిగితే కొంచెం జాగుచేసి వస్తాడని చెప్పాడు తర్వాత అభిరామయ్య వచ్చాడు వేమన్న ఆలస్యానికి కారణమడిగాడు అభిరామయ్య కారణం దాటవేసి **'చిత్తం'** అని నసిగాడు ఒకనాడు వేమన్న నిలదీయగా **"ప్రతి ఉదయం నాకు స్నానం జపం ఉంటాయి. అందుచే జాము పొద్దు ఎక్కేదాకా రాలేన"**ని చెప్పాడు కాని మొండివేమన్న "ఏమైనా సరే సకాలానికి రావాల"ని ఉత్తర్వు జారీచేశాడు ఈ సంగతి ప్రభువుకు తెలిసి **"వేమన్న వేశ్య ఇంట్లో ఉండటం కంటే**

అభిరామయ్య జపాదుల వల్ల ఆలస్యంగా వచ్చినా ఫరవాలేదు" అన్నాడు. వేమన్న పుర్రెలో పురుగుతిరిగింది. అభిరామయ్య ఆలస్యానికి అసలు కారణాన్ని కనుక్కోవలెనని నిశ్చయించుకున్నాడు. ఒకనాడు తెల్లవారుజామున బయల్దేరి అభిరామయ్య ఇంటి దాపున ఉన్న చెట్టెక్కి పైన దాగివుండి కనిపెట్టి కూర్చున్నాడు. అభిరామయ్య చెంబు చేతబట్టుకొని బయల్దేరగానే అతని కంటపడకుండా వేమన్న అతనిని అనుసరించాడు. అభిరామయ్య కొలనులో సంధ్యావందనాలు ముగించుకొని కొంత దూరంలో ఉన్న కొండ గుహలో కూర్చొనివున్న అంబికా శివయోగి కడకేగి పూలునింపిన నీళ్ళచెంబును ఆయన ముందుంచి నమస్కరించి నిలిచాడు. అంబికా శివయోగి కళ్ళు తెరచి "ఓరి శిష్యా! రేపు ఎన్ని పనులున్నా తప్పకుండా రా, రేపే నీకు ఉపదేశం, మాకు సమాప్తి" అని చెప్పి పంపాడు. మరుగు ప్రదేశంలో నుండి ఇదంతా వేమన్న విన్నాడు.

వేమన్న ఆ ఉపదేశాన్ని తాను పొందవలెనన్న దురుద్దేశంతో నరసాంబ వద్దకేగి "రేపుదయాన ఆరు గంటలకే అభిరామయ్య దుకాణానికి వచ్చి పనిచేసే విధంగా ఆజ్ఞ చేయించమ"ని గట్టిగా కోరాడు. ఆమె కారణమడుగగా, తర్వాత చెప్తానని ప్రార్థించాడు. నరసాంబ తన "జాముకాల" జతలో ఒకటి పోయింది కాబట్టి రెండోది రేపుదయమే అభిరామయ్యతో చేయించి రెండు జాములలోగా జనానాలోనికి పంపేలాగున ప్రభువుచేత ఆజ్ఞచేయించింది. రాజాజ్ఞ విని అభిరామయ్య తన దురదృష్టానికి ఎంతో విచారించి ఇంటికి వెళ్ళి నిద్రించాడు. రోజూ రెండు జాములప్పుడు అభిరామయ్య సరస్వతి పూజ చేసేవాడు. ఆరోజు అతడు సకాలానికి నిద్రలేవకపోవడంవల్ల అతని భార్య ఆ పూజ చేస్తూ బిడ్డను పంపి "మీ కృషి వ్యర్థం కాదు, పేరుంటుంది" అని చెప్పి లేపమన్నది.

అభిరామయ్య "జాముకా"ను చేసి జనానాలోనికి పంపి భోజనానికి వెళ్ళాడు ఇటు వేమన్న పువ్వులు నింపిన నీళ్ళ చెంబుతో యోగిని దర్శించాడు 'నువ్వెవ్వడవురా' అని యోగి వేమన్న నడిగాడు తాను అభిరామయ్య శిష్యుడినని చెప్పుకొని, అభిరామయ్యకు ప్రభువు పని చెప్పడం వల్ల, వేళ తప్పకుండ యోగికి పూలు తీసుకొని పోవలసినదని తలచి ఆయన తనను పంపాడని చెప్పాడు కొంత సేపాగి 'చూడరా వచ్చుచున్నాడేమో' అని శివయోగి అడుగగా 'లేద'ని చెప్పాడు రెండుసార్లిట్లా జరిగింది పిదప 'వాడు దరిద్రుడు నీవు రారా' అని చెంతకు పిలిచి చెవిలో ఉపదేశం చేసి నాలుకమీద బీజాక్షరాలు వ్రాసి పొమ్మన్నాడు వేమన్న అభిరామయ్యను వంచించినందుకు పశ్చాత్తాపపడి దుకాణానికి వచ్చి అభిరామయ్య కాళ్ళపై బడిపోయాడు జరిగిన వృత్తాంతాన్ని బయల్పరచి, అతనికి దక్కవలసిన ఫలితాన్ని తాను దక్కించుకొనినదానికి పరిహారంగా తన కవిత్వంతో వచ్చిన కీర్తితో బాటు అతని పేరు కూడా శాశ్వతంగా ఉండడానికి, తన పద్యాలలో మకుటంగా ఉన్న నాలుగవ పాదంలో (విశ్వదాభిరామ వినురవేమ) అభిరాముని పేరును ఖచ్చితం చేశాడు

# 5. వేమన్న మహిమలు

## 5.1 కాశీకి బోయినా కాసు రాదే!

ఎంత పోరినా పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడకపోవడంవల్ల కాశీయాత్ర చేసివస్తే పిచ్చి కుదురుతుందేమోనని వేమన తల్లి సన్నాహాలు మొదలు పెట్టింది వేమన తాను

రానని ఖండితంగా చెప్పాడు "పాపాలు పోతాయిరా" అన్నా వినలేదు. అన్న చెప్పినా అంగీకరించలేదు. కాశీకి వెళ్ళడం నిష్ప్రయోజనం అని వేమన్న అభిప్రాయం ఇక విధిలేక తల్లి ఒక్కతే ప్రయాణమయింది. తల్లి బయల్దేరేటప్పుడు వేమన ఒక రాగి నాణానికి బెజ్జంచేసి తాడుకట్టి తల్లి మెడలో వేసి గంగలో స్నానంచేసి తిరిగి వచ్చేసరికి అది బంగారం కావాలని చెప్పాడు తల్లి కాశీయాత్ర కేగింది యాత్ర ముగించుకొని తల్లి వచ్చేటప్పుడు అన్న ఎదురు బోయాడు కాని వేమన్న వెళ్ళలేదు తల్లి కోటలో ప్రవేశించిన తరువాత వేమన్న చేరబోయి తన చిల్లిరాగి డబ్బును ఇవ్వమనగా బంగారంగా మారక రాగిగానే ఉన్న నాణెం తల్లిమెడలో కన్పించింది కాబట్టి కాశికి పోయినా ఫలితం శూన్యం అని వేమన్న తేల్చాడు. "కాశీకి పోకుండానే మహిమ చూపుతా"నని తల్లి మెడలో నుండి రాగి డబ్బును తీసుకొని దానిపై 'లఘుశంక' తీర్చుకోగా అది బంగారమయింది. అందరు అమితాశ్చర్యం పొందారు.

### 5.2 పుచ్చకాయ పొలంలో పుత్తడి పంట:

వేమన ఒకనాడు అన్న దగ్గరికి వెళ్ళి "నేను డబ్బిస్తాను. ఒక ఎకరం పొలం ఖరీదు కిమ్మ"ని కోరాడు ప్రభువు 'డబ్బేమిటి, పొలమేమిటి' అని హేళన చేశాడు కాని రాణి ప్రోద్బలంతో పొలం ఇప్పించాడు 'నీ మరిది పండిస్తే మీరిద్దరు తిందురుగాని' అని ప్రభువు రాణితో సరసోక్తులాడాడు

పిదప చావడానికి సిద్ధంగా ఉన్న రెండెడ్లు తెచ్చి నాగలికి కట్టి వేమన్న పొలం దున్న సాగాడు అది చూసి జనులు నవ్వసాగారు. "నవ్విన నాపచేను పండు"నని వేమన తన పని సాగించాడు దున్నిన తర్వాత విత్తనాలు చల్లాడు అవి పాపరకాయ విత్తులు వెర్రిపుచ్చకాయ గింజలు అవి కాలక్రమాన నిలువెత్తు పైరై నిమ్మకాయలంత కాయలు కాశాయి

ఒకనాడు నిరుపేద ముసలిది ఎక్కడా కూలి దొరకనందువల్ల విచారంతో వేమన పొలం ప్రక్కదారి నుండి పోతుండగా వేమన కారణం తెలుసుకొని తన పొలంలో కాయలు కోస్తే కూలీ ఇస్తానని చెప్పాడు పిదప కూలి కింద ఒక పుచ్చకాయను ఇచ్చి పంపాడు కాయనేం చేసుకుందునని అసంతృప్తితో గొణుగుతూ ముసల్ది వెళ్ళిపోయింది ముసల్దాని మనుషులు కూలిగా పుచ్చకాయను చూసి "ముండాకొడుకు! పుచ్చకాయ నిచ్చినాడా?" అని దానినందుకొని కోపంతో కింద కొట్టారు పగిలిన పండులోనుండి వడ్లగింజల వంటి బంగారు గింజలు ధగధగ మెరుస్తూ చెల్లాచెదురుగా కిందబడ్డాయి అవి కోమటి వద్దకు తీసుకొని పోయి ఇవ్వగా ఇది ఒక మాదిరి వడ్లగింజలు అని తీసుకొని ముసలిదానికి దినవెచ్చాలు ఇచ్చాడు

కొందరు దొంగలు పొలంలో పడి పుచ్చకాయల నెత్తుకొనిపోయి పగులగొట్టి చూస్తే వాటిలో పుచ్చగింజలున్నాయి కాని బంగారు గింజలు లేవు కాని వారే వేమన చేతితో పొందిన పుచ్చకాయలలో బంగారు గింజలున్నాయి

ఒకనాడు అన్నయగు ప్రభువును తన పొలం చూడటానికి రమ్మని కోరగా ఆయన నిరాకరించాడు కాని రాణి బలవంతంపైన మంత్రితో గూడి పొలం చూడవెడలాడు అక్కడ పొలంలో ఉన్న రెండు ధాన్యం కుప్పలను వేమన తన చేతితో తాకగానే అవి

పసిడి కుప్పలైనాయి. ఒక కుప్పతో దాన ధర్మాలు చేయమనీ, రెండవ కుప్పతో రాజు బొక్కసం నింపమనీ కోరాడు. రాజు అమితానందంతో మురలిపోయాడు.

### 5.3 అల్లరి పని అంతరార్థం:

ఒకరోజు వేమన్న వదిన నరసాంబారాణి జనానా చావడిలో ఉన్నప్పుడు వేమన్న ఆమె కుడి కుచం మీద నెత్తురు వచ్చేటట్టు గోటితో మీటాడు. అప్పుడు అక్కడున్న దాసదాసీ పరివారం తిట్టి, కొట్టబోగా, రాణి వారి నడ్డగించి, మరిది చేసిన ఈ పోకిరి పని తన మేలు కొరకే చేసియుండునేమో అని వారిని వారించింది. భర్తకు కూడా కోపం రాకుండా తృప్తిపరచింది.

ఒకనాడు రాణి పూలతోటలో పూలుకోస్తున్నప్పుడు ఒక నాగుపాము ఆమె చేతిమీద కాటువేసింది. ఆమె వెంటనే స్మారకం తప్పి పడిపోయింది. దాసీజనులు ప్రభువున కెరిగించారు. ప్రభువు వచ్చి చూచేసరికి ఆ విషం, అంతకు ముందు స్తనంమీద వేమన్న చేసిన గాయం గుండా బయటకు స్రవించింది. వెంటనే రాణికి తెలివి వచ్చి వేమన్నచేసిన మేలును కొనియాడింది. అందరు పరమానందపడి వేమన్న అనాగత దృష్టిని ప్రశంసించారు.

### 5.4 వేమన్న వింత స్నానం:

వేమన్న పిచ్చిపిచ్చిగా తిరుగుతుంటే తల్లి విచారపడి "నాయనా, ప్రతి ఉదయం మీ అన్నలాగ స్నానం, జపం చేసుకొని బుద్ధిగా ఉండరాదురా" అన్నది వేమన 'స్నానం మేని మురికి తొలగించడానికి; జపం, మరింత ధనం, రాజ్యం సంపాదించడానికి మాత్రమే ప్రభువు చేస్తున్నాడు గాని ఈశ్వరునిపై భక్తి ఉండి కాదు' అని బదులు పలికాడు. అంతేగాక 'నా స్నానం చూద్దువు గాని రమ్మ'ని తల్లిని చెరువు వద్దకు తీసుకొని పోయి, తాను చెరువులో దిగి, తన పొట్టను కోసికొని, అందులో ఉన్న కల్మషం తీసివేసి నీళ్లతో కడుగుకొన్నాడు కోసిన కడుపు వింతగా మళ్ళీ అంటుకొన్నది 'ఇదీ నా స్నానం' అని వేమన పలికి అంతర్ధానమైనాడు తల్లి వేమన్న మహిమకు ఆశ్చర్యపడుతూ ఇంటికి వెళ్ళగా అక్కడ వేమన్న ఉన్నాడు

పై కథలన్నింటిని పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు కూడ తమ 'శ్రీ వేమన యోగి జీవితము'లో నమోదు చేశారు[1] అదే విధంగా వేమన్న జీవిత చరిత్రము ఇంగ్లీషులో వ్రాసిన సి రామకృష్ణారావు రెడ్డిరాజుల వంశవృక్షంతో సహా పూర్ణయాచారి ప్రకటించిన పై కథలన్నింటిని యథాతథంగా దిగుమతి చేసుకొన్నారు[2] 'వేమన యోగీంద్ర చరిత్రము'ను వ్రాసిన పూర్ణయాచారి ఏ ఆధారాలతో తన రచన జరిగిందో పేర్కొనలేదు కాని 'కోమటి వేమన్న కథ', 'గొల్లదు, గోసాయి కథ' కొండవీటి కైఫీయత్‌లో కనిపిస్తాయి[3]

---

1. 'శ్రీ వేమన యోగి జీవితము' వావిళ్ళ వారిచే ప్రకటితము – 1917
2. "Vemana, the Telugu poet and saint" - C Ramakrishna Row
3. Kondaveeti kaifiat Machenzie Manuscripts, Vol 1&2, Govt Oriental MSS Library, Madras, Courtesy of Andhra Pradesh Sahitya Academy (1962)

మన తార్కిక దృష్టిని కొంతసేపు జోకొట్టి ఊహాలోకపు మగత నిదురలోనికి జారవింటే పై కథలు అద్భుత రసడోలికలమీద ఊపుతాయి. కాని జాగ్రదవస్థలోనికి వచ్చిన తర్వాత వేమన్న సత్యచరిత్ర కానరాక వాడుక కథల ఎండమావులే మిగులుతాయి. వీటినుండి చరిత్రను తోడడానికి ప్రయత్నించడం ఇసుకలో నూనె తీయడం వంటిదే. భారతదేశ చరిత్ర నిర్మాణానికై నడుంకట్టిన వారెవరైనా ఈ కట్టుకథల కీకారణ్యంలో చిక్కుకొనక తప్పదు. హిందూ సమాజంపైన చారిత్రక దృక్కులు ప్రసరింపజేసిన అబేదుబాయ్ తనకెదురైన ఆభాసచరిత్ర నుండి బయటపడే మార్గం తెలియక వాపోయాడు.

"The ancient history of their country is for one thing, enshrouded in chimera and fable, and unfortunately, such incoherence and such obscurity prevail in their written records, which are our only means of really getting at the truth, that it is not much to presume that we shall never succeed in throwing proper light on all this mass of absurdities." (page 2.) (Hindu manners, customs and ceremonies).

రక్తమాంసాలతో ఈ భూమిపైన నడిచి తిరిగిన వ్యక్తికి కూడ అతీంద్రియ శక్తులు అంటగట్టి అద్భుత లోకాలలో ప్రతిష్ఠించడం మనకు వెన్నతో బెట్టిన విద్య.

"My readers will see in the following pages to what extremes the people of India carry their belief in and love for the marvellous......the Indian Muse of History thus became a kind of magician whose wand performed wonders" (page 2) (Hindu manners, customs and ceremonies).

వేమన్న భక్తులకు, శిష్యులకు ఈ కథలలో కనబడే వేమన్నే వేమన్న ఇంతకన్న భిన్నమైన వాస్తవికమైన వేమన్నను వారు ఊహించలేరు. పై కథలంటే వారికి 'సూర్యుడు తూర్పున పొడుస్తాడు' అన్నంత సత్యాలు వేమన్న మహిమలను ప్రశ్నించడమే పాపమన్నంత నమ్మకం వీరిది. వీటిలో చారిత్రకత, తర్కఅసహిష్ణుత ఎంత ఉందో పరిశీలించడం అటుంచి కనీసపు వాస్తవికతకు కూడ ఇవి ఎంత సుదూరాలో గమనిస్తే తెలుస్తుంది. వీటిలో కనిపిస్తున్న చారిత్రకాంశాలను ముందు ముందు చర్చిస్తాను

'వేమన' అనే పేరు గల వ్యక్తులు చరిత్రలో ఎక్కడోగాని కనపడరు కొండవీటి నేలిన రెడ్డిరాజుల పేర్లలో 'వేమ' శబ్దముండడం వల్లనే వేమన్నను కొండవీటికి ముడివేయడం జరిగింది

'కోమటి వేమన్న' 'గొల్లడు, గోసాయి' కథలు రెండింటిలో కూడ పరుసవేదితో బంగారం చేసే ప్రసక్తి ఉంది "వేమన్న మహిమలు"లో కూడ వేమన్న చేతితో తాకి పుచ్చకాయలు మొదలైనవాటిని బంగారం చేశాడు వేమన పద్యాలలో రసవాదానికి సంబంధించిన పద్యాలు ఉండడమే ఈ కథలు పుట్టడానికి కారణం కావచ్చును ఆధునిక రసాయనిక శాస్త్రం ప్రాచ్య రసవాదాన్ని కొంత నమ్మినా, అందులో కూడ చేతితో తాకినంతమాత్రాన బంగారమౌతుందని సూచనప్రాయంగానైనా కానరాదు. పోనీ వేమన పుచ్చకాయలను బంగారంగా మార్చినాడనుకుందాం

'ఈ సామర్థ్యము గలవాడు యన్నగారి యినుపపెట్టెనో లేక షెరటి మట్టిగోడనో తాకి బంగారంగా జేయవచ్చునే! ఏమి వెర్రివాడు వేమన్న'

అని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు ఈ కథను పరిహసించారు.

ఇక బహుళ ప్రచారంలో ఉన్నదీ, వేమనకు బాగా సంబంధించినదీ అయిన అభిరామయ్య కథను చూద్దాం. 'విశ్వదాభిరామ వినురవేమ' మకుటంలోని 'అభిరామ' శబ్దం ఆసరాతో పుట్టిన కథ కావచ్చునిది. ఈ కథను గూర్చి శర్మగారు చేసిన చర్చ ఈవిధంగా ఉంది:4

"ఇక నిందుకు సంబంధించిన అభిరామయ్య కథ కాళ్ళులేనిది. ఈ కథ తెల్పెడు పద్యములు బందరువారి ముద్రణములో గలవు. అవి వేమన స్వకీయ చరిత్రము వ్రాసినట్లున్నవి. నేను జూచిన యే వ్రాతప్రతులందును ఇదివరకు అభిరామయ్య పేరైనను కానరాదు. పాత యచ్చుప్రతులలో పీఠికలలో నీతని కథ సంగ్రహముగా గలదు. అసలు అభిరామయ్యయను పేరే వింత పేరు. రామయ్యలు గలరు, పట్టాభిరామయ్యలు గలరు; లోకాభిరామయ్యలు ఉండవచ్చును. కాని వట్టి అభిరామయ్య కర్థమేమి?.....అభిరామయ్య కథ కల్ల యనుటకు వేరొక సాక్ష్యము గలదు. అంబికా శివయోగి యను నాతడు తత్త్వరహస్యము నుపదేశించెదను రేపు రమ్మని కంసాలి అభిరామయ్యకు చెప్పగా దానిని రహస్యముగా బొంచి వినుచుండిన మన వేమన్న, తన వదినయైన రాణి గారి మూలమున మరునాడు అభిరామయ్య నగరు విడిచి పోలేకుండ జేసి తాను యోగివద్దకు బోయి, అతడే తనకు ప్రతిగా నన్ను బంపెనని చెప్పి, శివయోగిని వంచించి, యతనిచే బీజాక్షర మంత్రోపదేశమును బొందెనట. తరువాత తాను సంపాదించిన విద్య విలువెరిగిన జ్ఞానియై పశ్చాత్తాపమును బొంది మొదట జాగ్రత్తగా అభిరామయ్య కాళ్ళు పట్టుకొని తప్పు క్షమించెదనని బాస చేయించుకొని తన యపరాధమును దెలిపెను; అతడు పాపము, మొదలె క్షమించినాడు కదా; అతని దయకు కృతజ్ఞత జూపుట ధర్మమే కాని యదే బీజాక్షరోపదేశమును తానే యతనికేల చేయలేదు? పాపము, దానికై యాతడెన్నినాళ్ళు ఆ బైరాగి శివయోగి సేవచేసెను! అభిరామయ్యవలె శివయోగి గూడ వంచితుడే కదా! తనకు ప్రధాన గురువగు నతనికింత మాత్రము కృతజ్ఞత చూపవలదా?! వేమన పద్యములలో నా పేరే లేదే!"5

కాబట్టి వేమన కాల, ప్రాంతాల కొరకు వాడుక కథల్లో వెతికి ప్రయోజనంలేదు లిఖితరూపంలో లభిస్తున్న వేమన పద్యాల్లో వీటికి బలమైన సాక్ష్యాలు కనిపించకపోవడం వల్ల ప్రస్తుతానికి వీటిని నమ్మకపోవడం తప్ప మార్గాంతరం లేదు

## II. పాశ్చాత్యుల కాలనిర్ణయం:

వేమనను గూర్చి మొట్టమొదటిసారి పేర్కొన్న పాశ్చాత్యుడు ఫ్రెంచి మతగురువు జె.ఎ దుబాయ్ 1792 నుండి 1823 వరకు భారతదేశంలో ముఖ్యంగా మద్రాసు ప్రాంతంలో ఈయన తన జీవితాన్ని గడిపాడు 1806లో ఆయన రచించిన "హిందువుల

4 వేమన పేజీ 18
5 వేమన పేజీ 18

అలవాట్లు, ఆచారాలు, పండుగలు"6 అనే ఉద్గ్రంథం ఫ్రెంచి భాషలో వెలువడింది హిందువుల సాంఘిక చరిత్రను గూర్చి ఇంతటి సాధికారికమైన గ్రంథం అప్పటివరకు వెలువడలేదు. హిందువులను గూర్చి తెలుసుకొనగోరే పాశ్చాత్యులందరికి అది శిరోధార్యంగా భావించబడేది. 1887లో హెన్‌రీ కె. బ్యూకాంప్ (Henary K Beau champ) అనునతడు దీనికి ఉత్తమమైన అనువాదాన్ని వెలువరించాడు. దుబాయ్ తన గ్రంథ రచనా కాలానికే తెలుగు కవితా రంగంలో వేమన విశిష్టమైన గొంతును విని ఉన్నాడు. తన గ్రంథంలోని ఐదవ అధ్యాయంలో ఆత్మ యొక్క పవిత్రతను గూర్చి చర్చించే సందర్భంలో ఒక వేమన పద్యంలోని కింది భావాన్ని ఉదహరించాడు:

"It is water which causes mud, and it is water which removes it. It is your will that makes you commit sin, and it is by your will alone that it can be purified"

పై అనువాదాన్నిబట్టి దానిమూలమెంత రమణీయంగా ఉండి ఉంటుందో ఊహించ వచ్చు.7 వేమన కాలాన్నిగూర్చి కూడ మొట్టమొదటిసారి చెప్పిన ఈ మతగురువు వేమన 17వ శతాబ్దపు చరమపాదంలో మృతి చెందాడని చెప్పకోగా విన్నానని వ్రాశాడు.8 నేటికి 174 సంవత్సరాలకిందటి దుబాయ్ చెప్పిన మాటలకెంతో విలువ ఉంది. ఈయన మాటలప్రకారం వేమన 17వ శతాబ్దం చివరలో (అంటే 1675 తర్వాత) మరణిస్తే 1650 ప్రాంతంలో వేమన బ్రతికే ఉన్నాడన్నమాట దుబాయ్ ప్రకారం ఆయనకు దాదాపు 150 సంవత్సరాలక్రితం వాడే వేమన్న వేమన్న, ఇంకా వేమన్నలాంటి మిగిలిన "వ్యంగ్య విప్లవ కవులు" తనకన్న చాలా పూర్వులని దుబాయ్ భావించలేదు

"It is to be noticed that the authors of all these satirical and revolutionary works belong to recent times" (Page 275)

1816లో ఇండియాలో అడుగుపెట్టిన బ్రౌన్ మొట్టమొదట వేమన్న పేరును దుబాయ్ గ్రంథం ద్వారానే విన్నాడు.9 సరళసుందరమైన వేమన్న పలుకులు బ్రౌన్‌కు విపరీతంగా ఆకర్షించాయి వెంటనే వేమన పద్యాల ప్రతుల సేకరణ ప్రారంభించాడు

---

6. Hindu Manners, customs and cermonies - by the ABBE J A DUBOIS Translated by Henry K. Beau champ Page 194

7. ఈ అనువాదానికి మూలమైన పద్యంకొరకు నేను జరిపిన అన్వేషణ ఫలించలేదు దేశంలో ఇప్పుడు లభిస్తున్న ముద్రితాముద్రిత ప్రతులు వేటిలోనూ ఇది కనిపించలేదు పాదపీఠికలో G U Pope వ్రాసినదానివలన ఆయనకు కూడ ఈ పద్యం కనబడలేదని తెలుస్తున్నది "This is not to be found among the verses of Vemana, but any Telugu verse of which the author is unknown is ascribed to him - Pope" దుబాయ్ ఏ ప్రతిలో చూశాడో, లేక ఎవరినోటి ద్వారానైనా విన్నాడో తెలియదు

8. We are told that the philosopher who was of the Reddy caste and was born in the district of Cuddapah, died towards the end of the seventeenth century

9. I did not possess a single Telugu Volume, but ignorant as I was of all the poets in the language, the Abbe Dubois in his "Account of the Hindus", had acquainted me with the name of Vemana, a rustic epigrammatist I was led to pursue and translate the verses of Vemana, about as long as scotts Marmion, 1866

దాదాపు 18 ఏళ్ళ వేమన పద్యాలలో మునిగి తేలిన బ్రౌన్ వేమన కాలాన్ని ఈక్రింది విధంగా ఊహించాడు:

"It is said that in verse 707 he has fixed the date of birth which is believed to have been his own. This date coincides with A.D. 1652. The date is given in the cycle of sixty years, but which cycle is intended is unknown. Many verses, however, prove satisfactorily that he wrote in the latter part of the seventh century when the Mohamedans were governors of that part of India."[10]

ఇంచుమించుగా దుబాయ్ విన్న కాలాన్ని అంగీకరిస్తూనే బ్రౌన్ దానికి కొంత వివరణ ఇచ్చాడు. బ్రౌన్ ప్రకారం వేమన 17వ శతాబ్దపు ఉత్తరార్ధానికి చెందినవాడు. దానికి కారణాలు రెండు: 1. వేమన కాలాన్ని అస్పష్టంగానైనా చెప్పే పద్యమొకటి వేమన్న పేరుతో ఉంది 2 మహమ్మదీయులు దేశాన్ని పాలిస్తున్న కాలంలో వేమన్న జీవించి ఉన్నాడు అనడానికి ఆయన పద్యాలలోనే సాక్ష్యాలు లభిస్తున్నాయి. పై అంశాలను పరిశీలిద్దాం.

1. "నందన సంవత్సరమున
పొందుగ కార్తీక శుద్ధ పున్నమ నాడున్
వింధ్యాద్రి సేతు బంధన
సందున నొక వీరుడేలు సరసున వేమా"[11] (డి 1725,52)

వారం ఇవ్వబడలేదు కాబట్టి అరవైఏళ్ళ కొకసారి తిరిగే కాలచక్రంలో ఇది ఏ 'నందన' అయినా కావచ్చును వాటిలో మూడు ఈ విధంగా ఉన్నాయి. ఎడి 1772 లేక ఎడి. 1712 లేక ఎడి 1652 బ్రౌన్ వీటిలో మూడవదానివైపు మొగ్గుతున్నాడు. కాని ఈ పద్యం ఎంతవరకు నమ్మదగింది అనే విషయాన్ని ముందు ముందు చర్చిస్తాను

2. వేమన పద్యాలలో తురకపదాలు కలిగిన పద్యాలు నాలుగైదు ఉన్నాయి వాటిలో ఒక పద్యం ముస్లింల 'మక్కా' యాత్రకు పరిహసిస్తూ ఉంది కాబట్టి వేమన్న మహమ్మదియుల పాలనాకాలంలోనివాడై ఉండాలి ఇది బ్రౌన్ ఊహ

బ్రౌన్ 1839లో వెలువరించిన వేమన పద్యాల ద్వితీయ ముద్రణాన్ని 1866లో సమీక్షిస్తూ మేజర్ ఆర్ ఎం మ్యాక్డోనాల్డ్, బ్రౌన్ చెప్పిన కాలాన్నే ఒప్పుకున్నాడు[12] పైన

---

10. "My Discovery of Vemana" by Charles Philip Brown 1824

11. పాఠాంతరాలు

1 నందన సంవత్సరమా
నందన పునమినాడే

చాటుర వేమా (డి 1723,586)

2 కార్తీక శుద్ధ పున్నమి నెలలో
వింధ్యాద్రి సేతు మధ్యము
నందొక్కడు ఏలునుచు (డి 1779,822)

12. "Vemana, A Rebel poet" by Major R M Macdonald, Madras Journal of Literature & Science, 1866 "Vemana through western eyes" - Compiled by V R Narla, 1969

ఇచ్చిన మూడుకాలాలలో (అవ్వతాలు) 1652 వేమన్నకాలం కావచ్చునని అభిప్రాయపడ్డాడు. కాని ఈ అభిప్రాయంలో బ్రౌన్ చెప్పిన కాలంవైపు మొగ్గిన మ్యాక్డోనాల్డ్ తిరిగి మరికొన్ని అంతరంగ సాక్ష్యాలతో వేమన కాలాన్ని 17వ శతాబ్దపు చరమదశో లేక 18వ శతాబ్దపు ప్రారంభమో అని ఊహించాడు. బ్రౌన్ సూచనప్రాయంగా చెప్పిన మహమ్మదీయ పాలనను ఈయన కొంత ముందుకు వెళ్ళి పరిశీలించాడు.

*తిరుమలకు బోవ తురక దాసరిగాడు*
*కాశిబోవ లంజ గరితగాదు*
*కుక్క సింహమగునె గోదావరికి బోవ*[13]

ఈ పద్యానికి మ్యాక్డోనాల్డ్ వ్యాఖ్యానం ఇలా ఉంది -

"The Hindoos boast that the sacred soil of Tripety has never been profaned by the foot of a Mussulman or a Christian, and although this may not be strictly true, it is not likely that such visits as those noticed in the verse above quoted would have been ventured on before the period of the Mahommedan conquest. The first invasion of that portion of the Carnatic in which Tripety is situated, took place in 1310, but the country was not actually occupied until the beginning of the 16th century."[14]

ఇంతేగాక అబె దుబాయ్ వేమన కాలాన్ని కొంత ఆధునిక పరిసరాలలోకి నెట్టివుండవలసింది అని అభిప్రాయపడ్డాడు. వేమన కాలనిర్ణయంలో ఇంతవరకు చర్చించిన పై ముగ్గురికి పెద్దగా భేదాభిప్రాయాలు లేవు కాని వీరి తర్వాత 1871లో సి.వి. గోవర్ అనే ఇంగ్లీషు పండితుడు మాత్రం వేమనకాలాన్ని గూర్చి విపరీత నిర్ణయాలను ప్రకటించాడు. వేమన కాలం 12వ శతాబ్దావరణను దాటదని ఈయన వాదం తమిళకవి తిరువళ్ళువర్ అంటే ఈయనకు అభిమానం ఎక్కువ. కవిత్వోత్పత్తి హేతువులలో, కవితాధర్మాలలో చాలావరకు వళ్ళువర్‌తో సాయాప్యం ఉండడంచేత వేమనను ఆయన విశేషంగా గౌరవించాడు. "Flok songs of South India" అనే తన గ్రంథంలో ఆంధ్ర విభాగమంతా వేమనకే వినియోగించాడు. బ్రౌన్ చెప్పిన కాలాన్ని ఈయన నిరాధారమైన ఊహగా కొట్టిపారేశాడు బ్రౌన్ వేమన పద్యాలలోని భాషపై ఆధారపడుతున్నాడనీ, పలువురిచేత పలుమార్లు సవరింపబడి తిప్పి వ్రాయబడి తికమక చేయబడి అందులోని విషయాలు కొత్త వ్రాతగాళ్ళచేత ఆధునీకరింపబడ్డాయనీ, కాబట్టి పద్యాల భాషపై ఆధారపడి నిర్ణయాలు చేయడం పొసగదని చెప్పాడు. వేమన్న వేదాంతానికి సంబంధించిన బ్రౌన్ అనువాదభాగాలను ఉదహరించి వాటివలన వేమన ఇంకా ముందటివాడని సిద్ధాంతీకరించాడు వేమన జంగముడని, వీరశైవ సిద్ధాంతి అని నిరూపించే సిద్ధాంతాలనుకూడ ఈయన తోసివేశాడు 12వ శతాబ్దంవాడేనని ఈయన వాదన దానికి కారణం వేమన రచనలకు తమిళకవుల రచనలతో దగ్గరి పోలికలున్నాయి కాబట్టి ఆయన దాదాపు వారి కాలంవాడే నంటాడు కాని కేవలం ముక్తకప్రాయంగా చెప్పిన కవితాధర్మాల సామ్యంవల్ల దీనిని ఉపపత్తీకరించలేము దృక్పథాల సామ్యం

13 N D 1721,I,242
14. "A Rebel poet"

కూడా అవసరం. గోవర్ నిర్ణయంలో తొందరపాటు ఉన్నంతగా ఆలోచన కనిపించదు.

1875లో వేమనను గూర్చి ప్రస్తావిస్తూ జె.డి.బి. గ్రిబిల్ అనే ఇంగ్లీషు దొర బ్రిటిషువారు కడప జిల్లాను ఆక్రమించుకోవడానికి ముందు జీవించిన వేమన అనే 'మత ప్రవక్త జాడలు' లభించాయని చెప్పాడు[15] బ్రిటిషు వారికి ముందు ఈ ప్రాంతంలో ఉన్నది ముస్లిం పరిపాలనే కదా! తనకు దొరికిన "ప్రవక్త జాడల"ను పట్టుకొని గ్రిబిల్ మరికొంత దూరం పయనించిఉంటే మన అదృష్టం పండి ఉండేదేమో!

1898లో వేమనను గూర్చి ఉత్తమవ్యాసం వ్రాసిన డబ్ల్యూ హెచ్. క్యాంబెల్ కూడ బ్రౌన్ తదితరులు చెప్పిన కాలాన్ని ఖండించలేదు.

"History is an unknown art in India and it is extremely difficult to discover a basis of reliable fact beneath the mass of legends which are associated with the name of the poet. It is generally believed that he live about 250 years ago"[16]

క్యాంబెల్ 17 సంవత్సరాలు రాయలసీమలో నివసించినవాడు. వేమన పద్యాల సారాన్ని సూక్ష్మేక్షికతో పరిశీలించినవాడు. క్యాంబెల్ కి ఒక దశాబ్దం తర్వాత 1908లో "Heart of India" అనే గ్రంధాన్ని ప్రకటించిన ఎల్ డి. బార్ నెట్ అసలు వేమన అనే వ్యక్తి ఈ భూమిపైన జీవించి ఉంటాడా? అనే అనుమానాన్ని వ్యక్తపరిచాడు వేమనను ఒక "ఊహాజనిత వ్యక్తి"గా ఊహిస్తున్నాడీ ఇంగ్లీషు దొర[17] దీనివలన బార్ నెట్ కు ఊహలంటే ఉన్న అభిమానమే వ్యక్తమవుతుంది కాని ఈ వాదానికి వెన్నెముక లేదు.

ఒక గోవర్ తప్ప దుబాయ్ నుండి క్యాంబెల్ వరకు వేమన 1650 ప్రాంతంలో జీవించిన వాడని నమ్ముతున్నారు ఈ నమ్మకాన్ని వేమన పద్యాలలో వారికి లభించిన ఆధారాల పైననే నిర్మించుకున్నారు దుబాయ్ చెప్పిన కాలం ఆయన విన్నది బ్రౌన్ ఒక్కడే వేమన్న కాలాన్ని గూర్చి స్పష్టమైన చర్చ చేశాడు తర్వాత వారు బ్రౌన్ చూపిన సాక్ష్యాలను మరికొంత ముందుకు వెళ్ళి పరిశీలించారు గోవర్ తప్ప మిగిలిన పాశ్చాత్యుల ఊహలు తర్కసహంగానే ఉన్నాయి

## III. దేశీయుల వాదోపవాదాలు:

"'వానలో తడియని'వారు, వేమన పద్యాలు తెలియని తెలుగువారు లేరు" అంటే అది స్వభావోక్తే చెవి విప్పితే చాలు వేమన పద్యం వినిపించే తెలుగునేలలో 20వ శతాబ్దపు తొలిరోజులవరకు దేశీయ పండితుల శ్రద్ధా దృక్కులకు వేమన పద్యాలు

---

15. Cuddapah District Manual by J D B Gribble 1875 pages 290 and 291 Through courtesy of "Vemana Through Western eyes" edited by V R Narla 1969

16. అంటే 1648 ప్రాంతం "The one great poet of the people" Madras Christian College Magzine 1898 Through courtesy "Vemana through western eyes" edited by V R Narla-1969

17. "Vemana" is a Telugu "Poor Richard", an imaginary village sage in whose mouth have been placed the verses of a number of nameless rustic poets, "Teacher and preacher" - 1908 Through courtesy of "Vemana through western eyes"

నోచుకోలేదు. 1824లో బ్రౌన్ వేమన్న కోసం మొట్టమొదటిసారి "కాలేజీ"18 ద్వారాలు తెరిచిపెట్టిపోయినా తర్వాత ఒక శతాబ్దం దాకా పండితుల మౌనంలో మరుగున పడిపోయాడు వేమన. కాని కాలక్రమాన సామాన్య జనులలో వేమన్న ప్రభావం పెరుగుతున్నదే కాని చాలామంది ఇతర కవుల వలె భూతకాలంలోకి నిష్క్రమించలేదు. బ్రౌన్ ప్రారంభించి పోయిన వేమన పద్యాల బంగారుగని యొక్క తవ్వకపు పని మళ్ళీ తెలుగునాట మొదలైంది.

## III. ఎ) కొండవీటి వాదం:

'వేమన యోగీంద్ర చరిత్రము'19 వ్రాసిన పూర్ణయాచారిప్రకారం కొండవీటి సీమనేలిన రెడ్డరాజుల వంశంలో (పంట రెడ్లు) పుట్టిన వేమారెడ్డి వేమన. వేమన కొమరగిరి వేమారెడ్డి, మల్లమాంబల తృతీయపుత్రుడు. కోమటి వెంకారెడ్డి అనబడే అనవేమారెడ్డికి కనిష్ఠ సోదరుడు. వేమారెడ్లు శ్రీనాధుడు, భాస్కరుడు మొదలైన కవులను పోషించారు. పూర్ణయాచారి రెడ్డిరాజుల వంశవృక్షాన్ని ఆయా రాజులు పాలించిన కాలంతో సహా ఇచ్చాడు. వాటిని యధాతధంగా ప్రక్క పేజీలో ఇస్తున్నాను.

'ఎ.డి. 1328 సం॥-1428 సం॥ వరకు 100 సం॥ రెడ్ల ప్రభుత్వం' సాగిందని పూర్ణయాచారి వ్రాసిపెట్టాడు.

'ఈ వేమనయోగి యిప్పటికి అనగా ఎ.డి. 1912 వ సంవత్సరానికి 530 సంవత్సరాల క్రిందటివారు' అని వేమన కాలాన్ని తేల్చిచెప్పాడు

పై వంశ వృక్షాన్ని కొమర్రాజు లక్ష్మణరావుగారు ఖండించారు

'వేమన యోగీంద్ర చరిత్రమనుదానిని వ్రాసినవారు ఈతడు కొండవీటి ప్రభువైన రాచవేమారెడ్డి తమ్ముడని వ్రాసియున్నారు. ఇందుల కాధారమేమియు నిచ్చియుండ లేదు. ఇందలి వంశవృక్షమును సరియైనది కాదు. సంవత్సరములును గొంచెము హెచ్చు తక్కువగ నున్నవి. కొమరగిరి రెడ్డికి కోమటి వెంకారెడ్డి, రాచవేమారెడ్డి, వేమనయోగియను ముగ్గురు కుమారులున్నట్లు చెప్పబడినది. కాని శాసనాదులను బట్టి చూడగా కుమారగిరిరెడ్డి 1390-1400 వరకు రాజ్యము చేసినట్లున్నది. ఇతడు అనపోతరెడ్డి కుమారుడు. ఇతని చెల్లెలి భర్తయే కాటయవేముడు.

కుమారగిరికి సంతానము లేనందున, మనకర్తయైన వేమారెడ్డి యొక్క యన్నయగు మాచన యనువాని మనుమడగు కోమటి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చి 1400-1420 వరకు పాలించెను. ఈతని కుమారుడే రాచవేముడు. ఈతడు 1420-1424 వరకు రాజ్యము చేసెను. ఈతడు కొండవీటి రాజులలో చివరివాడు. ఇతడే నిజముగ మన వేమనకు నన్నయైన యెడల వేమన పదునైదవ శతాబ్దమునకు మొదట నున్నవాడు కావలసియుండును. ఈతడు రాచవేమనకు దమ్ముడగునేని పెదకోమటి వేమన యాతనికి దండ్రి కావలయు . ఈ రాజు సభలోనే శ్రీనాథుడు విద్యాధికారిగా

---

18 St George College, Madras

19. 'వేమన సూక్తి రత్నాకరము'లోనిది

# వంశవృక్షము



దొంతు అలియరెడ్డి, 1323 వ సంవత్సరంలో అనుమకొండ విడిచి
కొండవీడులో నివసించిన మూలపురుషుడు
1
పుల్లయ వేమారెడ్డి ప్రభువు
1328–1340
2
అనుపోత వేమారెడ్డి ప్రభువు
1340–1370
3
అనువేమారెడ్డి ప్రభువు
1370–1382
4
కొమరగిరి వేమారెడ్డి ప్రభువు
1382–1396
5
కోమటి వెంకారెడ్డి అనే వేమారెడ్డి ప్రభువు
1396–1424
6
రాచవేమారెడ్డి ప్రభువు
1424–1428
7
వేమారెడ్డి అనగా వేమనయోగి

నుండెను. కావున నీ కాలనిర్ణయమే నిజమగునేని వేమన శ్రీనాథుని కాలమువాడు కావలసియుండును."[20]

కాని లక్ష్మణరావుగారు ఈ కాలనిర్ణయాన్ని నిజమని నమ్మలేదు. వేమన ఇంత పురాతనమైన వాడే అయితే పూర్వకవులు, కనీసం శైవకవులైనా ఎందుకు పొగడలేదు? అని ప్రశ్నించారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "వేమాభిధానులగు రెడ్డిరాజుల కాలమువాడీ వేమన కావచ్చు"[21] నని అభిప్రాయపడ్డారు. దానికి ఆయన చూపించిన కారణం కాటయవేముని వద్ద రాయని భాస్కరుడను మంత్రి ఉన్నాడు కాబట్టి వేమన ఆయనను ప్రశంసించి ఉంటాడు[22] శేషాద్రి రమణకవులుకూడ కొండవీటి వాదాన్ని అంగీకరించలేదు.[23] దానికి వారు చూపిస్తున్న కారణమిది: వేమన కదిరితాలూకాలోని కటార్లపల్లికి సంబంధించినవాడు. కటార్లపల్లిలో ఉన్నవారందరు పాకనాటి రెడ్లే కావున వేమన పాకనాటి రెడ్డి కొండవీటి రాజులు పంటరెడ్లు కాబట్టి వారిమధ్య బాంధవ్య సంబంధాలు ఉండడానికికూడ వీలులేదు

పూర్ణయాచారి పుట్టించిన కొండవీటి వాదాన్ని ఒక వేటూరి ప్రభాకరశాస్త్రిగారే సమర్థిస్తున్నారు కాని కాటయవేముని మంత్రి రాయని భాస్కరుడని వారు చూపిన సాక్ష్యం బలంగా లేదు

అసలు వేమన్న కొండవీటివాడు అనే ప్రవాదం పుట్టడానికి కారణాలు మూడు:

1 వేమన్న పేరు
2. వేమన్న కులం
3 కొండవీటి పద్యం

## వేమన్న కులం:

మనసులో కులమత భేదాల లోహకుడ్యాలను కూల్చివేసుకొని, వాటిని నోరారా తిట్టిన వేమన్న కులాన్ని తెలుసుకోవడం కేవలం ఆయన చరిత్రను నిర్మించుకునే సాధనాల కొరకేగాని వేరుకాదు

'వేమన్న బ్రాహ్మణుడు కాదు. కాపు లేక రైతు' అని బ్రౌన్ 1824లో వ్రాశాడు[24] కాని 1829 నాటికి బ్రౌన్ తన అభిప్రాయం మార్చుకున్నట్టున్నాడు:

"His family name he never discloses, and hence imagine him to have been Zangum, the sect of Sudras known by this name are seceders from the common religion, their creed also corresponds with that taught by Vemana, and this is the only one not satirized by him"[25]

---

20. 1920లో జరిగిన వేమన జయంతిలో చదివిన వ్యాసం బహుశ, అముద్రితం దీనిని ప్రత్యక్షంగా వంగూరివారు మాత్రమే చూచినట్లున్నది వారి 'వేమన జీవితము-చరిత్ర' పుస్తకం నుండే ఈ వ్యాసభాగం పునరుద్ధరింపబడినది

21. "వేమన యోగి కాలదేశములు" ఆంధ్రపత్రిక (1924)

22. వేమన రాయని భాస్కరుని పొగడి వ్రాసిన పద్యాన్ని గూర్చి ముందు చర్చిస్తాను

23. వేమన జీవితము పీఠిక 'వేమన పద్యములు' వావిళ్ళ ప్రతి, 1925

24. "He is not a Brahmin, but a capoo or farmer" Preface, Verses of Vemana, 1829

25. 1866 (?)

కాని ఈ అభిప్రాయాన్ని వంగూరివారు ఖండించారు.[26] బ్రౌన్ దృష్టిలో జంగాలు అంటే శైవ సంస్కర్తలనే కాని జంగమకులం అని కాదు జంగాలదొక కులంగా ఇప్పుడు వాడుతున్నా దానిలో అన్ని కులాల వారున్నారు.

వేమన్న కాపు అని చెప్పడానికి అనేకులు ఈ కింది పద్యాన్ని ఉదాహరిస్తున్నారు.

"కలియుగమున నున్న కాపు కులానకు
వేమన తన కీర్తి విక్రయించె
ఉన్న ధర్మమెల్ల ఉర్విలో నరులకు
కోరి బెట్టె పరము గోరి వేమా." (డి.1721,475)

కృష్ణా గోదావరి మండలాలలో రెడ్లు వేరు, కాపులు వేరు కాపులంటే తెలగాలు, నాయుళ్ళు, బలిజలు మొదలైనవారే. కాని నెల్లూరు, దత్తమండలాలలో, కొన్నిచోట్ల తెలంగాణాలో రెడ్డి, కాపు అనే పదాలు పర్యాయ పదాలుగానే వ్యవహరించబడుతున్నాయి. కృష్ణా గోదావరులలోని కాపులలో కూడ ఎన్నో తెగలున్నాయి కాబట్టి వేమన్న తెగని నిర్ణయించడం కష్టం. ఈ పరిస్థితిని చూసి బండారు తమ్మయ్యగారు 'కాపు'ను ఒక ప్రత్యేక కులవాచకంగా తలపక **"ప్రకృతిమాత గారాపు కొడుకు కుర్రలగు కర్షక కుమారులకు సూచకముగా"** భావించడం మేలు అంటున్నారు.[27] దానికి వేమన పద్యాల నుండే కాపుల ప్రసక్తి ఉన్న కొన్ని ఉదాహరణలు ఇచ్చారు అదిగాక పైపద్యం **"విశ్వదాభిరామ వినురవేమ"** మకుటంతో ఉన్న పద్యం కాదు బ్రౌన్ ప్రతులు 40లో రెండు ప్రతులలో మాత్రమే ఈ పద్యం ఉంది (డి 1721, డి 1727) వావిళ్ళ ప్రతిలో లేదు [28] ఈ పద్యాన్ని ఎంతవరకు నమ్మవచ్చునో చెప్పలేము అయితే కాపుల ప్రసక్తితో వేమన అనేక పద్యాలు చెప్పాడు

ఇక వేమన్న కదిరితాలూకాలోని కటార్లపల్లివాడు అనే ప్రవాదం ఉంది కాబట్టి ఇతడు పాకనాటి రెడ్డి అని కూడ అన్నవారున్నారు కొండవీటివారు పంటరెడ్లు కాబట్టి వేమన రాజవంశానికి చెందినవాడు కాదనేది ఒక వాదం అయితే వేమనను **"వేమనృపాల శేఖరా"** అని సంబోధిస్తూ ఒక పద్యం లభిస్తున్నది

రాజైనవాడికి తెలియని, తెలిసినా పట్టించుకోని అనుభవాలు వేమన పద్యాల్లో కనిపిస్తాయి వ్యావసాయిక జీవితంలో కుత్తుకబంటిగా మునిగివున్నవాడు మాత్రమే చెప్పగలిగిన పోలికల్తో వేమన పద్యాలు చెప్పాడు మచ్చుకు కొన్ని

I) "దొంగ గొడ్డు మెడను దుంగ కట్టిన రీతి"
II) "పంటచేను విడిచి పరిగె యేరిన యట్లు"
III) "చేనులోని బొమ్మ చేసి కట్టిన యట్లు"
IV) "పండ్లుబడ్డ కుక్క పసరము పీకునా?"
V) "కొంక నక్కజావ గొర్రెలేమిటి కేడ్వు?"
VI) "గొర్రె చంకబెట్టి గొల్ల వెదకు రీతి"

---

26. వేమన జీవిత చరిత్రము (పేజీ 42)
27 వేమన చరిత్ర - పేజీ 92
28. బందరు ప్రతిలో "కోరుపెట్టె పదము" అని పాఠాంతరము

vii) "శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను"

సామాన్యుల జీవన పరిస్థితుల, పరిసరాల వర్ణనకు సంబంధించిన ఈ కింది ఉదాహరణలు ఆ జీవితంతో వేమన్న గాఢమైన అనుభవాన్ని సూచిస్తాయి.

i) "దొబ్బ నేర్చు కుక్క దుత్తలు మోసునా"
ii) "కుండ చిల్లిపడిన గుడ్డ దోపగవచ్చు"
iii) "కుక్క ముట్టినట్టి కుండ దొంతెక్కునా?"
iv) "తడికె బిర్రుపెట్ట తలుపుతో సరియౌనె!"
v) "కుక్క ఇల్లు జొచ్చి కుండలు వెతకదా?"

జనజీవితాన్ని పరిశీలించినవాడి భావాలకీ, దానిలో మగ్నుడైవున్నవాడి భావాలకీ భేదం ఉండి తీరుతుంది దారిద్ర్యాన్ని వర్ణించిన తీరు అనుభవం లేనివాడికి సాధ్యమయ్యేదికాదు. ఈకింది ఉదాహరణలు చూడండి:

i) "పేద పేద గూడి పెనగొని యుండును"
ii) "ధనము లేమి చూడ తలపనే పాపంబు"
iii) "విత్తహీనుడెంత రిత్తయైపోవును"
iv) "గోచిపాతకంటె కొంచెంబు మరిలేదు"
v) "అప్పులేనివాడు అధిక సంపన్నుడు"

కాబట్టి వేమన్న 'రాజు' అనే వాడుక నిరాధారమైనట్టిదే రాచకుటుంబం నుండి వచ్చినవాడు కావుననే ఆ స్పష్టతా, సాహసం అలవడ్డాయని వాదించేవాళ్ళున్నారు. వేమన్న సాహసాది సద్గుణాలు అతని నిశిత జీవితపరిశీలనవల్లా, అనితర సామాన్యమైన సూనృతంవల్లా ఏర్పడ్డాయని భావించవచ్చు

"గట్టిగ నార్గురేడ్గురిని కండలు గోసియు యేవురన్ మెడల్
గొట్టియు ముగ్గురిల్లు చెడగాల్చగ ముక్తియు గల్గనేర్చునా
బొట్టును బోనమున్ భుజము పొక్కులు బూడిదె పూతలూరకే
పెట్టుటగాక భూజనులు పేర్మిని వేమ నృపాల శేఖరా!" (డి 1723, 677)

కాని ఈ పద్యాన్ని గూర్చి ఏమీ చర్చ చేయకుండానే కొ[illegible] బ్రౌన్ ప్రతులలో ఒక్క ప్రతిలోనే ఈ పద్యం ఉంది పైగా వేమన ఉత్పలమాలలు వ్రాయలేదని నేను గట్టిగా నమ్ముతున్నాను

ఫలితమంతగా లేని పై చర్చ వలన మనమే కొన్ని నిర్ణయాలకు రావచ్చును ఏ తెగకు చెందినప్పటికి వేమన బండారు తమ్మయ్యగారు భావించినట్లు రైతు కుటుంబానికి చెందినవాడు వేమన పద్యాలలో కనిపించే వ్యావసాయక పరిజ్ఞానం కూడ ఈ ఊహకు బలాన్ని ఇస్తున్నది రాజవంశాలతో ఇతని కెటువంటి సంబంధమున్నట్టు తోచదు వేమన్న రాజులను, అధికారులను దుయ్యబట్టడం, అట్టడుగు జీవితాల్లో మగ్నుడైనవాడు తప్ప చేయలేని సామాన్య జీవిత వర్ణన గావించడం దీనికి కారణంగా చూపవచ్చు[29]

---

29 రాజులను, అదికారులను నోరారా తిట్టిన పద్యాలు "రాజకీయ సంక్షోభం" శీర్షిక కింద చూడవచ్చు

### వేమ శబ్ద విచారం:

వేమన అనే పేరు పెట్టుకొన్నవారు చరిత్రలో తక్కువగానే కనిపిస్తున్నారు. రాయలసీమలో మాత్రం ఇప్పటికీ ఈ పేరు పెట్టుకొన్నవారు కనిపిస్తున్నారు. కొండవీటి వేమారెడ్లకు మాత్రమే ఇది ప్రసిద్ధంగా కనిపిస్తుంది. వేమయ అనే వీరశైవ మతాచార్యునిబట్టి వేమారెడ్లకీ పేర్లు ఏర్పడి ఉంటాయని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్రాశారు.[30] కాని దీనిని బండారు తమ్మయ్యగారు సయుక్తికంగా ఖండించారు.[31] వీరశైవ మతాచార్యులలో వేమ నామాంకితు లెవరూ కానరారు. పురాతన శివభక్తులలో మాత్రం బెలిదేవ వేమనారాధ్యుడు, చేటుల వేమయ్యలు మాత్రం కనిపిస్తున్నారు.

అయితే 'వేమ' శబ్దానికి అర్థమేమిటో పరిశీలించవలసి వుంది. అయితే పేర్లన్నింటికీ రూప నిష్పత్తి, అర్థ నిర్ణయం చేయడం సాధ్యం కాదు. పేర్లు అనేక కారణాల ఆధారంగా రూపొందుతుంటాయి. దేవతల పేర్లనుబట్టి, గ్రామాలనుబట్టి, ఆహార పదార్థాలు, వృక్షాలు, జంతువులనుబట్టి పేర్లు పుడతాయి 'వేమ' శబ్దాన్ని గూర్చి అభిప్రాయ మీవిధంగా ఉంది:

"The names Vema and Vemana do not appear to be used by the Telugus of present day. Vema or Vemana in sanscrit signify a loom. (See Wilson's sanscrit lexicon-Page 854, and the sabdartha Calpataru Vol. II Page 199). I believe these names to have been practical titles alone, without a definite meaning. Thus it is well known that the titles or names of Dante and Hafiz were not the original names of those Poets; the first of whom was named Durante or Durando (see Cary's Dante) and *the second* Mahammed Shamsuddin"[32]

బండారు తమ్మయ్యగారు 'వేమయ్య'కు అర్థాన్ని సాధించడానికి ఈవిధంగా ప్రయత్నంచేశారు

"....వేమయ్య యను నామము వేమ+అయ్య అని. వేమ యను సంస్కృత శబ్దము పయి అయ్య అను పదమును జేర్చుటవలన గాని, లేక యా పదమునే 'వేమ+అయ్య' యని వేమ (వేపచెట్టు) అను వృక్షవాచకమగు తెలుగు శబ్దముపయి చేర్చుటవలనగాని యేర్పడినది."[33]

ఇదే మార్గములో వంగోలు వేంకటసుబ్బయ్యగారు కొంత చర్చ చేశారు

'వేమ శబ్దమేమి? వేమ=వేపచెట్టు, ఇందుకు ప్రమాణము వేమనయే చెప్పి యున్నాడు. తినగ తినగ వేము తియ్యనుండు...బుద్ధునికి బోధివృక్షమునకు లంకె యున్నది. ఈయన వలన నా వృక్షము మహాబోధి యాయెనో లేక యా వృక్షము వలన నీయన బోధిసత్త్వుడాయెనో సర్వజ్ఞులగు తథాగతులే నిర్ణయింపవలెను. ఇటులే వట తరువునకును శ్రీదక్షిణామూర్తికిని సంబంధము గలదు. "చిత్రం వట తరోర్మూలే వృద్ధా, శిష్యాగురుర్యువా." గౌరాంగు చైతన్యస్వామికి 'నిమామ్'

30 శృంగార శ్రీనాథము

31 వేమన చరిత్ర, పేజీ 96

32 Preface to Vemana, 23 Nov 1824 D 1773, Vol 5

33 వేమన చరిత్ర పేజీ 99

అను ప్రసిద్ధమైన పేరు కలదు. "నీమ్" అనగా వేపచెట్టు, నింబవృక్షము; ఆయన జన్మస్థానమునకు వేప చెట్టునకు నేదో సంబంధము చైతన్య చరిత్రకారులు వ్రాసియున్నారు. శ్రీవైష్ణవాళ్వార్లలో నగ్రగణ్యులగు శ్రీనమ్మాళ్వార్లకును చింతచెట్టునకును సంబంధము గలదన్న దేవరహస్యమును వైష్ణవులు చెప్పెదురు. ఇంగ్లీషు వారి పూర్వ పితామహులగు డ్రూయిడ్లు ఓకు వృక్షము క్రింద తపస్సు చేయువారట... "...Sage beneath the spreading oak. Sat the clrinal (?) hoarv chief" ఈవిధముగానే వేపచెట్టు క్రిందనే కూర్చుండి బోధచేయుచుండిరి కాబోలు. అందువలన లక్షణావృత్తిచే నీయనకు వేమయను పేరేర్పడి యుండవచ్చును. కాబట్టి యిత్యాది విషయములు కూడ వేమననంటి చర్చింపదగియున్నవి.'[34]

## III బి) కొండవీటి పద్యం

> ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి
> మూక చింతపల్లె మొదటి వీడు
> అరశి చూడ బయలు అది ముక్తి శివుడయా విశ్వ.[35] (డి.1769, 171)

దాదాపు ముద్రితాముద్రిత ప్రతులన్నింటిలోను ప్రథమపాదం ఒకేవిధంగా ఉంది. ఒక డి 1725 ప్రతిలో మాత్రమే "కొండపల్లె" అనే పాఠం కనిపిస్తున్నది. కాని ఇది లేఖక ప్రమాదంగానే తోస్తున్నది. ఇంతవరకు లభించిన సాధనాలు వేమన్నను కొండవీటికే ముడిపెడుతున్నాయి కాని కొండపల్లితో అతని కెటువంటి సంబంధంలేదు. ఇక రెండవపాదంలోని 'మూక చింతపల్లె' పాఠమే ఎక్కువ ప్రతులలో ఉంది. పైగా 'మూగసేత లెల్ల మొదటి వీడు' అనేదానికి అర్థాన్వయం కుదరదు. ప్రాచీన ప్రతిలో మూగచింతపల్లి అని ఉంది ఇటువంటి అర్థం కుదరని చోటులలోనే ఏదో గూఢార్థం కలదని వేదాంతపరంగా వ్యాఖ్యానం చేసినవారున్నారు వారిలో కూడ బ్రౌనే ప్రథముడు:

"The village of our body in which the deity dwells is Hill Town (The head?) his house is in back street (the spine) There in silence

---

34. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, దుందుభినామ సం॥ ఆశ్వయుజ 1913 సంపుటం 11

35. పాఠాంతరాలు

1 మూకచింతపల్లి మొదటి ఇల్లు (డి 1723, 504)

2 మూగసేత కెల్ల మొదటివీడు
అరశి చూడనది ముక్తిమార్గమో (డి 1776-5-900)

3 ఊరుకొండపల్లె ఉనికి పశ్చిమ వీధి
మూక చింతపల్లె మొదల యిల్లు
ఆత్మరాక పోక అదియెపో తత్త్వంబు (డి 1725, 646)

4 మూాల చింత కడకు ముందరిల్లు
అరశి చూడ బయలు అడనె శివుడుండు (డి 1727, 324)

5 మూగ చింతలెల్ల మొదటి యిల్లు
ఎడ్డెరెడ్డి కులమదే మని తెల్పుదు (వావిళ్ళ ప్రతి)

is the first house. We gaze and continually view it, this is the road of beatitude".[36]

ఇక రెండవపాదం ఉత్తరార్ధం మొదటివీడు, మొదటి యిల్లు, ముందరిల్లు మొదలైన పాఠభేదాలతో ఉన్నది. 'మూగచింతపల్లి మొదటి యిల్లు'కు కూడ అర్థం అన్వయసహంగా లేదు 'మూగచింతపల్లి మొదటి ఊరు' అని ఉండవలెను కాని 'మొదటి ఇల్లేమిటి?' అని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు ఈ పాఠాన్ని సందేహించారు[37] మూడవపాదం 'అరశి చూడ బయలు అది ముక్తి శివుడయా' అన్నదే స్వల్పభేదాలతో (చూడచూడ అడనే శివుడయా) ఎక్కువ ప్రతులలో ఉన్నది. 'ఆత్మ రాకపోక అదియెపో తత్త్వంబు' అనే పాఠం ఒక్క డి.1725 ప్రతిలోనే కనిపిస్తున్నది. అనేక ముద్రిత ప్రతులలో ప్రచురంగా కనిపిస్తున్న 'ఎడ్డెరెడ్డి కులమదేమని తెల్పుదు' అనే పాఠం తాళపత్ర ప్రతులలోగాని, బ్రౌన్ నాటికే వ్రాయించిన పత్రములలోగాని కనిపించదు. బందరు ప్రతిలో పై రెండు పాఠాలతో రెండు పద్యాలు ఉన్నాయి (నెం 569, 569) వావిళ్ళ ప్రతిలో 'ఎడ్డెరెడ్డి కులమదేమని తెల్పుదు' పాఠమే ఉన్నది (1034) కాని ఏ అముద్రిత ప్రతిలోను చివరకు ప్రాచీనప్రతి (దీనిలో కూడ అరశి పాఠమే ఉన్నది)లో కూడ లేని ఈ పాఠం నమ్మదగినది కాదు అంతేకాక వేమన తన నివాసపు భూగోళిక సమాచారాన్ని వర్ణించేటప్పుడు అర్థాంతరంగా తన కులప్రసక్తి తెచ్చినాడని అనిపించదు. 'ఎడ్డెరెడ్డి కులమదేమని తెల్పుదు' అంటే ఏమిటి? అదేమని తెల్పుదు? అంటే 'ఏమంత గొప్ప కులమని చెప్పను?' అని అర్థమా? కాబట్టి గృహ పరిసర వర్ణనంలో ఈ పాదం బయటనుంచి వచ్చి అతుక్కున్నదేగాని రెండు పాదాల తర్వాత పద్యక్రమంలో పుట్టినట్టుగా అనిపించడంలేదు ఇక ప్రాచీన ప్రతిలో కూడ ఈ పాఠం లేదు

పై పరిశీలన ఆధారంగా ఈ పద్యానికి పాఠ నిర్ణయం ఈ విధంగా ఉంది

*'ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి*
*మూగ చింతపల్లె మొదటి వీడు*
*అరశి చూడ బయలు అడనే శివుడుండు'*

ఈ పాఠ నిర్ణయంలో అన్వయ సహిష్ణుతను నా ధ్యేయంగా పెట్టుకున్నాను నా సొంత ఇష్టానిష్టాలకిక్కడ తావులేదు అదీగాక ఊర్లపేర్లతో స్పష్టంగా ఒక్క ప్రదేశం యొక్క జాడ చెప్పే ప్రయత్నమే ఇందులో కనిపిస్తున్నది కాబట్టి దీనిని అస్పష్టతలోనికి దిగజార్చి తాత్త్వికార్థాలను లాగడం ఫలితంలేని పని ఈ పద్యార్థంమీద బండారు తమ్మయ్యగారి అభిప్రాయం చూడండి "కేవలం వేదాంతమును బోధించు పద్యములలోగాని సాధారణముగా నితర బాహ్య విషయములను గూర్చి చెప్పు పద్యములలోగాని వేమన గూఢతకుగాని సందిగ్ధతకుగాని సందీయడు. చాటుమాటుల కాతని తేట కవితలో చోటులేదు"[38] పై పద్యానికి రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారి అర్థమీవిధంగా ఉంది "కొండవీటిలో బుట్టి కొన్నాళ్ళుండి, తర్వాత ఆరెంటిలో నేదో

---

36. Verses of Vemana, 1829
37. వేమన - పేజీ 26
38. వేమన చరిత్ర - పేజీ 30

యొక పల్లెలో మొదట వసియించినాడను అర్థమిచ్చు పాఠాంతర మొకటి పై పద్యమునకుండవలెననుకొంటిమేని, ఇతడు కొండవీటిలో బుట్టినవాడు కాదని సాక్షాత్ప్రమాణము లభించువరకును మనమతడందు బుట్టినవాడేయని నమ్ముదుముగాక!"
39 బండారు తమ్మయ్యగారికి పైపద్యంలో సందిగ్ధార్థమేమీ కనిపించలేదు. వారి అర్థమిది:

"వేమన పూర్వులు మొదట మూగచింతపల్లి యిల్లుగా అనగా నివాస స్థలముగా గలవారు. వేమన కాలము నాటికి వారియూరు కొండవీడు. ఆ యూరిలో పడమటి వీధిని వారి కాపురము."40 తమ్మయ్యగారు చెప్పిన ఈ అర్థం ఎంతో స్పష్టంగా ఉండి నాకెంతో ఆమోదకరంగా ఉంది. ఆయన దీనికి కొంత వివరణ కూడ చెప్పారు కొండవీటిని రెడ్డిరాజులు పరిపాలించే కాలంలో వేమన తాత ముత్తాతలెవరో మూగచింతపల్లినుండి కొండవీటికి వచ్చి అక్కడ స్థిరపడి ఉంటారు. ఆ కాలంలో రెడ్డిరాజుల కొలువులో ప్రవేశించిన మంత్రులు, దండనాథులు మొదలైనవారు తమ సంతానానికి ఆ రెడ్డిరాజుల పేరుపెట్టి ఉన్నారనటానికి అవకాశాలు ఉన్నాయి. వేమన పూర్వులెవరికో ఆ పేరు ఏర్పడగా వంశానుక్రమాన వేమనకు సంక్రమించి ఉంటుంది తాతల పేర్లు తనయులకు పెట్టే ఆచారం ఉందికదా! తమ్మయ్యగారి పై ఊహ హేతుదూరంగా లేదు 41 ఇక తృతీయపాదానికి అర్థం చెప్పడం కూడ కష్టంకాదు "అరశి చూడ బయలు అడనే శివుడుండు" – కొండవీటి పశ్చిమ వీధిలోని బయలు (మైదానం)లో శివాలయం ఉండి ఉంటుంది ఆ దాపుననే వేమన నివసించే ఇల్లు. ఇంటి చిరునామాకు వివరాలు చెప్పే పద్ధతి ఇది.

## 3.1 తుంగ వేమన

వేమన పేరుతో మన వేమన కానివాడొకడు ఉన్నాడని కనిపెట్టినవారు రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు. వేమన పద్యాలను ముద్రించినవారిలో అనేకులు వేమన కదిరితాలూకా 'కటార్లపల్లిలో' 'శార్వరి సంవత్సర చైత్ర శుక్ల నవమినాడు' తనువు చాలించాడని వ్రాశారు క్యాంబెల్ ఈ విషయంలో కొంత విచారణ జరిపి వేమన్న వారసులమని చెప్పుకునే కుటుంబమొకటి కటార్ల పల్లెలో కనిపించిందని వ్రాశాడు 42 శర్మగారు కటార్లపల్లెకు వెళ్లి సమగ్రంగా విచారణ చేసి వేమన్నలు ఇద్దరు ఉన్నారనే సంగతి బైటపెట్టారు దానికి వారికి లభించిన సాధనాలు మూడు 1 నల్లచెరువు చెన్నయ్య వేమన పురాణం, 2 'వేమన యోగి చరిత్రం' తాళపత్ర ప్రతి; 3 కటార్లపల్లెలోని ప్రవాదం

---

39. వేమన – పేజీ 28
40 వేమన చరిత్ర – పేజీ 30
41 వేమన చరిత్ర – పేజీ 31
42. "Local tradition says that his home was in Katarlapalle, a small village in the extreme south-west of the Cuddapah District and it is certain that a family is to be found there whose members claim to be his lineal descendants and receive offerings from those who wish to honour the poet" W H Cambell, Madras Christian College Magazine, March, 1898 as quoted by V R Narla

నల్లచెరువులోని గుడిలో వేమన విగ్రహం పట్టెనామాలతో ఉంది. అక్కడి పూజారి వేమన కథను ఈవిధంగా వినిపించాడు: వేమన కొండవీటి పైడిపాల కొడిది వంశంలో, కనుగోళ్ళ గోత్రీకుడు. ఇతని పూర్వనామం పుల్లారెడ్డి. రాజైన అన్నతో కలహించి తల్లితోగూడ నల్లచెరువునకు వలస వచ్చాడు. అక్కడ వ్యవసాయం చేసుకుంటుండగా మార్గంలో అతని తలపై పిడుగుపడి మరణించాడు. తర్వాత తల్లికి కలలో కనిపించి ఏడవరోజున మళ్ళీ పునర్జీవితుణ్ణి అవుతానని చెప్పి ఎనిమిదవనాడు బతికి వచ్చాడు. "ఎట్లా బతికావు పుల్లారెడ్డి?!" అని అందరూ అడిగితే, "నా పేరు పుల్లారెడ్డి కాదు, వేమన" అని చెప్పాడు. అప్పటినుండి మహాత్ముడై తూర్పుదేశమంతా సంచరించి అనేక మహిమలు చూపాడు. ఇంగ్లీషు దొరలు కూడ అతని అద్భుతాలకు మెచ్చి గౌరవించారు. అతని తల్లి అచ్చమ్మ కోడూరిలో, భార్య ఆదిలక్ష్మమ్మ కుచ్చెర్లపాడు గ్రామంలో మరణించారు. వారి సమాధులిప్పటికీ అక్కడున్నాయి కటార్లపల్లిలో వేమన సజీవంగా సమాధిగతుడైనాడు.

కాని కటార్లపల్లిలోని ధర్మకర్త చెన్నరాయని వద్ద ఉన్న తాటాకుల గ్రంథం వలన ఈ వేమన మన వేమన కాడని తెలుస్తున్నది ఆంధ్రసాహిత్య పరిషత్తులో ఉన్న "వేమన యోగి ద్విపద చరిత్రం" అనే తాళపత్ర గ్రంథమూ ఇదీ ఒకటే అందులోని కొన్ని వాక్యాలు ఈ కింది విధంగా ఉన్నాయి [43]

"ఇతడు శ్రీహరి పుత్రుడితడు పావనుడు। మున్ను వేమన
పరమ ముఖుడైనాడు। అతడె యితడని పల్కి ఆశ్చర్యమంది।
మంత్రాక్షతంబుల మహిమల చేబట్టి। వేమనార్యుని మీద
వెదజల్లిరంత......"

ఇది చరిత్ర కాదు వాడుక కథల పుట్ట ఇందులో నల్లచెరువు చెన్నయ్య చెప్పిన కథ లేదు దీనిప్రకారం శ్రీ వైకుంఠంలో చెన్నకేశవులు, ఆదిలక్ష్మి వేమన్నను పిలిచి భూలోకంలో అవతరించమన్నారు ఇతనితండ్రి తుంగవంశపు కేశవుడు తల్లి లక్ష్మమ్మ (అచ్చమ్మ) కేశవ నారాయణులు తమ్ములు మార్కాపురం చెన్నకేశవ స్వామికి భక్తులు తర్వాత వీరు కదిరి దగ్గరి రేపల్లెకి వచ్చారు ఇదే ఇప్పుడు పాత రేపల్లె; పాతర్లపల్లె అని వ్యవహరించబడుతున్నది వేమన పుట్టినదిక్కడే అందరికి తత్త్వబోధ చేస్తూ కటార్లపల్లెలోనే ఉన్నాడు

నల్ల చెరువు కథను కటార్లపల్లెవారు వేమన కొండవీటి సంబంధాన్ని మినహాయించి అంగీకరించారు తుంగ వేమనకు కొండవీటితో ఎటువంటి సంబంధం లేదు, వేమన పేర వచ్చే 'వర్థాన' (ని) నాదులు, గౌరవ మర్యాదల కొరకు వేమనకు కొండవీటి నంటగట్టినాయని, తుంగ వేమన వంశానికి చెందిన చెన్నరాయుడు విప్పిచెప్పి తన

---

43. ఆంధ్ర సాహిత్య పరిషత్తులో నాకిది లభ్యం కాకపోవడమంత దురదృష్టం మరొకటి లేదు నాటి ఆంధ్రసాహిత్య పరిషత్తును స్టేట్ ఆర్కైవ్స్ వారు స్వాధీనపరచుకొని కాకినాడలో 'రిసెర్చి ఇన్‌స్టిట్యూట్' అనే పేరుతో నిర్వహిస్తున్నారు "వేమన యోగి చరిత్ర" కేటలాగులో ఉంది కాని స్టేట్ఆర్కైవ్స్ వారికి అప్పగించినట్లు స్టాక్ రిజిస్టర్‌లో లేదు మధ్యలో దీనిని ఎవరు తస్కరించారో ఎవరికీ పట్టని విషయం

నిజాయితీని చాటుకొన్నాడు కాని 'మన వేమన'కు కొండవీటితో ఉన్న సంబంధాన్ని వీరు నమ్ముతున్నారు.

తుంగ వేమన మన వేమన కాదనడానికి మరొక సాక్ష్యం తాటాకుల పుస్తకంలోనే ఉంది అందులోని ఆటవెలది పద్యాలకు మకుటం "బాలచక్రవేమ భవ్యనామ" అని ఉంది "పరన రామ, బౌద్ధరామ" అని పాఠాంతరాలు కొన్ని అసలు వేమన పద్యాలే పై మకుటంతో ఉన్నాయి ఇందలి పద్యాలు వేమన ఫక్కీలోనే తుంగ వేమన వ్రాశాడు. కొన్ని పద్యాల మకుటం మాత్రం మార్చి యధాతథంగా దించుకొన్నాడు మచ్చుకు రెండు.

*1. "ఆది త్రిమూర్తులు ఆత్మలో నున్నారు*
*బంధించి తెలిపితే బైటపడును,*
*హృదయ మందు గురుని వుండ జూడగ లేదు*
*బాలచక్రవేమ భవ్యనామ."*

*2 "యాత్ర బోయిన వాడు యెన్నాళ్ళు తిరిగినా*
*పారమైన ముక్తి పదవి లేదు*
*మనసు నిల్చినవాడు మహనీయ మూర్తిరా*
*బాలచక్రవేమ భవ్యనామ "*

పై పద్యాలు బ్రౌన్‌ప్రతులలో కనిపించవు వావిళ్ళ ప్రతిలో ఒకటి బందరు ప్రతిలో రెండు కన్పిస్తున్నాయి ఈ తాటాకుల గ్రంథం నుండి పూర్ణయాచారి కూడ పద్యాలను యేరుకున్నాడని తెలుస్తున్నది

తుంగ వేమన జన్మ తేదీని తెలిపే పద్యమొకటి ఈ గ్రంథంలో ఉంది వేమన శా శ 1602వ శార్వరి సంవత్సరంలో (ఎ డి 1780) జన్మించాడు విచిత్రంగా మన వేమన మరణ కాలంగా ప్రచారంలో ఉన్న తేదీ కూడ ఇదే కాని ఈ తేదీలను నమ్మడానికి మనకెటువంటి ఆధారాలు లేవు అదీగాక నిన్న మొన్న వేమన పద్యాలను ముద్రించినవారి వ్రాతలే ఇవి

తుంగ వేమనేకాక ఇటువంటి **'స్వోద్ఘాటిత'** (Self-styled) వేమన్నలు ఇంకా చాలామంది ఉండి ఉండవచ్చును అప్పటికే ప్రసిద్ధికెక్కిన వేమన్న పద్యచట్రాన్నీ, మూసలను ఉపయోగించుకొని తమ భావాలను ప్రచారం చేసుకోదలచినవారు కావచ్చును దీనివలన ప్రక్షిప్తాలతో పెరిగిపోయిన వేమన సంప్రదాయ మొకటి ఏర్పడి ఉంటుంది

రాయలసీమలో వేమన మఠాలు అనేకమున్నట్టు జనశ్రుతి ఉన్నది, కాని కటారుపల్లె సమాధి తప్ప మిగిలిన వాటి గురించి వినపడడం లేదు అయితే పది పదిహేనేండ్ల క్రితం వరకు 'వేమనవారు' అనే ఘరానా భిక్షుకులు ఊర్లలోకి జాతరగా వచ్చేవారు ఖడ్గధారులై, బక్క గుఱ్ఱాలెక్కి వచ్చేవారట! భిక్షకులుగా మారని పూర్వకాలంలో వీళ్ళంతా వేమన్నవలెనే మతం తిరుగుబాటుదార్లేమో! వేమన్నలాగే పద్యాలుచెప్తూ ఊరూరు తిరుగుతుండేవారేమో! కాలక్రమాన వేమన పద్యాల 'వేడి' తగ్గి వేమన్న పేరు చెప్పుకుని భిక్షకుల స్థాయికి దిగజారి ఉంటారు

"వేమననగ యోగి వెలసె లోకములోన" వంటి పద్యాలు వీరు చెప్పినవే అయిఉంటాయి. ఈ ఊహలను ఆధారాలతో నిరూపించాలంటే రాయలసీమలో విస్తృతంగా సంచారాలు చేసి, ప్రత్యేకంగా పరిశోధించవలసిన అవసరం కనిపిస్తున్నది.

## 3.2 అవతారికల్లో వేమన

ఆంధ్ర కవుల చరిత్రను తెలుసుకోవడానికి కావ్యావతారికలు ప్రధానమైనవి. అవయినా కవులు తమను పోషించిన ప్రభువులను ప్రశంసిస్తూ ప్రసంగవశాన చెప్పినవే. కాబట్టి అవతారికలలో మనకు లభించే చరిత్ర శకలప్రాయమైనది ఆ ముక్కలను ఏరి ఒకచోట పేరిస్తే ఏర్పడే మూర్తి యొక్క బాహ్యారేఖలు అస్పష్టంగా ఉన్న అసంపూర్ణ చిత్రమే అవుతుంది

వేమన వంటి ఆశుకవిని, పామర భాషలో ఊరూరా పద్యాలు వెదజల్లుతూ తిరిగే దేశ ద్రిమ్మరి కవిని, సలక్షణమైన భాషలో ఒక్క కావ్యమైనా వ్రాయని ముక్తక కవిని మనం అవతారికలలో వెతకడం మృగతృష్ణలవెంట పరుగులు తీసినట్టవుతుందేమోనని అనుమానం కాని కావ్యకవులలో కూడ ఏ సహృదయ శేఖరుడో వేమన్నను పేర్కొని ఉండడా అనే ఆశ పరిశోధకునికి ఎప్పుడూ చావదు. ఇటువంటి ఆశావాదంతోనే వంగూరి సుబ్బారావుగారు అవతారికలను మొట్టమొదటిసారిగా త్రవ్వి కొన్ని సత్యాలను వెలికి తీశారు ఆయన పరిశ్రమ అపారమే అయినా దాని ఫలితాలలోని "చౌక్కాపుతనాన్ని" గీసి చూచుకోవలసి ఉంది

1. కృష్ణరాయని కాలం వాడైన యెఱ్ఱాప్రెగడ తన మల్హణ చరిత్ర కావ్యాదిలో పూర్వకవులతోపాటు వేమన్నను పేర్కొన్నాడు 44

   "వినుతు లొనర్తు నాంధ్ర సుకవి ప్రభు నన్నయభట్టు తిక్కయ
   జ్వను, శివదేవు, భాస్కరుని, జక్కన, నాచన సోము సర్వదే
   వుని, భవదూరు, వేము, నలపోతన, బిల్లలమఱ్ఱి వీరభ
   ద్రుని, శరభాంకు, వీరకవి, ధూర్జటి, గేతన, భట్టబాణునిన్"

ఇందులో శైవకవులసంఖ్య ఎక్కువ కృష్ణరాయని కాలంవాడైన యెఱ్ఱాప్రెగ్గడ పేర్కొన్నాడు కాబట్టి వేమన్న కృష్ణరాయలకు పూర్వుడై ఉంటాడని 1386-1505ల మధ్యవాడుగా చెప్పవచ్చునని వంగూరి వారి అభిప్రాయం కాని బండారు తమ్మయ్యగారు దానిని సయుక్తికంగా ఖండించారు 45 కృష్ణరాయల కాలంనాటి ధూర్జటిని కూడ పూర్వకవులలో చేర్చడంవలన ఈ కృష్ణరాయలు శ్రీకృష్ణదేవరాయలు కాకపోవచ్చును వంగూరివారు తలచినట్లు "భవదూరు" అన్నది వేమనకు విశేషణం కాదు అవి రెండూ వ్యస్తపదాలే పై పద్యంలోని వేమన మన వేమన కాదు శివకవుల సరసన పేర్కొనబడ్డాడు కాబట్టి మరెవరో చరిత్రకెక్కని శివకవి కావచ్చు

2 లక్ష్మణకవి రచించిన 'కంచి యేకామ్ర లింగశతకం.' ఈ కవి కౌండిన్య గోత్ర నిమ్మల వెంకటార్య సుతుడు

---

44. వేమన యోగీంద్ర చరిత్ర - పుట 33
45 వేమన కాల నిర్ణయం - బంత, ఆంధ్రపత్రిక, ఏప్రిల్, 1924

సీ. వ్యాస వాల్మీకుల వర్ణించి యాకాళి
దాసుల నెమ్మది దలచి(న)న్న
వరుస తిక్కన మంత్రి యధిపుల గొనియాడి
భీమ వేమానంత బిరుదు కవులు
బడబార్య, పెద్దన్న, బాణ, యాజిన దేవ
సత్కవీంద్రుల నెల్ల సన్నుతించి
నేనేర్చు విధమున నీ యంకితంబుగా
చెప్పెద శతకంబు చిత్తగింపు
గీ. పరమ పావన చారిత్ర ఫాలనేత్ర
విషమకర శరభంగ వృష తురంగ
యోగి హృత్సంగ బాల చంద్రోత్తమాంగ
అంబికార్ధాంగ కంచి యేకామ్రలింగ.

'వేములవాడ భీమకవి బిరుదు (ఉద్దండ) కవులలో జేరినవాడని ఈ పద్యమువలన వ్యక్తమౌతున్నది' అని బండారు తమ్మయ్య గారన్నారు[46] కాబట్టి ఇతడు మన వేమన కాకపోవచ్చు కాని భీమకవి వంటి పాండిత్యం లేకపోయినా, పలువురిని పద్యాలలో తిట్టడంలో ఇద్దరికీ సామ్యమున్నది అయినా దీనివలన వేమన బిరుదకవి అవుతాడా?

3 పింగళి యెల్లనార్యుని 'తోభ్య చరిత్రము':

సీ. భక్తిమై రేణుక ప్రమథోత్తము నుతించి
మాయ దేవాహ్వయు మహిమ పొగడి
చెలగి యథా వాక్యముల నన్నమయగారి
భజియించి మొక్కిడి పాలకురికి
సోమన్నగారి ప్రస్తుతి చేసి ప్రియమంది
శివదేవ ముఖ నవకవుల నెంచి
గణపతి దేవుని ఘనత సన్నుతి చేసి
వేమన గీర్తించి విమల మతిని
గీ వ్యాస వాల్మీకి కాళిదాసాది ఘనుల
నన్నపార్యుని దిక్కను యజ్వ నెర్ర
ప్రెగడ ధూర్జటి బోతన భీమ కవిని
చెలగి శ్రీనాథ ముఖ కవిశ్రేణి దలచి.

యెల్లనార్యుడు క్రీశ 1590-1620 ప్రాంతం వాడని కవుల చరిత్ర చెప్తున్నది పై పద్యంలో మొదటి నాలుగు సీసపాదాలలో పేర్కొనబడిన వారెవరూ కవులు కారు శైవ మతోద్ధారకులు, వీరితోపాటు మన వేమన పేర్కొనబడతాడా అని తమ్మయ్యగారి సందేహం[47] గీతంలో కూడ మొదటిపాదంలో సంస్కృత కవులు, మిగిలిన వాటిలోనే ఆంధ్ర కవులు ఉన్నారు పై పద్యంలోని వేమన మనవాడు కాదు అని బండారువారి వాదం

46. వేమన కాలనిర్ణయం
47. వేమన కాల నిర్ణయం

4. అన్యవాద కోలాహల కర్త శివయోగీంద్రుని పద్యం·

సీ. బసవయ్య నాచన్న బసవయ్య నిజలింగ
చిక్కయ్య కక్కయ్య చిత్తగించి
మాచయ్య సవరద నాచయ్య కవికేత
బ్రహ్మయ్య బొమ్మయ్య బ్రస్తుతించి
వేమయ్య నేకాంత రామయ్య బల్లేషు
మల్లయ్య నల్లయ్య మది భజించి
హొన్నయ్య మేదర చన్నయ్య శివరాత్రి
సంగయ్య వంకయ్య సన్నుతించి

గీ. కోరి యన్యవాద కోలాహలంబను
సీస శతక మింపు జిగురు లొత్త
నే నుపన్యసింతు నే కార్చు గురు చిత్త
నలిన భృంగ సోమనాథ లింగ.

శివయోగీంద్రుడు 15, 16 శతాబ్దాల వాడని కొందరు చెప్పినట్టు వ్రాశారు. కాని ఈ వేమన్న శివభక్తులలోని వాడు కావచ్చునని వంగూరివారే అభిప్రాయపడ్డారు. అన్యవాద కోలాహలకర్త శివయోగీంద్రుడే అనడానికి ఆధారాలు లేవని బండారు తమ్మయ్యగారు తమ పరిశోధన ద్వారా తేల్చారు[48] పై పద్యంలోని వేమన బసవ పురాణాది గ్రంథాలలో వర్ణించబడిన వీరశైవులలో ఒకడు కావచ్చు ఇతడు చేటల వేమన్న కావచ్చునని తమ్మయ్యగారు తలచారు.

5 తురగా రామకవి 'నాగర ఖండము'

సీ ప్రాచేతసు, బరాశర కుమారు, గాళిదా
సు, మయూరు, భవభూతి, జోరు, దండి,
బాణు, ధనంజయు, భారవి, జయదేవు,
భాసుని, శ్రీహర్షు, బ్రవరసేను
మల్లణు, బిల్హణు, మాఘు, మురారిని
క్షేమేంద్రు, వటమూలు, సోమనాథు,
శివతత్త్వు, శివదేవు, జిన్నయు, భవదూరు,
శరభాంకు, రాజశేఖరుని, వేము,

గీ నన్నపను, దిక్కమఖి, ప్రబంధ పరమేశు
సాధు నాథర్వణాచార్యు [!] జంద్రమౌళి
భాస్కరును నలరు శ్రీనాథ భట్టు, భీము,
సోము, నమరేంద్రు దలతు నుత్సుకనాత్మ

పై నాలుగు సీసపాదాలలోనివారందరూ సంస్కృతకవులే శైవకవులు వారి సరసన పొగడబడిన వేమన మన వేమన్న కాదని బండారు తమ్మయ్యగారి అభిప్రాయం[49]

48. పిడుమర్తి సోమనాథ కవి అన్యవాద కోలాహల కర్తయా? అనే వ్యాసం సారస్వతానుబంధంలో వారే వ్రాసినారట!

49 వేమన కాలనిర్ణయం

ఆంధ్రకవులప్రసక్తి ఎత్తుగీతిలోని ఉత్తరార్ధంలోనే ఉన్నది బహుశ ఇందులోని వేముడు పండితారాధ్య చరిత్రలో వర్ణించబడిన బెలిదేవరవేమనారాధ్యుడేమోనని తమ్మయ్యగారు ఊహించారు వీరేకాక ప్రసన్నాంజనేయశతకకర్త కాక మిగిలిన ముగ్గురు ప్రసిద్ధులు కాకపోవడంవల్ల వారి కాలం తెలియదు.[50] వేమన్న కాలాన్నిబట్టే వారి కాలం నిర్ణయించాలని వంగూరి వాదన పై అవతారికల ఆధారంగా వంగూరి వారు

**"అందువలన వేమన్న క్రీ.శ. 1500 మొదలు పూర్వ కవులలో జేరి స్తుతినొందుచున్నాడు. కావున స్థూలముగా 1400-1500 నడుమవాడని నిర్ణయమైనది"**[51] అని వ్రాసినారు కాని పూర్వకవి స్తుతులలోని వేమన మన వేమన కాడని బండారు తమ్మయ్యగారు భావించారు పైగా పూర్వకవులు మన వేమనను పేర్కొన్నారనడానికి అవకాశాలు తక్కువ పూర్వులు వేమనను యోగిగానే భావించారుకాని కవిగా ఆదరించలేదు

## 3.3 నందన సంవత్సర పద్యం

నందన సంవత్సరమా
నందిత కార్తీక శుద్ధ పున్నమ నాడే
వింద్యాద్రి సేతు బంధన
సందున నొక వీరుడేలు చాటర వేమా[52] (డి 1723, 536)

పై పద్యాన్ని గూర్చి మొట్టమొదటిసారి బ్రౌన్ ప్రస్తావించాడు వేమన జన్మించిన తేదీ ఈ పద్యంలో ఉన్నదనీ కాని అది అస్పష్టంగా ఉన్నదనీ బ్రౌన్ వ్రాశాడు[53] ఈ పద్యంలో ఒకానొక తిథిని సూచించడానికి కావలసిన సాధనాలు అన్నీ ఉండి ముఖ్యమైన 'వారం' లేకపోవడం వలన పరిస్థితి అన్నీ ఉండి అల్లుని నోట్లో శనికూడ ఉన్నట్టయినది నందన సంవత్సరం 60 ఏళ్ళకొకసారి వస్తుంది కాబట్టి ఇది ఏ నందన సంవత్సరమో తెలుసుకునే అవకాశం లేదు ఎ డి 1772; ఎ డి 1712; ఎ డి 1652 లలో చివరిదే వేమన కాలంగా కనిపిస్తున్నదని మ్యాక్‌డొనాల్డ్ అభిప్రాయపడ్డాడు వంగూరి సుబ్బారావు గారు తమ వాదన కనుకూలంగా 1412, 1472 లు కూడ నందన సంవత్సరాలే కాబట్టి వేమన క్రీ శ 1412 ననే పుట్టి ఉంటాడని తీర్మానం చేశారు[54] కాని వంగూరివారి కాలం సయుక్తికంగా ఖండించబడింది మ్యాక్‌డొనాల్డ్ నమ్మిన **ఎ.డి.1652 కాలాన్నే** అనేకులు **ఆమోదించారు.** ప్రాచీనప్రతి వయస్సునుబట్టి ఊహించిన కాలం కూడ దీనితో ఏకీభవిస్తున్నది

---

50 మంగళము యోగి వేమన్న గురుడెరుంగు!

51 వేమన - పుట 38

52 పాఠాంతరాలు - సంవత్సరమున పొందుగ కార్తిక శుద్ధపున్నమనాడు సరసున వేమా డి 1725-52 పున్నమ నెలలో విన్ద్యాద్రి సేతు మధ్యము, సందొక్కడు మేలుననుచు డి 1769, 822

53 It is said that in verse 707 he has fixed the date of birth which is believed to have been his own This date coincides with A D 1652 The date is given in the cycle of sixty years, but which cycle is intened is unknown (1824)

54 వేమన, పుట 39

అధిక సంఖ్యాకులు చెప్పిన కాలంతో ఇది సరిపోతున్నా నాకీ పద్యం వేమనదేనని తోచడం లేదు. ముఖ్యమైనకారణం వేమన్న బాణీలో ఈ పద్యం లేకపోవడమే 'సందున' అనే పెలుసుమాట ఉన్నది అంటేనే అది వేమన్నదన్న మాట అని రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు వ్రాశారు. కాని సూటిదనానికి, స్పష్టతకు పేరుబడ్డ వేమన ఇటువంటి అసంపూర్ణ పద్యరచన చేస్తాడా అనిపిస్తున్నది. ఈ పద్యం బందరు (2151) వావిళ్ళ ప్రతులలో (2717) ఉన్నా ప్రాచీన ప్రతిలో లేదు. తంజావూరులోని ఐదుప్రతులలోనూ లేదు. కాకినాడ ప్రతులేడింటిలో మూడింటిలో మాత్రమే ఉంది. ఈ పద్యం మధ్యకాలంలో పుట్టిందై ఉంటుందని చెప్పవచ్చు

## 3.4 అన్యదేశ్యాలు

స్వభాషలోనికి అన్యదేశ్యాల ప్రవేశాన్ని ఎవ్వరూ ఆపలేరు. ప్రజల నిత్య వ్యవహారంలో ఉన్న జీవభాషతో గాఢపరిచయం ఉన్న వేమనలాంటి వారి కవిత్వంలో అవి పిలువని పేరంటంలా బిలబిలమంటూ వచ్చి చేరుతాయి. అప్రయత్నంగా వాడిన ఈ మాటలే భవిష్యత్తులో చరిత్ర శకలాలౌతాయని వేమన ఊహించి ఉండడు

1600లో విజయనగర పతనం మహమ్మదీయప్రాభవానికి నాంది పలికింది ముసల్మానుల నీడలు క్రమంగా తెలుగువారిపై పాకుతూ స్థానికుల జీవన విధానాన్ని ఎట్లా ప్రభావితం చేశాయో 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో సురవరం ప్రతాపరెడ్డిగారు సోపపత్తికంగా వర్ణించారు [55] ఆనాటి కవుల కావ్యాలలో పార్సీ పదాలు మిళితమైనాయి ఆ కాలంలో మహమ్మదీయులు హిందువులపై జరిపిన ఘోరాలన్నింటిని అప్పటి కవులు ముఖ్యంగా శతకకవులు మిక్కిలి ఆవేశంతో, ఆవేదనతో వర్ణించారు [56] వారి పద్యాలలో కైజారు, సలాం, తాజీము, నమాజు వంటి పార్సీ పదాలెన్నింటినో ధారాళంగా దొర్లించారు ఇక ప్రజలలో ఒకడై సంచరించిన వేమన్న కవితలో ఎట్లా ప్రవేశించకుండా ఉంటాయి? తురకల ప్రసక్తి వచ్చినప్పుడు వేమన్న శివమెత్తినట్టు తిట్టాడు అసలు అతనికి మత విషయంలో స్వపర భేదం ఉండదు. దేశీయమతాలైన శైవ వైష్ణవాలను కూడా చెండాడడానికి ఆయన వెనుదీయలేదు ముస్లిం మత వ్యాప్తిని గురించిన ఈ పద్యం చూడండి

1 పసరపు నంజుడు బెట్టియు
మసలక సులతాను ముసలిమానుల జేసెన్
శశిముఖుల అధర మాంసము
కుసుమాస్త్రుడు బెట్టి చెరిచె కులజుల వేమా[57,58]

55 ఆంధ్రుల సాంఘిక చరిత్ర, ("క్రీ శ 1600 నుండి 1757 వరకు") పుటలు - 385, 409
56 గోగులపాటి కూర్మనాథుడు- వెంకటాద్వరి, వల్లా పేరకవి
57. పాఠాంతరాలు - పసరపు మాంసము - శశివదన అదర కులమున - డి 1725,153
58 'పై నాలుగు పద్యాలు (వాటిలో ఇదొకటి) వేమనవి గావని నా అనుమానం' అని సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాశారు

2\. మక్కాకు పోనేల మరి తిరిగి రానేల
యేకమైన కర్తయెందు లేడో
అన్నిట పరిపూర్ణుడల్లా మహమ్మదు విశ్వ[59] (డి.1723, 732)

3\. కూలినాలి జేసి గుల్లాపు పని జేసి
తెచ్చిపెట్ట యాలు మెచ్చనేర్చు
లేమ జిక్క విభుని వేమారు దిట్టును[60] (డి 1721, 59)

పదిహేడవ శతాబ్దంలోనే ముసల్మానుపాలన కొనఊపిరి దశకు వచ్చింది 1707లో ఔరంగజేబుమృతితో అంతఃకలహాలు పెచ్చుపెరిగి సామంతులు స్వతంత్రులైనారు. దక్షిణాన మొగలుల ప్రభావం చాలావరకు క్షీణించింది. 1757లో ప్లాసీ యుద్ధంతో మొగలురాజ్య చరిత్ర పూర్తిగా రూపుమాసిపోయింది ముస్లింల పతనావస్థను సూచిస్తూ వేమన పద్యాలలో ఒక పద్యం లభిస్తున్నది

రాళ్ళు నమ్మియున్న రాజాధి రాజులు
కూటి కెడలి భువిని కూలి చనిరి
రాళ్ళు పగులగొట్టి రాక్షస పుత్రులు
మాళ్ళు నూళ్ళు కలిగి మనిరి వేమ. (డి 1773, Vol III, 1205)

ఈ పద్యాన్ని అనువదిస్తూ చివర, బ్రౌన్ చేసిన వ్యాఖ్యానమిట్లున్నది·

"This is evidently airred at Mahammudan Government, estate is here mahal, the persian word" (728) "Verses of Vemana"

'మహల్ (లు)' అనే పర్షియా పదం వేమన్న నోటిలో 'మాళ్లు' అయింది 'రాక్షసపుత్రులు' అనేది 'సైతాన్‌కే బచ్చే' అనే వాడుకకు అనువాదమేమో!

కాని మన దురదృష్టమేమోగాని వేమనపద్యాలలోని చరిత్రను తెలిపే కీలకమైన పద్యాలేవీ నిర్వివాదాస్పదంగా ఉండవు వేమన్న చెప్పిన ఆటవెలదులలోని ధారాళమైన నడక వీటికి ఉండదు అవి తరచుగా కందాలో లేక 'వేమ' అనే లఘుమకుటంతో ఉన్న నాలుగు పాదాల ఆటవెలదులో అయిఉంటాయి వీటిలోని వేమన్న శైలి కూడ అనుమానాస్పదంగా ఉంటుంది అంతేకాకుండా పై పద్యాలు చాలప్రతులలో కనిపించవు తంజావూరు ప్రతులలో అసలుకే మృగ్యం ప్రాచీన ప్రతిలో కూడా ఒకటి రెండు మాత్రమే కనిపిస్తున్నాయి

ఏది ఏమైనా వేమనపద్యాలలో పర్షియాపదజాలం ప్రవేశించింది అనడానికి ఆటంకాలు లేవు కాబట్టి మహమ్మదీయులు ఆంధ్రదేశాన్ని పాలించిన రోజులలో లేదా ప్రవేశించిన రోజులలో వేమన్న ఉన్నాడు సురవరం ప్రతాపరెడ్డిగారు వ్రాసినట్లు 1600–1752 మధ్య ఎక్కడో ఉన్నాడు కాబట్టి అనేకులు తలచినట్టు వేమన 1650 ప్రాంతం వాడని చెప్పడానికి వెనుదీయవలసిన పనిలేదు ప్రాచీనప్రతి కాలం దీనినే సమర్థిస్తున్నది

---

59\. పాఠాంతరం – మళ్ళితా రానే – కర్తడిందులేడో, అంతట పూర్ణుండు – డి 1725, 356

60 పాఠాంతరాలు – గుల్లాపు పా.. పెట్టనేని చిక్కుబడిన నాడు చీకాకు పడకురా – డి 1723, 387, కూలినాలిజేసి గుళ్ళ [illegible], తెచ్చిపెట్టితె మెచ్చుదేవురాలు, జిక్కుబట్ట వెనక చీయని రోయునో – డి 17[illegible], 671, [illegible] 1735, 387

## 3.5 చారిత్రక వ్యక్తుల ప్రసక్తి

**రాయని భాస్కరుడు:**

పరగ రాయని కుల బాచని ధనమెల్ల
భటులపాలు, కవులపాలు తలుప
నొనర హీన జనుని ధనము దాయాదుల
పాలు జారకాంత పాలు వేమ[61]

**గుంటుపల్లి ముత్తన్న:**

ప్రాకటముగ నిట్టి లోకములో గుంటి
పల్లె ముత్తుడెన్న పరమ గుణుడు
యన్నదానమునను, హరు పూజ చేతను,
హరుని లోన గలిసె యరుదు వేమ.[62] (డి 1721,399)

వేమన కాలాన్ని గూర్చి అత్యమిత పరిశ్రమ చేసి కూలంకషంగా చర్చ గావించిన వారిలో ముఖ్యులు వేటూరి ప్రభాకర శాస్త్రి, బండారు తమ్మయ్యగార్లు సత్యాన్వేషణమార్గంలో వారు చేసిన వాదోపవాదాలు ఒక దశలో వ్యంగ్య స్పర్శను సంతరించుకున్నా మరెన్నో అవాంతర సత్యాలను చరిత్ర పొరలను త్రవ్వి వెలికితీయడంలో కృతకృత్యులైనారు వారి చర్చలలో ప్రధాన పాత్ర వహించినవి పైరెండుపద్యాలే వేమనవంటి వాని కవిత్వంలోని అంతరంగ సాక్ష్యాలపై ఆధారపడడంలో ఎదురయ్యే అవాంతరాలు, భ్రమప్రమాదాలు ఎటువంటివో ఈ చర్చను గమనిస్తే తెలుస్తుంది

---

61. పాఠాంతరాలు - 1 రాయని కులు వాచన్న దనమెల్ల (డి 1762-4-48)
 2 పరగరాయన మంత్రి బాచన్న దనమెల్ల
 భటకరి (?) యాచకపరుల పాలు,
 పరగ ప్రబంధ కవి పాలు, దాయాదుల
 పాలు జారస్త్రీల పాలు వేమ (డి 1733,998)
 పరగ రాజకులులు పాతిన ధనమెల్ల
 భటుల పాలో, కవుల పాలో తలుప
 నొనర హీన జనుని ధనము దాయాదుల
 పాలో, జారకాంత పాలో వేమ - వావిళ్ళ 2579, బందరు ప్రతి 2422

62 పాఠాంతరాలు
 1 ప్రాకటముగ నింత లోకమందున గుంటి
 పల్లె ముత్తుడెన్న పరమ గుణుడు
 అన్నదానమునను హరిపూజ చేతను,
 హరునిలోని గలిమి కతడె వేమ - 1640 వావిళ్ళ ప్రతి, 2639 బందరుప్రతి
 ప్రాచీన ప్రతిలో లేదు

పై రెండు పద్యాలలో ఇద్దరు చారిత్రక వ్యక్తులు ప్రశంసించబడ్డారు. 1. రాయని భాస్కరుడు, 2 గుంటుపల్లి ముత్తనామాత్యుడు. 'రాయని బాచన్న' అనేది రాయని భాస్కరునికి భట్టుకవులు పెట్టిన ముద్దుపేరు రాయని భాస్కరుని వేమన ప్రశంసించాడు. కాబట్టి అతడు జీవించిన కాలం ఆధారంగా వేమన్న ఎప్పటివాడో ఊహించడానికి వీలు కలుగుతుంది కాని పరిష్కారాలు ఇంతటి అనాయాసజనితాలైతే ఇక సమస్య లేమున్నాయి? రాయని భాస్కరుడు ఒక్కడు కాదు - అనేక రాయని భాస్కరులున్నారని వంగూరి సుబ్బారావుగారు కందిరీగల తెట్టెను కదిలించారు. రాయని భాస్కరుని చరిత్రను వ్రాసిన గుంటుపల్లి సోమయ్యగారు ఎవరెవరికాలంలో రాయని భాస్కరులున్నారో ఆ రాజులపట్టికను ఇచ్చారు 1 కాటయవేముడు, 2 ప్రౌఢ దేవరాయలు, 3. కృష్ణదేవ రాయలు, 4 పురుషోత్తమ గజపతి, 5. మంత్రి మానాటి కట్టుబాట్లు చేసిన రాయని భాస్కరుడు

కాని బండారు తమ్మయ్యగారు తొణకకుండా మన వేమన్న పొగడినది భాస్కరుని దాతృత్వాన్ని కాబట్టి దానధర్మాలకు పేరుపడిన వాడే ఈ రాయని భాస్కరుడని, అతనికొరకే అన్వేషించవలసి ఉన్నదని అభిప్రాయపడ్డారు.63 చాటువు వలన ఒక రాయని భాస్కరుడు కాటయ వేమారెడ్డి (1380, 1400) వద్ద మంత్రి పదవిని నిర్వహించాడని తెలుస్తున్నది

*కలికి పసిండి గంటమున* **గాటయ వేము** *సమక్షమందు స*
*త్ఫలముగ రాయని ప్రభుని* **బాచడు** *వ్రాసిన వ్రాల మోతలున్*
*ఘలు ఘలు ఘల్లు ఘల్లు మన గంటక మంత్రుల గుండెలన్నియున్*
*ఝలు ఝలు ఝల్లు ఝల్లు మనె సత్కవివర్యులు మేలు మేలనన్*

శ్రీనాథుడు కూడ లేబ్రాయంలో ఇతని ఆశ్రయంలో ఉండి ఉండవచ్చునని దానికాయన చాటువే ఆధారమని బండారు తమ్మయ్యగారు వ్రాశారు 64

*సీ కాశికా విశ్వేశు గలిసె వీరారెడ్డి*
*రత్నాంబరంబు లేరాయడిచ్చు,*

*గీ భాస్కరుడు మున్నె దేవుని పాలికరిగె*

1386 లోని ఈ భాస్కరుడే రాయని భాస్కరుడైతే ఇతడు కృష్ణరాయలకు నూరుసంవత్సరాలు పూర్వుడు అవుతాడు వేమన్న ఈ భాస్కరుడిచే పొగిడాడా అనేది ప్రశ్న ఎందుకంటే కృష్ణరాయల అనంతరం 1516లో ఒక రాయనిభాస్కరుడు, 1529లో మరొక రాయని భాస్కరుడు ఉన్నారని వంగూరి సుబ్బారావుగారు వ్రాశారు 65 కాబట్టి వేమన కృష్ణదేవరాయలకు పూర్వుడని తేలితే గాని వేమన ఆయనను పొగిడినట్లు కాదు కృష్ణరాయలకు పూర్వుడని నిరూపించడానికి అవతారికలలోని పద్యాల ఆధారంగా వంగూరి సుబ్బారావుగారు కొంత నిష్ఫల ప్రయత్నం చేశారు

63 వేమన కాలనిర్ణయం, బండారు తమ్మయ్య - ఆంధ్రపత్రిక, ఏప్రిల్, 1924
64 వేమన చరిత్ర, పేజీ, 66
65 వేమన, పేజీ 32

కాని మొదటి నుండి బండారు తమ్మయ్యగారికి వేమనను అంత వెనుక కీడ్వడం ఇష్టంలేదు కాబట్టి రాయని భాస్కరుని పొగడడానికి వేమన అయనకు సమకాలం వాడు గాని, సమీపకాలంవాడు కాని కానక్కరలేదు. మహనీయుల కీర్తి కలకాలం నిలిచి ఉంటుంది కాబట్టి అనంతకాలం వారు కూడ వారిని ప్రశంసింప వచ్చునని వ్రాశారు.[66]

**"అన్నప్రదాతలు, నెఱదాతలు నగు పుణ్యాత్ములు స్థిర కీర్తులగుటచే నేకాలము లందును గీర్తింపబడుచునే యుందురు."**[67] తమ్మయ్యగారి ప్రకారం కొన్ని పద్యాలను బట్టి వేమన 1628 తర్వాతనే ఉన్నాడు

*"ప్రస్తుతంపు వేళ బద్యంబు చదివిన*
*దప్పులున్న మిగుల నొప్పియుండు*
*వెలది (పణతి) సురత వేళ బిత్తలై యుండదా"* (డి 1723, 181)
పాఠాంతరాలు *"భామపడక పట్ల బత్తలై యుండదా?"* (డి.1769, 401)

*"బిత్తరై యుండదా?"* (డి 1773 IV 1647)

ఈ పద్యం పండితరాయలు రచించిన ఈ క్రింది శ్లోకానికి అనువాదమట:

శ్లో॥ *అవసర పఠితా వాణీ గణగణ రహితాపి (?) వహతాపరమోదం*
*రతి సమయే యువతీనాం భూషాహీనిశ్చ భూషణం భవతి*

వేమన కాలాన్ని 1412-1440 దాకా నెట్టివేసిన వంగూరివారు, వేమన పద్యాన్నే పండితరాయలు అనుసరించాడని వ్రాశారు కాని దీనిని బండారు తమ్మయ్యగారు సయుక్తికంగా ఖండించారు పండితరాయలనే వేమన అనుసరించాడని వాదించారు మొత్తంమీద వేమన 1650 ప్రాంతంలో పుట్టి 1720 ప్రాంతంలో సిద్ధిపొందాడని బండారువారి వాదం[68] కాని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1650 ప్రాంతంలో సిద్ధిపొందాడని వ్రాశారు నిజానికి వీరిద్దరి నిర్ణయంలో పెద్దభేదంలేదు 60, 70 సంవత్సరాల వ్యత్యాసమే వారిద్దరి వాదోపవాదాల కవకాశ మిచ్చింది

అంతేకాక వేటూరి ప్రభాకరశాస్త్రిగారు గుంటుపల్లి ముత్తమంత్రి రాయని భాస్కరులు సమకాలికులు అనే వాదం లేవదీశారు ముత్తమంత్రి ఈ క్రింది చాటువు ప్రకారం శా॥శ 1545లో మృతి చెందాడు[69]

*'పొందుగ శరజలనిధి హరి*
*చందన తరు చంద్ర శక వర్షంబుల్*
*దుందుభి నాషాఢంబున*
*నందముగా వీరముత్తడరిగెన్ దివికిన్'*

ఈ చాటువే కాక శాసనాలు సన్నదులు మొదలైన అనేక సాధనాలు ముత్తని కాలాన్ని తెలుపుతున్నాయి ముత్తని కాలంలో ఒక రాయని భాస్కరుడున్నాడు ఇతడు

---

66 వేమన చరిత్ర, పేజీ 71
67 వేమన చరిత్ర, పుట 71
68 వేమన కాలము - ఆంధ్రపత్రిక, అక్షయ సం॥ అదికచైత్ర ఎం త
69 ఆంధ్రపత్రిక - క్రోదన చైత్ర మా॥ 1 వే ప్ర శాస్త్రి

మంత్రిమానాటి కట్టుబాట్లు మొదలైనవి కలిగించినవాడు 'రాయుని భాస్కరుని చరిత్ర' ప్రకారం 'అతనికొడుకే కొండమంత్రి. అతని మనుమడే రామలింగ భాస్కరుడు. ముత్తామాత్యుడును నీ రాయని భాస్కరుడును నందవర ద్విజులు, సన్నిహిత బంధువులు.'70 కాబట్టి వీరిద్దరిని పొగడిన వేమన క్రీ.శ 1400 కాలం వాడు కాదు క్రీ.శ 1623లో చనిపోయిన ముత్తని వర్ణించిన వేమన అదే కాలానికి చెందినవాడు కాబట్టి తమ్మయ్యగారు పేర్కొన్న కొండవీటి రాయని భాస్కరుని కాలం, చాటువులోని ముత్తమంత్రి మృతి కాలం వేరువేరు కాబట్టి భాస్కరుడు వేమన్న పొగడినవాడు కాడు మంత్రిమానాటి భాస్కరుడే మన భాస్కరుడు అముద్రిత ప్రతులలో ఇద్దరిని పొగడుతున్న పద్యాలు ఒక్కచోటనే ఉన్నవి పైగా ఒకే చాటుపద్యంలో ఇద్దరి పేర్లున్నాయి:

*కమలభవాండ భాండమున గల్గిన నందనవరంపు టిండ్లలో*
*బ్రముఖుడు రాయని ప్రభుని భాస్కరుడే నెఱదాత పిమ్మటన్*
*విమల గుణేషు గుంటుపలి వీరయముత్తడె దాత భట్ట సం*
*భ్రమ ఘన దాన రూఢి నొకపాటి వదాన్యులనెన్న నేటికిన్*

అయినా వేమన కొండవీటి భాస్కరునే పొగిడినాడని, వేమన తర్వాత వాడే అయినా ఆయన స్థిరకీర్తి కావడంవల్ల ప్రశంసించాడనే వాదాన్ని బండారు తమ్మయ్యగారు వదులుకోలేదు పైగా ముత్తమంత్రిని పేర్కొన్న వేమన పద్యాన్ని ఆయన సందేహించారు ఈ పద్యాన్ని నమ్మకపోవడానికి ఆధారాలు లేవని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వాదించారు

ఇక వేమన్న అనువదించాడన్న శ్లోకం పండితరాయలది కాదు పొమ్మన్నారు శాస్త్రిగారు ఆ శ్లోకం 'ప్రసంగ రత్నావళి'లో సుభాషిత పద్ధతిలో చెప్పబడింది 'ప్రసంగ రత్నావళి' 1388లో సంకలనం చేయబడింది కాబట్టి జగన్నాథునికి దానితో సంబంధం లేదని తమ్మయ్యగారి వాదాన్ని ఖండించారు

ముత్తమంత్రి ప్రాభవం వేమనకు తెలుసు ఆయన అనంతరం (1623) కూడ వేమన జీవించి ఉన్నాడు కాబట్టి 17వ శతాబ్ది పూర్వార్ధమందే వేమన ఉన్నాడు అతనిని తర్వాతకి తెచ్చే ఆధారాలు లేవు తంజావూరు లైబ్రరీలోని ప్రతులు కూడ చాలా పాతవి 150 యేండ్ల క్రిందటి (ఇప్పటికి దాదాపు 200 యేండ్ల) లైబ్రెరీ లిస్టులలోనే వేమన పద్యాల ప్రతులున్నాయి అవి అత్యంత శిథిలావస్థలో ఉన్నాయి కాబట్టి వేమన్నను మరీ సమీప కాలానికి లాగరాదు - ఇది వేటూరివారి వాదం

మరల ఆంధ్రపత్రిక అక్షయసంచికలో వేమన పొగడినది మంత్రి మానాటి భాస్కరుని కాదని తమ్మయ్యగారు వాదించారు 71 మంత్రి మానాటి కట్టుబాట్లొనర్చిన భాస్కరుని ప్రశస్తి వేరు వేమన పొగడింది దాత భాస్కరుణ్ణే మంత్రి మానాటి శాసనాలు మూడున్నాయి వాటిలో ముగ్గురు భాస్కరులు పేర్కొనబడ్డారు వారు ముగ్గురు ఒక్క భాస్కరుడే కావచ్చును కాని అతడు వేమన పొగడిన దాత కాడు 1516 ఎడి (శా.శ 1438)లో నాదెళ్ళ అప్పయ మంత్రి వశిష్ఠ గోత్రుడూ, విద్వాంసుడూ అయిన రాయని భాస్కరునికి భర్తపూడిగ్రామాన్ని అగ్రహారంగా ఇచ్చాడని శాసనంలో ఉంది ఇతడు

70 ఆంధ్రపత్రిక - క్రోదన చైత్ర మా॥ 1 వే.ప్ర.శాస్త్రి
71 ఆంధ్రపత్రిక - అక్షయ సంవత్సరం, అధికచైత్ర

మంత్రి మానాటి రాయని భాస్కరుడు కావచ్చు కాబట్టే 1623 నాటి ముత్తమంత్రికీ ఇతనికి భేదం నూరేండ్లు. రాయలు సమ్మానించినవాడు కావున రాయని భాస్కరుడని గురజాడ శ్రీరామమూర్తిగారు వ్రాశారు కాని రాయని కుమారుడు కాబట్టి రాయని భాస్కరుడని అర్థం

ఇంతా చర్చించి తమ్మయ్యగారు – **"మహాశయులారా! వేమన కాలనిర్ణయమునకు దగు మార్గము లన్నియు నయోమయములుగ నున్నవి. నా యభిప్రాయములు సరియైనవే యని నే చెప్పజాలను"**[72] అని ప్రకటిస్తే అది వేమన కాలవిషయంలోని జటిల్యాన్నే సూచిస్తున్నది కాని వారి కృషిలోపం కాదు అంతేకాక తమ్మయ్యగారు పై రెండు వేమనపద్యాలను ముఖ్యంగా ముత్తమంత్రి పద్యాన్ని మొదటి నుండీ సందేహదృక్కులతోనే చూశారు **"వేమన పద్యములను బట్టి యాతని కాలనిర్ణయ మొనర్చుట ప్రమాదరహితమైన మార్గము గాదని మునుముందే వ్రాసి, అయినను మారుదారి లేనందున నదియే శరణ్యమగుచున్నదని వేమన పద్యములను బట్టియే నా యొనర్చిన కాలనిర్ణయమును జేసి యుంటిని."**[73] పై రెండు పద్యాలు బ్రౌన్ సేకరణలు ఒకటి రెండింటిలోతప్ప లేవు మొదటిపద్యం ప్రాచీనప్రతిలో కనిపిస్తున్నది కాని రెండవది లేదు అదయినా గణ యతిభంగాలతో కుంటుతూ నడుస్తున్నది బందరు, వావిళ్ళ ప్రతులలో **"రాయనిబాచన"** ప్రసక్తిలేదు **"పరగ రాజకులులు పాతిన ధనమెల్ల"** అనే పాఠం ఎక్కడినుండి వచ్చి చేరిందో తెలియదు కొన్ని ముద్రిత ప్రతులలో రెండవ పద్యాన్ని **"లోకములో గంటిన్ - పల్లెముత్తడెన్న"** అని విరిచి ముద్రించబడినట్లు **'గుంటు'**కు బదులుగా **'గంటు'** అనే పాఠం కూడ కనిపించినట్లు వేటూరివారు వ్రాశారు

కాని మళ్లీ మొదటికి వచ్చి చూస్తే ఇది నిజంగా వేమనపద్యాలేనా అని అనుమానం కలుగకతప్పదు విషయాన్నిబట్టి చూస్తే ఎప్పుడో దానధర్మాలతో కీర్తిగడించిన బాచన్నను వేమన్న పొగిడినాడన్నది పొసగని సంగతి అసంఖ్యాకమైన వేమన్న పద్యాలను పరిశీలించి చూసినా అతడు సమకాలీన విషయాలను పట్టించుకున్నవాడే కాని ఎప్పటిదో గతాన్ని తవ్విన దాఖలాలు కానరావు తెగడినా, పొగడినా తన అనుభవానికి వచ్చిన సంఘటనలకే వేమన ప్రతిస్పందించినాడనేది సామాన్యంగా మనకు తట్టే సంగతి

ఇక ఏ శాస్త్రీయ ప్రమాణాలదాకా వెళ్ళకుండానే సామాన్యంగా మనకు అలవాటైన వేమన్న శైలినిబట్టి చూసినా ఈ పద్యాలు నిర్ద్వంద్వంగా తమ సూనృతాన్ని నిరూపించుకోలేవు తమ్మయ్యగారు ఊహించినట్లు ఇవి ఏ శిష్యుల ప్రక్షిప్తాలో అయివుంటాయనుకున్నా, దానిని అవుననడానికి అవి వేమన్న పేరుతో ఉండడం తప్ప మరే తృప్తికరమైన సాధనాలు లేవు పై పద్యాలు సహజమైన పరుగులతో **'విశ్వదాభిరామ వినురవేమ'** అనే సంపూర్ణ మకుటంతోకాక, **'వేమా'** అనే లఘు మకుటంతో రచించబడ్డాయి వేమన్న పద్యపాదాలకున్న ఎక్కడికక్కడ విరిగే తత్త్వం వీటిలో కానరాదు ఒక పాదం తర్వాతి పాదంలోనికి చొచ్చుకొని వచ్చిన పద్యాలివి మొదటి ప్రకరణంలో లఘు మకుటంతో ఉన్న నాలుగు పాదాల ఆటవెలదులు వేమనవి

---

72 వేమనకాలము, ఆంధ్రపత్రిక, 1924, ఏప్రిల్

73 వేమనకాలము – ఆంధ్రపత్రిక, రక్షయ సంవత్సర ఉగాది సంచిక

కాకపోవడానికే వీలున్నదనీ, ఆశుకవితా సంప్రదాయంలో పుట్టిన తీరు ఇదికాదని వెనుక చర్చించాను.

**గజపతి:**

*అధముడైన మనుజు డధికుని జేబట్ట*
*అతని మాట నడుచు నవనిలోన*
*గజపతింట గ్రుడ్డి గవ్వలు చెల్లవా!*
**"గ్రద్దవంటివాడు గజపతి కాడకో"**74 (డి.1723, 352)

గజపతుల ప్రాబల్యం 1500–1550 ప్రాంతంలో కాని వెలసి ఉండలేదు. కాబట్టి వేమన వీరికి తర్వాతివాడై ఉంటాడని బండారు తమ్మయ్య గారు వ్రాశారు.

15వ శతాబ్దం నాటి తంజావూరు రాజులు వేమన రసవాదవిద్య చేత ఆకర్షితులై ఆయనను తంజావూరుకు పిలిపించి ఉండవచ్చుననే వంగూరివారి **ఉపశ్రుతికి** కూడ ఆధారాలు లేవు టేకుమళ్ళ కామేశ్వరరావు గారొక విడ్డూరమైన వాదాన్ని సృష్టించారు వేమన శంకరాచార్యుల కాలం వాడట 75 ఇద్దరు క్రీ శ 800 ప్రాంతాలలోని వారట. ఇది భ్రమావరణను కూడ దాటిపోయిన స్వాప్నికావస్థ

*భవదూరుడు శరభాంకుడు*
*శివమూలుడు వేయుగోటు సిద్దేశ్వరుడున్*
*శివ భృత్యుడు వట మూలుడు*
*శివమయ చిన్మయుడు సోమశేఖర గురుడున్*

బమ్మెర పోతన తన **'వీరభద్ర విజయం'**లో తన గురువైన యివటూరి సోమవిభుని గూర్చి వ్రాస్తూ సోమశేఖరుడని కూడ వాడడంచేత పై వేమన పద్యంలోని సోమశేఖరుడు ఇతడు ఒక్కడేననీ, పోతన వేమనలిద్దరు ఒక్క గురువు వద్ద సహాధ్యాయులనీ వంగూరివారు భ్రమపడ్డారు ఈ భ్రమకు తమకు మొదటి నుండి ఉన్న **'వేమన 1412-1590ల మధ్య ఉన్నాడనే నమ్మిక'** కారణం వీరి వ్రాతల ఆధారంగానే దిగవల్లి వేంకటశివరావుగారు 'పోతన–వేమనల యుగము' అనే వ్యాసాన్ని ప్రకటించారు 76 గద్వాల ఆస్థానకవులు కూడ దీనినే గుడ్డిగా నమ్మి వ్రాసినారు కాని ఈ వాదాన్ని బండారు తమ్మయ్యగారు ఖండించారు కాని బండారువారు పై సోమశేఖరుడు పాల్కురికి సోమనాథుడు కావచ్చునని చేసిన వాదం బలంగా లేదు

అసలు వేమన ఇటువంటి గురుస్తుతి పద్యాలు చెప్పాడని నమ్మకం కలుగదు

## IV వేమన ప్రాంతం

150 సంవత్సరాల క్రితం వేమన పద్యాలు చేతిలోపడిన వెంటనే వేమనను గూర్చి బ్రౌన్ ఈవిధంగా ఊహించాడు

74 వేమన చరిత్ర - పేజీ 81
75 ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక- పరాభవ 55, మార్గశిర, పుష్యములు
76 పోతన–వేమనల యుగము, 1924

"Of his history, little is known He was not a Brahmin, but capoo or farmer, a native of the Cuddapah district and born, I believe in the neighbourhood of Gandikotta" (1824)[77]

మరో ఐదేళ్ళపాటు వేమన పద్యాల అరణ్యంలో కొట్టుమిట్టాడిన తర్వాత వేమనను గూర్చి అనేకచోట్ల విచారణలుజరిపి కొంత సమాచారాన్ని సేకరించి మరికొన్ని వివరాలు ప్రకటించాడు బ్రౌన్ ఈ వివరాలు బ్రౌన్ అందరికన్నా ముందు ప్రకటించడంచేత, అనంతర పరిశోధకులందరికి అవే ఆధారం కావడంచేత వాటిని ఉటంకించక తప్పదు.

" .Of his birth place and circumstances very slight traditions have been preserved He was by birth a capu or farmer Some assert that he belonged to the family of Anavema Reddy, a chief in the Candanavol (or Curnool) country; and the brother of the poet is said to have commanded the fort of Gandicota Some believe him to have been a native of 'Christtipad' in Candanul, other, Inakonda in Guntoor, and I have also heard it said he was born at Chitwel in Cuddapah district And I have had opportunities of inquiring at all these places and have, after all, gained no information whatever Yet his dialect in a few passages render it probable that Vemana was a native of the South-western of Talangana where these towns are situated" (1829)[78]

కర్నూలు, గండికోట, క్రిష్టిపాడ్, వినుకొండ, చిట్వేల్ ప్రాంతాలతో వేమన సంబంధాన్ని చెప్పే జనశ్రుతులతో బ్రౌన్ తృప్తిపడక స్వయంగా పై ప్రాంతాలకు వెళ్ళి విచారణ చేశాడు కాని ఫలితాలు బ్రౌన్ శాస్త్రీయ బుద్ధిని, నిష్పక్షపాత వైఖరిని సంతృప్తిపరచలేక పోయినవి ఇక తానే నడుం బిగించి వేమన పద్యాలలోనికి తలస్పర్శిగా దిగాడు వేమన పద్యాలలోని 'మాండలికాన్ని' ఒట్టి వేమన్న "తెలంగాణెం"లోని దక్షిణ–పశ్చిమ ప్రాంతానికి చెందినవాడని నిర్ణయించాడు భాష ఆధారంగా కవిచరిత్రను అన్వేషించే ఈ నూతన విమర్శ పద్ధతిని గూర్చి డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు గారు[79] "ఈ వ్రాత మనకు రెండు విషయాలను వ్యక్తము చేయును. విదేశస్థుడగు బ్రౌన్ దొర, కవి ఉపయోగించిన మాండలికాలను బట్టి స్థల నిర్ణయము చేయ సంకల్పించెనన్న, అతడు మన భాషకు గల వివిధ మాండలికములను ఎంత చక్కగా పరిశీలించెనో తెలిసికొన్న ఆశ్చర్యము కలుగును వాడుకభాషలోని ప్రయోగముల నుపయోగించిన కవియొక్క రచననుబట్టి అతని ప్రాంతమును నిర్ణయింపబూనుట అను విమర్శనపద్ధతి ఏర్పడుట రెండవది" మరియు 'ఆంధ్రేతరులలో వేమనను గురించి వ్రాయువారికి బ్రౌన్ దొరయే ఆధారము' అని వ్రాశారు ఆంధ్రేతరులకే కాదు, ఆంధ్ర పరిశోధకులకు కూడ ఇప్పటికే బ్రౌన్ వ్రాతలే పరమప్రామాణికాలు

77 Preface to Vemana - 1829

78 Preface to Vemana - 1829

79 సిపి బ్రౌన్ (1798–1884) – డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1966

వేమన్న పుట్టి పెరిగిన ఊరిని వెతకడానికి ఇప్పటివరకు పరిశోధకులకు లభ్యమౌతున్న సాధనాలు మూడు 1 వేమన్న పద్యాలలో వాడిన పదజాలం; 2 వేమన పద్యాలలోని ఊర్ల పేర్లు; 3 జన(శ్రుతులు

1 మొదట పదజాలాన్ని పరిశీలిద్దాం వేమన వాడిన మాటలను బట్టి ఆయన ప్రాంతాన్ని బ్రౌన్ ఊహించిన 60 ఏళ్ళ తరువాత, బ్రౌన్ ప్రకటించిన వేమన పద్యాల ద్వితీయ ముద్రణాన్ని సమీక్షిస్తూ బ్రౌన్ అభిప్రాయాలను మ్యాక్ డొనాల్డ్ మరికొంత ముందుకు వెళ్ళి పరిశీలించాడు

పచ్చజూచువారు పచ్చ మెచ్చెడువారు
పచ్చ మీద వాంఛ పడినవారు
పచ్చ విడుచు వాని ప్రభువుగా జూతురు (డి 1721, 133)

వేమన కొన్ని పదాలను సామాన్యార్థంలో గాక ప్రత్యేకార్థంలో ప్రయోగించాడని 'పసుపుపచ్చ' అనే అర్థమున్న పై పద్యంలోని 'పచ్చ' పదాన్ని బంగారం అనే అర్థంలో ప్రయోగించాడని మ్యాక్ డొనాల్డ్ వ్రాశాడు[80] ('పచ్చ'కు బంగారం అనే అర్థం రాయలసీమలో నేటికి వాడుకలో ఉంది. "వాడికేంరా! వాడింట్లో దండిగ పచ్చ ఉంది" అని ఒక ప్రయోగం)

దూరదృష్టి గనరు దుడ్డిన దనుకను
పారు పట్టెరుగరు పడిన దనుక
దండ సాధ్యులైరి ధర్మసాధ్యులు గాక
భూమి జనులు వెఱ్ఱిబుద్ధి వేమా[81]

– (బ్రౌన్ III D 1773 55) డి 1721, 53

పై పద్యంలోని "దుడ్డుట" (తన్నటం అని అర్థం), మరియు ఇతరచోట్ల వాడబడిన 'బిత్తలి' (నగ్నస్త్రీ) వంటి పదాలవల్ల వేమన దత్తమండలాలకే చెందుతాడని మ్యాక్ డొనాల్డ్ విశ్వసించాడు

"పలుగురాతి గుండు పగులగొట్టవచ్చు"లోని 'పలుగురాయి' కఠినమైన రాయి అనే అర్థంతో గుంటూరు, నెల్లూరు జిల్లాలలో వాడుకలో ఉన్నదని, పైమాట స్వరూపం తెలియని వారు 'పరగ రాతిగుండు' అని దిద్దారు కాబట్టి వేమన్నకు గుంటూరు, నెల్లూరుల సంబంధమే సరియైనదని వేమూరి విశ్వనాథ శర్మగారు వ్రాశారు[82]

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు కూడ వేమన దత్తమండలం వాడు అని చేసిన వాదాలలో ఒక వాదంగా వేమన్న వాడిన ఈ కింది మాటలను ఉదాహరించారు

" మంకు, తారాడు, సంబళము, వొడ్డు, కళవళము, కూయు, చాడి, దుడ్డు, తాళిక, బిత్తలి ఇత్యాదులు కన్నడ సీమకు సమీపమగు తెలుగుదేశమందే వాడుకలో గలవు మఱియు ఆకువక్క, బైసి, వలికి, ఒక్కపొద్దు, రుద్దు, పీకు, కుళ్ళుపోతు మొదలగు శబ్దములు నల్లమల కీవలి వారికి తప్ప ఆవలివారి కర్థమగునా యనియే నా

---

80 Vemana A rebel poet Major R M Macdonald, Madras Journal of literature & Science, 1866

81 'తొట్టిన దనుకను' అని పాఠాంతరం, డి 1773, 1315–3 వాల్యూమ్

82. ఆంధ్రపత్రిక, దుందుభి, అశ్వయుజం, సారస్వతానుబంధం

సందేహము. వీనికితోడు కుంక, చెంబడి, ఊక వంటివి ఈ దేశమున వాడుకలేని పదములు అపురూపముగా గలవు కాని, యివి వేమనవంటి దేశదిమ్మరికి వచ్చుట వింత కాదు."[83] మరియు ఆ మండలంలోని 'బసివిరాంద్ర'ను వేమన పేర్కొనడం వల్ల వేమన దత్తమండలం వాడై ఉంటాడని శర్మగారి వాదం.

వేమన వంటి దేశదిమ్మరి కవి ప్రయోగించిన మాటలను బట్టి నిర్ణయాలు చేయడంలో కొన్ని చిక్కులున్నాయి. వివిధ ప్రాంతాలలో సంచారంచేసినవాడి భాషలో అనేక మాండలికాలు చోటు చేసుకోవడం సహజం. ఈ అనేక మాండలికాల సమ్మేళనం వల్ల మరుగునపడిన అతని అసలు మాండలికాన్ని కనిపెట్టడం అసాధ్యమేమీ కాదు అధునిక భాషాశాస్త్రంలో దానికి సాధనాలున్నాయి. కాని ఆ వక్తయొక్క భావనను మనం ప్రత్యక్షంగా వింటేనే కాని అది సాధ్యంకాదు మాట్లాడేటప్పుడు అతని ఉచ్చారణలోని ఊనిక, స్వరం, వ్యవధానాదులను బట్టి, ఉండి ఉండి బయటపడే అసలు క్రియాప్రయోగాలనుబట్టి నిర్ణయించవచ్చు. వ్రాతలో కవి వాడిన ఒక ప్రాంతపు మాటలను బట్టి అతని భాషను నిర్ణయించడం ప్రామాదికమేమీ కాదు రాళ్ళపల్లివారు ఉదహరించిన మాటల్లో చాలావరకు గుంటూరు, నెల్లూరు మండలాలలో కొన్ని కృష్ణా, గోదావరి మండలాలలో వాడబడుతున్నాయని, బండారు తమ్మయ్యగారు వ్రాశారు.[84] కాని చాలావరకు అనేది నిజంకాదు. రాళ్ళపల్లి వారిచ్చిన 19 మాటల్లో తొమ్మిది మాత్రమే ఇతర ప్రాంతాల వారికి తెలుసు అవికూడ రాయలసీమలో ఏ అర్థచ్ఛాయతో ప్రయోగింపబడుతున్నాయో చూడాలి [85]

---

83 వేమన – పుట–41 (రాళ్ళపల్లి ఇచ్చిన పద్యాల నెంబర్లు పరిహరింపబడినవి)

84 వేమన చరిత్ర – పుట 38

85 రాళ్ళపల్లి వారిచ్చిన 19 పదాల్లో కొన్ని పదాలు తెలంగాణా సర్కారుల్లో కూడ వాడుకలో ఉన్నాయి అయితే వాటి అర్థాల్లో కొంత ఛాయాభేదం కూడ కనిపిస్తున్నది

**మంకు:** మొండి, గడుసు (Adj) దుర్జనుడు (n s) అని బ్రౌన్ అర్థాలిచ్చాడు 'మొండి' అనే అర్థంలో తెలంగాణాలో కూడ ఈ మాట వాడుకలో ఉంది వేమన 'మూర్ఖత్వం' అనే అర్థంలో ప్రయోగించాడు – "మంటిలోన దాచు మంకుజీవి"

**తారాడు:** To dance attendance without coming to the point జీరాడుట, వ్రేలాడుట అని బ్రౌన్ అర్థాలిచ్చాడు "అట్లా తారాడుతున్నావేంటి?" అనేది నేటికీ రాయలసీమలో వినపడే ప్రయోగం

**సంబళము:** Wages, salary, hire జీతము, కూలి, "దినసంబళము, నెలసంబళము, సంవత్సర సంబళము" అని వాడతారు

**సొడ్డు:** దీనికి "ఆటలో వోడినవాని తలమీద వేసే దెబ్బ" అని బ్రౌన్ అర్థం 'సొడ్డు వేసుట'కు 'చెంపదెబ్బ' అనే అర్థమిస్తున్నాడు బ్రౌన్ కాని వ్యవహారంలో దీనికి అర్థం లేదు రాయలసీమలో సొడ్డు అంటే వంక, సాకు, Pretext అని అర్థాలు నేను విన్న ఈ కింది ప్రయోగాలు 'సాకు' అనే అర్థంలోనే ఉన్నాయి "సొడ్డు చిక్కింది కదూ నీకు? ఎగురగొట్టి పోయినావే పని?", "సొడ్డు దొరికితే చాలు తప్పించుకునేదేనా?"

**కళవళము:** Anxiety, distress, puzzle to beagitated or anxious - బ్రౌణ్యం

**కూయు:** To cry, exclaim, to make noise, To clamour, yell, To bark, bray, crow, croak, sing, shriek, hoot as an owl, అరచుట అనే న్యూనార్థంలో

వేమన పద్యాల్లో కనిపిస్తున్న పదజాలం వేమన రాయలసీమ ప్రాంతానికి చెందినవాడని చెప్పడానికి బలమైన సాక్ష్యంగా ఉపకరిస్తుందనడంలో సందేహం లేదు.

ఇక వేమన్న పేర్కొన్న స్థలాల పేర్లను పరిశీలించవలసి ఉంది.

*గండికోటలోన గత్తిబట్టిన యంత*
*రాజుగారి దొడ్డరౌతు గాడు*
*ఎంతవారినైన నెత్తిన గొట్టునా*[86] (1247), బందరు ప్రతి.

ఈ పద్యం వావిళ్ళ ప్రతిలో కూడ ఉంది (1207) తంజావూరు కాకినాడ ప్రతులలో లేదు. ముద్రిత ప్రతులలోని పాఠాంతరాలను బండారు తమ్మయ్యగారు ఉదాహరించారు, ఈ పద్యానికి అర్థం చెప్పడం కష్టం. వావిళ్ల ప్రతిలో దీని అర్థమిది. "పిరికివాడు గండికోటలో కత్తి పట్టుకొనునంతనే గొప్ప శూరుడు కాజాలడు, రాజుగారి రౌతుగాడు. ఎంతవాడైన నెదిరించినచో పిరికివాడు తిరుగబడి చంపలేదు." పద్యంకన్నా అగమ్యంగా ఉన్నది ఈ అర్థం

---

రాయలసీమలో వాడుక ఉంది "ఏమో కూశావంటనే" అని ప్రయోగం

**చాడీ:** Chari పర్షియాపదం కొండెం – అన్ని ప్రాంతాల్లో ఉంది

**దుడ్డు:** నాణె విశేషం. A penny, the fraction one eighth of a రూక, one sixteenth of (1/16) an anna - బ్రౌణ్యం ఈ మాట ఒక రాయలసీమలోనే వినిపిస్తున్నది ఉదా – "వీడు కొరదుడ్డుకు కూడ పనికిరాడు" "పిల్లోడు దుడ్లసంచున్నట్లు ఉండాడు" (బరువేకాదు విలువకూడ)

**తాళిక:** Patience

**బిత్తలి:** నగ్నమైనది అని అర్థం బత్తల అనే రూపభేదంతో తెలంగాణాలో కూడ ఉంది "భయపడి బత్తల పరుగెత్తాల" అన్నది కడప జిల్లాలో కూడా నేను విన్న ప్రయోగం

**ఆకువక్క:** మూడు ప్రాంతాల్లో వినిపిస్తుంది

**బైసి:** Shame, Modesty, బైసి మాలిన అనగా సిగ్గుమాలిన, shameless also, బవిష్యహీనమైన disgraced, ruined – బ్రౌణ్యం "బైసి పోతుంది" అంటే సిగ్గుపోతుంది "ఏమిటీ బైసీనము" – బహూహీనము బశల అంటే సిగ్గు కలిగినది – ముగ్ధ

**వలికి:** శ్మశానం "వావివరుసదప్పి వలికి పాలౌదురు" "వలక" అని రూపాంతరం "వలకల్లోకి పోయినా బుద్ధిరాదు" రాయలసీమలోనే వినిపిస్తుంది

**ఒక్కపొద్దు:** ఉపవాసం సర్కారుల్లో లేదు

**రద్దు, పీకు:** మూడు ప్రాంతాల్లో వినిపిస్తాయి

**కుళ్ళుపోతు:** మూడు ప్రాంతాల్లో వినిపిస్తాయి

**కుంక:** విదవ అనే అర్థంలో వేమన్నవాడాడు "కాంత కుంకయైన"

**చెంబడి:** చెంబట్టుక అని తెలంగాణాలో ఉంది

**ఊక:** సర్కారుల్లో కూడ ఇదే రూపంలో ఉంది తెలంగాణాలో 'ఉనుక' అంటారు

**బసివి:** 1917లో వావిళ్ళప్రతికి రాస్తూ రాళ్ళపల్లి వారిచ్చిన మాట ఇది 1918లో రాసిన వేమన పుస్తకంలో దీనిని వదిలేశారు "ఇదిగాక వేమన బసివిరాండ్రను పలుమారు పేర్కొని యున్నాడు" (పేజీ 41) అని రాశారు గాని 'బసివి' పదం వేమన పద్యాల్లో అపురూపంగానే లభిస్తున్నది (డి 1769, 826, డి 1769, 636)

86 'గండికోటలోన కస్తూరి మృగమండు' పాఠాంతరం

బండారు తమ్మయ్యగారు పై పద్యం నుండి అర్థాన్ని పిండడానికి వీలుగా దిద్ది ఈ పద్యానికి ఈ క్రింది అవతారాన్ని ప్రసాదించారు.

గండికోటలోన కస్తూరి మృగముండు
రాజు(నైన) దొడ్డ రౌతు(నైన)
ఎంతవారినైన (ఇంతలో) పడగొట్టు

దీనివలన వావిళ్ళ ప్రతిలోని అస్పష్టార్థానికి పూర్తిగా విరుద్ధమైన అర్థాన్ని సాధించారు

**"వీరాధివీరులకు నెలవయి వీర్య శౌర్యములకు స్థానమయిన గండికోటలో గత్తి చేత బట్టిన వాడెల్ల మహాశౌర్యధుర్యుడై యెట్టి జగజట్టీలనయిన బడగొట్ట నేర్చునని బద్యభావమయి యుండును."**[87] అర్థసాధన కొరకు పద్యం యొక్క సవరణకు పాల్పడి ప్రమాదకరమైన సంప్రదాయాన్ని నెలకొలిపినా తమ్మయ్యగారు సిద్ధింపజేసిన పై అర్థంవల్ల చెప్పుకోదగిన ప్రయోజనమేమీ లేదు "కస్తూరి మృగ" శబ్దం వలన వేమన ఒక యోగినో, సిద్ధుణ్ణో ఉద్దేశించాడన్న వేమూరి విశ్వనాథశర్మగారు చేసిన వ్యాఖ్యానం కూడ మనకేమీ సాయపడదు. కొట్టొచ్చినట్టు వినపడే 'గండికోట' అనే పదబంధం తప్ప పై పద్యంలో మనలను ఆకర్షించే గూఢార్థాలు ఏమీ లేవు వేమన గండికోటను పేర్కొన్నాడు కాబట్టి దానితో ఆయనకున్న సంబంధం "**ఇతడు కొండవీడులో బుట్టి గండికోట మొదలగు స్థలముల పెరిగి, తుదకు కటారుపల్లెలో శివసాయుజ్యము నొందెననుటయే యుచితముగా తోచుచున్నది.**"[88] అని వంగూరివారు ఊహించడానికి మాత్రమే పనికివచ్చింది ఆయన అన్నగారు కడపసుభా జమ్ములమడుగులోని గండికోట దుర్గాధిపతిగా ఉండేవాడు అని బ్రౌన్ కూడ వ్రాశాడు[89] గండికోట అప్పటి కొండవీటి రాజ్యంలోనిది కడపకు 50 మైళ్ళ దూరంలో ఉన్నది ఈ పద్యార్థం ఏదయినా వేమన దత్తమండలానికి చెందినవాడని చెప్పడానికి ఇదొక మంచి సాక్ష్యం

కదిరి తూర్పునందు ఘనత శోభిల్లగా
ఒరగ వర కరారుపల్లె వెలసి
యచల నిష్ఠగూడ నమరి యుండెదరయా (887, బందరు ప్రతి)

బ్రౌన్, కాకినాడ, తంజావూరు ప్రతులలో చివరకు వావిళ్ళప్రతిలో కూడ లేక కేవలం బందరు ప్రతిలో మాత్రమే ఉన్న పద్యమిది ఇది ఎక్కడిదో కాదు అనేక జనశ్రుతులవల్ల రూపుదిద్దుకొన్న కటార్లపల్లె పూజారి వద్దనున్న 'వేమనయోగి చరిత్రము' లోనిదే ఈ చరిత్రంలోని వేమన మన వేమనకాదనీ, కృతకవేమనయైన తుంగవేమన అనీ ఇదివరకే నిరూపించబడింది పైగా పై చరిత్రాన్ని వంగూరివారు నమ్మలేదు బండారు ఖండించారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు అనుమానించారు, అంతేకాకుండా దీనిలో 'కదిలి తూర్పునందు' అని ఉండాలనీ – 'కదిరి తూర్పునంద' అనేపారం లేఖకప్రమాదంవల్ల యేర్పడినదని శర్మగారు అభిప్రాయపడ్డారు కదిరికి తూర్పున ఉన్నది

87. వేమన చరిత్ర, పుట – 35
88 వేమన పుట – 19
89. డి 177, ప్రతిపైన బ్రౌన్ వ్రాసుకున్న నోట్సు

కటార్లపల్లె కాబట్టి, కటార్లపల్లెలో సమాధియైనవాడు మన వేమన కాజాలడు శేషాద్రి రమణకవులుకూడ కటార్లపల్లె వేమన్నను మన వేమన్నగానే భ్రమపడి వ్రాశారు.[90] వేమన రాజమండ్రి మొదలు చిత్తూరు దాక సంచారం చేసినా అనంతపురం జిల్లా కదిరి తాలూకా 'గాండ్లపెంట', మజరా కటారుపల్లె నల్లచెరువులో సిద్ధి పొందాడని వంగోలు వెంకట సుబ్బయ్యగారు ఈ కారణంవల్లనే వ్రాసినారు [91] కాని కటార్లపల్లె వేమన, మన వేమన ఒకరు కాకపోయినా, మన వేమనకు కటార్లపల్లెతో సంబంధం లేదని తేల్చడానికి కూడ ఆధారాలు లేవు అక్కడ ప్రజలందరు తుంగవేమనను మన వేమనగానే భావిస్తున్నారు అయితే ఈ తుంగవేమన ఎక్కడి నుండి ఊడిపడ్డాడు? ఇతడు వేమన శిష్యప్రశిష్యులలో ఒకడు కావచ్చు వేమన వేదాంతం వల్ల ప్రభావితుడై, వేమనగా తన పేరును మార్చుకొని అపర వేమనగా ఖ్యాతికెక్కాలనే కోర్కెతో వేమన వలెనే పద్యాలు చెప్పనారంభించినవాడు కావచ్చు ఇటువంటి వేమన్నలు మనకు తెలియనివారు ఇంకెందరో ఉండవచ్చుననడానికి తుంగవేమన వృత్తాంతం ఒక మంచి ఆధారం

కటార్లపల్లెతో వేమన సంబంధాన్ని నమ్మి మ్యాక్‌డొనాల్డ్ కటార్లపల్లెకు వెళ్ళి అక్కడ ఆ ఊరి భౌగోళికపరిసరాలను చెట్టుపుట్టలతో సహా వర్ణించి వ్రాశాడు ఇప్పటికీ వేమన పేరు మీద జరిగే ఉత్సవాదులను వేదం వేంకటకృష్ణశర్మగారు ఈ కిందివిధంగా వర్ణించి వ్రాశారు [92]

"ఇప్పటికిని నెల్లూరులోను - దత్తమండలములలోను, తెలంగాణా ప్రాంతములోను నివసించు వేమనశిష్యులెల్లరు కటారుపల్లె వేమయ్యయన్న (వేమన పద్యాలు చెప్పిన) వేమన అనియే భావించువారు కావున వేమన భక్తులైన వీరెల్ల తమ తమ యూళ్ళలో దమ గురువుపేర - (శ్రీరామ భజన నుందిరము వలె) నిర్మించుకొని వసించుచు, ఎక్కువ కాలము గ్రామ సంచారములతో గడుపుచు బొట్టుపోసికొనుచుందురు అట్లు వీరేగు గ్రామములలో వీరి కుత్సవములు ఊరేగింపులు జరుగుటయు గలదు వీరు తమతమ ప్రభావమున అగ్గిత్రొక్కుట మొదలగు నసామాన్య కార్యములను జూపుట సర్వ సాధారణము రాత్రి కాగానే దివ్వటి లిరువంకల బారులు తీరి నడుచుచుండ తుడుహూలు, తప్పెటలు మొదలగువాని రణగొణ ధ్వనులతో వేమన మెఱవణి, యూరిచివరి యేదేని దేవాలయము నుండి బయలుదేరును ఆ వెనుక ఇత్తడి కఱ్ఱల చోపుదారులు, నెమలి కుంచెలు పట్టుకొనినవారు, ధూపములు వేయువారు నడుతురు చివరనొక బక్క గుఱ్ఱము మీద, పచ్చని అంగరఖా, పెద్ద తలగుడ్డ, కొన్ని పూసల దండలు, విభూతి ధరించిన పురుష విగ్రహము కనబడును అది యూరుచుట్టుకొని మరల దేవాలయము చేరగానే అంతకు ముందే యక్కడ చేయబడిన యగ్నిగుండమున వేమయగారి బక్క గుఱ్ఱము వాద్యశబ్దములకు దగినట్లు లయతప్పకుండ 'కదం' త్రొక్కుటతో నుత్సవము సమాప్తమగును"

---

90 వేమన జీవితము - వావిళ్ళప్రతి

91 ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక - సంపుటం 11

దుందుభినామ సంవత్సరం, ఆశ్వయుజ, 1923

92 శతక వాఙ్మయ సర్వస్వము (1160-1860) - 1954

ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి
మూగ చింతపల్లి మొదటి వీడు

ఈ పద్యానికి వేదాంతార్థం చెప్పినవారు కూడ ఉన్నారని వెనుక చెప్పాను కాని అది పొసగదు. అయితే పై పద్యంలోని 'మూగ చింతపల్లి' ఎక్కడిది? ఒంగోలు తాలూకాలో ఈ పేరుతో ఒక గ్రామం ఉందని శేషాద్రి రమణ కవులు వ్రాశారు[93] కాని ఇది ప్రామాదికమే కడప జిల్లాలో ఉన్నదని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు వ్రాశారు కడప జిల్లాలోనిది కాదని నెల్లూరుజిల్లా పొదిలి తాలూకాలో 'మూగచింతల' అనే గ్రామమున్నదని, పూర్వమిది కొండవీటి సీమలోనే చేరి ఉండవచ్చునని బండారు తమ్మయ్య గారు భావించారు

"Alphabetical list of villages in the districts and Taluks of the Madras presidency" అనే పుస్తకంలో పై గ్రామనామం కనిపించలేదు కాబట్టి ఇది శివారు గ్రామం (Hamlet) అయి ఉంటుందని తమ్మయ్యగారు సమర్థించారు[94] అయితే **'చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాలో తప్ప మూగచింతలపల్లి అనే గ్రామం ఆంధ్రదేశంలో మరెక్కడా లేద'ని** ఖండితంగా ఆరుద్రగారు అంటున్నారు **'ఇది ఆరోజులలో ఆర్కాటు సుబాలో ఉండేదో కడప సుబాలో ఉండేదో చెప్పలేం'** అని కూడా అంటున్నారు[95]

పైపద్యం వల్ల ఆరుద్రగారు ఈ నిర్ణయానికి వచ్చారు **"వేమనగారు పుట్టింది చంద్రగిరి ప్రాంతాలలో; పెరిగింది కొండవీడులో. అయితే తిరిగింది మాత్రం ఎక్కువ కడప, కర్నూలు సుబాలలోనే. ఆదిలో ఆయన దిగంబరంగా కాలినడకను సంచరించినా ఉత్తరోత్తరా పసుపుబట్టలు కట్టుకొని పాంకోళ్ళు తొడుక్కొని గుఱ్ఱమెక్కి ఊరూరా తిరిగే వారని భావించవచ్చు. వేమనగారి శిష్యుల మఠాలు కడపలో చాలా వున్నాయి."**

ఆరుద్రగారు ఊహించినట్లు వేమన గుఱ్ఱమెక్కి ఊరూరా తిరిగినాడనిపించదు ఒకవేళ గుఱ్ఱమెక్కి తిరిగినా ఆదిలోనే తిరిగి ఉంటాడుగాని సర్వసంగ పరిత్యాగియై, దిగంబరంగా తిరిగిన చరమదినాలలో కాదని తోస్తుంది

పై పద్యం చాల చిత్రమైనది సుదూరంగా ఉన్న రెండు ప్రాంతాలకు (కొండవీడు, మూగచింతపల్లి) ఇందులో ముడిపెట్టబడింది కాబట్టే ఈ రెండు ప్రాంతాల మధ్య సంబంధాన్ని ఆవిష్కరించడానికి తలా ఒకరకంగా ఊహించారు కొండవీడులో పుట్టే రత్నమండలాలలో సిద్ధి పొందాడనేది వాటి సారాంశం వేమనకు కొండవీటితో ఎట్టి సంబంధం లేదు అతని పూర్వులెవరో కొండవీటికి వలస వచ్చారు వారి వంశంలోనివారికి రాజులపేర్లు (వేమారెడ్ల పేర్లు) పెట్టుకొని ఉంటారు అనుస్యూతంగా అది వేమనకు సంక్రమించి ఉంటుందని బండారు తమ్మయ్యగారు మొదటినుంచి తమవాదంమీద నిలిచివున్నారు[96] ఇక వేమన తన దేశసంచారాన్ని రాజమండ్రి నుండి విజయనగర సామ్రాజ్యం దాకా చేసినాడనీ, గోదావరి మండలంలో 'పుల్లె ఆకులలో

93 వేమన జీవితము - వావిళ్లప్రతి
94 వేమన చరిత్ర - 33
95 సమగ్రాంధ్ర సాహిత్యం - వాల్యూమ్ 11
96 వేమన కాలనిర్ణయం

భుజించినాడ'ని వంగూరివారు ఊహించారు కావచ్చు కాని వారిచ్చిన ఉదాహరణం బలంగా లేదు 97

మొత్తంమీద ఇంతచర్చ చేసి, ఇన్ని దేశాలు తిరిగి ఉన్నచోటికే చేరినట్లయినది సరే, వేమన్నది ఒక ఊరు కాదు ప్రతి ఊరు ఆయనదే అన్నంత కీర్తి ఆయనకున్నది, వేమన్న విస్తృత కీర్తిమూర్తి, సర్వాంతర్యామి కాబట్టి 'మొత్తంమీద వేమన్న ఆంధ్రుడు' అని తృప్తిపడదామంటే అందుకుకూడ ఆటంకాలు ఉన్నాయంటున్నారు బండారు తమ్మయ్యగారు ఉత్తర అర్కాడు జిల్లాలో దేసూరు అనే గ్రామంలో కొందరు రెడ్లు నివసిస్తున్నారు వీరిని దేసూరు రెడ్లు అంటారు వీరికొక చరిత్ర గ్రంథమున్నదట అందులో హేళాచార్యుడని వ్యవహరించబడేవాడు మన వేమనేనట. ఇతని జననం ఇప్పటికి 2980 సంవత్సరాల కిందటిది అప్పటికి తెలుగు సాహిత్యమేమో కాని తెలుగు భాషైనా స్పష్టంగా యేర్పడిందా అనేది అనుమానం ఈ కథకు కాళ్ళు లేవనేది తెలుస్తూనే ఉన్నది కాని మన వేమనకు తమిళదేశంతో సంబంధమే లేదని చెప్పలేము వేమన తంజావూరు వరకు వెళ్ళినాడనే జనశ్రుతువులున్నాయి పైగా వేమన్నకు తమిళుల ఆచార వ్యవహారాలు తెలుసునని వేమన పద్యాలలోనే దాఖలాలు కనిపిస్తున్నాయి:

> మేనమామ బిడ్డ మెరసి పెండ్లామాయె
> అరవలందు చెల్లెలాయె నదియు
> వలసిన పుణ్యంబు, వలదన్న దోషంబు (డి 1725, 599)

తమిళదేశమే కాదు మైసూరు రాష్ట్రంలో కూడ వేమన సంచరించినట్టు వాడుకలున్నాయి కన్నడకవి సర్వజ్ఞుడు వేమన సమకాలికుడట దేశాటనంలో ఇద్దరు, ఒకరినొకరు కలిసి సంభాషించుకొన్నట్లు "సర్వజ్ఞ వేమన సంవాద" అనే చిన్న కన్నడ అచ్చు పుస్తకం దొరుకుతున్నదట 98 మన వేమన కాలాదుల వలెనే సర్వజ్ఞుని గూర్చిన వివరాలు కూడ వివాదాస్పదంగా ఉండి తేలనందున పై వాడుకను ఖండించడానికి ఆధారాలు లేవు కన్నడదేశం వారికి వేమన బాగా పరిచితుడట ఇప్పటికీ ధార్వాడ ప్రాంతంలో వేమన జయంతులు జరుపుతున్నారని చెప్తున్నారు

ఏది ఏమైనా మొత్తంమీద వేమన్న తన పద్యాల్లో వాడిన పదజాలంవల్ల బసివిరాంఢ్ర ప్రసక్తివల్ల, స్థలనామాలవల్ల రాయలసీమవాడనే నిర్ణయం ప్రస్తుతానికి చెయ్యవచ్చు

## V సారాంశం

వేమన కాలం, ప్రాంతాన్ని గూర్చి చేసిన ఫలితమంతగా లేని పై సుదీర్ఘ చర్చ సారాంశమీ విధంగా ఉంది

వాడుక కథలలో ఉన్నది చారిత్రకాభాసమే కాని చరిత్ర కాదు మనకంటె ఎంతో పూర్వుడై వేమనకాలానికి దగ్గరివాడైన అబె దుబాయ్ వేమన 17వ శతాబ్దపు చరమపాదంలో చనిపోయాడని మొట్టమొదటిసారి వ్రాశాడు బ్రౌన్, మ్యాక్‌డొనాల్డ్‌లు చెప్పిన కాలం కూడ ఇంచుమించు ఇదే క్యాంబెల్ ఈ కాలాన్ని ఖండించలేదు వీరితో

---

97 'కుక్క తోక పట్టి గోదావరీదునా' – వేమన

98 ప్రొఫెసర్ కె సుబ్బరామప్ప అభిప్రాయం "విశ్వదాభిరామం"

విభేదించిన గోవర్ వేమన్నను 12వ శతాబ్దానికి ఈడ్చుకుపోయాడు బార్నెట్ది మరీ విడ్డూరం వేమన అనేవాడు ఒకడు ఉన్నాడా అని వితర్కించాడు

ఇక దేశీయులలో రాయవరపు పూర్ణయాచారి ఇచ్చిన కొండవీటి రాజుల వంశవృక్షాన్ని కొమర్రాజు లక్ష్మణరావుగారు ఖండించారు కాబట్టి 14, 15 శతాబ్దాలలో వేమన్న లేడని తేలింది పూర్ణయాచారి కొండవీటి సంగతిని ఒక వేటూరి ప్రభాకరశాస్త్రిగారే సమర్థించారు వేమన రాజవంశంతో సంబంధంలేని రైతుకుటుంబానికి చెందినవాడని బండారు తమ్మయ్యగారు అభిప్రాయపడ్డారు 'వేమ' శబ్దానికి తృప్తికరమైన అర్థం చెప్పడం కుదరదు. కటార్లపల్లె వేమన మన వేమన కాదు కాని మన వేమనకు కటార్లపల్లెతో సంబంధం లేకపోలేదు అవతారికలో స్తుతించబడిన వేమన మన వేమన కాదు నందన సంవత్సరపద్యాన్ని నమ్మలేము వేమన్న వాడిన షష్ఠియాపదాల వాడుకవలన వేమన 1650 ప్రాంతంవాడు అనేది ఖండించడానికి వీలులేదు పద్యాలలోని చారిత్రక వ్యక్తులెవరూ స్పష్టమైన రేఖలతో, నిర్వివాదంగా వెలువడలేదు దేశీయులు ప్రకటించిన కాలం ఈవిధంగా ఉంది

| | |
|---|---|
| వంగూరి సుబ్బారావుగారు | 1412-1480 |
| శేషాద్రి రమణ కవులు | 1460-1600 |
| వేదం వేంకటకృష్ణశర్మగారు | 1565-1625 |
| వేటూరి ప్రభాకరశాస్త్రిగారు | 1650 |
| బండారు తమ్మయ్యగారు | 1652-1725 |
| రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు | 1700 |

అబే దుబాయ్ విన్నకాలానికీ, బ్రౌన్ చెప్పిన కాలానికీ, బండారు తమ్మయ్యగారు చర్చించి తేల్చిన కాలానికీ పెద్ద దూరమేమీ లేదు వేటూరి ప్రభాకరశాస్త్రిగారి కాలానికి బండారు తమ్మయ్యగారి కాలానికి భేదం 60, 70 సంవత్సరాలే అబే దుబాయ్తో ప్రారంభమై బండారు వారితో ముగిసిన 17వ శతాబ్దమే వేమన కాలంగా చెప్పదగివుంది కచ్చితంగా చెప్పాలంటే వేమన కాలం 1650 ప్రాంతంగానే తేల్చవచ్చు ప్రాచీనప్రతి కాలం కూడ దీనినే సమర్థిస్తున్నది

వేమన రాయలసీమ ప్రాంతానికి చెందినవాడుగా నిర్ణయం చెయ్యవచ్చు

* * *

# వేమన పద్యాల నేపథ్యం

## I. రాజకీయ సంక్షోభం

వేమన్న 17వ శతాబ్దానికి చెందినవాడని రెండవ ప్రకరణంలో నిరూపించబడింది. వేమన్నకు కొండవీటి సంబంధమున్నదన్న దాఖలాలు ఉన్నప్పటికి ఆయన కవిత్వానికి పూర్వరంగం సమకూర్చిపెట్టింది దత్తమండలాలనబడే నేటి రాయలసీమ ప్రాంతమే అనికూడా చర్చలో తేలింది. 17వ శతాబ్దం నాటి దత్తమండలాలలోని రాజకీయ పరిస్థితులను అర్థం చేసుకోవడానికి ఆ కాలంలోని "ఆంధ్రదేశ" రాజకీయ చరిత్రను గూర్చి సమగ్రంగా, భారతదేశ చరిత్రను గూర్చి సంక్షిప్తంగా పరిశీలించవలసిన అవసరం ఉంది. పరస్పర సంబంధం కలిగినవి కాబట్టి, అనేక పర్యాయాలు పరస్పర దోహదకారులు కూడ కాబట్టి, నాటి భారతదేశ పరిస్థితులలో దేనినీకూడా ప్రత్యేకంగా చూడడం సాధ్యం కాదు. చరిత్రకారులు కావించిన యుగ విభజనలూ, వాటి క్రమాలూ సౌకర్యం కొరకు చేసినవే కాని నిజానికి కాలప్రవాహంలో ఏ రెండు సంఘటనలనూ తెగ్గొట్టినట్టు చూపడం కుదరదు. అందుకే చారిత్రక పరిస్థితులను వివరించేటప్పుడు ఆరంభాలను వెతుక్కోవడం కష్టకార్యమౌతున్నది కాని ఒక కాలపు రాజకీయ చరిత్రను పరిశీలించేటప్పుడు ఆ కాలపు రాజకీయ పరిస్థితులు ఆవిధంగా ఉండడానికి కారణమైన ఆ వ్యవస్థ ప్రారంభాన్నీ, దానికి దారితీసిన సంఘటనలపై దృష్టిని సారించడంతో ఈ చిక్కు చాలవరకు విడిపోతున్నది

### 1. విజయనగర సామ్రాజ్య చరమదశ

ఆంధ్రుల చరిత్రలో మునుపెన్నడూలేనంత సుదీర్ఘకాలం నిలకడగా చెలరేగిన రాజకీయసంక్షోభం 16వ శతాబ్దంలో దాపురించింది 19వ శతాబ్దందాకా ఆ మంటలు చల్లారలేదు దక్షిణదేశపటం క్షణక్షణం మారుతుండిన అస్థిర కాలమది విజయనగర సామ్రాజ్యపతనంతో దక్షిణదేశ చరిత్రలో సమూలమైన మార్పులు మొదలైనాయి. 1565లో అళియ రాయరాయలకూ, బహమనీ సుల్తానులకూ మధ్య జరిగిన **తల్లికోట** (రక్షస్-ధగిడీ) యుద్ధంలో హిందూ సామ్రాజ్యం చావుదెబ్బ తిన్నది తర్వాత మరో నూరు సంవత్సరాల వరకు విజయనగర సామ్రాజ్యం కొనసాగినా దానిలో వెనుకటి స్థైర్యం లేదు ఆత్మరక్షణలోనే ఆ నూరేండ్లు గడిచాయి మహమ్మదీయ రాచరికం వేరూని క్రమంగా దక్షిణాదిని విస్తరిస్తున్నది క్రీ.పూ. 5,6 శతాబ్దుల నుండి ఆంధ్రరాజుల చేత పాలించబడే ఆంధ్ర ప్రాంతానికి ఇదొక భిన్నమైన కొత్త అనుభవం. కాకతీయుల, రెడ్డి రాజుల కాలం నుండి కత్తులు నూరుతున్న మహమ్మదీయుల దండయాత్రల నుండి రెండు శతాబ్దాలకు పైగా హిందూ దేశాన్ని విజయనగరం కాపాడగలిగింది

తల్లికోట యుద్ధంలో అళియ రామరాయలు మరణించి, హిందూ దేశం పతనం కావడమే కాకుండా రాబోవు కాలంలో ఒక కొత్త దుస్సంప్రదాయానికి విషబీజాలు కూడ దీనిలోనే పడ్డాయి అప్పటివరకు రాజ్యకాంక్షతో యుద్ధాలు చేసిన మహమ్మదీయరాజులు మతప్రాతిపదికమీద ఏకమై రామరాయలను ఉమ్మడిగా ఎదుర్కొన్నారు

1347లో బహమనీ రాజ్యం స్థాపించబడింది. అంతవరకు హిందూ దేశమంతా తుగ్లక్ అధీనంలోనే ఉన్నా దక్షిణాదిన మాత్రం తుగ్లక్ అధికారం అంత స్థైర్యంగా నిలబడలేదు తుంగభద్రానదీ తీరాన హరిహర బుక్కరాయలు హిందూరాజ్య పునర్నిర్మాణం చేశారు హంపీని స్థావరం చేసుకొన్నారు అంతవరకు తుగ్లక్ ప్రతినిధులుగా ఉన్న హరిహర బుక్కలు స్వాతంత్ర్యం ప్రకటించుకొనగానే తుగ్లక్ సామ్రాజ్యం నుండి ఒక ముక్క విడివడింది అదే సమయంలో మహమ్మదీయులు చేసిన తిరుగుబాటు ఫలితంగా దౌలతాబాద్‌లో అల్లావుద్దీన్ హసన్ రాజుగా బహమనీ రాజ్యం స్థాపించబడింది. వెంటనే రాజధాని గుల్బర్గాకు మార్చబడింది 15వ శతాబ్దం ప్రథమ పాదంలో మళ్ళీ బీదర్‌కు మార్చబడింది. తుంగభద్ర కృష్ణల మధ్య గల రాయచూరు కొరకు విజయనగరం బహమనీసుల్తానుల మధ్య తరచుగా యుద్ధాలు జరిగేవి బహమనీరాజ్యం కాలక్రమాన మూడుభాగాలుగా చీలి అహమద్‌నగరంలో నిజాంషాహీలు, బీజపూర్‌లో అదిలాషాహీలు, గోలకొండలో కుతుబ్‌షాహీలు రాజ్యాలు స్థాపించారు

ఈవిధంగా చీలిపోయిన సుల్తానులుకూడ ఉత్తరంనుండి సాగుతున్న మొగలు దండయాత్రలను ఎదుర్కోవడానికి షాజీ, శివాజీ, శంభాజీ వంటి హిందూ రాజుల సహాయాన్నే అర్థించారు కాని ఒకేమతంవారు అయినప్పటికీ వారు ఏకం కాలేదు విజయనగరం విషయంలో కూడ ఇదే జరిగింది రాజ్యకాంక్షల కారణంగా వారు ఒకరినొకరు దెబ్బతీయడానికి విజయనగర రాజుల సహాయాన్ని తీసుకున్నారు బీదరువాడైన ఖాసిం బరీద్ బీజపూర్ పైకి హిందువులను మొట్టమొదట పురికొల్పాడు చాలాకాలం వరకు వీరిమధ్య జరిగిన యుద్ధాలు ఆర్థిక, భౌగోళిక కారణాలపై ఏర్పడినవి ఈ యుద్ధాలలో రామరాజు అవలంబించిన పక్షాలూ, పాత్రా, రాజనీతితో చేసినవే కాని అతనికి మహమ్మదీయులపట్ల ద్వేషం లేదు కాని అదిల్‌షా పక్షాన, నిజాంషాకు వ్యతిరేకంగా జరిగిన యుద్ధాలలో కల్యాణీదుర్గం వశమైన సందర్భంగా రామరాజు సైనికులు మతపరమైన అత్యాచారాలు కావించారు ఈ చర్య అంతవరకు తమలో తాము కలహించుకొంటున్న మహమ్మదీయ రాజులలో మతపరమైన జాగృతిని కలిగించింది హెన్రీ హీరాస్ అనే పోర్చుగీసు చరిత్రకారుడు ఈ సంఘటనను వర్ణించాడు [1]

ఆనాటి రాజకీయాలలో రామరాజు వహించిన పాత్రనుగూర్చి P M Joshy ఈవిధంగా వ్రాశాడు [2]

---

1 "The Aravidu Dynasty of Vijayanagar"
The Ref Henry Heras S J M A

2 Geo-political and cultural Relations of Vijayanagar with the neighbouring Muslim states - P M Joshi (paper) published in "Aspects of Deccan History" V K BAWA, Editor, Institute of Asian studies, Hyderabad - 1975, Report of seminars

"Rama Raya would almost have succeeded in his ambitious design but for his insulting and arrogant attitude towards Islam. It was his threat to the very existence of Islam in Deccan that brought the sultanites together to crush him He was no longer the enemy of an individual Muslim state but of all of them The struggle was no longer a political struggle, but was religious It was this factor that was responsible for the muslim confedercy."

హీరాస్, ఇతర చరిత్రకారులు రామరాయలపై అపనిందలు వ్రాశారనీ, సత్యాలు కావనీ చిలుకూరి వీరభద్రరావుగారు ఖండించారు.[3] వీరభద్రరావుగారు అభిప్రాయపడినట్లు రామరాయలు చేసిన యుద్ధాలన్నీ కేవలం మతావేశంతో జరుగలేదు. రామరాయల 23 ఏండ్ల పరిపాలనలో అహమద్‌నగర్, బీజపూర్ రాజులను నాలుగుసార్లు ఓడించాడు. కాని నిజాంషాతో జరిగిన యుద్ధంలో మాత్రం మతానికి దెబ్బతాకింది.

రామరాజు మరణంతర్వాత అదిల్‌షాకు విజయనగరంతో వైరం నశించింది. బీజపూర్, గోల్కొండ నవాబులు మాత్రం విజయనగరం రాజ్యంలోని అనేక భాగాలను క్రమంగా జయించగలిగారు 17వ శతాబ్ది ప్రారంభం నుండి మొగలుదాడులు ప్రారంభం కావడంవల్ల విజయనగరం రాజులను ఇంకా ఎక్కువగా వేధించలేకపోయారు.

తళ్లికోట యుద్ధం తరువాత విజయనగరాన్ని విడిచి తిరుమలరాయలు అపార ధనరాసులతో పెనుగొండకు పారిపోయాడు మహమ్మదీయ సుల్తానులు విజయనగరాన్ని ఆరునెలలపాటు కొల్లగొట్టారు 1568లో తిరుమలరాయలు పెనుగొండను రాజధానిగా చేసుకొన్నాడు 1568లో అలీ అదిల్‌షా ఆనెగొంది దుర్గాన్ని స్వాధీనం చేసుకొన్నాడు గోల్కొండ నవాబులు తూర్పుతీరాన్ని జయించి రాజమహేంద్రవర దుర్గాన్ని, ఉత్కళ దేశంలో కొంత భాగాన్ని ఆక్రమించుకొన్నారు విజయనగరానికి ఉత్తరానగల సామంతులు తిరుగుబాటు చేశారు కాని దక్షిణదేశం మాత్రం వీరి స్వాధీనంలోనే ఉన్నది 1570లో తిరుమల రాయలు సింహాసన మధిష్టించి, పాలనా సౌకర్యం కొరకు రాజ్యాన్ని మూడు భాగాలుగా విభజించాడు మూడు భాగాలకు తన ముగ్గురు పుత్రులను అధిపతులుగా నియమించాడు

1 శ్రీరంగరాయలు – పెనుగొండ రాజధానిగా తెనుగు ప్రాంతం
2 రామరాయలు – శ్రీరంగ పట్టణం రాజధానిగా కన్నడ ప్రాంతం
3 వెంకటపతిరాయలు – చంద్రగిరి రాజధానిగా ద్రావిడ ప్రాంతం

తిరుమలరాయని కాలంలో బీజపూరు నవాబు కర్ణాటకంలోని తురగల్లు, ధార్వాడ దుర్గాలను జయించాడు బంకాపూర్‌ను ఆక్రమించుకొన్నాడు 1572లో తిరుమల రాయలు కాలధర్మం చెందాడు శ్రీరంగరాయలు రాజ్యానికి వచ్చాడు ఈతని కాలంలో తూర్పుతీరంలోను, దక్షిణంలోను గల సామంతులు తిరుగుబాటు చేశారు బీజపూర్ నవాబు శ్రీరంగరాయని రాజ్యంపై దండెత్తి నేటి షిమోగా, కడూరు జిల్లాలను ఆక్రమించాడు గోల్కొండ నవాబు కొండవీడు, ఉదయగిరి, బెల్లంకొండ దుర్గాలను జయించాడు రామరాయలు పాలిస్తున్న కన్నడ ప్రాంతాన్ని సామంతరాజులు లాక్కున్నారు

3 అళియ రామరాయలు ప్రకాశకులు యస్.ఎ నరసింహము, రాజమహేంద్రవరము – 1931

1585లో శ్రీరంగరాయలు మరణించాడు. ఇక మిగిలింది వెంకటపతి రాయలు. ఈయన రాజ్యభారాన్ని వహించాడు చంద్రగిరి రాజధానిగా ఏర్పడిన వెంకటపతి రాయల రాజ్యంలో తమిళప్రాంతం, రాయలసీమలు ఉన్నాయి

వెంకటపతి రాయల కాలంనుండే బహుశా మనకు కావలసిన కాలం మొదలైందని చెప్పవచ్చు **"వేమన్న వేంకటపతి రాయల కాలానికి కొంచెం తర్వాత జీవించి ఉన్నాడని చెప్పవచ్చు."** వెంకటపతి రాయలు 28 ఏండ్లు (1586-1614) రాజ్యం చేశాడు. వెంకటపతి రాయలు 1614లో మరణించేవరకు ద్రావిడ, రాయలసీమ ప్రాంతాలు మహమ్మదీయుల చేతికి చిక్కలేదు విజయనగరపు చెప్పుకోదగిన చిట్టచివరిరాజు వెంకటపతి రాయలే వెంకటపతి రాయల మరణానంతరం కూడ 32 ఏండ్ల దాకా విజయనగర సామ్రాజ్య శేషం కొనవూపిరులతో పెనుగులాడుతూనే ఉన్నది

వెంకటపతి రాయని అనంతరం చంద్రగిరి సింహాసనం కొరకు కలహాలు ప్రారంభ మయినాయి వెంకటపతిరాయని అన్నకొడుకు రెండవ శ్రీరంగరాయలు, వెంకటపతిరాయని బావమరిది జగ్గరాజు రాజ్యం కొరకు సంఘర్షించారు జగ్గరాజు శ్రీరంగరాయలను సకుటుంబంగా చంపించాడు ఈ హత్యను సహించలేక స్వామిభక్తిపరుడైన యాచమ నాయకుడు అనే సేనాని, బాలుడైన మూడవ శ్రీరంగరాయని (రెండవ రాయని కొడుకును) రక్షించి అతని పక్షాన తిరుచినాపల్లి దగ్గరి తోపూరు గ్రామంవద్ద జగ్గరాజుతో యుద్ధం చేశాడు అదేకాలంలో తంజావూరు పాలిస్తున్న రఘునాథరాయలు యాచమనాయకునికి సాయం చేశాడు జగ్గరాజు ఓడిపోయాడు

అనంతరం మూడవ శ్రీరంగరాయలు కొంతకాలం చంద్రగిరిని పాలించాడు కాని 1646లో ఉత్తర అర్కాటు జిల్లా మహమ్మదీయుల వశం కావడంతో అంతవరకు అస్తమయ సంధ్యలో కొట్టు మిట్టాడిన విజయనగర సామ్రాజ్యానికి పూర్తిగా ప్రొద్దుగూకింది శ్రీరంగరాయలు ఉత్తరాన షాజహాన్ సహాయాన్ని కోరాడు కాని అది రాలేదు సామంత రాజుల తిరుగుబాట్ల సుడిగుండాలు చుట్టుముట్టగా శ్రీరంగరాయలు మైసూరుకు పారిపోయాడు 1675 నాటికి విజయనగరం సామ్రాజ్యం పూర్తిగా నశించిపోయింది 1646 నుండి 1675 దాకా ద్రావిడ ప్రాంతం, రాయలసీమ భయంకరమైన రాజకీయ సంక్షోభంలో పడిపోయినాయి స్థానిక ప్రభువుల అంతఃకలహాలతో, మహ్మదీయుల పదఘట్టనలతో ఈ కాలమంతా కల్లోలమైపోయింది 1675 నుండి 1800 దాకా రాయలసీమ ప్రాంతం స్థానిక నవాబులు, పాళియగార్ల అధీనంలోనే ఉన్నది

అయితే 17వ శతాబ్దంలో రాయలసీమలో సంభవించిన పరిణామాలను అర్థం చేసుకోవడానికి విజయనగర సామ్రాజ్య చరిత్రను స్థూలంగా తెలుసుకున్నట్టే, అదే కాలంలో పొరుగు రాజ్యాలైన మధుర, తంజావూరులను గూర్చి, వాటితో చంద్రగిరికి గల సంబంధాన్ని గూర్చి రేఖామాత్రంగా తెలుసుకోవాలి అదేవిధంగా అప్పటికి సమీప భవిష్యత్తులోనే హిందూసామ్రాజ్య శేషాల నిర్మూలన పూర్తిచేసి సామ్రాజ్యాన్ని నెరపబోయే మహమ్మదీయుల అధికార క్రమ విజృంభణను పరిశీలించాలి వెంకటపతిరాయని కాలంలోనే 1639లో చెన్నపట్నం కట్టుకోడానికి అనుమతి పొంది, భవిష్యత్ మహా సామ్రాజ్యానికి పునాదులు వేసుకున్న బ్రిటిషువారిని గూర్చి స్పర్శామాత్రంగానైనా చెప్పుకోవాలి

## 2. తంజావూరు

విజయనగరం ఉన్నత స్థితిలో ఉన్నప్పుడే దక్షిణాన రెండు సామంత రాజ్యాలు ఏర్పడ్డాయి ఒకటి తంజావూరు, రెండు మధుర. ఇవి తమిళ ప్రాంతాలైనా ఆంధ్రరాజులచేత పాలింపబడ్డాయి తంజావూరుకు మొదటి రాజు చెవ్వప్పనాయకుడు. ఇతడు కృష్ణదేవరాయల తమ్ముడైన అచ్యుతరాయలకు బావమరిది. తమిళ దేశానికి తరలిపోయి సింహళం వరకు దండయాత్రలు చేశాడు క్రైస్తవుల మతప్రచారం దక్షిణదేశంలో ఇతనికాలంలోనే మొదలైంది ఇతని కుమారుడు అచ్యుత నాయకుడు విజయనగర వినాశనం ఇతడు గద్దెనెక్కే సరికే జరిగిపోయింది ఇతని కుమారుడు రఘునాధరాయలు. చంద్రగిరిలో వెంకటపతిరాయలు మరణించిన సంవత్సరమే (1614) రాజ్యానికి వచ్చాడు. ప్రభుద్రోహి అయిన జగ్గరాయలు రఘునాధుడు కల్పించుకోవడం వల్లనే ఓడిపోయాడు. ఇతని కాలంలోనే బీజపూర్ నవాబు తంజావూరుకు సౌహార్దం కోరుతూ రాయబారిని పంపాడు రఘునాధుని కుమారుడు 1633లో రాజ్యానికి వచ్చాడు ఇతడు సమర్థుడు కాడు. గోలకొండ బీజపూరు సుల్తానులు ఇతనిపై దండెత్తి కొల్లగొట్టారు. నవాబులకు లంచమిచ్చి తాత్కాలికంగా తన అధికారాన్ని రక్షించుకొన్నాడు. దానికి కావలసిన ధనంకొరకు ప్రజలను పన్నులచేత చాలా పీడించాడు 1662లో భయంకరమైన కరువు ఏర్పడింది. ఇతనికి మతసహనం కూడ లేదు వీర వైష్ణవుడై ఇతర మతాలవారిని బాధించాడు ప్రజలలో అసంతృప్తి చెలరేగింది మధురరాజు చొక్కనాధుడు తంజావూరును ఆక్రమించుకొన్నాడు 1775 ప్రాంతంలో మహారాష్ట్ర ప్రభువైన శివాజీ సోదరుడు వెంకోజీ తంజావూరును ఆక్రమించాడు తంజావూరును నాయకరాజులు 140 సంవత్సరాలు (1535–1675) పాలించారు

## 3. మధుర

మధురను 1529 నుండి 1736 వరకు దాదాపు రెండువందలేండ్లు ఆంధ్ర నాయక వంశంవారు పాలించారు తంజావూరు రాజులతో తమకుగల కలహాలలో వీరు మహమ్మదీయుల సహాయాన్ని పొందారు తంజావూరు, విజయనగర సామ్రాజ్య పతనానికి మధురరాజులు దోహదం చేశారు మధురను పాలించిన మొదటి రాజు విశ్వనాధ నాయకుడు చిట్టచివరి పాలకురాలు మీనాక్షి ఈ మండలాన్ని కూడా మహమ్మదీయులు స్వాధీనం చేసుకున్నారు

## 4. గోలకొండ

1482 నుండి 1512 వరకు అధికారం నెరపిన బహమనీ రాజ్యం విచ్ఛిన్నమై ఐదు చిన్న రాజ్యాలైనది వీటిలో కుతుబ్ షాహీలు పాలించిన గోలకొండ రాజ్యం ఒకటి వీరు పాలించింది ముఖ్యంగా ఆంధ్రప్రాంతం కాబట్టే వీరి చరిత్ర మనకు అవసరమవుతున్నది గోలకొండ సుల్తానులు ఆంధ్ర ప్రాంతాన్ని 170 సంవత్సరాలకు పైగా (1512–1687) పాలించారు సరిగ్గా ఈ కాలంలోనే 150 సంవత్సరాలు విజయనగర రాజులు పెనుగొండ, చంద్రగిరి రాజధానులుగా పరిపాలించారు గోలకొండను ఏడుగురు రాజులు పాలించారు వారి పాలనా కాలాలు ఈక్రింది విధంగా ఉన్నాయి

1. కులీకుతుబ్ షా (1512-1543)
2. జంషీద్ షా (1543-1550)
3 ఇబ్రహీం షా (1550-1580)
4 మహమ్మద్ కులీకుతుబ్ షా (1580-1611)
5. మహమ్మద్ కుతుబ్ షా (1611-1626)
6 అబ్దుల్లా కుతుబ్ షా (1626-1672)
7. అబుల్ హసన్ కుతుబ్ షా (తానీషా) (1672-1687)

వీరి చరిత్రను సంక్షిప్తంగానైనా చెప్పుకోవాలి. బహమనీరాజ్యంలో గోలకొండ ప్రాంతం ఒక సుభా. దీనికి తెలంగాణమని కూడ పేరు. మొదటిరాజైన కులీకుతుబ్ షా నాటికి తెలంగాణాలో కొంతభాగమే ఇతని ఆధీనంలో ఉన్నది మిగిలిన తెలంగాణా, పూర్వాంధ్రదేశం (కోస్తాలు) ఒరిస్సారాజైన ప్రతాపరుద్ర గజపతి స్వాధీనంలో ఉన్నాయి కృష్ణరాయలకాలంలో కులీకుతుబ్ షా రాచకొండ, దేవరకొండ దుర్గాలను ఆక్రమించుకొన్నాడు కాని కృష్ణరాయలతో తర్వాత సంభవించిన యుద్ధంలో వీటిని కోల్పోయాడు రాయలు మరణించిన అనంతరంగాని ఇతనికి ఓరుగల్లు, ఖమ్మంమెట్టు, బెల్లంకొండ, కొండపల్లి, కొండవీడు స్వాధీనం కాలేదు క్రమంగా మెదకు, పానగల్లు దుర్గాలను కూడ చేజిక్కించుకొన్నాడు. తెలంగాణా సాంతం స్వాధీనంలోనికి వచ్చింది ఈ యుద్ధాలలో సీతాపతిరాజు అనే వీరుడు కులీకుతుబ్ షాను ప్రతిఘటించి మూడుసార్లు ఓడిపోయాడు ఇతడెన్నో ప్రజాహిత కార్యాలు చేశాడు.

గోల్కొండ నవాబులలో మూడవవాడు ఇబ్రహీం కుతుబ్ షా తల్లికోట యుద్ధంలో విజయనగర సామ్రాజ్య పతనకారకుడితడే ఇతడనేక ప్రజాహిత కార్యాలు గావించాడు తెలుగు కవులతనిని 'మల్కిభరాం' అని కీర్తించారు నాల్గవ నవాబు మహమ్మదు కులీ ఇతడు హైదరాబాదును స్థాపించాడు ఇతని కాలంనాటికి ఆంధ్రదేశమంతా గోల్కొండ సుల్తానులకు స్వాధీనమయింది ఉత్తరాన గంజాంవరకు వీరిరాజ్యం విస్తరించింది ఐదవవాడు అబుల్ హసన్ తానీషా ఇతని కాలంలో 1686లో గోల్కొండపై ఔరంగజేబు దండెత్తాడు వ్యాపార నిమిత్తం ఆంగ్లేయులు ఇతని కాలంలోనే ఆశ్రయింపులు మొదలుపెట్టారు హిందువుల అభిమానాన్ని అధికంగా చూరకొన్న రాజు తానీషా కాబట్టే గోలకొండ సామ్రాజ్యం మొగలులకు చిక్కినప్పుడు ప్రజలు తల్లడిల్లిపోయారు 1687లో గోలకొండ సామ్రాజ్యం అంతరించింది

గోలకొండను జయించిన తరువాత ఔరంగజేబు 20 ఏండ్లు జీవించాడు గోలకొండను సాధించాడు కాని ఆ పరగణాలో శాంతిని మాత్రం స్థాపించలేకపోయాడు గతంలోని అనేక యుద్ధాల ఫలితంగా రాజుకుంటూన్న సంక్షోభ జ్వాలలు ఈకాలంలో తారాస్థాయిని అంటుకున్నాయి గోల్కొండ రాజ్యంలోని సామంతులు, చిల్లరరాజులు, జమీందారులు ప్రభుత్వంమీద తిరుగుబాటు చేశారు కాలం కల్లోలమయమైనది

తర్వాత నిజాంరాజ్యమేర్పడి జమీందారులను మిగిల్చి అదికూడ అంతరించిన దశలో బ్రిటిషు సామ్రాజ్యం పూర్తిగా నిలదొక్కుకున్నది

రాయలసీమ 1799 దాకా నిజాం హస్తగతం కాలేదు. అదికూడ టిప్పుసుల్తాన్ మరణానంతరమే సాధ్యమైంది బ్రిటిషువారు ఆంధ్ర భూభాగం పైన 1611లో

అడుగుపెట్టారు. సుమారు 200 ఏళ్ళ తర్వాతనే వారికి ఆంధ్రదేశమంతా స్వాధీనమయింది విజయనగర వినాశనంతో ఆంధ్రదేశంలో ప్రారంభమైన రాజకీయ సంక్షోభం బ్రిటిషువారి సుస్థిర సామ్రాజ్య స్థాపనతోనే అంతమైనది

విహంగదృష్టితో చూస్తే 17వ శతాబ్దంలోని రాజకీయ పరిస్థితులు ఇట్లున్నాయి:

1565లో జరిగిన తల్లికోట యుద్ధం విజయనగర పతనానికి దారితీసింది. ఈ యుద్ధానికి 36 ఏండ్లక్రితమే దక్షిణాన తంజావూరు రాజ్యం స్థాపించబడింది 1570 నుండి చంద్రగిరి రాజధానిగా ద్రావిడ, రాయలసీమ ప్రాంతాలను వెంకటపతి రాయలు పాలించసాగాడు. 1572 తర్వాత కొండవీడును బీజపూర్ నవాబు కైవసం చేసుకొన్నాడు 1580–1611ల మధ్య గోల్కొండను పాలిస్తున్న మహమ్మద్ కులీకి ఆంధ్ర ప్రాంతమంతా స్వాధీనమైంది గోల్కొండ సుల్తానులు గోల్కొండను పాలించిన 170 సంవత్సరాల కాలంలోనే చంద్రగిరి రాజధానిగా విజయనగర రాజులు పాలించారు. 17వ శతాబ్దం తొలిపాదం నుండే మొగలుదాడులు ప్రారంభమయినాయి. 1614లో వెంకటపతిరాయలు మరణించాడు. వెంకటపతిరాయలు మరణించిన సంవత్సరంలోనే రఘునాథరాయలు తంజావూరు గద్దెనెక్కాడు 1639లో బ్రిటిషువారు మద్రాసు కోటను కట్టుకోవడానికి చంద్రగిరిరాజు నుండి అనుమతిని పొందారు 1646లో ఆర్కాటుతో సహా చంద్రగిరి రాజ్యం మహమ్మదీయుల వశమైంది 1662లో తంజావూరులో భయంకరమైన కాటకం ఏర్పడింది. 1675లో విజయనగరం పతనం పూర్తయింది అదే సంవత్సరం తంజావూరును మహారాష్ట్రులు ఆక్రమించుకొన్నారు

17వ శతాబ్దమంతా యుద్ధాలకాలం దండయాత్రలు వెడలడం, ఆత్మరక్షణకై పోరాడడంలోనే ఈ యుగమంతా గడిచింది ఈ కాలంలోని పరిపాలన చాలావరకు యుద్ధ ప్రాతిపదికల మీద నిర్వహించబడింది కుటిల రాజనీతితో ఏకమవుతూ వచ్చిన మహమ్మదీయ రాజులు మతం ఆధారంగా ఒకటి కావడం ఈ కాలంలో జరిగిన దుష్టపరిణామం యుద్ధాల వలన దేశంలో ప్రతి ప్రాంతంలో కూడ శాంతి కరువైంది సైనికుల కసాయి చర్యలకు మతోన్మాదం తోడు కావడంవల్ల ప్రజల కడగండ్లకు అంతులేదు చిల్లరరాజులు, పాళియగార్లు సమయం చిక్కినప్పుడు బందిపోట్లవలె పక్క ఊళ్ళను దోచుకునేవారు ఈ కాలమంతా ప్రజలకు కష్టాలమయం సంధియుగం [4]

ఆ కాలంలో కేంద్రరాజులు ఎవరున్నా ప్రజలకు ప్రత్యక్ష సంబంధమున్నది స్థానిక పాలకులతోనే రాయలసీమ ప్రాంతాన విజయనగర రాజుల సామంతులు, పాళియగార్లు

---

4 పై చరిత్రను వ్రాయడానికి ఈ గ్రంథాలు సాయపడినాయి

a) Forgotton Empire - Robert Sewell, 1962

b) The Andhra Through the ages - K Balendu Sekharam, 1973

c) ఆంధ్రుల చరిత్ర–సంస్కృతి – డా॥ ఖండవల్లి లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందుశేఖరం

d) ఆంధ్రుల చరిత్ర–ఏటుకూరి బలరామమూర్తి

e) ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఏషియన్ స్టడీస్, హైదరాబాద్ వారి సెమినార్ రిపోర్టు – 1975

f) ఆంధ్ర దర్శిని – విశాలాంధ్ర ప్రచురణాలయము, విజయవాడ, 1954

(అమర నాయకులు) మొదలైన చిల్లరరాజులు అధికారం నెరిపారు. రాయలసీమలోని వివిధ జిల్లాల పరిస్థితి కూడ కొంత తెలియవస్తున్నది. కడప జిల్లా 14వ శతాబ్దపు మధ్యకాలం నుండి 17వ శతాబ్దం మధ్యకాలం దాకా విజయనగరం పాలన కిందనే ఉన్నది. విజయనగర రాజ్యపు ఉదయగిరి రాష్ట్రంలో అది చేర్చబడింది. తర్వాత గండికోట, సిద్ధవటం అనే రెండు సీమలుగా కడప జిల్లా గోల్కొండ నవాబుల వశమైంది నవాబు సైన్యాధికారులలో ఒకడైన నేక్నామ్‌ఖాన్ కొంతమంది ముస్లింలతో వచ్చి పాత కడపకు దక్షిణాన ఒక మైలు దూరంలో నేక్నామాబాద్‌ను నిర్మించాడు. ఇతడు హిందువుల యెడ సుహృద్భావ వైఖరినే ప్రదర్శించాడు.

1687లో గోల్కొండ రాజ్యాన్ని ఔరంగజేబు జయించే వరకు కడపను గోల్కొండ నవాబులు, కడప నవాబులు గోల్కొండ రాజప్రతినిధులుగా పాలించారు. మీర్‌జమ్లా అనేవాడు గండికోటలో మొదటి నవాబుగ నియమించబడ్డాడు. అబ్దుల్ నబీఖాన్ మొదటి కడప నవాబుగ అధికారంలోనికి వచ్చాడు 1714లో కడపను పాలించినవాని పేరు కూడ నబీఖానే. ఇతనిని రెండవ నబీఖాన్ అంటారు ఇతడు గండికోటలో, గుర్రంకొండలో సైనికకేంద్రాలు ఏర్పరచి స్థిరసైన్యాన్ని పోషించాడు. ఈ నవాబు లెవరూ గ్రామాలలో చెలరేగిన పాలెగార్ల నణచలేకపోయారు. రాజ్యంలో శాంతిని స్థాపించడం వీరికి చేతకాలేదు. 1740లో మహారాష్ట్రులు కడప కోటపై దండెత్తి నబీఖాన్‌ను ఓడించారు. రెండుసార్లు సంధి జరిగింది 18వ శతాబ్దం అర్ధభాగంలో కడప జిల్లా మూడేండ్లు మహారాష్ట్ర సైన్యాలకు, నవాబులకు యుద్ధరంగమైంది. చివరికి ఆర్కాటు నవాబు, కర్నూలు, కడప నవాబులు ఏకం కావడంవల్ల మహారాష్ట్రులు ఓడిపోయారు

ఇక అనంతపురం జిల్లాలో గుత్తిదుర్గం ప్రసిద్ధమైంది 16వ శతాబ్దం చివరి పాదంలో ఇది గోల్కొండనవాబుల వశమైంది విజయనగరంవారుకాని, గోల్కొండవారుకాని పాలనాసౌలభ్యం కొరకు ఆయా ప్రాంతాలలో ప్రతినిధులను నియమించేవారు ప్రతినిధులు లేనిచోట పాలెగార్లు పాలించేవారు. 17వ శతాబ్దంలో అనంతపురం తాలూకాను హండే ములకప్పనాయకుని వంశీకులు పాలించేవారు 1677లో శివాజీ నాయకత్వాన మహారాష్ట్రులు అనంతపురం జిల్లాపై దాడిచేశారు 1687లో ఔరంగజేబు దక్కనును జయించడం వలన అనంతపురం తాలూకా, దక్కను సుబేదారు పాలన కిందికి వచ్చింది

చిత్తూరు జిల్లా 1646లో గోల్కొండ నవాబుల వశమైంది గోల్కొండ నవాబుల క్రింద కడప నవాబు మదనపల్లి, వాయల్పాడు, పుంగనూరు తాలూకాలను పాలించగా, ఈ జిల్లాలోని మిగతా తాలూకాలను ఆర్కాటు నవాబు పాలించాడు గోల్కొండ రాజ్యం పతనమైన తర్వాత చిత్తూరు జిల్లాను కర్నాటక నవాబులు పాలించారు 1758లో ఆర్కాటు నవాబు తమ్ముడైన అబ్దుల్ వాహబ్‌ఖాను చంద్రగిరి కోటనుండి పాలించాడు

1565లో **తల్లికోట** యుద్ధం తర్వాత కూడ 1570 వరకు నెల్లూరు జిల్లా సదాశివరాయల వంశీకుల పాలనలో ఉన్నది తరువాత గోల్కొండ నవాబులు పాలించారు గోల్కొండ రాజ్య పతనానంతరం ఆర్కాటు నవాబులు నెల్లూరు జిల్లాను ఆక్రమించారు

ఈవిధంగా రాయలసీమలో ఆయా దుర్గాధిపతులు రాజ్యం చేస్తున్నప్పటికీ ప్రజలను ప్రత్యక్షంగా పాలించినవారు ప్రతినిధులు, సైన్యాధికారులు, పాలెగార్లే. ముఖ్యంగా నవాబుల అదుపులేని పాలెగార్ల దుండగాలకు అంతులేదు

1746లో మహారాష్ట్ర సేనాని మురారిరావు అనేవాడు గుత్తి, తాడిపత్రి, పెనుగొండ ప్రాంతాలను స్వాధీనం చేసుకొని పాలెగార్ల నణచేదాకా ప్రజల బాధలు సాగుతూనే ఉన్నాయి

## 5. వేమన పద్యాలలో నాటి రాజకీయ పరిస్థితులు

వేమన భావాలు, ఆలోచనలు అతని కాలమే పునాదిగా లేచిన గోపురాలు సమకాలంలో వేళ్ళూనలేని కవి ఎంత ప్రతిభావంతుడైనా కాలమారుతాల ఘాతాలకు తట్టుకొనలేడు రాజపోషణలో రాణించిన ఇతరాంధ్ర కవులవలె తమ కృతికర్తల చరిత్రకు అతిశయోక్తుల వింజామరలను ఊపినవాడు కాదు వేమన స్వానుభవం వేమన కవిత్వానికి జీవధాతువు రాజులను ఆశ్రయించి, వారి అభిరుచుల కనుసన్నలలో తన కవిత్వానికి సామగ్రిని కూర్చుకున్నవాడు కాదు నిజానికి రాజాశ్రయమే వేమన స్వభావానికి గిట్టదు నైసర్గికంగా ప్రవహించే స్వేచ్ఛా స్వరూపిణియైన నదిలాగే వేమన స్పష్టమైన సరిహద్దులకు లోబడి నడిచినవాడు కాదు ఇటువంటివాడు ఒక పోతనే మనకు కనిపిస్తాడు పోతన రాజులను '**కర్ణాటకిరాట కీచకులు**' అని తిడితే, వేమన అటువంటి రాజులను ఆశ్రయించి కవిత్వాన్ని ఎంత తక్కువ వెలకైనా అమ్మే దరిద్రగొట్టు కవులను చీదరించుకున్నాడు

*తోట కూరకైన దొగ్గలి కైనను*
*తవిటి కూరకైన తవిటి కైన*
*కావ్యములను చెప్ప గండ్యాలు ఘనమైరి* (డి 1723, 579)

ఆనాటి రాజులలో కవుల సొమ్మును ఎగవేసే హీనులు కూడ ఉండేవారు

*గండమైన దొంగ కవుల సొమ్మెగవేసి*
*కండ కావరాన కదియ బలసి*
*గండుకుక్క వలెను కాటుక దిరుగును* (డి 1773, III 1365)

వేమన తన కాలపు రాజులను గూర్చి ప్రత్యేకదృష్టితో చెప్పినవాడు కాదు అతని అనుభవంలో ఆకస్మికంగా చేరిన అంశాలనుబట్టి మనమారాజుల స్వభావాన్ని తెలుసుకోగలము రాజుల ఆశ్రయంలో ఉండి వారు చేసే అరాచకాలను కూడ వీరరస మందాకినిలో ముంచి తేల్చవలసిన అవసరం లేనివాడు కాబట్టి దుర్జనులు, స్వార్థపరులు, దొంగలైన వారి దుశ్చర్యలలో లీనంకాక, దూరంనుండే వారి ప్రజావ్యతిరేకమైన దుండగాలను చూచి, చలించి ఉద్రేకంతో కవితా ఖడ్గం చేతబూని ఛీంకరించాడు ఆవేశంతో రాజుల దురన్యాయాలను ఖండించేటప్పుడు వేమనకు ఫలానా రాజు అనే ప్రత్యేకింపు లేదు వారు వీరు అననేల, దాదాపు అందరు అటువంటి వారే ఐనప్పుడు, వేమనకు పేరు పేరునా నిందించవలసిన అవసరం లేదు అందుకే ఆ దుష్టప్రభువుల పేర్ల కొరకు వేమన పద్యాలలో వెతికే ప్రయోజనం లేదు

వేమన పద్యాలలో మనకు కనిపించే రాజులను, వారి స్వభావాలను బట్టి మూడురకాలుగా చెప్పుకోవచ్చు:

1. **పిరికిపందలు** 2. **దుర్మార్గులు** 3. **అజ్ఞానులు**

ఈ రాజులను గూర్చి వర్ణించేటప్పుడు వేమన తరచుగా రెండు ఉపమానాలను వాడుతాడు. 1. పాములు 2. కోతులు. ఈ పోలికల మీద వేమనకున్న మక్కువ, అతని లోకానుభవం ఆధారంగా పుట్టిందే. వేమన ఉపమాసామర్థ్యానికివి నికషోపలాలు కూడ.

వేమన కాలంలో పాలకులు ప్రజలకు '**పట్టుకొమ్మలు**'[5]గా ఉన్నవారు కాదు. '**పెట్టి పొయ్యలేక తిట్టువారు**'[6] అయినప్పటికీ ప్రజలకు కనీస రక్షణ నందించలేని అసమర్థులు. అది రణనినాదాలతో, అశ్వరింఖలతో మృత్యుధూళి పైకెగసిన కాలం. పరసైన్యాలు గుర్రాలపై వచ్చి ఊళ్ళను దోచుకొని, జనులను హింసించి, చంపి శ్మశానాలను మిగిల్చి వెళ్ళేవి. అప్పుడు ప్రజలను కాపాడవలసిన అధికారులు పలాయనం చిత్తగించేవారు.

*పరబలంబు జూచి ప్రాణరక్షణమున*
*కురికి పారిపోవు పిరికి నరుడు*
*యముడు కుపితుడైన నడ్డంబు యెవరయా*[7] (డి.1783; 1–410)

శత్రుసైన్యాలు రాకముందే పారిపోయిన వారు కొందరైతే కదనరంగం దాకా వెళ్ళి కాళ్ళకు బుద్ధి చెప్పేవారు మరికొందరు

*పంద నధికు జేసి బవరంబునకు బంప*
*పారిపోవు కార్య భంగమవును*[8] (డి 1721, 1–241)

కాని ఇటువంటి పిరికివారికే బిరుదుగొడుగులుండేవి

*"పిరికి బంటుకేల బిరుదుగొడుగు"* (డి 1721, 250)
(పాఠాంతరం 'బిరుదు మాట' డి 1725, 405)

ఈ బిరుదు గొడుగు రాజచిహ్నం రాజ్యానికి వచ్చేటప్పుడు రాజ బిరుదంతోపాటు ఏర్పరచే బంగారు గొడుగు అన్నమాట (బ్రౌన్ దొర What a cowadly soldier to do with honourable insignia and the golden umbrella of Vemana III 261)

కాబట్టి బిరుదు, గొడుగు అని రెండు వేరువేరుగా వ్రాయడం సరికాదు

ప్రజలను సంరక్షించవలసిన అధికార్లు పిరికిపందలు కావడం వలన ప్రజాకంటకులైన అధికార్లకు అడ్డులేకపోయింది ఈ అధికార్లు విజయనగర సామ్రాజ్యం అస్తమించిన నాటినుండి ప్రజలను హింసించి, దోచుకోవడానికి అలవాటుపడిన పాలెగార్లు రాయలసీమను ఆక్రమించిన నవాబులు ఎవ్వరూ ఈ పాలెగార్లను అణచి శాంతిని స్థాపించలేకపోయారు పాలెగార్లు విజయనగర కాలంలో ఎప్పుడూ కొంత స్థిర సైన్యాన్ని పోషించి, రాజులకు అవసరమైనప్పుడు సైనికసేవ చేసేవారు విజయనగర రాజుల కాలపు పాలెగార్లలో

---

5 డి 1721, II 86
6 డి 1721, II 86
7 పాఠాంతరాలు పద దశంబుజూచి, ఉరుకు పిరికివాడు ఊరిదనుక – డి 1723, 1044
8. పాఠాంతరం అధిపుజేసి – డి 1723, 339, డి 1725, 620, డి 1769, 808

మట్లవంశపు పాలెగార్లు ముఖ్యులు. వీరు 17వ శతాబ్దంలో సిద్ధవటం కోటను నిర్మించారు. విజయనగరం సమసిపోగానే వీరు తమ సైనికబలంతో యధేచ్ఛగా దోచుకొని ప్రజలను నానా అవస్థలకు గురిచేశారు

పెక్కు జనుల జంపి పేదల వధియించి
డొక్క కొరకు ఊళ్ళు దొంగిలించి
యెక్కడికిని బోవ నెరిగి యముడు జప్పు[9] (డి. 1773-1-315)

పాలెగార్లు స్వతంత్రంగా వ్యవహరిస్తూ కేంద్రాధికారాన్ని సాగనివ్వలేదు దేశంలో అరాచకం తాండవించింది. ఈ బాధల నుండి విముక్తి చేసే బలవంతుడైన రాజుకొరకు ప్రజలు ఎదురు చూశారు

పుడమి నుప్పరంబు పురికొల్పి జగముల
రక్ష జేయగల్గు రాజులెవరు
మహిపతి యను పేరు మనుజున కేడదో॥ (డి 1773, Vol.V, 2155)

కాని ప్రజల కడగండ్లు పాలెగార్లను అణచిన బ్రిటిషు పాలన వచ్చేదాకా తీరలేదు. ఊర్లను పాలించే పాలెగార్లే కాదు, వాళ్ళను అదుపులో పెట్టలేని రాజులు, నవాబులు కూడ తక్కువ తిన్నవారు కాదు[10] ప్రజల నమ్మకాన్ని పొందడంలో వీరు ఘోరంగా విఫలమైనారు ప్రజలను నమ్మించి మోసం చేసేవారు.

పట్ట నేర్పు పాము పడగ యొరగజేయు
చెరుప జూచు వాడు చెలిమి జేసు
చంపదలచు రాజు చనువిచ్చుచుండురా (డి 1773 I-321)

'తరచు కల్లలాడు ధరణీశు'[11] 'కరువనున్న పాముల వలె నెరి దాచుకొని'[12] కాటు వేసేవారు. 'భూపతికృపలు'[13] నమ్మి దెబ్బతిన్నవారు 'ప్రజల ఉసురుదాకి, ఆ రాజులు నశిస్తారు' అని శపించి ఊరుకున్నారు

---

9 ఈ అరాచకాల అవశేషాలు బ్రిటీషు సామ్రాజ్యం ఏర్పడిన కొంతకాలం దాకా ఉన్నాయి 19వ శతాబ్దం మొదట్లో కాశీయాత్రకు బయల్దేరిన ఏనుగుల వీరస్వామిగారు రాయలసీమ, తెలంగాణాల గుండా ప్రయాణం చేస్తూ అప్పటి చిల్లర పాలకులను గూర్చి వ్రాశారు " ఆ జమీందారులకు ఒకరికొకరికి సరిపడక వచ్చినట్టయితే పోట్లాడి చావడంమాత్రమే కాకుండా ఒకరి గ్రామాదులను ఒకరు కొల్లబెట్టి, రైతులను హింసించి గ్రామాదులను పాడుచేయుచున్నారు" "కాశీయాత్ర చరిత్ర" - పేజీ 24

10. "ఈలాగున కలహములు చెలరేగినప్పుడు న్యాయము విచారించి యొకరికొకరికి సమరస పెట్టకుండా దీవాన్‌జీ తనము చేసే చందు లాలా ప్రభృతులు ద్రవ్యకాంక్ష చేత నుభయులకున్ను కలహములు పెంచి వేడుక చూచుచున్నారు అలాంటి ప్రారబ్ధము నా ప్రయాణ కాలములోనే వనపర్తి జమీనుదారునకిన్నీ కొల్లాపురపు జమీనుదారునకిన్నీ ఒక సంవత్సరముగా పొసగి తహతహ పడుచున్నది" కాశీయాత్ర చరిత్ర - పుట 24

11 డి 1723, 278, డి 1725, 583

12. డి 1721, 22, డి 1735, 333

13. డి 1721, 44, అనేక ప్రతులలో ఉంది

అల్పబుద్ధివాని కధికార మిచ్చిన
దొడ్డవారి నెల్ల దొలగ గొట్టు
చెప్పు దిన్న కుక్క చెరకు తీపెరుగునా[14] (డి. 1721, II-8)

అని దృష్టాంతాలతో కూడిన వేదాంతం చెప్పుకున్నారు ఈ రాజులు 'దండసాధ్యులే' గాని 'ధర్మసాధ్యులు'[15] కారని కొందరు గ్రహించడం మొదలుపెట్టినారు 1662లో రాయలసీమ గుండా ప్రయాణం చేసిన Tavernier అనే వజ్రాల వ్యాపారి గండికోట నవాబు ప్రజలను శిక్షించే దారుణ పద్ధతిని గూర్చి వర్ణించాడు.[16] ఆనాడు రాజు తలచినదే ధర్మంగా చెలామణీ అయింది. రాజులంటే భయంతో బాటు ప్రజల మనస్సులలో రాజుల యెడల వ్యతిరేకత కూడ మొదలైంది.

ఎంత సేవచేసి ఏపాటు పడినను
రాచమూక నమ్మరాదు రన్న
పాముతోటి పొందు పదివేలకైనను[17] (డి 1773, I-322)

ఎరుకలేని దొరల నెన్నాళ్ళు గొలిచిన
బతుకులేదు వట్టి భ్రాంతి గాని
గొడ్డుటావు పాలు గోకితే చేపునా (డి 1721, 136)

ఒక్క రాజే కాదు – వారి కొలువులోని వారందరూ వారికి తగినవారే పాములవలె కాటువేసే వారే కాక కోతులవలె చీకాకు పరచిన వెర్రి వెంగలప్పలు కూడ ఆనాడు రాజ్యాలేలారు

కొండముచ్చు కెన్న కోతి పేరంటాలు
బడుగు దొరకు మంత్రి బండవాడు
బండవాని కరయ కొండీడు చుట్టము[18] (డి 1773 I-309)

కాని 'వెర్రి గొల్వరాదు విభుడెంత వాడైన'[19] అని భావించేవారు కొందరైతే ఆ మర్కటరాజుల చుట్టూ చేరే నిర్భాగ్యులు కొందరు ఉండేవారు

14 పాఠాంతరాలు తూలపారదిట్టు దొడ్డవాని, మాలవాడకుక్క మరి మొర్గకుండునా డి 1773, I, 177

15 డి 1721, 53

16 Tavernier's Travels in India - P 218, 219, Published in London in 1677 Republished by the "Bandabasi" office, 38-2 Bhowani Charan Dutt's Street, Calcutta - 1905

17 పాఠాంతరాలు రాచక్రూరులు, పదివేలు చెప్పిన – డి 1725, 639 పాలుపోసి పెంప పాముతో పొందేనే – డి 1727,347 ఎంతచేసి చేసి డి 1723, 332

18 పాఠాంతరాలు బండివాడు మంత్రి పడుచు దొరకు 1769, 779

19 డి 1723, 577

కోతి బట్టి దెచ్చి కొత్తపుట్టము గట్టి
కొండ ముచ్చులెల్ల గొలిచినట్లు
నీతిహీనులొద్ద నిర్భాగ్యులుందురు20,21

వేమన కాలానికి దేశమంతా నానా శకలాలుగా చెదిరిపోయి ఉంది ముస్లిం పాలన అప్పటికి బాగా స్థిరపడి పోయిందనే చెప్పవచ్చు కాని వారి పాలన అంతా యుద్ధాలలో నిమగ్నమై ఉండడంవల్ల వారి ప్రభావం గాఢతరంగా పడలేదనే చెప్పాలి వేమన ముస్లింల ప్రస్తావనతో వ్రాసిన పద్యాలు నాలుగైదు మాత్రమే కనబడుతున్నాయి. బ్రిటిషువారిని గురించి వేమన బహుశా విని ఉండలేదనే తలచవచ్చు అప్పటికే మద్రాసులో కోట కట్టుకున్నా, 1625 నాటికే నెల్లూరు జిల్లాలో తూర్పిండియావారు ఫ్యాక్టరీని స్థాపించినా ఆ గొడవ లేవీ వేమన్న చెవిన పడినట్టు లేదు

## II. వివిధ మతాల శిథిల సంధ్య

వేమన్నను గూర్చి పరిశీలించిన పాశ్చాత్యులు వేమన నాటి వివిధ పరిస్థితులలోకి క్షుణ్ణంగా వెళ్ళలేదు బ్రౌన్‌కూడ అప్పటి చరిత్రను తెలియజేసే వేమన పద్యాలను గూర్చి ఎటువంటి వివరణ లేకుండానే కేవల భావానువాదం చేశాడు 19వ శతాబ్దం తొలిపాదంలో భారతదేశంలో నివసించిన ఇంగ్లీషు దొరలు ఆనాటి మత సాంఘిక చరిత్రల మీద దృష్టి సారించి ఉంటే మనకు అమూల్య విషయాలు లభించి ఉండేవి. మత పరిస్థితుల విషయంలో 17వ శతాబ్దం నాటికీ 19వ శతాబ్దం తొలినాళ్ళకీ సంబంధమే లేనంత భేదం కనబడదు భారతీయ మత జీవనంలో ఒకటి రెండు శతాబ్దాలు, గుర్తు పట్టలేని పెద్ద మార్పులు తెచ్చేటంతటి దీర్ఘకాలం కాదు నాటి రాజ్యాల వైభవం, ప్రజల విశ్వాసాలు, సుఖదుఃఖాలు, విద్వేషాలను గూర్చి నేటి శిథిలావశేషాలు కొంత చెప్తాయి.

"History fails to tell us much of what these kingdoms did, whom they conquered, how they fell But geography steps in to prove how far their arms reached, how deep the impress they left All over the Indian seas we find the tokens of a great Telugu dominian"22

శిథిలాలనేకాక భారతీయ జన జీవితాన్ని కొంత లోతుకు వెళ్ళి సాంస్కృతిక దృష్టితో పరిశీలించిన పాశ్చాత్యులు కూడ కొందరు లేకపోలేదు వారిలో 19వ శతాబ్దం తొలిభాగంలో దక్షిణదేశంలో నివసించిన ఫ్రెంచి మత గురువు జె ఏ దుబాయ్ చెప్పకోదగిన వాడు ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నుడైన ఈ పరాసు ఫాదరీ స్థానిక పరిస్థితులను

20 పాఠాంతరం 'కొత్త పట్టము' – డి 1723, 355

21 He had no great reverence for a jack in Office Perhaps he had in view some local Dogiberry when wrote If you catch a monkey and dress it a new coat the hill apes will all worship it Thus are the luckless subjects to the senseless - Teacher and Preacher P 70 L D Barnett Through courtesy "Vemana through western eyes" (డి 1721–2–64)

22 Popular poet - C V Gover 1871
"Vemana through western eyes"- Page 42

తన దృష్టితో చూసినప్పటికి, సాధ్యమైనంత నిష్పక్షపాత వైఖరితోనే తన గ్రంథాన్ని రచించాడు. ఆయన హిందువుల ఆచారాలను గూర్చి వ్రాసిన ఈ పరిశోధనాగ్రంథం ఆయన సూక్ష్మదృష్టికీ, నిరంతర పరిశ్రమకూ నికషోపలం దుబాయ్ వర్ణించిన పరిస్థితులు 19వ శతాబ్దం తొలిభాగంలో తాను ప్రత్యక్షంగా చూసినవి. అవి 17వ శతాబ్దంనాటి మతపరిస్థితులకు ఏమాత్రం భిన్నమైనవి కావు[23] ఒకవేళ కించిద్భేదం కనిపించినా అది పరిణామంలో తరువాతిదశ కావచ్చునేమో కాని, రెండు పరిస్థితులను వేరు పరిచే మలుపు కాదు.



వేమనను మొట్టమొదటిసారి పేర్కొన్న ఫ్రెంచి మతగురువు
అబే దుబాయ్

23 అబే దుబాయ్ ఈ పుస్తకంలోని విషయాన్ని తనకన్న ముందుతరంవాడైన ఓ Jesuit missionary రాసిన అముద్రిత గ్రంథం నుండి చౌర్యం చేశాడని Sylvia Murr అనే ఫ్రెంచి రచయిత రాశారట ఇదింకా కచ్చితంగా తేలవలసి ఉంది అయితే దుబాయ్ 'పేరున' ఉన్న గ్రంథంలోని విషయాన్ని ఉపయోగించుకోవడానికి ఈ నిజం అడ్డురాదు Literary Auto - biography of C P Brown Brown's projects edition, Sri Venkateshwara University - 1978, P P 35, 36

## 1. మతావశేషాలు

'మతము' మన్ (To think) అనే ధాతువు నుండి పుట్టింది. మతం అనే పదానికి సమ్మతమైనది అని విజ్ఞాన సర్వస్వం అర్థం చెప్తున్నది.[24] ఇష్టమైన దానిని తెలుసుకోవడమే మతం అని ఆ అర్థానికి వివరణ. అభిప్రాయం అనే అర్థంలో కూడ 'మతం' వ్యవహరించబడుతున్నది. అతీంద్రియ విషయాలు, మానవ శ్రేయస్సూ, కర్తవ్యం వీటినిగూర్చిన ప్రతీతి – విశ్వాసం మతం అనే పేరుతో రూఢి కెక్కినవి. కొన్ని భారతీయ భాషలలో సంప్రదాయాన్ని (Tradition) మతం అనే అర్థంలో వాడుతున్నారు. ధర్మం అనే పదం కూడ మతానికి పర్యాయంగా ప్రయోగించబడుతున్నది. పారంపర్యంగా సంక్రమించే విద్యాస్థానం, శ్రద్ధా సంప్రదాయ మనబడతాయి. ధరించేది కాబట్టి ధర్మం. లోకాన్ని, సంఘాన్ని ధరించేది ధర్మం మతం, సంప్రదాయం, ధర్మం అనే ఈ మూడు Religion అనే పదానికి సమానార్థకంగా వ్యవహరించబడుతున్నాయి. మానవుని నిత్య జీవిత కృత్యాలనుండి విముక్తిని అంగీకరించేది మతం. మానవుని మామూలు జీవితాన్ని ఈవిధంగా నిర్వచించవచ్చును. "గానుగ ఎద్దువలె నక్తందినముల నిత్యకృత్యములను, వృత్తి కర్మను చేయుచు స్వభావమును, గమ్యమును, స్వస్థితిని ఎరుగక నిశ్చిత ఆదర్శములు, విలువలు లేకుండ బ్రతుకుట మామూలు జీవిత విధానము ఇటువంటి సామాన్య జీవితమునుండి ఏదో విధమగు ముక్తిని లేదా పరిత్రాణను (Salvation) లేదా అతీత ప్రాప్తిని అంగీకరించునది మతము అని చెప్పుట ప్రపంచమునందలి గొప్పమతము లన్నింటికి వర్తించునని తోచును మోక్షము నంగీకరింపని మతము లేదు"[25]

అనాదిగా జ్ఞానము ద్వారా మోక్షము నిత్యప్రాప్తంగా ఉన్నదనీ, దానిని గుర్తించడమే మోక్షమని కొన్ని మతాలు చెప్తున్నాయి మామూలు జీవితం నుండి విముక్తం కావడమే సిద్ధిపొందడం అన్నమాట క్రైస్తవమతానికి అవధి పరిత్రాణ ప్రాకృతజీవితాన్ని వదలి దివ్యజీవితాన్ని పొందడమే పరిత్రాణ

జంతువులవలె యథేచ్ఛావృత్తి కాకుండా విధి నిషేధాలకు లొంగిన జీవితాన్ని మతం నిర్దేశిస్తుంది చాలావరకు భారతీయ మతాలన్ని ఏదోరకమైన 'ముక్తి'ని అంగీకరించాయి. కాని ఆ ముక్తి స్వరూపం అర్థం చేసుకోవడంలో, భావించడంలో, అనుభవించడంలో ఉన్న తేడాలను బట్టి దానిని సాధించడంకోసం అనుసరించవలసిన మార్గాలలో భేదాలు ఏర్పడ్డాయి పరమార్థ మొక్కటే అయినా దానిని సాధించడం కొరకు జరిపే ఉపాసనాకాండలో మాత్రం వైవిధ్యాలు జనించాయి మతాలు అన్నీ సమానమే 'అన్నింటి గమ్యమొకటే' అనేవాళ్ళేకాక 'ఉన్నది ఒకటే మతం, అది పరమం తక్కినవన్ని దాని కింది దశలు పరమ మతాన్ని చేరడానికి ఇవి సోపానాలు మాత్రమే' అని కూడ విశ్వసించే వాళ్లున్నారు కాని ఈ సమగ్ర దృష్టి కాకుండా, వీటిలో ఏదో ఒకటే ఋజువైనదనీ, ప్రశస్తమనీ నమ్మి దానిని అనుసరించేవారే అధిక సంఖ్యాకులున్నారు తమ మతం ప్రశస్తమైనదని భావించడంతోనే మనుష్యులు ఆగలేదు, తమ మతం ప్రతిపాదించే ధర్మమే నిజమైన మోక్షమార్గమని నమ్మడమే కాకుండా, తమ దొక్కటే సత్యమని భావించడంతోనే చిక్కులు మొదలైనాయి సిద్ధాంతాలు, కర్మకాండలు మున్నగు విభేదాలు వివాదాలవైపు దారి తీసినవి స్వమతం మీది అభిమానంతోపాటు పరమతాలనిరసన

---

24 . విజ్ఞాన సర్వస్వము – Vol VII తెలుగు భాషా సమితి ప్రచురణ, 1962

25 విజ్ఞానము సర్వస్వము – Vol VII తెలుగు భాషాసమితి, 1962

కూడ చీడవలె పుట్టి వ్యాపించింది స్వమతధర్మాలను సమర్థించుకొనుటకు అన్యమత ధర్మాలను ఖండించుటకు కావలసిన తర్కశాస్త్ర పాండిత్యం కూడ ప్రజలకు పుష్కలంగా నేర్పబడింది మతకలహాలు రాజకీయ కలహాలకన్న హానికరమై, ఒకప్పుడు వాటికి కారణమై జాతి సుఖ జీవన సారాన్ని పీల్చి పిప్పి చేసినవి

వేమన కాలంలో వివిధ మతాల స్థితిగతులను తెలుసుకునే ముందు వాటి తత్త్వాలను గూర్చి స్థూలంగానైనా తెలుసుకోవలసి ఉంది అద్వైత తత్త్వాన్ని ప్రతిపాదించినవాడు శంకరాచార్యులు ప్రపంచంలోని చరాచరాలన్నీ ఒకే అనాదిపదార్థం నుండి ఉద్భవిస్తున్నాయని దీని సారాంశం. ఏకమైన ఈ పదార్థానికి ఆత్మ లేక బ్రహ్మము అని పేర్లు ఇదొక్కటే నిత్యమైనది మిగిలినవి అనిత్యాలు ఏకమైన బ్రహ్మం అజ్ఞానం వలన, లేక ప్రతి వస్తువు మాయావృత్తం కావడం వలన భిన్నరూపాలుగా కానవస్తున్నది అజ్ఞానం వలన కనిపించే ఈ వైరుధ్యం నశించి బ్రహ్మ పదార్థం ఒకటే అని తెలియడం. **"ఆ బ్రహ్మం నేనే"** అనే జ్ఞానాన్ని పొందడమే మోక్షం ఇదే అఖండ తత్త్వం

ఈ అఖండ వాదాన్ని రామానుజాచార్యులు పూర్తిగా అంగీకరించలేదు ప్రపంచం మాయ లేక మిథ్య అనడాన్ని ఆయన ఒప్పుకోలేదు ఆయన భగవంతుణ్ణి ఈశ్వరరూపంలో దర్శించి ప్రతిష్ఠించాడు. జీవాత్మకు వ్యక్తిత్వమున్నది అది పరమాత్మ యొక్క సాహచర్యాన్ని మాత్రమే పొందుతుంది, కాని దానితో ఏకం కాదు అని ప్రతిపాదించాడు ఈ సిద్ధాంతాన్ని విశిష్టాద్వైతమని అంటారు. శంకరుల అద్వైతాన్ని రామానుజుడు కొంతవరకు సడలిస్తే మధ్వాచార్యులు పూర్తిగా వ్యతిరేకించాడు జీవాత్మ పరమాత్మల మధ్య రామానుజుడు కించిద్భేదాన్ని దర్శిస్తే, ఆ భేదాన్ని పూర్తిచేసినవాడు మధ్వాచార్యులు మధ్వాచార్యుల ప్రకారం భౌతిక ప్రపంచం వాస్తవికమైనదే కాక శాశ్వతమైనది కూడ ఈయన దృష్టిలో తెలుసుకొనేవాడు, తెలుసుకొనబడేది లేకుండా జ్ఞానం లేదు ఈయన ఐదురకాల భేదాలను వర్ణించాడు అద్వైతులు ఈ భేదాలను **"మాయ"** లేక **"లేనివి"** అని ప్రతిపాదిస్తే, ద్వైతులు ఈ భేదాలను **ఉన్నవాటిగా** అంగీకరించారు రామానుజుడు ప్రతిపాదించింది కూడా శ్రీవైష్ణవమే అయినందున భేదం తెలియడంకోసం తన మతానికి 'సద్ వైష్ణవం' అని నామకరణం చేశాడు మధ్వాచార్యులు సద్ వైష్ణవులు కూడ భక్తితత్త్వాన్ని నెలకొల్పారు.[26]

కాని ద్వైతబంధాల నుండి బయటపడి అద్వైత సిద్ధిని పొందడం సామాన్యులకు సాధ్యం కాని పని సద్గుణమైన బ్రహ్మాన్ని అనుభవపూర్వకంగా సాధించి తెలుసుకొనుటకు కావలసిన సహనం, దార్ఢ్యం సామాన్యులకుండదు కాబట్టి ముందు సగుణ బ్రహ్మమును ఉపాసించి ధ్యానిస్తే అది నిర్గుణోపాసనకు దారి తీస్తుందని అద్వైతులు తలపక తప్పలేదు ఇక ఉత్సవాలు, వేడుకలు మొదలైన పద్ధతులను అనుసరించడం మొదలు పెట్టారు ఈవిధంగా సిద్ధాంతానికి అద్వైతులమని చెప్పినా ఆచరణలో ద్వైతులైపోయారు

*అంతరంగమందు నద్వైతియై యుండు*
*బాహ్యమందు ద్వైత భావియగును*
*నట్లుగాక తత్త్వమేలవడ నేరదు విశ్వ॥* (డి 1727, 19)

సగుణ వాదం వలన మనుష్యుల అభిరుచులను బట్టి దేవతలు సృష్టించబడ్డారు

---

26. తత్త్వవేత్తలు - వాల్యూమ్ II - గోపీచంద్, పేజీలు 1, 9, 40

"ఉపాసన సాధనములుగా నుండవలసిన విగ్రహములు దేవతలుగా తలపబడెను. సంఘదేవతలు జాతి దేవతలుగను, ఊరి దేవతలుగను, ఇంటి దేవతలుగను అవతార భేదములు దాల్చవలసి వచ్చెను."[27] ఆనాటి బ్రాహ్మణులు తత్త్వాన్ని వదిలివేసి కేవలం మతాలను స్వాధీనం చేసికొన్నారు ప్రజల జీవన విధానాన్ని తమ స్వార్థాలకు, స్వాభిమానాలకు అనుగుణంగా శాసించడం మొదలుపెట్టారు ఆనాటి బ్రాహ్మణుల వేషధారితనాన్ని వర్ణించే ఒక రత్నంవంటి శ్లోకాన్ని విశ్వగుణాదర్శంనుండి గ్రహించి శ్రీ రాళ్ళపల్లి తమ 'వేమన' ఉపన్యాస గ్రంథంలో ఉటంకించారు కులభేదాలు తీవ్రతరమై, కులాతిక్రమణచేసే వారికి కులబహిష్కరణలు నిర్ణయించారు. ప్రాయశ్చిత్తాలతో పబ్బం గడుపుకోవడం సాగించారు తమ ఆధిక్యాన్నే సర్వదా ప్రచారం గావించారు.

## 2. "కల్ల గురువులు"

వేమన గురువులను జ్ఞాన గురువులు, కల్ల గురువులు అని రెండు రకాల వారిని పేర్కొన్నాడు కాని ఆ కాలంలో ఎటు చూసినా నకిలీగురువులే ప్రత్యక్షమైనారు అబద్ధపు గురువులను గూర్చి తెలుసుకునే ముందు 'వేదాంతసారం'లో వర్ణించబడిన నిజ గురువులను గూర్చి తెలియవలసి ఉన్నది[28]

గురుడు జ్ఞానఖడ్గంతో శాఖోపశాఖలుగా విస్తరించిన పాపాన్ని మొదలంటా నరికివేస్తాడు హేతుకాంతితో పాపపూరితమైన తమస్సును చెదరగొడతాడు. పాపం కొండవంటిదైనా దానిని వజ్ర హృదయంతో ఎదురుకొంటాడు స్వతంత్ర బుద్ధితో ఉదాత్తంగా వర్తిస్తూ శిష్యులను కన్నబిడ్డలవలె భావిస్తాడు స్వపర భేదం లేక అందరిపైన సమానంగా దయామృతం కురిపిస్తాడు ఇనుప ముక్కకూ, పసిడి ముద్దకూ ఒకే రకమైన విలువనిస్తాడు శివ పారమ్యాన్ని కీర్తిస్తాడు. బోధించేవన్నీ ముందు తన ఆచరణలో చూపుతాడు క్షేత్ర సందర్శనం చేస్తాడు చతుర్వేదాలు, వేదాంగాలు, జ్యోతిష్యం, వైద్యం, ధర్మం మొదలైన శాస్త్రాలు; కావ్య నాటకాలు, అష్టాదశ పురాణాలు, చతుష్షష్టి కళలు మున్నగునవన్నీ చదువుకొని ఉంటాడు

వేమన కాలానికి పై లక్షణాలు ఉన్న గురువులు మృగ్యమైనారు ఆనాటికి 'గురువు' అనే పదానికి 'యజమాని' అన్న అర్థం వచ్చి చేరింది రాజ్యానికి రాజే గురువు అనే వాడుక పుట్టింది ఆధ్యాత్మిక విలువల వలన కాకుండా సంఘంలో హోదా సంపత్తులు గలవారు కూడ గురువులుగా పరిగణన లోనికి వచ్చారు గురువు వంశంలోని వారు ఆధ్యాత్మిక జ్ఞాన హీనులైనప్పటికి తరువాతివారు వారసత్వంగా గురువులైనారు ప్రజలకు వీరు బోధించేదేమిటో అర్థమయ్యేది కాదు పారిభాషికపదాలతో ప్రజలను హడలగొట్టేవారు గురువు చెప్పేదేమిటో దేవునికే తెలుసు అని ప్రజలు తికమకపడేవారు

గురువు చెప్ప విద్య గురునకు తెలుసును
గురువు చెప్ప విద్య గురువు యెరుంగు
గురువు మహిమ పరమ గురువుకు తెలుసును[29] (డి 1723, 6)

---

27 వేమన – పేజీ 75, రాళ్ళపల్లి

28 ఈ వర్ణనను అబె దుబాయ్ తన గ్రంథంలో ఉదహరించాడు

29 . పాఠాంతరము – 'గురువుకే తెలుసురా'– డి 1769

ఇట్టివారి శిష్యరికం 'గురువు శిష్యవృత్తి గుడ్డెద్దు జొన్నయా' (డి 1723) అని తలచబడింది.

సమకాలంలోని మతసంబంధమైన కట్టుబాట్లను రక్షించడం తమ కర్తవ్యంగా వీరు భావించారు. కులం నుండి బహిష్కరించడం వంటి శిక్షలను అమలు జరిపేవారు వారి ఆశీస్సులు లేకుంటే పాపాలు పోవని చెప్పేవారు. వారిచేత 'ప్రసాదం' పొందడమే మహాభాగ్యం. విభూతి, పూజా పుష్పాలు, వారి ఎంగిలి కూడు, వారు పుక్కిలించిన లేక ముఖం, కాళ్ళు చేతులు కడుగుకున్న నీరు (ఈ నీరు తీర్థంగా పుచ్చుకొని తరచుగా తాగేవారు) – ఒకటేమిటి, వారి పవిత్ర హస్తాలతో ఏది ఇచ్చినా ప్రజల దేహాత్మలలోని కల్మషాలు క్షాళితమౌతాయని నమ్మించారు. సామాన్యప్రజలు వీరిని భయగౌరవాలతో సేవించారు న్యాయమైనా, అన్యాయమైనా గురువులు శపిస్తే "నాశనమై పోతామని" వారు విశ్వసించే వారు. గురుప్రశస్తిని వర్ణిస్తూ అనేక గ్రంథాలు వెలువడ్డాయి ప్రజల మూఢత్వాన్ని పెంచి అభూతకల్పనలను, గురువుల మహిమలను, ఆ గురువుల చుట్టూ ఉండే శిష్యులు ప్రచారం చేశారు

గురువుల నోటి మాటకు తిరుగులేదనీ, దాని వలన చెడిన వారిని తమ కళ్లతో "చూసినామ"ని ప్రజలకు చెప్పేవారు గురువులు శాపం పెట్టీపెట్టక ముందే వెంటనే ఒకడు చచ్చిపోవడం తాము "చూశామ"నీ, గురువు తిట్టగానే ఒక స్త్రీ నెలలు నిండకనే 'ప్రసవించినద'నీ, ఒక కూలివాడి ఎడ్లు 'చచ్చిపోయాయ'నీ, గురువు శాపం తగిలి ఒకడు శిలగా, మరొకడు పందిగా 'మారినార'ని శిష్యులు ప్రచారం చేసేవారు మూఢులైన ప్రజలు నిజంగానే వాటిని నమ్మి గురువుల అడుగులకు మడుగులొత్తేవారు గురువులు కోరిన కానుకలను అర్పించడానికి పెండ్లాం బిడ్డలను తెగనమ్మడానికైనా సిద్ధపడేవారుకాని, గురువులను నొప్పించి శాపోపహతులు కావడానికి ఎవ్వరూ సాహసించేవారు కాదు

ఈ గురువులలో పేద యతులు కూడ ఉండేవారు వీరు గుళ్ళ పంచలలో ఉండి వీలయినంతలో ప్రజలకు ఉపదేశం చేసేవారు

కూడు చీర బాసి గుళ్ళ పంచలబడు
నట్లు వ్రాసె బ్రహ్మ యతుల నుదుట
తోయజాక్షుజేర దోషంబు లంటునా[30] (డి 1721, 248)

ఈ గురువులు అనేక రకాలుగా ఉండేవారు సామాన్య బ్రాహ్మణ గురువులే కాకుండా, స్మార్త తత్త్వవాద, బ్రాహ్మణులకు వారి వారి ప్రత్యేక గురువులుండే వారు ఇతర కులాల వారేకాక ప్రతి కులానికి ప్రత్యేకంగా గురువులు ఏర్పడ్డారు వీరిని 'కుల గురువుల'నేవారు ఈ గురువులలో చాలామంది మానిని, మధుపానాదులను మరిగారు [31]

---

30 ఆ కాలంలో 'చీర' వస్త్రమే కాని కేవలం స్త్రీలు ధరించే వాటికే పరిమితం కాదు ఈ పద్యంలో మూడవ చరణం అర్థం స్పష్టంగా లేదు 'తొల్లి జేసినట్టి దోషంబు తగిలెనో' (డి 1723, 889) అనే పాఠం ఉచితంగా ఉన్నది

31 పై అంశాలన్నీ-టికీ దుబాయ్ చేసిన ప్రత్యక్ష పరిశీలన ఆధారం

*చోరునకు యేల సుభగ ప్రవర్తన*
*జారునకు యేల జపము తపము*
*మద్యపానికేల మహిమీద తత్త్వంబు.* (డి. 1773, 260 వాల్యూమ్ I)

ఈ గురువులు రాజులతోపాటు యుద్ధభూములకు పోయి విజయం కొరకు మంత్రాలు చదివి ఆశీర్వదించేవారు. గురువులకు ప్రజలపై ఉన్న ప్రభావం, పలుకుబడివల్ల రాజులుకూడ వీరిని అమితంగా గౌరవించేవారు

'గురుదక్షిణ' మొదలైన పేర్లతో వీరు ప్రజలనుండి అనేక రకాలైన పన్నులు వసూలుచేసే వారు. గురువులు ప్రజల మధ్యకు వచ్చినప్పుడు అతి వైభవాన్ని ప్రదర్శించేవారు. ప్రజలలో గురువులు ఊరేగే దృశ్యాన్ని దుబాయ్ కళ్ళార చూచి వర్ణించాడు. జిల్లాలలో వారు ఏనుగులపై ఊరేగేవారు. కాలినడకనే ఎందరో వారి ననుసరించేవారు. ఆయుధపాణులైన వారు వెనకాముందుల నడిచేవారు. అనేకరకాలైన వాయిద్యాలు మోగుతుండగా గురుస్తుతి గీతాలు పాడుతుండే వారు. దేవదాసీలు నర్తించే వారు అశ్లీల గీతాలు కూడ వినిపించేవని దుబాయ్ వ్రాశాడు గురువు నడిచినప్పుడు దారి పొడవునా కొత్త వస్త్రాలు పరిచేవారు తోరణాలతో వీధులను అలంకరించేవారు. ఈ పర్యటనలలో ప్రజలు గురువులకు కానుకలు సమర్పించేవారు **'కాసులకును దిరుగ కలుగునా మోక్షము'** (డి. 1721, 1256) గురువులకు **"గుంటుపోకలు"**, **'పుచ్చకూరలు'** ఇచ్చే ఆచారముండేది. "గురువుకైన వొంటి గుంటుపోకీయరు" (డి 1723 97) గురువునకును "పుచ్చకూరైన నియ్యరు" (డి 1721, I, 28)

ప్రజలు భక్తితో ఇచ్చే కానుకలతో వీరెప్పుడూ తృప్తిపడేవారు కారు కట్టుబాట్లు తప్పిన వారినుండి వీరు ధనం వసూలుచేసే పద్ధతి నిర్దయగా ఉండేది ఇవ్వలేనివాని ముఖాన పేడనీరు చల్లి అవమానించే వారు అప్పటికీ వాడు చెల్లించలేకపోతే వాడి పిల్లల్ని లాక్కునేవారు ధనం ముట్టేదాకా వారితో వెట్టిచాకిరీ చేయించుకునేవారు ఒకప్పుడు ధనానికి బదులుగా వాడి భార్యను లాక్కుపోయిన సంఘటనలు కూడ ఉండేవి చివరి అస్త్రంగా శాపాలతో బెదిరించేవారు ఎవరో కొందరు వివాహితులైనప్పటికీ గురువులలో అధికులు బ్రహ్మచారులే తరుచుగా వీరి బ్రహ్మచర్యం నేతిబీరకాయవంటిదిగానే ఉండేది వీరెప్పుడూ ఒకరిద్దరు స్త్రీలను వంటలక్కలుగా నియమించుకునేవారు సామాన్యులకు విధించే కట్టుబాట్లు తమకు వర్తించనట్టుగానే ప్రవర్తించేవారు అనాటి సమాజంలో గురువులదే అత్యున్నత స్థానం దేవతలకు కూడ జరగని ఉపచారాలు వీళ్ళకు జరిగేవి ప్రజలు గురువులను లోలోపల అసహ్యించుకునేవారు

*తల్లిదండ్రులెన్న తన మొదలి గురువులు*
*పార్వతీ భవులును పరమగురులు*
*కూలికాండ్ర జగతి గురులన ద్రోహంబు* (డి 1721, II, 335)

నాటి గురువులందరూ ధూర్తులే అని నిర్ణయానికి రావడంకూడ తొందరబాటే కాగలదు అక్కడక్కడ ద్వీపాలవలె సజ్జనులు లేకపోలేదు కాని వారి సంఖ్య నాటి అధర్మస్థితిని ఎదుర్కొన గలిగినంతగా లేదు

*భూమి లోన పుణ్య పురుషులు లేకున్న*
*జగములేల నిల్చు పొగులు గాక*
*అంత తరచు దొరక రాడ నాడను గాని* (డి. 1721, I 63)

### 3. శైవ వైష్ణవాల సంఘర్షణ

భారతీయ తత్త్వసంప్రదాయాలలో అనేక భేదాలున్నాయి వాటిలో శ్రీవైష్ణవం, శాంకరం అనేవి కొన్ని. రామానుజుని శ్రీవైష్ణవ తత్త్వాన్ని గూర్చి ఇంతకు ముందే సారభూతంగా కొంత తెలుపబడినది దీనికి విశిష్టాద్వైతమని పేరున్నా వ్యవహారంలో మాత్రం ఇది ద్వైతమే రామానుజుల విశిష్టాద్వైతానికి వీర శైవానికి ముఖ్యతత్త్వంలో భేదం లేదు కానీ మోక్షమంటే వీరశైవులకు శివసాయుజ్యమని అర్థం. జీవ బ్రహ్మైక్యాన్ని విశిష్టాద్వైతంకంటె ఇదే ఎక్కువగా అంగీకరించింది. ఇక శంకరాద్వైతం శంకరాచార్యులు ప్రతిపాదించిన మాయావాదం దీనిని సర్వాద్వైతమని కూడ పిలుస్తారు.

ద్వంద్వాతీతులై భగవంతుని కైంకర్యసౌఖ్యం అనుభవించడమే వైష్ణవుల దృష్టిలో మోక్షం దానిని చేరడానికి భక్తి వారికి సాధనం భక్తిమార్గం కన్న సులభమైన 'ప్రపత్తి'ని కూడ వారు అనుసరించారు యోగవిద్యలలో వీరికి నమ్మకం ఉన్నట్టు కానరాదు 32 శంకరాచార్యుల అద్వైతం బ్రాహ్మణులలోనే వ్యాప్తిగాంచినది ఈ అద్వైతం యోగవిద్య సహాయం లేక బ్రతకడం కష్టం కనుక ఇది ఎక్కువగా వ్యాప్తి చెందలేదు యోగాభ్యాసం చేసిన యోగులు అద్వైతంలో అపురూపమైనారు

అద్వైత సిద్ధాంతం ప్రచారంలోనికి వచ్చినప్పటికీ అప్పటి బ్రాహ్మణులు కర్మకాండల వాసనలను పూర్తిగా వదులుకోలేకపోయారు

"But by this, inspite of the teachings of Acharyas like Shankara and Ramanuja, Vedic religion had deteriorated into dogmatic rigidities Even the splendid vision of the Upanishads was dimmed by sectarian customs Blind beliefs and, meaningless and superstitious rituals had become parasitic growths on society The cult of sacrifice was widely prevalent "33

ఇటువంటి పరిస్థితులలో వీరశైవం పుట్టింది 12వ శతాబ్దంలోని బసవేశ్వరుడు దీని స్థాపకుడు ఆ కాలంలో గొప్ప శక్తిమంతమైన సంస్కరణ సాధనంగా వీరశైవం పుట్టింది శివపారమ్య కీర్తనం, వేద విహితమైన యజ్ఞయాగాదుల నిరసన, కులభేదాల నిరాకరణ, స్త్రీ పురుష అసమానతల తిరస్కరణ, అస్పృశ్యత పైన ధ్వజమెత్తడం వంటి సూత్రాలతో వీరశైవం దేశంలో కాలూనింది కుల విభేదాలకు వ్యతిరేకంగా కులాంతర వివాహాలు జరిపించారు వీరశైవులు, మానవతావాదాన్ని, సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని ప్రబోధించారు

ఈ మతం కార్చిచ్చువలె దేశంలో వ్యాపించింది శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు, పాల్కురికి సోమనాథ కవి మొదలైనవారు వీరశైవాన్ని ఆంధ్రదేశానికి తెచ్చి

---

32 వేమన – రాళ్ళపల్లి పుట 84
33 Basaveswara (Makers of India literature series) - by H Thippe Rudraswamy, Sahitya Academy, New Delhi 1975

తీవ్రప్రచారం గావించారు. వీరశైవంలో అన్ని కులాలవారికి ప్రవేశమున్నది, అత్యున్నత స్థానంలోని బ్రాహ్మణులూ, అట్టడుగున ఉన్న అస్పృశ్యులూ అందరూ వీరశైవమతంలో సమానులైనారు ఒకరకంగా బ్రాహ్మణాధిక్యతకు వ్యతిరేకంగానే విజృంభించింది వీరశైవం.

వేసమునకునైన దాసరి గావచ్చు
హొంగుదప్ప వేళ జంగమగును
పదియు వేలకైన బాపడు గారాదు (డి. 1773-1-262)

కాని కాలం విచిత్రమైనది. ఉదాత్తమైన ఆశయాలతో పైకెగసిన వీరశైవం తొందరలోనే నిస్తేజమై పోయింది ఆత్మ నశించి కేవలం శరీరం మాత్రం శేషించింది. చిత్తశుద్ధి కరువైపోయింది (చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా) కులాలే వద్దని తిరస్కరించిన శైవులు **'లింగాయతులు'** అనే మరో కొత్తకులం ఏర్పడడానికి కారకులైనారు. వీరశైవులలో అనేక వర్గాలేర్పడి సంఘంలోని వర్ణవ్యవస్థ మార్గంలోనే అనేక కులాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా బ్రాహ్మణ, అబ్రాహ్మణ భేదం ఆధారంగా ఆరాధ్యులు, జంగాలు వెలిశారు. కొత్త ఆచారాలు, గురువులు, కొత్త విశ్వాసాలు ఏర్పడ్డాయి లింగధారణ, క్షేత్ర సందర్శనం, శివభజన, పైపూతలు మొదలైనవాటిపట్లనే పట్టింపు లెక్కువైనాయి కాని ఈ అలజడితో తత్త్వం అడుగునపడిపోయింది [34]

నొసలు బత్తుడయ్యె నోరు తోడేలయ్యె
మనసు భూతము వలె మలయగాను
శివుని గనియెనన్న సిగ్గెట్లు గాదకో. (డి 1721, 154)

తాత్త్విక స్థాయిలో లింగమతం ప్రశస్తమైనదే, కాని ఆ కాలంలోని లింగధారులు మాత్రం దొంగలే అయినారు

ఆరు మతములకన్న నధికమైన మతము
లింగమతముకన్న లేదు జగతి
లింగధారికన్న దొంగలు లేరురా[35] (డి 1721, 271)

వీరశైవ మత సిద్ధాంతాలను అభిమానించినవారు కూడ ఆ కాలపు వీరశైవులను అసహ్యించుకొన్నారు

ఇక వైష్ణవ మతపరిస్థితి కూడ ఇదే విధంగా ఉన్నది దీనిలో కూడ తెన్‌గల, వడగల భేదాలు ఏర్పడ్డాయి నొసళ్ళపైన ధరించే 'నామ' రూపభేదం కూడ ఈ వివాదానికి కారణమైంది ఆ నామం గోపీచందనంతోనా తిరుమణితోనా అనేది కూడా విభేదాలు సృష్టించజాలింది

పట్టు చీరగట్టి పట్టె తిరుమణిబెట్టి
సృష్టి వైష్ణవంబు శిఖలు మించె
చిన్నెలెన్నో జేసి చెరచె వైష్ణవ మిట్లు[36] (డి 1721 II, 412)

---

34 "Religion in a word becomes organised hypocracy" - Page 43 V R Narla

35 పాఠాంతరం దొంగతనము మేలు దోషకారులకెల్ల (డి 1727, 175)

36 పాఠాంతరం చిన్నెలింతెగాని శ్రీవైష్ణవ మతంబు (డి 1723, 1085)

బ్రాహ్మణుల షణ్మతాలవలె శైవ వైష్ణవాలు కేవలం తాత్త్విక స్థాయిలోనే విభేదించి ఊరుకొన్నవి కావు. లౌకిక స్థాయిలోకూడ అవిరళంగా వివాదపడ్డాయి అసహనమే ఈ వివాదాలకు కారణమైంది శైవ వైష్ణవాలు వేరువేరుగా వర్ధిల్లుతున్న ఆ కాలం లోనే శివకేశవాభేదంతో ఇద్దరిని సమానప్రతిపత్తితో పూజించేవారు కూడ అధిక సంఖ్యాకులున్నారు

శైవ వైష్ణవాది షణ్మతంబులకెల్ల
దేవుడొక్క డనుచు తెలియలేరు
తమకు భేదమయిన తత్త్వంబు భేదమా (డి 1721-2-369)

ఆ కాలంలోని శైవ వైష్ణవుల పతనావస్థనూ, వారి మధ్య సంఘర్షణను అబె దుబాయ్ తన గ్రంథంలో విపులంగా వర్ణించాడు వారు ధరించే చిహ్నాలను బట్టి వారిని లింగధారులని, నామధారులని కూడ పిలిచేవారు. శైవులు లింగాన్ని మెడలోగాని, తలలోగాని, చేతికి (దండ) గాని కట్టుకొనేవారు దక్షిణభారత దేశంలో వైష్ణవులు పెద్దసంఖ్యలో ఉన్నారు విష్ణుభక్తునికి అనేక పేర్లు వాడుకలో ఉండేవి – దాసరి, రమణయోగి, బైరాగి మొదలైనవి శివయోగికి కూడ బైరాగి అనేవాడుక ఉన్నది వైష్ణవులు పీతాంబరధారులు తలపాగాలు, భుజం మీద పులితోలు, 'మెడలో పొడ'పైన తులసిపూసల మాలలతో వారి వేషం ప్రత్యేకంగా ఉండేది 37

వీరు భిక్షకు బయలుదేరినప్పుడు చేతిలో కంచుగంట, శంఖు ఉండేవి బిచ్చానికి బయలుదేరుతూ వారు తమ రాకను తెలియజేస్తూ శంఖు వూదేవారు గంట మోగించేవారు వారి మెడలో ఒక వెండి రేకు పలక వ్రేలాడుతుండేది దానిపైన హనుమంతుని రూపంగాని, విష్ణువు దశావతారాలుగాని చెక్కి ఉండేవి కొంతమందికి భుజాలనుండి పాదాలవరకు చిరుగంటలు ఉండేవి ఆ చిరుగంటల మోతలు గృహస్థులకు వారి రాకను తెలియజేసేవి వీటన్నిటికి తోడు కొందరికి భుజాలపై రెండు కొనలు పదునుగా ఉండే ఈటెల వంటివి ఉండేవి వీటి చివరలలో వేలాడే గిన్నెలలో యజ్ఞాలు చేసిన వీబూది ఉండేది

వీరు భిక్షావృత్తిని తమ హక్కుగా భావించేవారు తీర్థయాత్రాస్థలాలలో వీరికి అనేక ప్రత్యేక సౌకర్యాలు ఉండేవి అటువంటి స్థలాలలో వీరు వేల సంఖ్యలో ఒకచోట కనిపించేవారు వీరు చిన్న చిన్న గుంపులుగా విడిపోయి ఊర్లమీద పడేవారు తీర్థయాత్రలకు వెళ్ళేటప్పుడు దారిలో తటస్థించిన గ్రామాల ప్రజలే వీరి తిండి, వసతి మొదలైన అవసరాలు తీర్చేవారు వీరు గుంపులుగానే తప్ప ఒంటరిగా సాధారణంగా ప్రయాణించరు వీరు భిక్షమడగడం కూడ యాచనాకంఠంతో కాక బెదిరింపు ధోరణిలోనే ఉండేది వీరికి బిచ్చం వేయడంలో ఏమాత్రం జాప్యం జరిగినా కోపంతో గంటలు మోగిస్తూ, శంఖనాదం చేస్తూ తమ అసహనాన్ని తెలియజేస్తారు వాటికి కూడ జవాబు రాకపోతే, కొందరు ఇంట్లో ప్రవేశించి వస్తువులను పగులగొట్టి, ఇంటి సామానులను చెదరకొట్టి నానాబీభత్సం చేస్తారు వీరు బిచ్చమడిగేటప్పుడు పదాలు పాడుతూ నర్తిస్తారు సామాన్యంగా వీరి

37 పట్టు పాగ జుట్టి పట్టు దోవతి గట్టి
సృష్టి వైష్ణవుండ ననుచు పదును
విన్నెలింతె కాసి శ్రీవైష్ణవ మతము (డి 1721, 421)

పాటలు విష్ణుపరమైనవే. తరచుగా అశ్లీల గీతాలు పాడగా విన్నానని అబె దుబాయ్ వ్రాశాడు. ఇవి ప్రజలనుండి భిక్షలను ఆకర్షించడానికేనని అతడు అభిప్రాయపడ్డాడు. ఇటువంటి దురుసు ప్రవర్తన వలననే వైష్ణవేతర వర్గాలు వీరిని అసహ్యించుకునేవి.

వైష్ణవులను పొట్టి వార్త మాత్రమే కాని
భ్రష్టులంతకన్న పరులు లేరు[38]
కష్టనరుల కెల్ల కలుగునా మోక్షంబు. (డి. 1721, 224)

వైష్ణవ భిక్షకులు మధుసేవనం, మాంసభోజనం చేసేవారు.[39] గంజాయి వంటి మత్తు పదార్థాలకు లోనయ్యేవారు శైవులలో ఉన్న శక్తిపూజ వీరిలో కూడ కొంత కనిపించేది వానరము, గరుడము, సర్పము వీరికి చాలా గౌరవప్రదమైనవి. వీటిని ఎవరైనా వీరికళ్ళ ఎదుట గాయపరచడం కాని, చంపడం కాని చేస్తే సహించేవారు కాదు. దానిని తీవ్రమైన నేరంగా పరిగణించేవారు ఆ నేరం చేసినవాడి ఇంటిముందు వేలసంఖ్యలో మూగిపోయి వాడినుండి పెద్ద మొత్తంలో ధనాన్ని జరిమానాగా వసూలుచేసేవారు. ఈ తతంగమంతా అతి దారుణంగా జరిగేది. ఆ ధనంతో తర్వాత ఘనమైన విందు జరుపుకునేవారు

ఇక శైవులు దక్షిణంలో అన్ని ప్రాంతాలలోను కనబడతారు పశ్చిమ ప్రాంతంలో మలబారు, కోరమండల్ ప్రాంతాలలో వీరి వునికి అధికం మరణించిన వారిని ఖననం చేసే ఆచారం వీరిలో ఉన్నది వైదిక కర్మకాండను నిరసిస్తారు వీరికి పునర్జన్మ సిద్ధాంతంలో విశ్వాసం లేదు

వీరశైవులు లింగం అందరిని సమానపరుస్తుందని నమ్మినవారు కాబట్టి కులభేదాలను నిరాకరించారు అస్పృశ్యుడు కూడ వీరశైవులదృష్టిలో బ్రాహ్మణుని కన్నా తక్కువవాడేమీ కాదు లింగం శివుని యొక్క నిలయం కాబట్టి లింగధారులలోని తరతమ భేదాలను వీరు అంగీకరించరు [జంగమైన పిదప జాతి నెంచగరాదు (డి 1721, 1 177)] లింగములేని రాజసౌధముకన్న లింగసహితమైన గుడిసెయే మేలు అని వారి విశ్వాసం వీరు వైదికబ్రాహ్మణ వ్యతిరేకులు కాబట్టి బ్రాహ్మణుల అసహనానికి గురియైనారు వీరశైవులలో అనేకులు భిక్షావృత్తితో జీవించేవారు భూములు మొదలైన ఆస్తిపాస్తులున్నవారు తమ ఆదాయాన్ని మఠాలనిర్వహణకు, శివకైంకర్యానికి ఖర్చుపెట్టేవారు, శైవ గురువులు (జంగాలు) పట్ల శివభక్తులకు ఎనలేని గౌరవాదరాలు, భయభక్తులు ఉండేవి అతడు యాత్రకు బయలుదేరి తన ఆతిథ్యానికి ఒక ఇంటిని ఎన్నుకునేవాడు ఆ యింటి యజమాని భార్య తప్ప ఆ యింటివారందరూ ఇల్లు ఖాళీచేసి, గురువు బసచేసినన్ని రోజులూ వేరుగా నివసించేవారు ఇంటి యజమాని భార్య అతనికి సేవలు చేసేది ఆ గురువులు పడుచు భార్య ఉన్న యింటినే బసకు ఎన్నుకుంటారని చెప్పుకోగా విన్నానని అబే దుబాయ్ వ్రాశాడు

---

38. పాఠాంతరం 'అంతకంటె ప్రజలు లేరు' (డి 1723, 1081)

39 ఎంబెరు మతమందు నెసగ మాంసముదిని
మారు పేర్లు బెట్టి మదువు ద్రావి
వావి వరుస దప్పి వలికి పాలౌదురు (డి 1721, I-175)

కరకు కాయల దిని కాషాయ వస్త్రముల్
బోడినెత్తి గలిగి బొరయుచుంద్రు
తలలు బోడులైన తలపులు బోడులా.40 (డి 1721, 166)

శైవుల వేషం కూడ ప్రత్యేకంగా ఉండేది:

కంబళములు గట్టి గంటలు గజ్జెలు
బోడి తలలు కావి బొంత చీర
లాత్మ దేవ పూజలవి చేయనేరవు (డి 1725, 769)

శైవేతర సన్యాసులలోకూడ ఇటువంటి వేషధారణ కనిపించేది. ఫకీరులు, బౌద్ధులుకూడ ఈ రంగు బట్టలను ధరించేవారు. శైవసన్యాసులు రుద్రాక్షమాలలు, ఫాలభాగం, చేతులు మొదలైన భాగాలలో బూడిద పూతలు ధరించేవారు. వీరి పూజాహేతువులు లింగం, నంది శైవులలో వైష్ణవులలో పిల్లలు గురుదీక్ష లభించిన తరువాతనే శైవులుగా గాని, వైష్ణవులుగా గాని మారుతారు. ఈ రెండు మతాలలోకూడ బ్రాహ్మణేతరులు అధికంగా, అస్పృశ్యులు, చర్మకారులు వంటివారు అత్యధికసంఖ్యలో చేరేవారు శైవము స్వీకరించగానే మధుమాంసాదులు విసర్జించాలి. కాని వాటికి గాఢంగా అలవాటుపడిన చిన్నకులాల వారికి అది కష్టంగా ఉండేది కాబట్టి శూద్రులలో కొంతభాగమూ, అస్పృశ్యులు మొదలైనవారూ వీటిని యధేచ్ఛగా ఉల్లంఘించేవారు మతాలను మార్చడం, ముఖ్యంగా తమ బలహీనతలకు అనుకూలంగా ఉండే మతాలలోనికి మారిపోవడం అధికంగా జరిగేది ప్రజలు వీరిని హేళనగా చూసేవారు

కుక్క దిన్న వాడు గురులింగ జంగంబు
పంది దిన్న వాడు పరమయోగి
యేన్గు దిన్నవాడు యెంత సుజ్ఞానిరా! (డి 1721-1-223)

పెద్ద ఆటంకాలు కల్పించకనే ఎదుటి మతంవాడిని తమ మతంలోనికి చేర్చుకునేవారు భార్య శైవురాలు, భర్త వైష్ణవుడుగా ఉన్న కుటుంబాలను కూడ దుబాయ్ చూసినట్లు వ్రాశాడు రెండు మతాల వారి అభిమానాన్ని పొందడానికి ఇదొక యుక్తి కావచ్చును

వైష్ణవులు నిత్య వ్యవహారంలో కూడ తరచుగా విష్ణు పారమ్యాన్ని ఉద్ఘాటించేవారు శివుని జన్మకు, స్థితికి కూడ అతడే హేతువు అనేక పరిస్థితులలో శివుణ్ణి విష్ణువుతో తులతూగలేడని ఈ క్రింది విధంగా వాదించేవారు

కొడుకును బ్రతికించు కొనలేడు శంభుండు
కొడుకును బ్రతికించు కొనడె శౌరి
దేవతాంతరములు దీననే కనిపించె (డి 1723, 877)

ఇక శైవులదృష్టిలో విష్ణువు చేసినవన్నీ అకార్యాలే వాటిని వైష్ణవులు కూడ సమర్థించుకోలేరు కావున శివుడే సకలారాధ్యుడు లింగధారణం అసహ్యకరమని వైష్ణవులు భావిస్తే, నామధారులైన వైష్ణవులు నరకంలో అదే ఆకారంలో ఉన్న శూలాలతో గుచ్చబడతారని శైవులు ప్రచారం చేసేవారు వీరి పరస్పర దూషణలు తరచుగా

40 మూడవ చరణం అనేక పద్యాలలో ఉన్నది

హింసాత్మకమైన కలహాలతో ముగిసేవి. ఒక గుంపు మరో గుంపును రెచ్చగొట్టడంతో కలహాలు ప్రారంభమయ్యేవి ఒక గుంపు తమ దైవపారమ్యాన్ని ఉద్ఘాటిస్తూ పరదైవ దూషణకు పాల్పడేది వెంటనే పరస్పర దైవదూషణలతో, శాపనార్థాలతో ముష్టిఘాతాలకు దిగేవారు రక్తపాతం కూడ జరిగేది. ఒకరి తలపాగాను మరొకరు లాగివేయడం. బట్టలు చింపుకోవడాలతోనే ఇదెక్కువగా ముగిసేది

*లింగమతము లోన దొంగలుగాబుట్టి*
*యొకరి నొకరు నింద నొనరజేసి*
*తురకజాతి చేత దూళియైపోదురు* (డి 1723, 691)

ఇటువంటి మతోన్మాదుల అలజడులు రెచ్చిపోగానే రాజులు వీటిని తమ రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకునేవారు వీలునుబట్టి ఆయా మతాలను స్వీకరించేవారు

## 4. బసివిరాండ్రు

అతి ప్రాచీనకాలం నుండి కొందరు – పెళ్ళికాని ఆడపిల్లలను దేవాలయాలలో సేవ కొరకు మొక్కుబడిగా సమర్పించేవారు. ప్రాచీన గ్రంథాలలో శాసనాలలో **'దేవాలయ కాంతల'** ప్రసక్తి కనిపిస్తున్నది వీరు శాస్త్రబద్ధమైన నాట్యం చేసేవారు రాజులు కూడ 'దేవాలయ కాంతల' పద్ధతిని పోషించి వారివలన వచ్చే రాబడిని సైన్యపు ఖర్చులకు వినియోగించుకునేవారు దేవుని పేరుమీద వదిలివేయబడిన వీరు త్వరలోనే **'పడుపు కత్తెల'** స్థాయికి దిగజార్చబడ్డారు తెలుగు దేశంలో వీరిని **బసివిరాండ్రు, దేవదాసీలు** అని వ్యవహరించేవారు బసవని పేరుమీద వదలినవారిని బసివిరాండ్రనీ, వైష్ణవాలయాలకు సమర్పించబడినవారిని దేవదాసీలని పిలిచేవారు బహుశా బసివి సంప్రదాయం – శైవమతాన్ని ఆదరించిన కాకతీయ, రెడ్డి, వెలమ రాజుల కాలంలో మొదలై ఉండవచ్చును ఇప్పటికీ **వీటిబసివి, ఊరబసివి** వంటి మాటలు అవశేషాలుగ వ్యవహరించబడుతూ వినబడుతున్నాయి రథోత్సవాలలో, జాతరలలో వీరు నాట్యం చేసేవారు అబే దుబాయ్ వీరిని గూర్చి విపులంగా వర్ణించాడు

"To the sects both of Siva and Vishnu Priestesses are attached, that is to say women specially set apart, under the name of "Wives of the Gods" for the service of one or other of these dieties They are quite a distinct class from the dancing girls of temples, but are equally deprived They are generally the unfortunate victims of the immorality of the Jangams or Vaishnavas These priests, by way of keeping up a character for good behaviour, and conciliating the families upon whom they have brought dishonour, put the whole blame on vishnu or siva, and the poor gods, as is only fair, are forced to make amends So the girls are given to the gods as wives, by the aid of a few cermonies and we know that these worthy gurus enjoy the privilege of representing in every thing, the Gods whose ministers they are The women who are thus consecrated to Vishnu are called Garuda basavis (Wives of garuda), and have the image of this bird tattooed on their breasts as the distinctive mark of their rank

The priestesses of Siva are called Linga basavis or women of the lingam, and bear this sign tattooed on their thighs."[41]

"సంతబసివి" అనే మాటతో వేమన్నవి రెండుపద్యాలు మాత్రమే కనపడుతున్నాయి. 'బసివి' పదాన్ని వేమన్న "పలుసార్లు" పేర్కొనడం నిజంకాదు

వంతు లింగముగట్టి వడలెల్ల భూతియు
అంతరంగమెరుగ దంత్యజాతి
"సంతబసివి" కొడుకు జంగముదేవర. (డి. 1723–826)

"సంతబసివి" పొందు చలిపందిరి ఉదకంబు
త్రోవ నమ్ముతోడు తొత్తుమాట
రచ్చకూటమి త్రోవ రసికులు మెచ్చరో. (డి 1769, 636)

## 5. వర్ణ వ్యవస్థ-అస్పృశ్యత:

ఎప్పుడైతే జీవసారం నశించి శుష్కించిన మ్రోడులవలె తత్త్వరహితమైన మతాలు శేషించినాయో అప్పుడు దంభమే జీవిత విధానమైనది. తమ మతం, తమ జాతి, తమ కులం ఘనతరమనే అహంకారం ముండ్ల చక్రాలవలె మనుష్యుల చుట్టు నిర్మించబడింది. తరచుగా ఈ ముండ్లచక్రాల ఘర్షణ విస్ఫులింగాలను వెదజల్లి సంఘశాంతిని పరశురామప్రీతి గావించేది. అంతకుముందు లేని జాతులు, కులాలు శాఖోపశాఖలుగా సృష్టించబడ్డాయి **"బ్రాహ్మణులు మొదలు చండాలుర వరకును అందరును తమకన్న నొక తక్కువ జాతి గలదనుకొని సంతోషించిరి. చండాలురను బ్రాహ్మణు లెంత దూరమున నుంతురో యంత దూరమున చండాలురచే నుంచబడిన 'డొక్కలవారు' అను అడవి జాతివారిని నా చిన్నతనమందు చూచినాను"**[42] అని రాళ్ళపల్లివారు వ్రాశారు. బ్రాహ్మణుల జాత్యహంకారం మిన్ను ముట్టింది. 'వేరు జాతివాడు విప్రుడు గాడయా' అనే ప్రచారం ముమ్మరంగా సాగింది. శైవ వైష్ణవాల ప్రాబల్యం వలన బ్రాహ్మణవ్యతిరేకత గూడ ప్రజలలో వ్యాపించింది కులభేదాల సుడిగుండాలలో పడి తిరుగుతూ ప్రజాజీవనం కల్లోలమైనది

కులము చేతబట్టి గుంపించ నేటికి
పాదు ఉన్న చోట ప్రబలు విత్తు
ఏటి కులంబింక ఎక్కడి ద్విజుడయా (డి 1727, 334)

అన్ని ప్రశ్నించే ప్రతిఘటనా ధోరణులు అక్కడక్కడ తలెత్తినవి కాని అవి వెల్లువలో పూచిక పుల్లలైనవి

చతుర్వర్ణాల నుండి విడివడిన అంటరానివారి వెలికులం ఎప్పుడు ఎక్కడ ఎట్లా జనించిందో చెప్పడానికి స్పష్టమైన ఆధారాలు కానరావు బహుశా ఏవో నేరాలమీద సంఘంలోని అన్ని కులాలనుండి బహిష్కరించబడి కాలక్రమాన వీరే ఒక కులంగా, ప్రధానవ్యవస్థకు దూరంగా అభివృద్ధి చెందుతూ వచ్చి ఉంటారని అబె దుబాయ్

---

41 Hindu manners, customs and ceremonies, By Abbe J A Dubois, Page 133
42. వేమన – రాళ్ళపల్లి, పేజీ – 77

ఊహించాడు. అస్పృశ్యులకు తరతరాలుగా జరుగుతున్న హేయమైన దారుణాలను కండ్లారాచూసి కదలిపోయాడు దుబాయ్

"In fact these pariahs are the born slaves of India and had I to choose between the two sad fates of being a slave in one of our colonies or a pariah here. I should unhesitatingly prefer the former."[43]

అంటరాని వారిని ముట్టుకుంటే చేసుకోవలసిన ప్రాయశ్చిత్తాలను నిర్దేశిస్తూ అనేకులు స్మృతులకు వ్యాఖ్యానాలు వ్రాశారు

## 6. రసవాదం

వేమన్న కాలంలో మంత్రతంత్రాలు, స్వర్ణవాదవిద్య విపరీతంగా ప్రబలిపోయినవి వేమన మంత్రతంత్రాలను నిరసించినా, స్వర్ణవాదం మీద మాత్రం ఆశలు పెట్టుకున్నట్టు కనిపిస్తున్నది. యోగులనబడేవారు కూడ దీనికొరకు ప్రయత్నం చేసినట్టు ఆధారాలు ఉన్నాయి యోగులకు కృత్రిమ బంగారం మీద ఆశ ఎందుకు జనించిందోనని రాళ్ళపల్లివారు ఆశ్చర్యం ప్రకటించారు.[44] హఠయోగాదుల సాధనకు దేహశక్తిని పొందడానికి **'పుష్టాహారం'** దొరకక, బంగారాన్ని భస్మాదుల రూపాలలో సేవించడానికి దీనివెంట పడినారేమోనని ఆయన ఊహించారు

**"మానవ సుఖజీవితానికి ధనం, సంపద అత్యవసరమనే ఒక వాస్తవికత, బహుశ ఈ వికృతరూపంలో వేమనలో ప్రతిబింబించి ఉండవచ్చు"**[45] అని ఏటుకూరి బలరామమూర్తి గారు అన్నారు బీదరికాన్ని పోగొట్టుకోవడానికి సామాన్య ప్రజలు సిద్ధుల వెంటబడ్డారు. రసవాదాన్ని 'గుప్తవిద్య'గా భావించేవారు కావున శుశ్రూషలు చేయించుకొని ఆ సిద్ధులు ఎవరికీ అర్థంకాని ప్రతీకలతో రసవాద విద్యను బోధించేవారు అనుకోవాలి తత్త్వోపదేశం వలన కాక బంగారం మీద ఆశ చేత సిద్ధుల కనేకులు శిష్యులైనారు

ఇహమున సుఖియింప హేమ తారక విద్య
పరమున సుఖియింప బ్రహ్మవిద్య
కడమ విద్యలెల్ల కల్ల మూఢుల విద్య (డి 1727, 226)

అనే నిర్ణయానికి అనేకులు వచ్చారు

## 7. మహమ్మదీయ మతపు లేత నీడలు

వేమన కాలం నాటికి మహమ్మదీయ సింహాసనాల నిలువెత్తునీడలు ఆంధ్రదేశమంతటా వ్యాపించాయి విజయనగర సామ్రాజ్యం, రెండవ వెంకటపతి రాయలతోపాటు సమసిపోగానే తెలుగుదేశం పైన మహమ్మదీయుల అధికారానికి స్థైర్యం చేకూరింది రాయలసీమలో దుర్గాలన్నింటికి మహమ్మదీయులు అధిపతులైనారు కాని ఇక్కడ గమనించవలసిన

43. Hindu manners, Page-49
44. వేమన - పేజీ 86
45. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర - పేజీ 222

విషయమొకటి ఉంది. కేంద్రాధికారులు మహమ్మదీయులే ఐనప్పటికి, గ్రామాలను స్థానికులే వారి ప్రతినిధులుగా పాలించారు

తల్లికోట యుద్ధంలో మహమ్మదీయ మతం పాత్ర వహించినప్పటికీ, అది దండయాత్రలకే పరిమితమైంది కాని హిందూమత ధర్మాలను అది ప్రాభావితం చేయడానికి సుదీర్ఘకాలం పట్టింది ముస్లింలు సాధారణంగా రాజధానులలో, పట్టణ ప్రాంతాలలో నివసించేవారు కావున, ఆ ప్రత్యక్ష సంబంధం వలన అక్కడి హిందూ జీవన విధానం పైన వారు గాఢమైన ముద్ర వేయగలిగారు. దీనికి వారి అధికారం కూడ తోడయ్యింది

భారత దేశంలో అనేక మతాలు పుట్టి ప్రవర్తిల్లి పతనమైనాయి. వెలుపలి నుండి వచ్చిన మతాలు కూడ ప్రబలంగా ఉన్న భారతీయ సభ్యతా ప్రవాహంలో లీనమై కరిగిపోయినవి కాని ఇస్లాం విషయంలో జరిగిన తీరు వేరు. ఇది తాత్త్వికంగా హిందూమతంతో భేదించినదే కాక విరుద్ధమైనది కూడ హిందూమతంలో ఐహికం కన్న పారలౌకిక దృష్టికే ప్రాధాన్యం కాని ఇస్లాంలో ఈ ఐహిక నిర్లిప్తత అసలే లేదు ఇహ, పరాల మధ్య ఒకానొక తూకం దానికున్నది ఎప్పుడైతే ఈ రెండు మతాలు కలిసి జీవించవలసి వచ్చిందో ఆ మరుక్షణం నుండి సహజంగానే అవి సంఘర్షించుకోవటం ప్రారంభించాయి. కాని ఈ సంఘర్షణ ఒకదాని నొకటి మింగివేయడానికి ఏమాత్రం తోడ్పడలేదు పైగా ఒకదాని నొకటి చాపకింద నీరులాగ నిశ్శబ్దంగా ప్రాభావితం చేయడం మొదలుపెట్టాయి

గ్రామాలు పట్టణాలకు దూరంగా ఉండడం వలన ఈ ప్రభావం అక్కడి మత వ్యవస్థ యొక్క పరిపూర్ణతను భంగపరచలేకపోయింది కాని దీనివలన ఇస్లాంమత ప్రభావం గ్రామాల వరకు పూర్తిగా ప్రయాణించలేదని చెప్పడానికి వీలులేదు పట్టణాల నుండి గ్రామాలకు నిరంతరం రాకపోకలుండడం వలన ఆ ప్రభావం ప్రత్యక్షం కాక పరోక్షమైంది

దక్షిణ దేశంలో ఇస్లాం మతం ప్రవేశించేనాటికి హిందూమతం ఎంత శక్తిహీనమైన స్థితిలో కొట్టుమిట్టాడుతున్నదో వెనుక పుటలలో చర్చించబడింది తత్త్వం నశించి కావి బట్టలు బూది పూతలే మిగిలివున్న కాలమది పరదేశీయుల దండయాత్రల వలన ఒక విధమైన నైరాశ్యం అన్ని రంగాలలో తాండవమాడుతున్నది అటువంటి పరిస్థితిలో ఇహప్రధానమైన ఇస్లాం సుడిగాలి వలె వీచింది ఈ దేశంలో అది సరికొత్త గాలి నూతన వాయు స్పర్శతో ఇక్కడి సంఘ వ్యవస్థలు చలించడం మొదలైంది మతాలు వేసుకున్న మాయవేషాలు రెపరెపలాడినవి హిందూవ్యవస్థలోని బాధితులు, దీనజనులు ఈ మార్పును అనుకూల దృష్టులతో చూశారు సజీవ కళలను కోల్పోయిన స్వమతాలు, అపూర్వతత్త్వంతో దిగిన ఇస్లాం – ఈ రెండింటి కలయిక దేశంలో తర్కశీలానికి బీజావాపనం చేసింది కులభేదాలు లేని అన్యమతాగమనం వలన భారతీయ వర్ణవ్యవస్థ చలించసాగింది పాత విధానాలకు, కొత్త భావాలకు మధ్య జరిగిన ఈ ఒరిపిడిలో ఒక రకమైన సందిగ్ధ వాతావరణం పొగమంచులా వ్యాపించింది సరిగ్గా ఇటువంటి పరిస్థితులలోనే భావుకులైనవారు తత్త్వాన్వేషణకు పూనుకున్నారు ఈ అన్వేషణలో వారికి క్రొత్తగా లభించిన తర్కశీలం సాధనమైంది ఈ అభిప్రాయాన్ని సమర్థిస్తూ సురవరం ప్రతాపరెడ్డిగారు ఈ క్రింది విధంగా వ్రాశారు

"అట్టి సన్నివేశములలో అనగా తురక, క్రైస్తవుల విజృంభణ కాలములో ఆంధ్రదేశమును రక్షించినది రాజులు కారు; తత్త్వబోధకులే రక్షించినారు దేశమంతటా వేదాంతులు బయలుదేరి గేయాలతో మతావేశమును కలిగించుచు సంఘ లోపాలను సంస్కరించుచు వచ్చిరి. అట్టివారిలో ముఖ్యులు వేమనయోగి, పోతులూరి వీరబ్రహ్మం గారు "46

పై ఉటంకింపులో 'సంఘ లోపాలు' అనేమాట గమనించదగింది వినూత్నతత్త్వ ఘోషలో కొత్త గొంతులు వినిపించగానే స్వమతంలోని సంఘలోపాలు స్పష్టంగా కనిపించాయి. కొత్తభావాల ప్రవేశంతో హిందూ మతం కుచించుకుపోయి తన్ను తాను రక్షించుకోవాలని తాపత్రయపడింది ఆ ప్రయత్నంలోనే తత్త్వాన్వేషకులకు సంఘలోపాలు అడ్డు తగిలాయి కాబట్టి ఆ సంఘలోపాలను సంస్కరించనిదే హిందూమత పునరుజ్జీవనం సాధ్యం కాదని త్వరలోనే వారు గుర్తించారు 47 వారిలో వేమన ముఖ్యుడు.

వేమన పద్యాలలో ముస్లింల ప్రసక్తితో రెండు మూడు పద్యాలకన్న లేవు పదజాలం మాత్రం బాగానే ప్రవేశించింది

# III. గ్రామ వ్యవస్థ విచ్ఛిత్తి

వేమన గ్రామీణ కవి గ్రామ జీవన రీతి వేమన స్వభావానికి పూర్వరంగమైంది. సహజ సుందరమైన పల్లెటూరి చల్లదనంలో వేమన పద్యాలు దిద్దుకున్నాడు 'పల్లెసీమ' వాతావరణాన్ని దాటిన వేమనపద్యం ఒక్కటి కూడ కనిపించదు. పల్లెలలోని పిల్లబాటలేగాని పట్టణాల వైపు దారితీసే ఘంటాపథాలను వేమన త్రొక్కినట్టు కనబడదు. నాగరిక వాసనలు వేమన పద్యాలలో మచ్చుకైనా కానరావు

ఆనాటికీ నేటికీ భారతదేశానికి గ్రామమే వెన్నెముక భారతీయ ప్రజాజీవన వ్యవస్థను అర్థం చేసుకోవడానికి గ్రామమే ఆధారం. కాని ప్రాచీన గ్రామవ్యవస్థను గూర్చి లోతుగా తెలిపే ఆధారాలేవి మనకు లేవు ఇంతవరకు చారిత్రకులకు లభించిన సమాచారంకూడ శాసనాల నుండి క్రోడీకరించినదే పాశ్చాత్య యాత్రికులు, మత ప్రచారకుల వ్రాతలు కొంత ఉపకరిస్తాయి గాని, అవి హిందూజీవితంతో గాఢమైన సంబంధాన్ని వ్యక్తీకరించవు సాంఘిక పరిస్థితుల వంటివి కూడ కవుల కావ్యాలలో అప్రయత్నంగా చేరినవే కాని మనవారికి స్వతహాగా చారిత్రక దృష్టి శూన్యమనే సంగతి గత ప్రకరణంలో ప్రస్తావించబడింది కాని పాశ్చాత్యరచనలలో మళ్ళీ అబే దుబాయ్ వ్రాసిన గ్రంథమే అపవాదంగా నిలుస్తున్నది హిందూప్రజల జీవవాహినిలో నిమగ్నమై ఆసక్తి, నిష్పాక్షికతా రెండు కళ్ళుగా ఈ పరాసు ఫాదరీ చేసిన పరిశోధనలో నాటి గ్రామవ్యవస్థ కూడ అవాంతరంగా చోటుచేసుకొన్నది 'హిందువుల పేదరికం' అన్న ప్రకరణంలో అప్పటి గ్రామాలలోని వివిధ ఆర్థిక వ్యత్యాసాలను అతడు బేరీజు వేసిన పద్ధతి

---

46 ఆంధ్రుల సాంఘిక చరిత్ర – పేజీ 391

47. "Our heritage" - Mr Humayun Kabir, National Information Publications Ltd, Bombay

స్పష్టమైన అవగాహనకు దారులు తీస్తున్నది. వేమన పద్యాలలోని అంశాలకు, దుబాయ్ వ్రాసిన సత్యాలను వర్తింపజేసి చూసుకుంటే అనేక సంగతులు బయటపడతాయి

## 1. గ్రామీణ వాతావరణం

అనాదికాలం నుండి మానవుడు అరణ్యాలతో, దూరంతో, భద్రతావాంఛ కారణంగా ఒంటరితనంతో జరిపిన నిరంతర పోరాటంలో భాగంగానే గ్రామాలు నిర్మించబడ్డాయి అవిరామ పరిశ్రమతో మనిషి ప్రకృతిని మచ్చిక చేసుకొని మనుగడ సాగించాడు. సహజంగా చెట్టు పుట్టల నుండి లభించే ఆహారమే కాకుండా ఏరులను మళ్ళించి భూమినుండి భుక్తిని పిండుకున్నాడు ప్రకృతిసౌందర్యంలో భాగమైపోయి 'ముక్తి'ని సాధించాడు ఇటువంటి గ్రామసీమలలోనే వర్షావేళ భూమిలో నుండి వెలువడే పృధ్వీ సౌరభం లాగ వేమునకవిత్వం పుట్టింది వేమన పద్యాలకు చిక్కక తప్పించుకున్న పల్లీయజీవన రీతులను మనం వెతుక్కోవలసిందే వెల్లువలో నునుపెక్కిన సాలగ్రామాలవలె గ్రామజీవన వాహినిలో నుండి సూక్తులను తోడి కుప్పలుపోశాడు వేమన కొండలు, పసిడి వేమన పద్యాలలో తరచు కనిపించే పోలికలు

రాయలసీమలోని కొండలు, చరిత్ర ప్రసిద్ధిచెందిన గనులను గూర్చి అందరెరిగినదే వ్యావసాయకమైన ఉపమానాలు వేమన పద్యాలలో కొల్లలుగా కనిపిస్తాయి పక్షులు, జంతువులలో కూడ వేమన్న ఏకత్వాన్ని దర్శించాడు

> కుక్కుటమ్ము నెమలి గూబ పందియు కాకి
> కుక్క యుడుత పెక్కుకులము లెంచి
> తక్కువ యని జూచి తత్త్వమే మెఱిగిరి (డి 1773, I-472),

## 2. గ్రామపరిపాలన

గ్రామ పరిపాలనా బాధ్యతను రెడ్డి, కరణం, పురోహితుడు, తలారి, బారికాపు, కమ్మరి, కుమ్మరి, సాలె, కంసాలి మొదలైనవారు నిర్వహించేవారు మొత్తం గ్రామపాలనబాధ్యతను రెడ్డి వహించేవాడు భూములకు సంబంధించిన వ్యవహారాలు కరణం చూసేవాడు రైతు వ్యవసాయంలో నిమగ్నమై ఉండగా అతనికి ఉపయోగించే ఇనుప పనిముట్లు కమ్మరి, పాత్రలు కుమ్మరి, వస్త్రాలు సాలె, ఆభరణాలు కంసాలి చేసి ఇచ్చేవారు ప్రతిఫలంగా రైతు నుండి వీరికి ధాన్యం లభించేది ఒక్కొక్క వృత్తిని అవలంబించినవారు ఒక్కొక్క కులంవారై ఒక్కో విద్యను కాపాడి పోషిస్తూ వచ్చారు వృత్తివిద్యలు కుల విద్యలైనవి ఇతర వృత్తిని చేపట్టడం కులద్రోహంగా పరిగణించబడేది 'వెలి విద్యలు' కులవిద్యకు సాటిరావు అని గువ్వల చెన్న శతకంలో వ్రాయబడింది

సాధారణంగా గ్రామంలో ధనమూ, పలుకుబడీ గలవాడు రెడ్డి (రెడ్డిని 'గ్రామకర్త' అని వ్యవహరించాడు వేమన – "కల్లలాడు వాని గ్రామకర్త యెరుంగు" – డి 1721, 20) ఇతణ్ణే ప్రజలు ఎన్నుకున్న తర్వాత రాజు అనుమతిని పొందవలసి ఉండేది కాలక్రమాన ఈ పద్ధతి పోయి రెడ్డి, కరణాలను రాజే నేరుగా నియమించడం అమలులోనికి వచ్చింది వంశపారంపర్య నియామకాలు కూడ ఉండేవి ఇక పురోహిత బ్రాహ్మణుల ప్రమేయం లేని శుభకార్యాలు గ్రామాలలో జరిగేవి కావు వైదిక విద్యలు

ద్విజ వైశ్య క్షత్రియుల అధీనంలో ఉండగా పారిశ్రామిక విద్యలకు ఇతర కులాలవారు అధికారులుగా ఉండేవారు రైతుకు భూమిని అమ్ముకునే హక్కు ఉండేది; కాని దానిమీద అతని పెత్తనం గ్రామ పంచాయతీకి లోబడి ఉండేది గ్రామం ఒక స్వయం సంపూర్ణ కేంద్రంగా ఉండేది గ్రామస్థులకు కావలసినవన్నీ గ్రామంలోనే దొరికేవి పశువులను సంతలలో కొనుక్కునేవారు ముఖ్యమైన ప్రతి గ్రామానికి చుట్టూ ప్రహరీ గోడ ఉండేది ప్రహరీ చుట్టు తిరుగుతూ గ్రామ రక్షణ బాధ్యతను ప్రహరీకాపు నిర్వహిస్తాడు. ఈ పేరు క్రమంగా పారికాపు, బారికాపు, బారికాడుగా మారింది వైశ్యులు వర్తక వ్యాపారాలు చేసేవారు ఆ రోజులలో వ్యాపారం కష్టంగా ఉండేది రవాణా సౌకర్యం అసలే లేనిరోజులవి గ్రామాల నానుకొని అడవులు కొండలు ఉండేవి

గ్రామంలోని వివిధ వృత్తుల వారికి 'ఈనాము' భూములుండేవి వీటిని 'భటవృత్తి మాన్యములు' లేక 'జాతి కట్టుడు మాన్యము' లనేవారు భటుల వలె సంఘ శరీరాన్ని కాపాడుతారు కాబట్టి వీరు భటులు. ఇతర గ్రామస్థులే భట వృత్తి మాన్యాలను దున్నిపెడుతుండేవారు బ్రాహ్మణులు మొదలైనవారు మతవిద్యలలో ఆధ్యాత్మికంగా తీర్పులు చెప్తుండగా, వివిధ వృత్తికారుల చేతి చలువతో పారిశ్రామిక కళలు వికసించి సుఖాలను సమకూర్చినవి

అయితే నాటి కాపుజీవితపు తీరుతెన్నులను తెలుసుకుంటే గాని గ్రామవ్యవస్థ స్వరూపం పూర్తిగా అవగతం కాదు

విజయనగరరాజ్యంలో మహారాజు తర్వాత అధికారాలన్నీ మహాప్రధానికే ఉండేవి దక్షిణ దేశంలో పాలెగార్లు, మండలాధిపతులు మహాప్రధాని అదుపాజ్ఞలకు లోబడి ఉండేవారు పాలెగార్లు, ఇతర సామంతులు రైతులనుండి పన్నులు వసూలు చేసేవారు వారు మండలాధిపతులకు సుంకం (levy tribute) చెల్లించేవారు

పాలెగార్లకు తమకు ఇష్టం వచ్చిన వారికి కౌలుకివ్వడానికి గాని, తిరిగి లాగేసుకోవడానికి గాని అధికారం ఉండేది పన్నుల ప్రమాణాన్ని కూడ వారే నిర్ణయించేవారు. వారు రైతుల నుండి పిండి వసూలు చేసిన మొత్తానికీ, వారు ప్రభుత్వకోశానికి చెల్లించ వలసిన మొత్తానికీ పొంతన ఉండేది కాదు తాము చెల్లించే సుంకం ప్రమాణం రాజువద్ద వారికి గల పలుకుబడీ, సాన్నిహిత్యాన్నిబట్టి నిర్ణయమయ్యేది సాధారణంగా తాము వసూలుచేసిన పన్నుల మొత్తంలో మూడోవంతును ప్రభుత్వకోశానికి చెల్లించేవారు తాము పోషించే సైనికుల ఖర్చును మినహాయించుకుని మాత్రమే ఈ చెల్లింపు జరిగేది నిబంధనల ప్రకారం వీరి ఆస్తులూ, అధికారాలూ ఆనువంశికంగా దక్కనక్కరలేదు కాని వాస్తవంలో ఇవి ఆనువంశికాలే అయ్యేవి వారికింద సైన్యనాయకులకు కూడ మాన్యాలు లభించేవి

సాగుభూములను ఊరివారు పంచుకునేవారు మిగిలిన బంజరు భూములను సాముదాయికంగా అనుభవించేవారు వాటికి కూడ పన్నులు కట్టవలసి ఉండేది మెట్ట ప్రాంతాలలో సరియైన వర్షాలు కురిసేవి కావు కాబట్టి అక్కడి పంటలు సందేహాస్పదంగా ఉండేవి అయినా పన్నులు మాత్రం కచ్చితంగా వసూలు చేసేవారు

"చెడ్డచేని కింత రెడ్డితనంబేల?" (డి 1723, 354) అనేది వేమన్న విసురు

వేమన పద్యాలలో కాపు జీవితానికి ప్రాధాన్యం ఎక్కువ వ్యవసాయాన్నే సర్వస్వంగా భావించినవారు కాపులు

వెలయ భూమి తల్లి విత్తనమటు తండ్రి
పంటలరయ సుతులు పాడిపరము
ధర్మము తనపాలి దైవము సిద్ధము. (డి 1773 III 1227)

కాపులను వేమన 'వెర్రివారు'గా నోట్లో నాలిక లేని వారుగా ("వాక్కెరుంగరు" డి 1762-4-55) వర్ణించాడు

కాపు కులజునెంత కర్ములైనాగాని
పాపరాశికొంత పరిగిపోవు
వివరమెరుగనట్టి వెర్రి జీవులుగాన (డి 1727, 633)

పాలకులు పన్నులు తరచుగా పెంచేవారు 14వ శతాబ్దం నాటికే ధనరూపంలో చెల్లించాలనే వొత్తిడి మొదలయింది. దీనితో రైతుల ఆర్థిక పరిస్థితులలో సమూలమైన మార్పులు మొదలయినాయి. ఉన్న భూములమ్మి పన్నుచెల్లించి ఊరు విడిచి వలసల పాలయ్యేవారు మరోచోట కౌలుకు చేసినా ఇదే పరిస్థితి

"భూమి కొత్తయైన భోక్తలు కొత్తలా?" (డి 1773 I 779)

ధనరూపేణా చెలామణి వచ్చిన తర్వాత కాపులు ఎప్పుడూ భూస్వామికి ఋణపడి ఉండేవారు ఋణం మోయలేని వారిని తొలగించి వేరే వారికి కౌలుకిచ్చేవారు భూస్వాములు కాపులు క్రమంగా వ్యవసాయ బానిసలుగా మారిపొయ్యేవారు ఒకని కింద ఎప్పుడూ పొలం ఉంచనివాన్ని రైతులు తిట్టుకునేవారు

"ఇట్టి నేల బుట్టి యిట్టి నేల బెరిగి
యిట్టి నేల నొకరికివ్వలేడు" (డి 1773 I 779)

ఇటువంటి పరిస్థితి వలన రైతులలో అసంతృప్తి ప్రబలింది ఫలితంగా నిస్పృహతో భూములను వదిలేసి వెళ్ళిపోయేవారు రైతులు రాజు అసరా చూసుకొని, రైతులను బాధించి భూములను పాడుపెట్టడానికైనా వెనుదీయని అధికారులను ప్రజలు నిందించేవారు

భూపతి కృపనమ్మి భూమి తెరుచువాడు
ప్రజల యుసురు దాకి పడును పిదప
ఎగురవేయు బంతి యెందాక నిల్చురా (డి 1722, 44)

భూములను వదిలివేసి వెళ్ళడం వంటి తిరుగుబాట్లను అధికారులు నిర్దాక్షిణ్యంగా అణచివేసిన సంఘటనలు చరిత్రలో ఉన్నాయి[48] వేమన కాలానికి కేంద్రాధికారం సన్నగిల్లడం వలన పరిస్థితులు మరింత విషమించాయి అధికారుల దుండగాలకు అంతులేదు వేమన తిట్టింది వీరినే స్వయం సంపూర్ణమైన గ్రామ వ్యవస్థ విచ్ఛిత్తికిదొక ముఖ్య కారణం

గ్రామాలు నిర్లక్ష్యం చేయబడి రాజధానికి ప్రాధాన్యం పెచ్చడం విచ్ఛిత్తికి మరోకారణం మండలాధిపతికి రకరకాల వృత్తులవారిని సలహా మండలిలో నియమించుకోవడం పద్ధతిగా ఉండేది రానురాను ఇతరులకు ప్రాధాన్యం తగ్గి భూస్వాములే మండలాధిపతి వద్ద ప్రాబల్యం నెరపడం మొదలయ్యింది సముద్రసుంకాలు, సంతసుంకాలు భూస్వాములూ,

---

48 A History of India - P 221, 22, 23

వడ్డీ వ్యాపారస్తులూ వసూలు చేసేవారు. రాజధాని విదేశీ యాత్రికుల ఆకర్షణ కేంద్రంగా మారింది. అన్నిరకాల వినోదాలు నగరానికి చేరి దాని ప్రాధాన్యం హెచ్చింది. రాజధాని వైభవాన్ని నిలపడానికి గ్రామాలపైన వొత్తిడి అధికం కాజొచ్చింది పోర్చుగీసు యాత్రికుడు న్యూనిజ్ వ్రాతల ప్రకారం అప్పట్లో పదింటి దిగుబడిలో తొమ్మిది వంతులు రైతులు అధికారులకు పన్నులుగా చెల్లించుకునేవారు. ఈ పన్నుల కోరల్లో చిక్కి నలిగిపోయింది కాపేననేది సుస్పష్టం

నాటి రైతు వ్యవహారాలలో కరణాలప్రమేయానికి చాలా ప్రాధాన్యమున్నది. కాకతీయుల కాలం నాటికి కరణాలు విశ్వబ్రాహ్మణ కులానికి చెంది ఉండేవారు. గణపతిదేవుని కాలంలో బ్రాహ్మణుల నియామకం మొదలైంది. వీరినే నియోగులంటారు. వేమన్న కాపు కరణాల పరస్పర సంబంధాన్ని చిత్రించాడు.

*కాపు లేని యూరు కరణానికే కీడు*
*కరణము పగచేత కాపుకీడు*
*కాపు కరణములు కావటి కుండలు.* (డి 1773, III, 1403)

కరణంతో పగ తెచ్చుకుంటే కాపు బతుకు మొలకెత్తదు. ఇప్పటికీ గ్రామాలలో **'కరణం పగ'** అనే వ్యవహారం వినబడుతున్నది. స్వభావాన్ని బట్టి వేమన రెండు రకాల కరణాలను గూర్చి చెప్పాడు. 1. అధమ కరణం 2 బిరుసు కరణం. కాపులు అధమకరణాన్ని లెక్కచేసేవారు కాదు అధికారం చలాయించే కరణానికి భయపడేవారు.

*కరణ మధముడైన కాపులందరు గూడి*
*వంగు మంద్రు మనసు వచ్చినపుడు*
*బిరుసు కరణమైన బిడ్డల మందురు*[49] (డి 1773, I 266)

కరణాన్ని కాదని నడచిన కాపు కాపురము తాడులేని గాలిపటము వంటిది (డి.1727, 543) అదే విధంగా కాపులేనిది కరణానికి విలువలేదు వ్యవసాయ జీవితానికి కరణం ఉపకరణం మాత్రమే 'కరణము గ్రామాభరణం' అన్నాడు సుమతి శతకకారుడు

భూమి సరిహద్దుల తగాదాలు వచ్చినప్పుడో, భూముల అమ్మకం జరిగినప్పుడో భూమిని కొలిచే విధానం ప్రాధాన్యం వహించేది భూమిని కొలిచే నిపుణులు ప్రత్యేకంగా ఉండేవారు వారిని గణికులు అనేవారు

*గడల పగ్గములను గణిత మానంబున*
*నేరుపునను యంజ వార డెరింగి*
*భూమి గొల్వజేయు పురుషులు గణికులు* (డి 1773 III 122)

భూమిని కొలవడానికి ప్రత్యేక 'గణితమానం' ఉండేది దానిలో గడ ఒక కొలతకు ప్రమాణం ఈ 'గడ' ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క రకంగా ఉండేది నాలుగువైపుల 'గడ' పొడవుగల చతురస్రాన్ని 'కుంట' అనేవారు గడల పొడవును 'పగ్గం' తాడుతో

---

49 ప్రాచీన కాలంలో కరణాల దర్జాను గురించి "Report of the Madras Estates land Act committee"లో వివరించబడినది "These people have lands instead of wages and there are certain presents which they receive at seed - time and harvest from townfolk, which being matter of favour it would be wrong to forbid" (1938)

కొలిచేవారు. అప్పటి గణికులు 'అంజవార' (అడుగుభేదం) కూడా లేకుండా నిపుణంగా కొలిచేవారు పగ్గం లేకుండా కూడ కేవలం పాదాల లెక్కతో కొలిచే పద్ధతికూడ ఉండేది అట్లా భూమిని కొలిచే గణికుల్ని కాపులు అమితంగా గౌరవించేవారు.

*పరగ యుప్పు దీరు పాదంబులుండిన*
*గడను నిల్చి కొల్చు గణిక వరుడు*
*ప్రజల దీవెనొంది పుణ్యాత్ముడై ఉండు* (డి 1773, III 1221)

వేమన కాలానికి వైశ్యుల వర్తకవ్యాపారాలు ప్రజలను పీడించే స్థితికి వచ్చాయి. అన్యాయంగా సంపాదించే ధనం అరణ్యాలలో ప్రయాణించేటప్పుడు దోపిడీ దొంగల పాలయ్యేది

*"కోమటోని సొమ్ము క్రూరుల పాలౌను"* (డి 1771, I 246)

నాటి రాజాస్థానాలకు సన్నిహితంగా ఉండి సంపన్న వర్తక వర్గాలు ప్రజలను పీడించేవారు రాజులు ప్రజలను మరింత పీడించడానికి వర్తకులను కూడ ఆయుధాలుగా ఉపయోగించుకునేవారు

*రాజసమితి కెల్ల రంపముల్ వైశ్యులు*
*జూదకాండ్ల కాది జూదగాండ్లు*
*యోచనను దెలియరు యురక నర్థాపేక్ష* (డి 1773, III 1323)

ఒక వృత్తిమీద మరోవృత్తివారికి నమ్మకం తగ్గుతున్న కాలమది కంసాలులు బంగారం కాజేస్తారనే వాడుక ప్రచారంలోకి వచ్చింది

కడక దొంగ యనుచు కంసాలినందురు
వాని దొంగ యన్న వాడె దొంగ
మన్ను పసిడి చేసి మరి పంచిపెట్టడా (డి 1727, 489)

గ్రామజీవనంలో చాకలివాని పాత్ర చాలా ముఖ్యమైనది సంఘంలోని మురికిని కడగబూనుకున్న వేమన, బట్టల మలినాన్ని పోగొట్టే చాకలివృత్తిలోని నేర్పును తెలిపే పద్యమొకటి వ్రాశాడు

'చాకివాడు కోక చీకాకు పడజేసి
మైలబుచ్చి మంచి మడుపు జేయు
బుద్ధి చెప్పువాడు గుద్దితే నేమయా' (డి 1726, 72)

ఆనాడు, (నేటికి కూడ) గ్రామంలో ఏ కులానికి ఆ వాడ వేరుగా ఉండేవి ముఖ్యంగా మాలలకు మాత్రం వెలిగా ప్రత్యేకంగా వాడ ఉండేది
(మాలవాడ కుక్క మరిగిన విడుచునా – డి 1727, 200)

కులం తగాదాలు, భూమి తగాదాలు వచ్చినప్పుడు గ్రామపెద్దలు తీర్పు చెప్పేవారు వీటిలో ధర్మబలంకన్న మందబలానికే పైచేయి ఉండేది

పదుగు రాడు మాట పాటియై ధర జెల్లు
నొక్క డాడు మాట యెక్క దెందు
ఊరకాడు వాని కూరెల్ల నోపదు (డి 1721, II, 40)

ఊరుకునే వాడు ఊరిలో ఉండలేనివాడే అయ్యేవాడు. 'తగవు చెప్పచోట ధర్మము బలుక'ని ప్రభువులే విచ్చలవిడిగా ఉండేవారు. వీరి తీర్పులు ఎటూ తెగనివిగా ఉండేవి. ఆలోచించక చేసే స్వార్థనిర్ణయాలే కాని విచక్షణతో చేసే నేర్పు వీరికి ఉండేదికాదు.

ఆర్ప తీర్పలేని తీర్పరితన మేల
కూర్ప విప్పలేని నేర్పదేల
పెట్టి పోయలేని వట్టి బీరములేల. (డి. 1727, 186)

అని వేమన నిరసన.

## 3. ఆర్థిక జీవితం

స్థూలంగా వ్యవసాయమే నాటి ప్రజల జీవనాధారం. రైతు పండించింది, వృత్తి పనుల వారికి కొంత పోగా గ్రామ పంచాయతీద్వారా పన్నులరూపంలో ప్రభుత్వానికి కొంత ముట్టేది. పన్నుగా వసూలైన ధాన్యాన్ని 'రాచగాదెలు' అనబడే వాటిలో పోసి ప్రభుత్వోద్యోగులు కాపలా కాసేవారు. ప్రభుత్వోద్యోగులు గ్రామాల వైపు వస్తే వారికి ఈ ధాన్యం ఉపయోగించబడేది మిగిలిన ధాన్యాన్ని అమ్మి ధనాన్ని రాజధానికి పంపేవారు నాటి ప్రభుత్వానికి వచ్చే ఆదాయాలలో ధాన్యాదాయం, సువర్ణాదాయం రెండూ ముఖ్యమైనవే ఆదాయాలనుబట్టి మూడు రకాల గ్రామాలు ఉండేవి 1 రాచ ఊళ్ళు 2. అగ్రహారాలు 3. నాయంకరులు.

1 ఇవి రాజుగారి స్వంత గ్రామాలు వీటి ఆదాయమంతా రాజుగారి స్వంత ఖర్చులకు ఉపయోగింపబడేది రాజోద్యోగులే ఈ గ్రామాలలో సర్వాధికారులు. వీటిని భండారగ్రామాలని, హవేలిగ్రామాలని కూడ పిలుస్తారు

2 అగ్రహారాలలోని పన్నులన్నీ బ్రాహ్మణులకు చెందుతాయి రాజుగారికి ఈ గ్రామాల మీద అధికారమే లేదు

3 సాధారణ గ్రామాలన్నీ మూడవ రకానికి చెందినవి

వ్యవసాయపు పన్నే కాక ఇంకా అనేకరకాల పన్నులుండేవి వ్యాపారం, ప్రయాణం, పశువులు, విలాసాలు మొదలైనవి సామంతరాజులు చెల్లించేదానిని కప్పం అనేవారు

నాటి ఆర్థిక వ్యవహారాల్లో వస్తు రూపం పోయి ధనరూపేణా చెలామణి మొదలయ్యింది అనేక రకాల నాణాలు చలామణిలో ఉండేవి ఇవి ప్రతి రాజ్యానికి వేరువేరుగా ఉండేవి రాజులు మారినప్పుడు కొన్ని కొత్త నాణాలు ప్రవేశపెట్టబడడమే కాకుండా పూర్వ కాలంనుండి వస్తున్నవి కూడ వ్యాప్తిలో ఉండేవి ఉదాహరణకు కాకతీయకాలంలో వ్యవహారంలో ఉన్న వరాహాన్ని విజయనగర చక్రవర్తులు స్వీకరించారు[50] నాణాలు బంగారు, వెండి, రాగి మొదలైన లోహాలతో చేయబడేవి వేమన పద్యాలలో కొన్ని నాణాలు దొర్లినవి వరహా తప్ప చిల్లర నాణాలన్నింటిని వేమన పేర్కొన్నాడు

---

50 వరాహ చిహ్నము ముద్రింపబడినది కాబట్టి వరాహము వరాహం బంగారుది అన్నింటికన్న విలువైనది

వేమన కాలంలో కాసు[51], వీసం[52], దమ్మిడీ[53], తారము[54], రూక[55] మొదలైన నాణాలు ఉండేవి వీటి విలువలు ఈ క్రింది విధంగా ఉన్నవి.

కాసు . చిన్న రాగి నాణెం, అతి తక్కువ విలువ గలది. బహుశ ఇప్పటి పైస వంటిది కావచ్చును

వీసం · రూకలో పదహారవ వంతు విలువ గలది

దమ్మిడి ఐదు కాసుల నాణెం, అరదుడ్డు అని బ్రౌణ్యం

తారము వెండి నాణెం, నాలుగు కాసులైతే ఒక తారము.

రూక చిన్న మెత్తు వెండి, బంగారముల నాణెము అని శబ్దరత్నాకరము.

వేమన పేర్కొన్న కాసు, తారము విజయనగరకాలంలో కూడ వ్యాప్తిలో ఉన్నాయి. చంద్రగిరి నేలిన వెంకటపతిరాయల కాలందాకా వాటి చలామణి కొనసాగిందని చెప్పవచ్చు. వేమనకాలానికి కాసులలో గుల్లకాసులు[56] (గవ్వలు) కూడ ఉండేవి. లోహంతో చేయబడిన నాణాలేకాకుండ 'గవ్వల'కు కూడ మారకపు విలువ ఉన్నట్టు సాక్ష్యాలున్నాయి[57] ద్రవ్యవ్యాప్తిలో కనీసపు విలువ గలిగినవి ఇవే అయి ఉంటవి ఏనుగుల వీరస్వామయ్యగారి కాశీయాత్రనాటికే హైదరాబాదుదాకా ఇవి వ్యాప్తిలో ఉన్నట్టు తెలుస్తున్నది అయన వాటి విలువలను కూడా తెలిపాడు **"వారికి కొన్ని గవ్వలయినా ఇచ్చిపోకపోతే అవమానము తోచుచున్నది. చెన్నపట్టణపు రూపాయికి అతడి పయిసాలు 50, పయిసా 1 కి 20 పుంజీల గవ్వలు, పుంజీ 1 కి గవ్వలు 4."**[58] 'గవ్వకు కూడ కొరగాడు' అనే సామెత ఇప్పటికీ తెలుగుదేశంలో వ్యవహారంలో ఉంది అనాడు ధనాన్ని, ముఖ్యంగా కాసులవంటి వెండి బంగారునాణాలను, భూమిలో పాతిపెట్టి దాచేవారు ఇండ్లలో, దొడ్లలో, చేనులలో, బిందెలను నాణాలతో నింపి పాతి గుర్తుపెట్టి ఉంచేవారు

ఇంటిలోని ధనము ఇది నాది యనుచును
మంటిలోన దాచు మంకుజీవి
కొంచబోడు వెంట గుల్లకాసైనను (డి 1722, 139)

ప్రాచీన గ్రామ ఆర్థిక వ్యవస్థలో ప్రజల ఆర్థిక స్థితిగతులను కొంత లోతుకు దిగి వేరువేరుగా పరిశీలిస్తేగాని అప్పటి ప్రజా జీవనప్రమాణాలలోని వ్యత్యాసాలు అవగతం

---

51 అ) కాసు వీసమేని కనని జనుడు (డి 1727, 201)
ఆ) కాసు తీర్చలేక మోసపోరె (డి 1721, 243)
ఇ) చేతి కాసులెల్ల చేర దీసు (డి 1721, 205)

52 కాని వానిచేత కాసు వీసము లిచ్చి (డి 1769, 776)

53 తటుకు చనులనాడు దమ్మిడి సేయదు (డి 1773, 5, 3177)

54 తటుకు చనులనాడు తారంబు సేయదో (డి 1723, 138)

55 బరుల మోనపుచ్చి యొక రూక పాతికె (డి 1727, 460)

56 కొంచబోడు వెంట గుల్లకాసైనను (డి 1726, 139)

57 I) గజపతింట నెన్న గవ్వలు చెల్లవా (డి 1723, 352)
II) గణకు లొప్పియున్న గవ్వలు చెల్లవా (డి 1721, 151)

58 కాశీయాత్ర చరిత్ర - పేజీ 34

కావు గ్రామవ్యవస్థను గూర్చి తెలియజేసే చారిత్రక సామగ్రియే అరుదైనప్పుడు అప్పటి సమాజంలోని వివిధవర్గాలను గూర్చి ప్రత్యక్ష సమాచారం లభించడం మరీ దుష్కరమౌతున్నది. కాని నాటి జన జీవితంలో కుత్తుకబంటిగా దిగి చూసిన అబె దుబాయ్ చేసిన పరిశోధనమే మళ్ళీ తరగని నిధిగా నిలిచి ఆహ్వానిస్తున్నది.

ఆస్తి విలువలను బట్టి నాటి ప్రజలను అబె దుబాయ్ ఎనిమిది వర్గాలుగా విభజించాడు. మొదటి ఆరు వర్గాలు గ్రామవాసులు కాగా చివరి ఇద్దరు పట్టణాలలో నివసించేవారు. నిజానికి మొదటి రెండింటిని ఒక వర్గంగా, తరువాతి నలుగురినీ రెండవ వర్గంగా, చివరి ఇద్దరిని మూడవ వర్గంగా విభజించవచ్చు కాని దుబాయ్ సూక్ష్మ పరిశీలన ఫలితంగా ఇన్ని వర్గాలు చెప్పాడు.

## (ఎ) పేదరికం

1) మొదటి రెండు తెగలవారు పూర్తి పేదలు మొట్టమొదటి వారూ అట్టడుగు వారూ పేదరికానికి ఇంకా కింది వారూ అయిన వీరి ఆస్తిపాస్తుల విలువ దుబాయ్ మాటలలో 5 స్టెర్లింగులు (50 రూపాయలు) లోపు ఉండేది. మొత్తం జనాభాలో దాదాపు సగం (9/20) ఈ వర్గానికి చెందుతారు. ఈ అర్ధభాగంలో అస్పృశ్యులు, చర్మకారులు కలిసి పావుభాగమైతే మిగిలిన పావు శూద్రులు. దేశ దిమ్మరులు, బిచ్చగాళ్ళను గూడ ఈ వర్గంలో చేర్చవచ్చు. వీరిలో అధికులు అతిస్వల్ప వేతనానికి అత్యధిక శ్రమ చేసే వ్యవసాయ కూలీలు. ఏపూట కాపూట సరిపోయే సంపాదన వీరిది. ప్రాంత భేదాలను బట్టి వారి సంవత్సర ఆదాయం 12 నుండి 26 రూపాయల దాకా ఉంటుంది తీరప్రాంతాలలోనైతే ఎక్కువ ముడుతుంది. వీరి కూలీని సగం ధాన్యంగా, సగం ధనంగా చెల్లించేవారు ఈ సంపాదనలోనే కూడు, గుడ్డా గడపవలసి ఉన్నది ఇటువంటి వారినే 'నడపీనుగలు' అనేవారని వేమన చెప్పాడు.[59]

కుడువ ముడువ లేక కూడు బెట్టగలేక
విడువ నుడువ లేక విద్య లేక
నడువ నేరని వాని నడ పీనుగందురు (డి 1723,309)

ఆ కాలంలో ఇండియాలో ఎక్కడైనా కనీస అవసరాలకు మించిన వేతనం మృగ్యమని హెన్రీ బ్యూకాంప్[60] కూడ ఈ సందర్భంగా అభిప్రాయపడ్డాడు

యువకులు కొందరు పెండ్లి చేయించాలనే ఒప్పందంతో సంపన్నరైతువద్ద ఏడెనిమిదేండ్లు వెట్టి చాకిరి చేసేవారు[61] వివాహితులైన కూలీల యిండ్లు గడవడానికి తిండి యజమాని ఇంటినుండి పంపబడేది కాని ఈ తిండి ఒక మనిషికి సరిపోయేదిగానే ఉండేది దానినే భార్యాపిల్లలు పంచుకొని తినేవారు నిండీ నిండని కడుపులతో

---

59 'నడ పీనుగులు' అంటే 'నడచే పీనుగులు' అని వేమన మరోచోట చెప్పినాడు

60 దుబాయ్ గ్రంథాన్ని ఇంగ్లీషులోనికి అనువదించినవాడు

61 'వెట్టివారు అనబడే అస్పృశ్యులు మూడురకాల వెట్టి చేయవలసి ఉండేది రాచ వెట్టి, గ్రామ వెట్టి, కుల వెట్టి, – రాజులకు చేసే సేవ, గ్రామానికి చేసే సేవ, కులానికి చేసే సేవ, ఈ శ్రమకంతా ప్రతిఫలంగా గ్రామస్తులు వారికి ఏదో కొంత ముట్టజెప్పేవారు' ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర – పేజీ 168

వారు తరచుగా అడవులలో, నదీ తీరాలలో, చెరువుగట్ల ప్రక్కన ఆకులలములు, దుంపలు తెచ్చి ఉడకబెట్టుకొని తినేవారు అనేకసార్లు వీటిలోనికి ఉప్పే ఉండదు. వీరి పిల్లలు కూడ ఏడెనిమిదిసంవత్సరాల ఈడులోనే వారి తండ్రి యజమాని యొక్క పశువులు మేపడం, పేడకళ్ళు తీయడం మొదలైన పనులలో నియమించబడేవారు రోజువారీ కూలీల పరిస్థితి మరీ అధ్వాన్నం వీరికి ఎన్నో రోజులు పనే దొరకదు బానిసలుగా ఉన్న తమ సోదరులకన్న వీరి పరిస్థితి మరీ అధ్వాన్నం వీరి ఆస్తిపాస్తులు మహాఉంటే ఒక పాత చిన్న గుడిసె, ఒకటి రెండు మట్టి కుండలు, రెండు కొడవళ్ళు – ఇవే వారి సర్వస్వం వీరిలో కొంత మెరుగైనవారికి ఒక ఇత్తడి చెంబు, ఒకటి రెండు పళ్ళాలు, మూడు నాలుగు రూపాయల విలువ గలిగిన వెండి గొలుసులు, రెండు మూడు ఆవులు ఉండేవి వీరు బంజరు భూములను సాగుచేసి ప్రభుత్వానికి ఒక రూపాయ నుండి $12\frac{1}{2}$ రూపాయల దాకా శిస్తు చెల్లించేవారు

II) వీరి ఆస్తి విలువ 50 రూపాయల నుండి 250 రూపాయల వరకు ఉండేది మొత్తం ప్రజలలో వీరు ముప్పైశాతం వీరిలో దాదాపు అందరు శూద్రులే అందరికి వ్యవసాయమే వృత్తి వీరికి కూలీలను పెట్టుకునే స్తోమత లేదు ప్రభుత్వ భూములను సాగుచేసుకొని యేటేటా 4 రూపాయల నుండి 70 రూపాయలవరకు (1–20 Pagodas) శిస్తు చెల్లించేవారు వీరిది ఎక్కువలో ఎక్కువ ఒకటిరెండు వెండి గొలుసులు, ఒకటిరెండు రాగి గిన్నెలు, కొన్ని వ్యవసాయపు ఇనుప పనిముట్లు గలిగిన జీవనం మొదటి తరగతివారికన్న కొంచెం మెరుగైన గుడిసెలలో వీరు నివసిస్తారు నేతగాండ్లు, మంగలి, చాకలివాళ్ళు, ఇతర వృత్తులవాళ్ళు ఈ తరగతి కిందికి వస్తారు

మొదటివారికన్న మెరుగైనప్పటికి వీరి పరిస్థితు లేమి సంతృప్తికరంగా లేవు పన్నుల బరువుతో కృంగిపోయేవారు యేడాదిలో నాలుగు నెలలు మాత్రమే వీరు కడుపు నిండా తినేవారు ఈ వర్గంలో పండించిన వాడెప్పుడూ తినడు పన్నులు, అప్పు కట్టడానికి ధాన్యం అమ్ముకుంటాడు ఎనిమిది నెలల పస్తుల కాలంలో దుంపలు మొదలైనవి తిని కాలక్షేపం చేసేవాడు దక్షిణ భారత దేశంలో సంవత్సరానికి మూడు నెలలు (జూలై, ఆగస్టు, సెప్టెంబరు) ప్రజలు తీవ్రమైన కరువును అనుభవించడం పరిపాటి అని దుబాయ్ వాపోయాడు మనుషులే కాదు పశువులు కూడ కరువుకు గురౌతాయి

III) వీరి ఆస్తి విలువ 250 రూపాయల నుండి 500 రూపాయల వరకూ ఉండేది మొత్తం ప్రజలలో వీరి సంఖ్య ఐదు శాతం వీరుకూడ ప్రధానంగా వ్యవసాయదారులే వీరు మూడు, నాలుగు నాగళ్ళవ్యవసాయం చేస్తూ 35 రూపాయల నుండి 105 దాకా శిస్తు చెల్లించేవారు వీరి పరిస్థితి ఎంత మెరుగైనదంటే, పన్నులు కట్టంగా కూడ సంవత్సరమంతా తిండిగింజలు కండ్లజూచేవారు తినగా మిగిలిన తిండిగింజలను ఊరిలోనివారికి అమ్మగలిగిన మంచిస్థితి వీరిది పై ఇద్దరికన్న వీరి నివాసాలు చెప్పుకోదగినవి వీరి ఇండ్లలోని ఆడవారికి కట్ట విడువ బట్టలుండేవి పశువుల వలన కూడ వీరికి చాలా రాబడి ఉండేది మేకలు, గొర్రెలు, ఇంటినిండా పాడితో ఒకరికి చేయిచాచని బ్రతుకులు వీరివి వీరికి అప్పుల బాధ ఉండేది కాదు

iv) గ్రామాధికారులు అన్ని వర్గాలకన్న ఈ వర్గం చాలా ముఖ్యమైనది ఆర్థిక ప్రమాణాలను బట్టి కాక ప్రజలపైన వీరికున్న ప్రభావం వలన కూడ ప్రాచీన గ్రామజీవన వ్యవస్థలో ఈ వర్గం చాలా ప్రధానం వహిస్తున్నది

వీరి ఆస్తిపాస్తులు 500 రూపాయల నుండి 1,000 రూపాయల వరకు ఉండేవి మొత్తం జనాభాలో ఏడున్నర శాతమే వీరి సంఖ్య (3/40). బ్రాహ్మణులు, సంపన్నులైన శూద్రులు వీరిలో చేరుతారు కూలీలను విచ్చలవిడిగా నియమించుకోదగిన స్తోమత వీరిది వీరు వ్యాపారాలు చేసేవారు; వడ్డీలకు ఇచ్చేవారు తాము తినగా, నలుగురికి పెట్టగా కూడ సద్ది మిగిలే సంసారాలు వీరివి[62]

*నేయిలేని తిండి నీయాన కసువది*
*కూరలేని తిండి కుక్కతిండి* (డి 1721, 136)

అనజాలినవారు అనేక వేమనపద్యాలను సూక్ష్మంగా పరిశీలిస్తే వేమన ఈ ఆర్థిక వర్గములోనే పుట్టినవాడని భావించడానికి వీలున్నది కాని అతని దృష్టి ఎక్కువగా క్రిందివారిపైనే కేంద్రీకరించబడింది తన వర్గంతో ఐక్యంకాక అవధులు లేని చైతన్యంతో అడుగువారి న్యాయం కొరకు పోరాడిన వేమనలో జన్మత వచ్చి ఇంకా మిగిలి ఉన్న తన వర్గపు నీడలు స్పష్టాస్పష్టంగా కనిపించి, అతడు ఏ వర్గం నుండి వచ్చినాడో తెలుసుకోవడానికి తిరుగులేని సాక్ష్యాలౌతాయి

గ్రామాధికారం చేసే రెడ్డి, కరణం మొదలైనవారు ఈ ఆర్థిక తరగతి నుండి వచ్చినవారే వీరిని ఎదిరించి ఎవరూ గ్రామంలో నిలువగలిగేవారు కారని దుబాయ్ వ్రాశాడు వీరి విధులు, కార్యాలను గూర్చి దుబాయ్ మాటలలోనే తెలుసుకోవడం మంచిది

"This class provides the villagers with their Sudra head-men, and these men are at the same time the largest holders of Government lands They also exercise in their villages the functions of Collectors of revenue, petty magistrates and public arbitrators As these are usually held responsible by Government for the due payment of all taxes levied on their villages, they are obliged to conciliate the villagers, to prevent their secretly migrating elsewhere, which would mean the non-cultivation of the land, and consequent inability on their part to furnish the revenue due to the state These men have quite a patriarchal authority in their villages, but those who attempt to abuse their power are soon confronted with deserted homesteads, waste lands, and ruin staring them in the face"[63]

v) సంపన్నులు ఇక్కడినుండి పై వర్గాలు మొదలౌతాయి వీరి ఆస్తిపాస్తులు 1,000 రూపాయల నుండి 2,000 రూపాయల వరకు ఉండేవి మొత్తం ప్రజలలో మూడు శాతం పైగా వీరి సంఖ్య బ్రాహ్మణులు లేక వైశ్యులు మరియు సంపన్న శూద్రులు

62 "సద్ది మిగుల నింట సంసార మేలయా"

63 Hindu manners - Page 88

ఈ తరగతిలోనికి వస్తారు. వ్యవసాయం, ధాన్యవ్యాపారం, ఇతర దినుసుల వ్యాపారం, మరియు వడ్డీకి ఇవ్వడం వీరి వృత్తులు. పెంకుటిండ్లలో నివసించేవారు ఈ వర్గానికి చెందిన శూద్రులు కూడ శాకాహారాన్ని పాటించడంలో బ్రాహ్మణులను అనుకరించేవారు. వీరిలో ఎక్కువగా అసహనం, అహంకారం కనిపిస్తుండేవి

vi) 2000 రూపాయలనుండి 5000 రూపాయల వరకు వీరి ఆస్తి. నూటికి ఇద్దరి చొప్పున వీరి సంఖ్య. వీరిలో సగం మంది బ్రాహ్మణులు. వీరికి పారంపర్యంగా వచ్చిన మాన్యాలు ఉండేవి పండ్ల తోటలు, కొబ్బరి తోటలు, ధనం, పశువులు మొదలైనవి వీరి సంపద వీరిలో చాలామందిలో గర్వం, దుర్మార్గం కనిపించేవి.

vii) వీరి ఆస్తిపాస్తులు 5,000 రూపాయల వరకు ఉండేవి నూటికి ఒకటి చొప్పున వీరి సంఖ్య వీరు ప్రభుత్వోద్యోగాలలో ఉండేవారు

viii) వీరి ఆస్తి 10,000 రూపాయల నుండి 20,000 రూపాయల వరకు ఉండేది వీరు వెయ్యికి ఐదుమంది చొప్పున ఉండేవారు. ఈ వర్గంవారు దాదాపు అందరూ బ్రాహ్మణులే. అగ్రహారీకులు చాల కొద్దిమంది మాత్రమే వైశ్య, శూద్రులుండేవారు వీరు ఎక్కువగా పట్టణాలలో, రాజధానిలో నివసిస్తూ వ్యాపారాలు, ప్రభుత్వోద్యోగాలు చేసేవారు. ఇరవైవేల రూపాయలను మించిన ఆస్తిగలవారు రాజ్యంలోనే వేళ్ళమీద లెక్కబెట్టగలిగినవారుగా ఉండేవారు

## (బి) అప్పు ముప్పు

తేనె చుట్టు మూగే ఈగల వలె సంపన్నుని ఇంటి చుట్టూ పేదలూ, భికారులూ చేరేవారు. ఇది సర్వకాలాలలోను జరిగేదే

"A native house is besieged as soon as he is known to be a wealthy man and this not only by his own relatives, but also by the indigent of his caste, and by a horde of parasites of every description, including poverty - stricken Brahmins, religious mendicants, ballad-mongers, and low flatterers, who feed his vanity by writing odes to his honour and glory, and by lavishing on him praise of the most fulsome nature "[64]

ఎంత స్వల్ప ప్రతిఫలానికైనా, దాత పైన కవిత్వం అల్లే దరిద్రగొట్టుగా కవులు జమ అయినారు

*తోటకూరకైన దొగ్గలికైనను*
*తవిటికైన తవిటి కుడుముకైన*
*కావ్యములను చెప్ప గండ్యాలు ఘనులైరి* (డి 1723, 579)

వేమన కాలానికి పుణ్యపుణ్యకార్యాలపై ఆసక్తి, దానగుణం చాలా వరకు తగ్గిపోయినవి వేడ వచ్చిన అర్థిని వెళ్ళగొట్టే దాతృత్వ హీనులను, లోభులను నిందిస్తూ వేమన వందలాది పద్యాలు చెప్పాడు ధనం పుష్కలంగా ఉండి ఎవరినీ దరిచేరనివ్వని వానిని వేమన చేనిలోని బెదురుబొమ్మతో పోల్చి పరిహసించాడు

64 Hindu manners - p 92

ఈవి నశించిన లేమి రోజులలో గడవని వారికి అప్పులే శరణ్యమైనాయి కాని ఆ అప్పులు కూడ అందరికి లభించేవి కావు (పరగలేమి చేత పరపతి దప్పురా డి 1721, 60) గ్రామ సమష్టి జీవనంలోని సత్యకాలం క్రమంగా సడలిపోతున్న కాలమది.

దుబాయ్ చెప్పిన అట్టడుగు వర్గంవారే తరచుగా ఈ ఋణబాధలలో చిక్కుకునేవారు. పెండ్లికో, మరి దేనికో అప్పిచ్చి ఆ కట్టడిలో బంధించి పెద్ద రైతులు ఏండ్ల తరబడి వెట్టి చేయించుకునేవారు ఆ అప్పు వడ్డీతోబాటు దినదిన ప్రవర్ధమానమయ్యేది. తిండికి గడవడానికి భార్యాబిడ్డలు అందరూ కూలిపని చేసేవారు అప్పు ఎన్నటికీ తీరదు చచ్చిపోయేవరకు ఈ చాకిరీ మాత్రం అవిచ్ఛిన్నంగా సాగుతుంది ఈ ఋణం తరతరాలుగా కొనసాగి భావితరాలవారు బానిసలుగా పుట్టి బానిసలుగానే మరణించేటట్లు చేస్తుంది

*వడ్డి కిచ్చువాని వాకిట బడుదురు*
*బడ్డు చిక్కి నరక బాధ పడుచు*
*దుడ్డు కాసు గాని దొడ్డయీవియ్యరు* (డి 1773, III, 1328)

దుబాయ్ పేర్కొనిన ఐదవవర్గం వారు ఎక్కువగా అప్పులిచ్చేవారు వీరు విధించే వడ్డీ "నిజంగా మిత్తే" వీరు వడ్డీలు, 25, 30, 50 శాతం వరకు వసూలు చెయ్యడం దుబాయ్ చూసి వ్రాశాడు ఋణగ్రస్తులై కృంగి కృశించి పోయిన బలహీనులు, 'అప్పులేని వాడు అధిక బలుడు' (డి 1721, 147) అనే తీర్మానానికి వచ్చారు

వ్యవసాయ సంస్కృతిలోనికి మెల్లగా వ్యాపార వాతావరణం ప్రవేశిస్తున్న రోజులవి కలిగినవారే కాక, కడుపు కట్టుకొని వడ్డీకిచ్చే పేదలు కూడ తయారైనారు

*కూడు వడ్డి కిచ్చి కూర్మి తోడుత గంజి*
*తాగునట్టి వోగు తారమైన*
*పేద సాదలకును పెండ్లికి ఇచ్చునా* (డి 1769, 733)

ఋణం దారుణంగా మారింది 'ఋణము మోసి నరుడు రూఢికి ఎక్కునా' (డి 1727, 97) అని అప్పుడు వ్యతిరేకంగా వేమన అనే పద్యాలలో ప్రచారం చేసినాడంటే అప్పటి ఋణబాధలు ఎటువంటివో ఊహించడానికి వీలౌతున్నది

## IV. సాంఘిక పరిస్థితులు

వేమన పద్యాలలో నాటి సాంఘిక పరిస్థితులు శకలాలుగా లభిస్తున్నవి సంపన్నులకు పెద్దయిండ్లు, వాటి చుట్టు ప్రహరీగోడలు ఉండేవి

*చెట్టు చేమ గొట్టి చుట్టు గోడలు బెట్టి*
*ఇట్టునట్టు పెద్ద యిల్లు గట్టి*
*మిట్టిపడును నరుడు మీద చేటెరుగక* (డి 1721, 161)

పేదవారి తడికె తలుపుల వలె గాక వాటికి గట్టి తలుపులు ఉండేవి (తడికె బిర్రుపెట్ట తలుపుతో సరియౌనె – డి 1735, 843) సంపన్నులైనవారి వేషాలను

వేమన ఈ క్రిందివిధంగా వర్ణించాడు:

తలను పాగ, పైని తగు పచ్చడము, బొజ్జ
చెవుల పోగులరసి చేరు నర్థి
శుద్ధ మూర్ఖులనుచు బుద్ధిలో నరయక (డి. 1721, 42)

పాగ పచ్చడము పైకి కూసంబును
పోగులుంగరములు బొజ్జ కడుపు
కలిగినట్టి వాని కందురు చుట్టాలు.[65] (డి. 1721, 21)

స్త్రీ పురుషుల భేదము లేకుండా పోగులు ధరించేవారు. ధనవంతులు ధరించే పోగులకు ముత్యాలు, రత్నాలు గుచ్చి ఉండేవి. పేదవారి పోగులకు ఫ్తాసలుండేవి. వీటిని ఫ్తాసపోగులనేవారు. ఫ్తాసపోగులను స్త్రీలు, పురుషులు కూడ ధరించేవారు.

ఫ్తాసపోగు బెట్టి పురుషుని భుజమెక్కి
కన్నులార్ప వారకాంత గాదు
తనకు లొంగువాని తడయక జంపురా. (డి 1762-4-60)

మగవారి చేతులకు కడియాలు ఉండేది. (మొండివానికేల ముంజేతి కడియాలు - డి. 1721-2-79). సంపన్నులైన సువాసినులు తలపాపిటలో ముత్యాలసరం ధరించేవారు (ముండమోపికేల ముత్యాల పాపిట - డి 1723, 1096)

వ్యవసాయదారులు పంటచేనులలో వెదురుబొమ్మలు చేసి కట్టేవారు (చేనిలోన బొమ్మ చేసి కట్టిన రీతి - 1723, 304). పసరాలకు దొమ్మరోగం వస్తే వాతలు పెట్టేవారు

దొమ్మతెగులు చేత తూలిన పసరంబు
వాత వేయ బ్రతికి వచ్చెనేని
వాత యెనుముపాలు రోతన వచ్చునా (డి 1723, 397)

నాటి ప్రజల వినోదాలలో తోలుబొమ్మలాట ప్రాధాన్యం వహించింది (తోలుబొమ్మలాట కీలు దెలియలేరు - డి 1769, 122) కృష్ణరాయల కాలం నాటివలె దొమ్మరిసాని గడెక్కి ఆడడం కూడ వేమన కాలం నాటికి బతికి ఉన్నది (అకసపు గడెక్కి ఆడు దొమ్మరిసాని - డి 1727, 130) వేమన నాటికి గాజుకుప్పెలు వాడుకలో ఉన్నాయి ధనవంతులు గాజుకుప్పెలలో దీపాలు వెలిగించేవారని తెలుస్తున్నది (గాజుకుప్పెలోన కడగుచు దీపంబు - డి 1721, 17) అనాడు మిరియాలకు మిరపగింజలనే వాడుక ఉన్నది అప్పటికి ఇంకా మిరపకాయ పంట మన దేశానికి రాలేదు [66]

65 ఈ పద్యాలను సురవరం ప్రతాపరెడ్డిగారు కూడ తమ సాంఘిక చరిత్రలో ఉదాహరించారు.

66 "1498లో పోర్చుగీసు వాస్కోడిగామా, మలబారులో దిగిన తర్వాత, దక్షిణఅమెరికా చిల్లీ దేశం నుండి తెచ్చిన, మనదేశంలో దింపిన, చిల్లీ అనే నేటి మిర్చి - మిరప - వేమన కాలానికి యింకా దేశంలో పాకినట్లు లేదు" - వేమన, మరుపూరు కోదండరామరెడ్డి, చైతన్యలహరి, యువభారతి ప్రచురణ, 1972

మిరపగింజ చూడ మీద నల్లగనుండు
కొరికి చూడ లోన చురుకుమనును
సజ్జనులగువారి సారమిట్టులనుండు (డి 1721, 141)

వేమన కాలానికి చిత్రపటాలు గీయడం ముమ్మరంగా ఉన్నట్లున్నది ఇంగిలీకాన్ని చిత్తరువుల రంగులలో వాడేవారు రసవాద ప్రక్రియలో ఒక ద్రవ్యంగా వాడే ఇంగిలీకాన్ని చిత్రాలకు వాడడాన్ని వేమన నిరసించాడు.

ఇంగిలీక మహిమ హేమింపనేరక
చిత్రపటము వ్రాసి చెరచినారు (డి 1723, 1092)

ఆయుర్వేద దేశీయ వైద్యానికి సంబంధించిన పద్యాలు వేమన పద్యాలలో దొరుకుతున్నవి కాని వేమన పద్యాల సహజశైలి వాటికి లేదు

ఆనాటి వైవాహిక సంబంధాలలో మేనరికం ప్రాధాన్యం వహిస్తున్నది అరవలలో మేనరికపు ఆచారం లేదని కూడ వేమన యెరిగి ఉన్నాడు.

మేనమామ బిడ్డ మెరిసి పెండ్లామాయె
అరవలందు చెల్లెలాయెనదియు
వలసిన పుణ్యంబు వలదన్న దోషంబు (డి 1725, 599)

ఆర్థికంగా అంతంత వారు కూడ సంపన్నులచేత వియ్యమందడానికి ఉవ్విళులూరేవారు (**కలిమి గల్గు వాన్కి కన్యనిచ్చెదు వేళ - డి 1773, 3, 101**) సమానమైన వారితో వియ్యమందడం సరసంగా భావించబడే ఆ రోజులలో ధనవంతులకు పిల్లనిస్తే అమ్మకంతో పోల్చేవారని ఈ కింది పద్యాల వల్ల ఊహించ వచ్చును

కలిమి జూచి యివ్వ క్రయమిచ్చినట్లుండు
సమున కివ్వ మంచి సరస గుణము
పేద కివ్వ మనువు పెన వేసినట్లుండు (డి 1773, 3, 104)

పేదవాడు యైన పెంటి నిచ్చెదనని
పైక మడుగరాదు పరుసమునను
పైడి గొనుట పెంటి బట్టిన యట్లయా (డి 1773, III 1200)

సంపన్నులలోనే కాదు, పేదవారిలో కూడ పిల్లనిచ్చి ధనం పుచ్చుకొనే ఆచారముండేది కన్యాశుల్కం ఇచ్చి మనువాడితే పరుని బిడ్డను చెరబట్టినట్టే అని వేమన భావించాడంటే కన్యాశుల్కం ఆచారం ఆ రోజులలో ముమ్మరంగా సాగేదని తెలుస్తున్నది 'పరుసమునను' అనడం వలన ఆ పద్ధతి బలవంతంగా ఉండేదని కూడా ఊహించవచ్చును

నాటి బంధుత్వ సంబంధాలు కూడ ఆర్థిక ప్రాతిపదికల పైననే సాగినవి

ఆలివంక వారు ఆత్మ బంధువు లైరి
తల్లివంక వారు తగిన పాటి
తండ్రివంక వారు దాయాది పగివారు (డి 1769, 653)

ఈ పద్యానికి ఆరుద్రగారి సరస వ్యాఖ్యాన మిట్లున్నది "వావి వరుసలు ఆస్తినిబట్టి ఏర్పడ్డాయన్న సత్యం వేమనగారు గుర్తించారనడానికి ఈ పద్యం తార్కాణం.

అత్తింటివాళ్ళు అల్లుడికి ఎప్పుడూ అయినవాళ్ళే. మేనమామలు మేలుకోరే వారైనా అంతంతమాత్రమే. తండ్రివంక వారు దాయాదులు, అందుకే శత్రువులు. ఆలివంకవారు, తల్లివంక వారూ ఆప్యాయంగా కట్నాలూ, కానుకలు ఇచ్చేవారు. తండ్రివంక వారితో ఆస్తిపాస్తులు పంచుకోవాలి. అందుకని తగవులు పెట్టుకోవాలి, రచ్చకెక్కాలి, రాజీ పడాలి. అన్నీ చిక్కులే. ఆస్తి కుటుంబంలోనే ఉండిపోవాలని తల్లి పెత్తనం ఉన్న సంఘాలలో వారసత్వం కొడుకులకు కాక మేనల్లుళ్ళకు చెందుతుంది. మన మేనరికాలలో అర్థం ఇదే. దీనిని ఇతర ప్రాంతాలలో వావి తప్పినట్లు భావిస్తారు."[67]

భద్రతకు పేరుగాంచిన హిందూ కుటుంబ వ్యవస్థ బీటలు వారుతున్నది. అందరు కలిసికట్టుగా ఉండే ఆ ఉమ్మడి కట్టడిలో సమష్టి కుటుంబమే సర్వత్రా ఆచరణీయమై ఉండేది కాని ఉమ్మడి కుటుంబం నుండి వ్యష్టికి వేరుపడే ధోరణులను వేమన సహించలేకపోయాడు వేర్పాటు పద్ధతులను భార్యలు ప్రోత్సహించేవారు

ఆలి మాటలు విని అన్నదమ్ముల బాసి
వేరుబడ్డ వాడు వెర్రివాడు
కుక్కతోక బట్టి గోదావరీదునా (డి 1723, 383)

కుటుంబ వ్యవస్థ పగుళ్ళువారిన దనడానికి మరో ఉదాహరణ కొడుకులు అవిధేయులుగా మారడం

అనుకూలవతిగాని ఆలినేలుట యేల
తనకు లోకువ గాని తనయుడేల
పనికి మాలినట్టి బంధుండు యేలయా[68] (డి 1769, 673)

నాటి సంఘంలో అమితంగా ప్రబలిన వేశ్యాలంపటత్వం కూడ కుటుంబ జీవనానికి ప్రమాదంగా వాటిల్లింది దీనికి ఉదాహరణగా వేమనపద్యాలు చాలా దొరుకుతాయి

## V. ఆత్మచరిత్ర శకలాలు

"వేమన ఒక వ్యక్తి కాదు. అనేక వేమనలున్నారు. ఆశుకవితా స్రవంతిలో వేమనలది ఒక సమష్టి సంప్రదాయం" అనే దృష్టికి అవకాశమున్నప్పటికీ, నేను మొదటి నుంచీ వేమనను ఒక వ్యక్తిగానే భావిస్తూ అన్వేషణ చేస్తున్నాను లిఖిత సాహిత్య సంప్రదాయంలోని దారులన్నీ అగమ్యాలైనప్పుడు మాత్రమే ఆశుసాహిత్యప్రమాణాల వైపు ఆశగా చూస్తున్నాను వేమన పద్యాలలో తమ పద్యాలను చేర్చిన వారందరిని కూడ వేమనలుగా భావించే స్థితికి నేనింకా చేరలేదు కాబట్టి ఇప్పటివరకు నా దృష్టిలో వేమన ఒక వ్యక్తి

67 వేమన వేదం - స్వాతి, 1975
68 పెద్ద కొడుకు తండ్రి చెప్పినట్లు (డి 1727, 1363)
'వినడుగా' అనేది పాఠాంతరం (డి 1725, 657)

'వేమన యోగీంద్ర చరిత్రము'[69] 'వేమన జీవితము'[70] లను వ్రాసినవారందరు వేమనను ఒక వ్యక్తిగానే భావించారు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు, సి. రామకృష్ణారావుగార్లు ఈ కథలను గ్రంథాలుగానే వ్రాశారు కాని వారి వేమన ఎక్కువగా 'వాడుక కథల' నుండి పుట్టిన వేమనే ఆ వాడుక కథలు కూడ వేమన పేరు బట్టి, వేమన పద్యాలలోని బంగారం ప్రసక్తి, వేశ్యల ప్రసక్తిని బట్టి పుట్టాయి. ఈ కథలలోని వేమన రక్తమాంసాలతో మన మధ్య తిరిగే సామాన్య మానవుడు కాదు. అతీంద్రియ శక్తులతో అద్భుతాలను చూపే అమానుషుడు దేశమంతటా ఇటువంటి కథలు ప్రచారంలో ఉన్నాయి సామాన్య జనులే కాక పండితులు కూడ ఈ ఇతివృత్తాన్నే తీసుకొని ప్రబంధ ఫక్కీలో కావ్యాలు వ్రాశారు.[71] చిరకాలం నుండీ ఇదే వస్తువుతో అసంఖ్యాక నాటకాలు దేశం నలుమూలలా ప్రదర్శింపబడుతున్నాయి.[72] కె వి రెడ్డి **'వేమన యోగి'** చలన చిత్రాన్ని రసవత్తరంగా నిర్మించి చరిత్ర సృష్టించారు [73]

కాని ఈ వాడుకలు చారిత్రక దృష్టికి నిలిచేవి కావని వెనుక నిరూపించబడింది ఇక వేమన భౌతికజీవితాన్ని గూర్చి కొంచెమైనా చెప్పడానికి వేమన పద్యాలే ఆధారం ఏ కవి కవిత్వమయినా, కొంతవరకు అతని ఆత్మకథ వంటిదే కవి అభిరుచులు, అభ్యంతరాలు, పుట్టిపెరిగిన వాతావరణం, స్వభావాన్ని తీర్చిదిద్దిన పరిస్థితులు, అభిప్రాయాలు, వాటి పరిణామం మొదలైనవన్నీ భావుకుని రచనలలో ఏదో ఒక ప్రమాణంలో, రూపంలో

---

69 పూర్ణయాచారి

70 శేషాద్రికవులు

71 i) వేమన ఇదీ ప్రబంధమే రచయిత విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్య కవి విశ్వజ్ఞ మండలి, తెనాలి వారి ప్రచురణ కాలం 1948 ఇందులో వేమన జీవితంలోని వివిధ దశలకు 1 ప్రకృతి 2 సమావేశము 3 తలపోత 4 సూక్తులు అనే నాలుగు ప్రకరణాలున్నాయి ఈ పుస్తకంలో చెప్పుకోదగింది ఏమీ లేదు పీఠిక వ్రాసిన ఏటుకూరి వేంకట నరసయ్యగారు మాత్రం వేమన రూపురేఖలను గూర్చి ప్రస్తావిస్తూ 'నాసాగ్రమున దృష్టి నిల్పి మోకాలి కురికి వంగి బద్ధకరవలె నున్న వెర్రి వేమనను ప్రసాదించినది శిల్పిలోకము' అని వ్రాశారు

ii) శ్రీ వేమన యోగీయము నాదెళ్ళ మేధా దక్షిణామూర్తి (ఈయన నాదెళ్ళ పురుషోత్తమకవిగారి కుమారుడు) ప్రబంధ ధోరణిలో (షష్ఠ్యంతములు, సంధ్యాది వర్ణనలు) వ్రాయబడిన కావ్యం 1955లో కృష్ణా స్వదేశీ ప్రెస్, బందరు వారిచే ప్రచురింపబడింది

iii) వేమన గ్రంథకర్త యి షేక్ ఫరీదు కవి వినుకొండ, తారీఖు లేదు

iv) విశ్వదాభిరామం చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి, రాజమండ్రి, 1973

72 i) (వేమన యోగి) నాటకం రచయిత-కవిదిగ్గజ చిట్టెపు వేమారెడ్డి, కొరిటిపాడు, గుంటూరు - 2 1968

ii) వేమన నాటకము-వెంకటాచారి 1874, 3 శ్రీ వేమనయోగి (నాటకం) రచన ఎమ్ పంచనాదం పబ్లిషర్స్ శ్రీ స్వరాజ్య పబ్లికేషన్స్, మల్లికార్జున పేట, విజయవాడ

మరెన్నో వందల నాటకాలు (ముద్రితాలు, అముద్రితాలు) దేశంలో ఉన్నాయి వాటన్నింటిని చూసే అవకాశం లభించకపోవడంవల్లనే వాటినిక్కడ పేర్కొనలేకపోతున్నాను

73 వేమన యోగి చిత్రాన్ని కీ శే కె వి రెడ్డి నిర్మించి, దర్శకత్వం వహిస్తే, కీ శే సముద్రాల రాఘవాచార్య కథ, మాటలు వ్రాశారు దీనికోసం ఆచార్యులవారు ఎంతో రిసెర్చి చేశారని లింగమూర్తిగారు చెప్పారు కాని చిత్ర నిర్మాణంలో దేశంలో వాడుక కథలకున్న ప్రచారం కారణంగా పద్యాలలోని ఆధారాలను త్యాగంచేయక తప్పలేదు

బయటపడక తప్పదు కాని వేమన వంటి ఆశుకవిని గూర్చి స్పష్టమైన వివరాలను సేకరించడంలో అనేక చిక్కులున్నాయి ఆధారాలమీద నిర్మించే ఊహాసౌధమే కాని, తిరుగులేని సాక్ష్యాలను ప్రదర్శించడం కష్టం వేమనవంటివాని జీవితాన్నిగూర్చి చెప్పుకునే కథ కదిలే అలల మీద నీడబొమ్మే కాని స్థిరమైన భిత్తికాచిత్రం కాదు. ఇంతవరకు ఈ ప్రయత్నంలో చాలావరకు కృతకృత్యులైన వారిలో శ్రీ రాళ్ళపల్లి, శ్రీ నార్ల, శ్రీ ఆరుద్రగార్లు ముఖ్యులు వేమన పద్యాలు మైనపు ముద్దల్లాంటివి కాబట్టి ఇష్టానుసారంగా మలచుకోగలిగే సౌకర్యం వీటికి ఉండడంవల్ల కించిద్భేదాలతో వీరి కథలు సాగినవి అయితే ఈ భేదాలు సంవిధానంలోనే గాని, కథాశరీరం మాత్రం సామ్యాన్నే సంతరించుకున్నది వేమన బాల్యం, యౌవనంలోని వేశ్యాలంపటం, గయ్యాళి భార్య, వైరాగ్య జీవితం - ఇటువంటి కీలకమైన దశలను గూర్చి వీరికి ఏకాభిప్రాయం ఉంది. కేవలం పద్యాల ఆధారంగానే వేమన ఆత్మ చరిత్ర శకలాలు చెప్పుకునే ప్రయత్నం చేస్తాను

వేమన పద్యాలలోని వివిధ భావాంశాలను ఈక్రింది విధంగా బేరీజు వేయవచ్చు

1 ప్రపంచ స్వభావ పద్ధతి 2 లౌకిక రీతులు 3 పుత్రులు 4 మూఢులు 5 సంసారం 6 ఆశ 7 మోహం 8 వివిధ విలువలు 9 బాహ్యావేషాల ఖండన 10 వేమన మీది పద్యాలు 11 మూర్ఖుడు 12 గురువు 13 కులం 14 బ్రాహ్మణులు 15 కాలం 16 పురాణ పాత్రలు 17 బోధపద్యాలు 18 మృత్యువు 19 దానం–దాత 20 ధనం 21 లోభులు 22 తీర్థయాత్రలు 23 హింసాహింసలు 24 త్యాగం 25 సత్యం 26 సామాన్య నీతి పద్యాలు 27 స్త్రీలు 28 దుర్మార్గులు 29 అజ్ఞానం 30 యోగం 31 కుండలిని 32 సాధన 33 అనుభవం 34 మనస్సు 35 యుక్తి 36 చింత 37 ముక్తి 38 ఎరుక 39 బ్రహ్మజ్ఞానం 40 తత్త్వం 41 భక్తి 42 మతం 43 యోగి 44 జ్ఞాని 45 సజ్జనుడు 46 వైద్యం 47 ధర్మం 48 గుణములు (త్రి) 49 అద్వైతం 50 మాయ 51 కర్మ (పునర్జన్మ) 52 జ్ఞాని 53 ఆత్మజ్ఞానం 54 బ్రహ్మము 55 దేవుడు 56 దైవబలం 57 దేహం 58 రసవాదం 59 ఆధ్యాత్మికం 60 ఫలశృతి

మరికొంత పరిశీలన వలన ఈ విభాగాలను ఇంకా తగ్గించుకోవచ్చు వస్త్వైక్యం సాధించే దృష్టితో వరసను మార్చుకోవచ్చు

1 నుండి 28 విభాగాలవరకు ఉన్న పద్యాలన్నీ వేమన లోకవృత్త పరిశీలనను, భావావేశాన్ని ప్రదర్శిస్తాయి ఈ పద్యాలు వేయిని మించి ఉన్నాయి లోకంలో ప్రసిద్ధికెక్కిన పద్యాలన్నీ ఈ విభాగాల లోనివే 29 నుండి 60 వరకు ఉన్న పద్యాలన్నీ వేదాంతపరమైనవి వేదాంత పద్యాల్లో దాదాపు మూడువంతులు కందాలే కావడం గమనార్హం

వేయికి పైగా ఉన్న పై పద్యాల్లో వేమన జీవితచరిత్ర శకలాలను అన్వేషించే ప్రయత్నానికి వీలున్నది వ్యక్తి జీవితాన్ని సమాజం నుండి వేరుచేసి చూడడం కష్టమే అయినా, ప్రతిభావంతుడైన ఒక వ్యక్తి జీవితం ఆ సమాజంలో ఎటువంటి ప్రత్యేకమైన మార్పులకు లోనవుతుందోననే ఆసక్తి ఇక్కడ నా దృష్టి

వేమన 17వ శతాబ్దంలో రాయలసీమలో ఒకానొక కాపుకుటుంబంలో జన్మించాడు కాపులను గురించి అతడు చెప్పిన పద్యాలు, వ్యవసాయ జీవితంతో అతనికి గల గాఢ పరిచయాన్ని బట్టి అతడు 'కాపు' అని ఊహించవచ్చు గ్రామంలో పెత్తనం చలాయించే

అధికారవర్గంలోనివాడు కాబట్టి వేమనకు రాజసగుణం అలవడి ఉంటుంది. చాలా పద్యాల్లోని వెలుసుదనం, సాహసం, స్పష్టతవల్ల దీనిని ఊహించవచ్చు మాటసాగినవాడే కాక మాటకారి కూడ అయి ఉంటాడు పద్యాలలోని తర్క శీలం మనకు తెలిసిందే నాయకత్వ లక్షణాలుండి ఉంటాయి ఇతని స్నేహితులలో అన్ని కులాలవారూ ఉండేవారు అగ్రవర్ణస్థుల నుండి అంటరానివారిదాకా వేమనతో తిరగనివారు లేరు అప్పుడే కులవ్యవస్థలోని అమానుషత్వాన్ని గమనించి ఉంటాడు తర్వాతి కాలాల్లో కూడ వర్ణవ్యవస్థను అంతబలంగా ప్రతిఘటించినవారు లేరు. విశాలమైన ఆకాశం కింద ఎటుచూసినా ఎత్తయిన కొండల సౌందర్యం వేమన పసిహృదయం మీద చెరగని ముద్రలు వేసి ఉంటుంది (వేమన పద్యాల్లో కొండ పోలికలు ఎక్కువగా కనిపిస్తాయి. మచ్చుకు "కొండ అద్దమందు కొంచెమై యుండదా?" అదే విధంగా "బంగారు" ఉపమానాలు, సున్నం ప్రసక్తితో పద్యాలు కనపడడానికి రాయలసీమలోని గనులు, బట్టీలు కారణమా?)

స్నేహితులతో క్షణం తీరికలేక ఊరూవాడా తిరిగే అలవాటువల్ల వేమనకు ఒకచోట కాలునిలవని అస్థిర స్వభావం ఏర్పడి ఉంటుంది సంచార జీవితాన్ని వర్ణించే వేమన పద్యాలు కొల్లలు ఊరిలోని దేవళాలలో అయ్యవార్లు చెప్పే ఆధ్యాత్మిక విషయాలు, హరికథలు, తోలుబొమ్మలాటలు ("తోలుబొమ్మలాట కీలు తెలియలేరు") మొదలైనవన్నీ పురాణ పరిచయాన్ని కలిగించి ఉంటాయి ఆ కాలంలో ఊరూరు తిరిగే గంజాయి గోసాయీల గుంపులతో పరిచయం కలిగి, వారివలన దేశదేశాలలోని విడ్డూరాలను కుతూహలంతో అడిగి ఆసక్తిగా విని ఉంటాడు అన్నిమతాలవారిని అంటుకొని తిరగడం వల్ల వేమనకు ఆయా మతాలతో గాఢమైన పరిచయం కలిగి ఉంటుంది అన్ని మతాలనూ అంత తీవ్రంగా విమర్శించడానికి ఆ జ్ఞానమే తోడ్పడి ఉంటుంది

యుక్తవయస్సు రాగానే వేమన వ్యభిచార జీవితంలో పడిపోయి ఉంటాడు అనాటి మత సంస్థలలో పేరుకొనిపోయిన అవినీతి, దేవదాసి, బసివిరాండ్ర సంప్రదాయం, పెచ్చుపెరిగిన వ్యభిచారం ఇవన్నీ వేమన మీద ప్రభావం చూపి ఉంటాయి అనేక పద్యాల్లో దీనికి సాక్ష్యాలు కనపడతాయి

పెళ్ళి జరిగి కోటిఆశలతో వచ్చిన కొత్తకోడలి ఆశలు భగ్నమై ఉంటాయి అన్నదమ్ములు వేరుపడిపోయి బాధ్యత తెలియని వేమన నిస్సహాయుడై ఉంటాడు పెళ్లాం మాటలు విని వేరుపడ్డవాళ్ళను వెర్రివాళ్ళని వేమన పడదిట్టిన పద్యాలు ఉన్నాయి

ఆలిమాటలు విని అన్నదమ్ముల బాసి
వేరు బడ్డవాడు వెర్రివాడు
కుక్కతోక బట్టి గోదావరీదునా (డి 1721-229)

తన పాలిః వచ్చిన పొలంలో విధిలేక వ్యవసాయం మొదలుపెట్టి ఉంటాడు అనుభవం లేకపోవడం వల్లనో, ఓపికగా ఒళ్ళువంచి పనిచేయకపోవడం వల్లనో ఏమో ఫలసాయం రాలేదు అప్పుడే పేదరైతులు బాధలు, కాపుల అమాయకత్వాన్ని వేమన గమనించి ఉంటాడు చెడు అలవాట్లవల్లనో, పన్నుల బాధ వల్లనో చితికిపోయి అప్పులపాలై ఉంటాడు అప్పులను గురించిన వేమన చెప్పిన పద్యాలు కేవలం ఇతరుల గురించి చెప్పినవిగానే తోచవు

వచ్చినప్పుడు నోరులేని సాధ్విగా ఉన్న భార్యకు వాయిగాయీ అలవడ్డాయి. ఆమె వేమన మాట వినడం మానివేసి ఉంటుంది

మాట వినని యాలు మగవానికి మరగాలు

తనకుగాని యాలు దానవురాలయా (డి 1724, 36)

ఆలు మగని మాట కడ్డంబువచ్చెనా
ఆలు గాదది మరగాలు గాని
అట్టి యాలు విడిచి యడవినుండుటమేలు (డి 1721, 15)

(పాఠాంతరాలు. "వాని వ్రాలుగాని", డి 1773 II 44; "కష్టురాలు గాని" డి 1727, 199)

పతికి మారుబల్కు పడతియే శునకంబు
మీరు సతిని గవయ మిగులు పతియు
పంది పంది కూడి పదమాకు రొంపిలో (డి 1721, 275)

వేమన మాటకు అడ్డురావడం, మారు పలకడం, ఇంటిలోనే కాకుండా మందిలో కూడ పరువు తీయడం సాగించి ఉంటుంది

వాడకురికి తిట్టు వలదన్న మొరపెట్టు
ముందు మగని దిట్టు ముసుకు బెట్టు
గడుసురాలు మగని గంప బెట్టుమ్మురా (డి 1721, 59)

(పాఠాంతరం మగని నెత్తిగొట్టి ముసుకుబెట్టు
ఇట్టిదాని పొందు ఎట్లు వేగింతురో) (డి 1823, 390)

వేమన పెళ్ళాన్ని చేయి చేసుకొని ఉంటాడు భార్యను వంచలేనివాడు అధమునికింద జమే అని చెప్పే పద్యాలు కనిపిస్తున్నాయి ఈ కింది పద్యంలో కూడ అటువంటి ప్రసక్తి కనిపిస్తుంది

ఆడబోవుచోట నా యింటివారెల్ల
సారె సారె కొట్టి చంపెననుచు
పుట్టి నింటికేగి పొలతి తాబోదయా (డి 1727, 142)

పై పద్యాలన్నీ వేమన వ్యక్తిగత అనుభవాలే అనడం ప్రమాదం కావచ్చుగాని అటువంటి వాతావరణం అతని జీవితంలో ఉండవచ్చుననడానికి ఆస్కారం మాత్రం కనిపిస్తుంది వేమనకు స్త్రీలపట్ల ఉదారాభిప్రాయాలు ఏర్పడకపోవడానికి ఇటువంటి కారణాలు కూడ కొంత దోహదం చేసి ఉంటాయి సంసారంతో విసిగిపోయిన వేమన సంసార జంజాటం నుండి బయటపడ దల్చుకున్నాడేమో! కాబట్టే దానిని బోధించే దశకు ఎచ్చాడు

సతుల బడయరాదు సుతుల బడయరాదు
వెతల బడినవాడు వెర్రివాడు
నేల నున్న రాయి నెత్తికెత్తిన యట్లు (డి 1721, 217)

(పాఠాంతరం 'సతుల గవయనేల సుతుల బడయనేల' - డి 1769, 569)

తల్లి చనిపోవడమో, ఆర్థికంగా చితికిపోయి నిండా అప్పుల పాలవడమో, ఇంట్లో శాంతి లేకపోవడమో - ఇటువంటి కారణాలు వేమన జీవితంలో మలుపుకు దారితీసి ఉంటాయి పేదరికం నుండి బయటపడడానికి రసవాదులతో చేరి బంగారం చేసే విద్యను నేర్చుకుందామనుకొని ఉంటాడు దేశంమీద పడ్డాడు సంచారంలో కూడ అతనికి శాంతి లభించినట్టు లేదు

*ఊరు ఊరు తిరిగి ఉద్యోగధారియై*
*వాడ వాడ తిరుగు వనిత కొరకు*
*ఏడనేడ దిరిగి ఏమేమి కనెనయా* (డి 1727, 327)

తొందరలోనే "ఎంత సేవచేసి ఏ పాటుపడినను, రాచకృపలు నమ్మరాద"ని తెలుసుకున్నాడు వేమనకు పద్యాలు అల్లే అలవాటు మొదటినుంచీ ఉండి ఉంటుంది. వాటిని ఒకరిద్దరు అధికారులకు, కవులకు వినిపించిచూస్తే వారతని పద్యాలను కవిత్వంగా గుర్తించి ఉండరు

*పడుచు నిచ్చువాని పద్య మిచ్చినవాని*
*కడుపు చల్లజేసి ఘనత జేసి*
*నడువ నేరని వాడు నా బుల్ల గుడువనా?* (డి 1723, 303)

వాళ్ళకు కావలసిన కవిత్వం ఇది కాదని వేమన తెలుసుకొని ఉంటాడు కాని ఉన్న ఊరు విడిచినవానికి వేరేచోట బలం లేదని త్వరలోనే తెలుసుకొని ఉంటాడు ("నెలవు దప్పుచోట నేర్పరి కొరగాడు" - డి 1721, 25; "స్థానబలిమి కాని తన బలిమి కాదయా" - డి 1721, 26)

"ఎంత భూమి తిరిగి"నా లాభం లేదని మళ్ళీ ఊళ్ళోకొచ్చి ఉంటాడు భార్య పిల్లలు అసహ్యించుకున్నారేమో!

*తొఱ్ఱి కొంపకేడు తిఱ్ఱియాలొక్కటె*
*తిఱ్ఱియాలుకేడు వెఱ్ఱికొడుకు*
*వెఱ్ఱికొడుకుకేడు వెక్కిఱి కాంద్రురా* (డి 1773, I-1415)

అందరూ అతనిలోనే తప్పులెన్నుతున్నారు వారికే తనను వేలెత్తిచూపే నైతికబలం లేదని గుర్తించాడు వారి ద్వంద్వ జీవితాలను పడదిట్టాడు పెరిగిన గడ్డంతో, మాసిన బట్టలతో ఉన్న అతణ్ణి లోకులు పిచ్చివానిగా జమకట్టి ఉంటారు "వెఱ్ఱివేమన" బిరుదును ప్రసాదించిఉంటారు "విభుని శ్రేష్ఠగుణము వేశ్య తా నెరుగునా?" అని వేమన సానివాడలకు వీడ్కోలు చెప్పాడు నిజంగానే వేమనకే ప్రపంచంమీద విరక్తి పుట్టి ఉంటుంది తాను ఇదివరకు కోరిచేసిన పనులను తానే ఖండించుకొనే స్థితికి ఎదిగి వుంటాడు పశ్చాత్తాపం కలిగింది కాని అప్పటికే చాలా ఆలస్యం జరిగిపోయి వుంటుంది శాంతి కరువయింది నీడ పోయింది గోసాయి గుంపులతో ఊరూరు తిరగసాగాడు కాని వారి తప్పులను ఎత్తిచూపి వారికి కూడ దూరమయ్యాడు అడవులలో, కొండగుహలలో శాంతికి మార్గం చూపేవారికోసం వెతికి వుంటాడు దేశ సంచారంలో అతనికి అన్యాయాలు బాగా అర్థమై వుంటాయి అన్యాయాలకు గురయినవాళ్ళు అతనికి శిష్యులై వుంటారు

వేమననగ యోగి వెలసె లోకములోన
పూజలిడుదు పుణ్యపురుషులార
పూజలిడిన యంత భుక్తిముక్తుల నిచ్చు. (అనేక ప్రతుల్లో ఉంది)

(వేమనను గురించిన పద్యాలు పదిదాక లభిస్తున్నాయి వేమనను గూర్చి అతని శిష్యులు అల్లినవో, లేక ప్రజల్లో ప్రచారాని కెక్కినవో అయి ఉంటాయి. తర్వాత్తర్వాత వేమన పద్యసంచయంలో చేరి వేమనపద్యాలై ఉంటాయి.)

వేమన విమర్శలను తట్టుకోలేనివారు రాళ్ళతో కొట్టి వెంటపడి తరిమి ఉంటారు

తిట్టి కొట్టిరేని తిరిగి మాటాడక
ఊరకున్న చూడ ఉర్విమీద
వాడగు పరమాత్మ వర్ణింపశక్యమా? (డి 1721, 185)

అనే స్థితికి వచ్చి ఉంటాడు లౌకిక స్పృహను విస్మరించి వైరాగ్యంతో దిగంబరాన్ని ధరించి ఉంటాడు దిగంబరాన్ని సమర్థించిన పద్యాలు కనిపిస్తున్నాయి

పుట్టు బిత్తలివలె పోవు బిత్తలివలె
తిరుగు బిత్తలివలె దేహి ధరణి (డి 1721, 48)

ఇట్లాంటి ఉపదేశాలు విని, నగ్నవేమనను చూసి లోకులే సిగ్గుపడి ఉంటారు గాని వేమన దాని నెప్పుడో జయించి ఉంటాడు

సిగ్గువారలమని సృష్టిలోపలివారు
వెర్రి వేమన గని నెరగు పడిరి
తనకు గలుగు సిగ్గు దైవ మెరుంగడా? (డి 1721, 215)

ఎవరు విన్నా వినకున్నా జ్ఞానమార్గాన్ని ఉపదేశించి దేశమంతా తిరిగి రొష్టుపడీ, ఉద్రేకపడీ, అన్వేషించీ, ఎప్పుడో ఎక్కడో వేమన తనువు చాలించివుంటాడు

* * *

# వేమన్న వేదాంతం

వేమన పద్యాలేవో నికరంగా తేలితేకాని వేమన్న వేదాంతమేదో స్పష్టంగా చెప్పడం కష్టం నకిలీపద్యాలను పరిహరించి వేమన్న పద్యాలను గుర్తించడానికి కొన్ని మార్గాలలో అన్వేషణ జరిగింది శైలినిబట్టి కందాలను, ప్రాచీన ప్రతి ఆధారంగా అనంతర పద్యాలను ఏరివేసినా ఇంకా కొన్ని మౌలికమైన చిక్కులు అలాగే మిగిలిపోతున్నాయి. ఆశుకవితా దృష్టిని ప్రసరిస్తే ఈ సమస్యలకు సమాధానం లభిస్తుందేమో కాని సామాన్యంగా అందరూ ఆశించే పరిష్కారం దొరుకుతుందా అనేది అనంతర పరిశోధన వలననే తేలవలసి ఉంది.

ఎంత మధనపడినా ఇప్పటివరకు "వేమన ఫలానా వాడు" అని అంటే అవుననీ చెప్పవచ్చు; కాదనీ చెప్పవచ్చు "ఇంతకన్న బలమైన సాక్ష్యం లభించే వరకు ఇప్పటికిదే నమ్ముదాం" అని వేమనను గూర్చి పరిశోధించినవారు అనడం పరిపాటిగా మారింది. దీనికి కారణాలు రెండు·

1 అనేక వేమన పద్యాలకు పూర్వోత్తర వైరుధ్యాలు ఉండడం

2 ఒకే పద్యాన్ని గూర్చి అనేక వ్యాఖ్యానాలు చేయడానికి వీలుండడం.[1]

ఈ రెండు కారణాల మూలంగానే వేమన అసలు తత్వాన్ని కనిపెట్టడం అసాధ్యం అని తీర్మానం చేయలేముగాని ఆ మార్గంలో ఇవి బలమైన ఆటంకాలని మాత్రం ఒప్పుకోక తప్పదు వేరువేరు పరిణామదశలలో చెప్పబడిన పద్యాలుగా నిరూపించి మొదటి సమస్యను ఏదో విధంగా కొంత సమాధాన పెట్టినప్పటికీ, రెండవ సమస్య అసంపూర్ణంగానే పరిష్కరించబడే బాధ ఉండనే ఉన్నది

అయితే ఈ దారిలో మరికొన్ని ప్రశ్నలు వేసుకుంటేగాని ముందుకు సాగలేని పరిస్థితులున్నాయి వేమన్న దృక్పధాన్ని గూర్చి తెలుసుకోవడానికి వేమన పద్యాలలో ఏక సూత్రతను సాధించవలసి ఉంది అయితే అది సాధ్యమేనా అనేదే కాకుండా అసలు సాధించవలసిన అవసరం ఎంతవరకు ఉన్నది అనేది ప్రశ్న ఒక వ్యక్తి, జీవితపర్యంతం మాట్లాడిన, లేక బోధించిన అంశాలలో వస్త్వైక్యాన్ని దర్శించే ప్రయత్నం చేయడానికి కావలసిన వివేచన ఎటువంటిది? జీవితం ఒక వ్యక్తిదే కావచ్చుకాని ఆ వ్యక్తిని తీర్చిదిద్దిన శక్తులు ఏవైనా వెలుపలి నుండి వచ్చినవే కాని వ్యక్తిలో స్వతహాగా పుట్టినవి కావు. వ్యక్తికి సమాజానికీ గల నియతసంబంధాన్ని ఇక్కడ నిర్లక్ష్యం చేయలేము అనుభవాల తాకిడిలో వ్యక్తి అభిప్రాయాలను మార్చుకోవడానికీ నిన్నటికన్నా భిన్నమైన దృక్పధాన్ని ఏర్పరచుకోవడానికీ అవకాశమున్నది ఇటువంటి అనేక కారణాలవల్ల అర్థం కాని

---

1 వేయి విధములమర వేమన పద్యము
అర్థమిచ్చు వాని నరసి చూడ
చూడ చూడగలుగు చోద్యమౌ జ్ఞానంబు డి 1735, 84, ఇంకా అనేక ప్రతులు

కలగాపులగపు ముద్దగా ఉన్న వ్యక్తి యొక్క అవగాహనకు తోడ్పడడానికి అప్పటి కాలమాన పరిస్థితులే మనకు శరణ్యమౌతున్నాయి అయితే ఆ కాలం ఎటువంటిది? ఆ కాలంలో స్పష్టమైన దృక్పథంతో చెక్కి తీర్చినట్టుగా వ్యక్తి వెలువడే అవకాశం ఉన్నదా? కాబట్టి వేమన్న విషయంలో కేవలం బహిరంగ పరిస్థితులే కాక అయన సహజ ప్రకృతిని కూడ అతని పద్యాలకు అనువర్తింపజేసి చూచుకోవలసి ఉంది.

వేమన తాత్త్విక దృక్పథం విషయంలోగాని, సాంఘిక అభిప్రాయాల విషయంలోగాని నేను ఎక్కువగా గత ప్రకరణం మీద ఆధారపడదలిచాను తత్త్వాలు నశించి మతాల శవాలు మిగిలి ఉన్న కాలంలో వేమన్న గావించిన అన్వేషణలో అతనికెదురైన పరిస్థితులకు ప్రతికృతిగానే వేమన వేదాంతం వెలువడింది **వేదాంతం** అనే మాటను రూఢ్యర్థంలోనే కాక దృక్పథానికి పర్యాయమైన వ్యవహారార్థంలో కూడా వాడుతున్నాను

## I. వేమన్న మతం

వేమన్న మత నిర్ణయం స్పష్టంగా చేయగలిగితే అది వేమన్న పద్యనిర్ణయానికి తోడ్పడుతుంది వేమన్న మతాన్ని గూర్చి మొదటినుంచీ రెండురకాల అభిప్రాయాలు ప్రసిద్ధంగా ఉన్నాయి 1 వేమన్న అద్వైతి 2 వీరశైవుడు ఇటీవల ఆరుద్రగారు మరో మతాన్ని చేర్చారు ఆయన ప్రకారం వేమన **'లోకాయత'** మతానికి చెందినవాడు దీనికి ఆదిమ భౌతికవాదం అని కూడ పేరున్నది పై అభిప్రాయాలను వరుసగా పరిశీలిద్దాం

### 1. అద్వైతం

వేమన్న మతం అద్వైతమని ప్రతిపాదించినవారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు **'వేమనయోగి సిద్ధి-మత ప్రచారం'** అనే శీర్షిక క్రింద సుదీర్ఘమైన చర్చచేసి వేమన్నను **'ఒకరకమైన అద్వైతి'**గా శర్మగారు తేల్చారు కొన్ని పరిమితులు విధించుకుంటే గాని వేమన్నను అద్వైతిగా నిరూపించలేమని దీని వలన తెలుస్తున్నది శర్మగారి చర్చలో లెక్కకు వచ్చిన విషయాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి

1. వేమనకు చిన్ననాడే ద్వేష మెక్కువలేని శివభక్తి కుదిరింది
2. లింగధారిగా కూడ నుండవచ్చు.
3. హఠయోగి విద్యలో ఉపదేశము కుదిరింది.
4. రాజయోగ సాధన చేశాడు.
5. షట్చక్ర భేదనమగు కుండలినీయోగం సాధించాడు.
6. ఒకరకం అద్వైతం బోధించాడు.
7. అసలతని మతసిద్ధాంతములు చదువుకున్నవారికే అర్థం కావు.
8. వేమన తాంత్రికుడనియు కొందరందురు. అగుననియు చెప్పవచ్చును, కాదనియు చెప్పవచ్చు.[2]

---

2 పై అంశాలను వేరేజు వేసినవారు శ్రీ ఆరుద్ర

పై వాటిలో 3, 4, 5, 6 నెంబర్లు గల అంశాల సహాయంతో వేమన్నను అద్వైతిగా సిద్ధాంతీకరించారు శర్మగారు. ఈ సందర్భంలో అద్వైత సిద్ధికి కావలసిన సాధనాలేమిటో, వేమన పద్యాలలో వాటికి ఆధారాలు ఎంతవరకు లభిస్తున్నాయో పరిశీలించవలసి ఉంది

అఖండ తత్త్వంలో దృఢ విశ్వాసాన్ని అద్వైతం ప్రకటించింది. జీవుడు, బ్రహ్మం ఒక్కటే. వేరుగా కనిపించడం మాయ లేక అవిద్యవలన. ఈ మాయ తొలగి ఐక్యానుభూతిని పొందడం ముక్తి. కాని ఈ నిర్గుణమైన బ్రహ్మం సామాన్యుల మేధాశక్తిని మించింది కాబట్టి సగుణ బ్రహ్మమును ఆశ్రయించక తప్పలేదు. బ్రహ్మమెప్పుడైతే సగుణమైందో జనులు సిద్ధాంతానికి అద్వైతులే అయినా ఆచరణలో ద్వైతులైనారు. అయినప్పటికీ అద్వైత సిద్ధిని పొందడానికి సాధకులనేకులు ప్రయత్నించారనడంలో విప్రతిపత్తి లేదు వేమన్న కూడ ఈ సాధకుల గుంపులోచేరి తత్త్వసిద్ధికి కృషి చేశాడనడానికి అనేక పద్యాలు సాక్ష్యం పలుకుతున్నాయి లంబికా శివయోగి వేమనకు గురువని అతనిద్వారా వేమనకు యోగ మార్గోపదేశం లభించిందని కూడ వాదుకలున్నాయి

సకల జగత్తుకు కారణమైన మూలతత్త్వాన్ని అనుభవపూర్వకంగా తెలుసుకోవడానికి అనేక ప్రయత్నాలు జరిగాయి పరిమిత శక్తి గలిగిన ఇంద్రియాలకు అంతటి సామర్థ్యం లేదు కాబట్టి అమితశక్తివంతమైన మనస్సుపైన ఆధారపడాలి కాని ఈ మనస్సు కూడ ఒకచోట స్థిరంగా ఉండేదికాదు ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్ర, స్మృతి అని అయిదు అవస్థలను పొందుతూ వుంటుంది బాహ్య ప్రపంచంపట్ల ఉండే రాగ, ద్వేష, అభిమానాదులే పై చిత్తవృత్తులకు మూలం కాబట్టి ఈ చిత్తవృత్తిని నిరోధించాలి దానిని నిరోధించడానికి ఎనిమిది ఉపాంగాలు కల యోగపద్ధతిని ఆశ్రయించాలి పతంజలి యోగశాస్త్రంలో ఇవి చెప్పబడ్డాయి

"యమ, నియమ, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధయోష్టాంగాని" (2-29)

వీటిలో మొదటి ఐదు బైటి సాధనాలు మిగిలిన మూడు మనస్సుకు ఏకాగ్రత కలుగజేసేవి కాని ఈ అభ్యాసకాండలో అసలుతత్త్వం మరుగున పడిపోయింది వేమన్న ఈ యోగాలను, ముఖ్యంగా ఉపాంగాలలో మూడవదైన ఆసనాలను సామువిద్యలని పరిహసించాడు ఆసనాది యోగాలను అల్పయోగాలన్నాడు ("ఆసనాది విధులు అల్పయోగంబులు"- డి 1769, 221)

ఆసనములు పన్ని అంగంబు బిగియించి
యొడలు విరిచికొనెడు యోగమెల్ల
జెట్టిసాముకన్న చింతాకు తక్కువ[3] (డి 1721, 189)

ఇంద్రియముల చేత నెగ్గొందుచుండెడు
వెర్రిమనుజుడేల వెదకు శివుని
ఇంద్రియముల రోసి యీశుని జూడుడీ (డి 1721, 95)

---

3 అష్టాంగాల్లో మూడవ అంశమైన ఆసనాల్లో మళ్లీ ఎనభై నాలుగు రకాల ఆసనాలున్నాయి వీటిలో కొన్నింటివల్ల శరీరదార్ఢ్యం పెరుగుతుంది అయితే ఇవికూడ వ్యాయామ క్రీడలకన్న కొంత తక్కువ స్థాయివే అని వేమన్నవాదం ఆసనాదివిద్యలు అణిమాదికాష్టసిద్ధులకు మెట్లు అని వేమన్న ఒప్పుకోవడంలేదు

ఇవిగాక శరీరాన్ని అధికంగా కష్టపెట్టే హఠయోగం కూడ వేమన్నకు రుచించినట్టు లేదు. శాంతమార్గం వలన కైవల్యం పొందడానికి సుదీర్ఘకాలం పడుతుంది. కాబట్టి దేహ మనస్సులను బలవంతంగా పరిశ్రమకు గురిచేసి శీఘ్రంగా మోక్షం సాధించడానికి హఠయోగం ప్రచారంలోనికి వచ్చింది. హఠయోగం అంటే 'హ' కారానికి ఊర్ధ్వగతి అయిన ప్రాణవాయువు అని, 'ఠ' కారానికి అధోగతి అయిన అపానవాయువు అని అర్థం చెప్పారు. కాని హఠం అంటే పట్టుదల, బలత్కారం, దౌర్జన్యం, పీడనం, మొండితనం అనే అర్థాలు కూడా ఉన్నాయి హఠయోగంలో ధౌతి, వజ్రోళి మున్నగు ప్రక్రియలను పరిహసిస్తూ వేమన పద్యాలు కనబడుతున్నాయి.

ముక్కుత్రాళ్ళు గుచ్చి మురికి బోవగ దోమి
కచ్చు నీరు నించి కడిగి కడిగి
డొక్క దుడిచినంత దొరుకునా మోక్షంబు[4] (డి. 1721, 394)

హఠవిద్యకు సంబంధించిన 'మంత్రయోగం, లయయోగం' అని మరి రెండు ఉపయోగాలున్నాయి. వేమన్న గురువుగా చెప్పబడుతున్న లంబికా శివయోగి హఠయోగుల గుంపుకు చెందినవాడని రాళ్ళపల్లివారు ఊహించారు అద్వైతానుభవం రాజయోగ పరమావధి.

తాను నింద్రియముల తనర జయించిన
తత్త్వ మరసి చూడ దాన యగును
రాజయోగి యిట్లు తేజరిల్లుచునుండు. (డి. 1721, 199)

ఎప్పుడైతే వేమన అద్వైతానుభవం సాధించాడో దానిని సాధించడానికి సాధనాలైన ఆసనాదివిద్యలను, ఏరుదాటి పుట్టేని లెక్కజేయనట్టు, తిరస్కరించాడని రాళ్లపల్లివారి వాదన.

వేమన్న అద్వైతానుభవం సాధించగలిగాడా అనేది ఎవరూ నిరూపించలేనిది కాని ఒకటి మాత్రం నిజం ఈ అన్వేషణలో ఒక నివృత్తిదశకు చేరుకొని ఉంటాడు

బ్రహ్మమనగ వేరె పరదేశమున లేదు
బ్రహ్మమనగ తానె బట్టబయలు
తన్ను దానెరిగిన తానెపో బ్రహ్మంబు (డి 1773, I, 364)

బ్రహ్మ స్వరూపం శాస్త్రాల వలన తెలియదు దీనికి సాధనే శరణ్యం

స్వానుభూతి లేక శాస్త్రవాసనలచే
సంశయంబు చెడదు సాధకునకు
చిత్రదీపమునను చీకటి చెడనట్లు (డి 1721, 110)

---

4 దేహమాలిన్యాన్ని పోగొట్టుకొనడానికి హఠయోగులు మూడురకాల ప్రక్షాళన కర్మలను పేర్కొంటారు. నౌళి, ధౌతి, వజ్రోళి ఒక తాడును ఒక ముక్కు రంధ్రంలోనికి దోపి రెండవ రంధ్రం నుండి తీసి రెండు కొనలు పట్టుకొని తోమడం నౌళి ఒక తడిగుడ్డను మింగి అన్ననాళం ద్వారా పోనిచ్చి లోపల శుభ్రపరచి, ఆ గుడ్డను వెలుపలికి తీయడం దౌతి నీళ్ళను కచ్చులోనికి తీసుకొని మళ్ళీ ధారగా వదిలిపెట్టడం వజ్రోళి ఇటువంటి వాటివలన మోక్షం దొరకదని వేమన్న అభిప్రాయం

కాబట్టి సాధనకు ఒళ్ళు వంచక శాస్త్రగ్రంథాలను ఆశ్రయించేవారిని వెర్రివాళ్లు అన్నాడు వేమన్న.

మనసులోని ముక్తి మరియొక్క చోటను
వెదుకబోవు వాడు వెర్రివాడు
గొర్రెచంక బెట్టి గొల్ల వెదకురీతి. (డి. 1739, 149)

బ్రహ్మము ఒక రూపం కాదు- అదొక అనుభవం, ఆ అనుభవం లేకుండా బ్రహ్మవేత్తలమని చెప్పుకునే వారిని నిలదీసి ప్రశ్నించాడు.

బ్రహ్మవేత్తలమని పౌరుషమాడేరు
బ్రహ్మ మనగ దాని భావమేమి?
తెలుపా నలుపా యెరుపా తెలిసిన బలుకుడీ. (డి. 1776, 216)

అయితే ఆ బ్రహ్మానుభవం లభించే మార్గమేమిటి? నిరంతరచింతనం వల్లనే అది సాధ్యమని వేమన్న జవాబు. దీనిని ధ్యానయోగమని అంటారు. నిరంతర చింతనం వలననే చేతనం వికసిస్తుంది.

తరువ తరువ బుట్టు తరువున ననలంబు
తరువ తరువ బుట్టు దధిని ఘృతము
తలప తలప బుట్టు తనువున తత్త్వంబు.[5] (డి. 1773 I 424)

ఇక అనుభవైకవేద్యమైన ఆ పరతత్త్వాన్ని గురించి వేమన అనేక రకాలుగా చెప్పాడు.

"అంతరాత్మ నిలుప నతడేపో బ్రహ్మము" (డి 1721-183)
"తిలల తైలివుట్లు తేజరిల్లు జిదాత్మ" (డి 1773 I-423)
"మనసు తెలియువాడు మర్మజ్ఞుడౌనయా" (డి 1773, 5-2158)
"నీవు నిన్నెరుగంగ నీవెపో శివుడవు" (డి 1721, I 46)
"బయలు లోన బయలు భావింపతత్త్వంబు"[6] (డి 1723, 510)
"యెరుకలోని యెరుక నెరుగుట తత్త్వంబు"[7] (డి 1725, 666)

---

5 వైదికజ్ఞానం సామాన్యప్రజల పరం కావలసిన చారిత్రకావసరం వేమన, వీరబ్రహ్మం వంటి తాత్త్విక కవులు బయలుదేరడానికి కారణమైంది వీరు జ్ఞానయోగ ప్రధానమైన శంకరాద్వైతాన్ని నిరసించి భక్తియోగం ద్వారా తత్త్వప్రచారం చేశారు ఈ ప్రచారానికే, 'అచలబోధ', 'అచలమతం' అనే పేర్లు వాడుకలోకి వచ్చాయి జగత్తు మిథ్య అనీ, బ్రహ్మమే సత్యమనీ – ఇదే అచలవాదం కూడ కాని జగన్మిథ్యవైపే మొగ్గు ఎక్కువై బ్రహ్మము అడుగున పడిపోయింది అద్వైత ప్రతిపాదకులు నిరసించిన హఠయోగాదులను వీరు ఆదరించినట్టు కనిపిస్తుంది వీరు గురూపదేశానికి ఎక్కువ ప్రాధాన్యమిస్తారు ఇది ఎక్కువగా అబ్రాహ్మణుల్లో వ్యాపించింది శంకరాద్వైతుల ఆదరాన్ని ఇది ఎప్పుడూ పొందలేదు – ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు "హిందూమతము – అచలబోద" అనే వ్యాసంలో దీనిని వివరించారు (See Bibliography)

6 బయలు అంటే ఆకాశం చిదాకాశం అన్నమాట 'అంతరిక్షము' అనికూడ వాడతాడు మరోచోట బ్రహ్మమునకు పర్యాయముగా కూడ వాడినట్టు కనిపిస్తుంది

7 జ్ఞానము అనే అర్థంలో ఎరుక, తెలివి అనే మాటలను కూడ వేమన ఉపయోగించాడు జ్ఞానం అంటే భేదాభేదముల నెరిగిన జ్ఞానమని అర్థం

"తలపులన్నియుడుగ తానెపో తత్త్వంబు" (డి. 1721, 130)
"ముక్తి యనగనేమి మూలంబు తానయా" (డి. 1721, 1011)

అడ్డంగా ఉన్నంతవరకు చిత్తవృత్తుల నాశనమే తత్త్వం. అది అటంకమైనంతవరకు ముక్తి కనపడదు.[8]

మేఘమడ్డమైన మిహిరుని జెరుచు
చిత్తమడ్డమైన స్థిరము జెరుచు
మరపులడ్డమైన మరి ముక్తిలేదురా (డి. 1721, 213)

2. మాయ:

ఈ 'మరపే' మాయ. అనేక పద్యాలలో ప్రపంచం మాయ అనే అర్థంలో పద్యాలు చెప్పాడు వేమన్న

సతులు సుతులు మాయ సంసారములు మాయ
ధనము ఘనము మాయ తనువు మాయ
మాయ గెల్చువాడు మర్మజ్ఞుడగు యోగి.[9]
(డి. 1773, I 374)

ఈ మాయను గెల్వడానికి తనలోనే అన్వేషణ చేయవలసి ఉంది.

తన్ను వెదకి చూడ తానెపో జీవుండు
తత్త్వమరసి చూడ తానె యాత్మ
మన్ను మిన్ను లేదు, మాయ తాలేదయా (డి 1711, 261)

అయితే ఈ 'మాయ' ఏమిటి? "మాయ శబ్దమునకితనికి నిజమైన అర్థమేమో తెలిసికొనే మార్గము లేదు" అని రాళ్ళపల్లి వారన్నారు[10] ఇది శంకరాచార్యులు ప్రతిపాదించిన మాయావాదమా? శాక్తేయులు కూడ ఒకానొక 'మాయ'ను గూర్చి చెప్తారు. వేమన్న 'మాయ'ను భ్రాంతి, అవిద్య అనే అర్థాల్లోనే వాడినట్టు కనిపిస్తున్నది.

వేమన అద్వైతి అని భావించడానికి మరో ఆధారంగా అతడు ద్వైతధోరణులపై చేసిన దండయాత్రను చూపవచ్చు వేమన సూన్యతవాదే సిద్ధాంతానికి అద్వైతులై, వ్యవహారంలో ద్వైతులుగావున్న విధానాన్ని వేమన్న హర్షించలేదు

అద్వైత సిద్ధాంతం మీద తిరుగుబాటుగా అనేక ధోరణులు తలెత్తాయి వాటిలో ముఖ్యమైనవి రామానుజుని విశిష్టాద్వైతం, మధ్వాచార్యుని ద్వైతం ఈ రెండు కూడ

---

8 వేమన పద్యాల్లో యోగసాధన దశకు సంబంధించిన దశల వర్ణన కూడ కనిపిస్తుంది మూలము, యుక్తి (సాధన అని వేమన్న అర్థం), మోహము, మగ్నుడు (లౌకిక ప్రపంచంలో లీనమైనవాడు), ఉపమ (పెక్కుచోట్ల వస్తుంది ఉపాయానికి రూపాంతరమా?), బంధము, భావము (అనుభూతి అని వేమన్న అర్థం), బిందువు (కొలతలు లేని బిందువు, సాధనలోనికి వెళ్తే 'నీవు' అనేది అంతగా తగ్గిపోతుంది బిందువు నాదంలో కలిసి సృష్టి పుడుతుందని చెప్తారు), కళలు (ఆత్మచుట్టూ ఉండే అజ్ఞానపు పొరలు ఆత్మచుట్టూ కళలు ఉంటే తత్త్వము వాటినంటదు) వంటి మాటలు వేమన పద్యాలలో కనిపిస్తాయి అయితే ఇవి ఎక్కువగా కందపద్యాల్లోనే వస్తాయి

9 మర్మజ్ఞుడు అంటే 'మాయ' నెరిగినవాడు (knower of Mystery)

10 వేమన – రాళ్ళపల్లి, పేజీ 102

కొంత భేదంతో శంకరుని మాయావాదాన్ని ఖండించి ప్రపంచం యొక్క వాస్తవికతను అంగీకరించాయి. ఇవి అగాధమైన తాత్త్విక చర్చలను నిరాకరించి వేర్వేరు మోతాదులలో భక్తిమార్గాన్ని ప్రచారం చేశాయి. ముఖ్యంగా భేదానికి ప్రాధాన్యమిచ్చి ద్వైతం సహజంగానే కులవిభేదాలకు, కర్మకాండకు తావిచ్చింది. మాధ్వమతం బ్రాహ్మణులలోనే ఎక్కువగా వ్యాపించింది. విష్ణుపారమ్య కీర్తనయే వీరి మతం. ఈ కారణంగానే మాధ్వమతం ఎక్కువగా పురాణాదులపైన ఆధారపడింది అంటారు తత్త్వపిపాసిగా మారిన వేమన్న పురాణపాత్రలను తర్కాన్ని చేపట్టి అవహేళన చేశాడు

కనకమృగము భువిని కలదు లేదనడయ్యె
రాముసంత వెఱ్ఱి రాజు గలడె
పురము దప్పి పోవ బుద్ధులు నిలువవు[11] (డి 1773–I–281)

అగ్నిబాణమేసి యంబుధి నింకించి
రాముడవలి కేగరాక నిలిచి
చెట్లు గిరులు తెచ్చి సేతువు గట్టడా (డి 1725, 470)

తండ్రిమాటలు విని తల్లిని తెగటార్చి
పరశురాముడేమి ఫలము గనియె?
నిలువనీడలేక మలయాద్రి నుండడా (డి 1723, 410)

పాల సాగరమున పవ్వళించిన సామి
గొల్ల యిండ్ల పాలు గోరనేల?
ఎదుటివారి సొమ్ము ఎల్లవారికితీపి (డి 1723, 451)

అద్వైతులు వ్యవహారంలో ద్వైతులై విగ్రహారాధనకు పాల్పడ్డారు అప్పటి శైవ, వైష్ణవాల సంఘర్షణల జోలికి పోక ఇద్దరికీ సమానంగా గుళ్ళుకట్టి సమన్వయమార్గంలో కొందరు నడిచారు ఇక ద్వైతులు విష్ణుకీర్తనమే పరమార్థంగా భావించారు అనేక దేవతలతో ఊరూరికీ దేవళాలు వెలిశాయి వేమన్న విగ్రహారాధనను తీవ్రంగా ఖండించాడు

శివుడు గల డటంచు శిలలకు మ్రొక్కెడి
వెఱ్ఱి జీవులార వెతల విడుడి
జీవులందె కాక శిలల నేమున్నది (డి 1721, 172)

శిలను ప్రతిమ జేసి చీకటింటను బెట్టి
మొక్కవలదు వెఱ్ఱి మూఢులార
యుల్లమందు బ్రహ్మముండుట దెలియరు (డి 1721, 221)

కొండరాళ్ళు దెచ్చి కోరిక గట్టిన
గుళ్ళలోన దిరిగి కుళ్ళనేల
పాయరాని శివుడు ప్రాణియై యుండగ (డి 1726, 186)

11 ఈ పద్యానికి పాఠాంతరాల కొదవలేదు కాని "తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా" అనే ముద్రితపాఠం ఏ అముద్రిత ప్రతిలోను లేదు

అయితే అద్వైత సిద్ధాంతాన్ని గూర్చి పలుమార్లు బోధించడం, ద్వైత ధోరణులను సూటిగా ఖండించడంతోనే వేమన్నను అద్వైతిగా తీర్మానించడానికి వీలుకాదు. ఈ నిర్ణయానికి బాధకంగా అద్వైత విరుద్ధ ధోరణులు అనేకం వేమన్నలో ఉన్నాయి. ఉదాహరణకు వేమన్న వేద ప్రామాణ్యాన్ని ఒప్పుకున్నట్టు కనబడదు అద్వైతం వేద ప్రామాణ్యాన్ని ఖండించదు వేమన్న బ్రాహ్మణాధిక్యతను ఖండించాడు.

వేదవిద్య లెల్ల వేశ్యల వంటివి
భ్రమల బెట్టి తేటపడగనీవు
గుప్తవిద్య యొకటె కులకాంత వంటిది (డి 1723, 837)

బ్రాహ్మణులకు బెట్ట ఫలము కద్దందురు
కుక్కలకు బెట్ట కొదవ యేమి
ఇందు నందు శివుడు ఒక్కటే అందురు (డి 1735, 214)

కాని "ఆంధ్ర బ్రాహ్మణులలో, ముక్కాలు మువ్వీసము అందరు అద్వైతులే" అని రాళ్ళపల్లివారు అంటున్నారు[12] కాబట్టి ఈ ధోరణులు ప్రబలంగా ఉన్న శైవం వేమన్నలో ఎంతవరకుందో పరిశీలించాలి

### 3. వీరశైవం

వేమన్న శైవుడని విశ్వసించినవారు బండారు తమ్మయ్యగారు ఆయన వేమన్న తల్లిదండ్రుల మతం శైవం కావచ్చునంటూ చరిత్రసాయంతో మొదలుపెట్టారు కాని, చరిత్రకు సరిగ్గా అందని వేమన్న మతాన్ని ఆయన పద్యాలప్రమాణంతోనే నిర్ధారణ చేయవలసి వుంది తమ్మయ్యగారు వేమన్న శైవుడని నమ్మారేగాని నిరూపించడానికి ప్రయత్నం చేయలేదు వేమన్నను వీరశైవ దర్శనంలోని జంగం అని బ్రౌన్ అభిప్రాయపడ్డాడు

"It is not easy to ascertain any thing regarding the history of Vemana, which is the personal name of the author, and sometime occurs, through rarely among the Telugus of the present day His family name he never discloses, and hence imagine him to have been a zangam, The fact of Sudras known by this name are seceders from the common religion, they worship Siva alone, and on embracing the zangam sect, they give up the family appellation, and are then usually called by the name of the sect alone Their creed also corresponds with taught by Vemana, and this is the only one not satirized by him"[13] (1829)

గృహనామం ధరించక పోవడంవల్లనూ, వేమన్నచేత అధిక్షేపించబడనిది ఒక జంగమ మతమే కావడం వల్లనూ వేమన్న జంగముడని బ్రౌన్ అభిప్రాయం కాని ఇవి వాదానికి నిలిచేవి కావు

12. వేమన – రాళ్ళపల్లి, పే 74
13 Preface to Vemana

శ్రీకర శివతత్త్వ శీలుడౌ వేమన
ప్రాకటముగ వేము పద్యములను
లోకమందు చదివి లోవెలి బాయరో (డి. 1821, 191)

అంతరంగ మందు నభవు నుద్దేశించి
నిల్పి చూడ చూడ నిలుచుగాక
బాహ్యమందు శివుని భావింప నిల్చునా[14] (డి. 1721, 280)

ధ్యానములను శివుని ధ్యానమే శ్రేష్టము (డి. 1762, 301)

ఆహూతి యగు వెనుక హరున కర్పితమౌను (డి.1762, 229)

గృహనామం ధరించక పోవడంవల్లనూ, వేమన్నచేత అధిక్షేపించబడనిది ఒక జంగమ మతమే కావడం వల్లనూ వేమన్న జంగముడని బ్రౌన్ అభిప్రాయం. కాని ఇందులో సత్యం లేదు. ఇంటిపేరు ధరించకపోవడం శైవులలో ఉన్నప్పటికి అది వారికే పరిమితం కాదు ఆ మాటకొస్తే శ్రీనాధుడు, ధూర్జటి వంటి శైవకవులేకాక మారన, జక్కన వంటి శైవేతరులు కూడ గృహనామాలను ధరించలేదు. ఇక వేమన జంగాలను ఖండించలేదనడం కూడ పొరపాటే వేమన్న లింగధారులను హేళనచేస్తూ చెప్పిన పద్యాలు ఉన్నాయి

రాతి బసవని గని రంగుగా మ్రొక్కుచు
గునుక బసవని గని గుద్దుచుంద్రు
బసవ భక్తులెల్ల పాపులు తలపోయ[15] (డి. 1721, 129)

బందె త్రాళ్ళుదెచ్చి బంధించి కట్టంగ
లింగడేమి దొంగిలించినాడో
ఆత్మలింగమేల నర్చించి చూడరో (డి 1721, 750)

అయితే వేమన్న శైవుడనడానికి పై కారణం అడ్డురాదు వేమన్న శైవుడు అనే వాదనను నిమిషంసేపైనా నిలబెట్టుకోవడానికి తగిన సాక్ష్యాలు వేమన్న పద్యాలలో ఉన్నాయి వేమన పద్యాలలో ప్రసిద్ధంగా కులభేదాల ఖండన ఉంది వీరశైవులు కులభేదాలను పాటించలేదు వీరశైవం స్వర్గనరకాలను నమ్మదు పునర్జన్మను విశ్వసించదు బహుదేవతారాధనను అంగీకరించదు వేమన్న కూడ పై వాటిని ఖండిస్తూ పద్యాలు చెప్పాడు వేదప్రామాణ్యాన్ని తిరస్కరించడం, బ్రాహ్మణాధిక్యతను గర్హించడం కూడ వీరశైవ లక్షణాలే. వీటన్నిటికి ఉదాహరణలు ఈ కింద ఇవ్వబడ్డాయి

14 ఇది చాలప్రతులలో ఉంది పాఠాంతరాలు కొల్లలు

15 శైవుల పూజాహేతువులు లింగం, నంది అవి ఎక్కడ కనపడినా భక్తితో మొక్కుతారు ప్రాణంలేని శిలానంది కనపడగానే భక్తిప్రపత్తులతో నమస్కరిస్తారు, బండి లాగడానికి ఉపయోగపడుతూ పరిగెత్తే నిజమైన ఎద్దును గుద్దులతో, దెబ్బలతో అదిలిస్తారు జీవంలేని ఎద్దుకు మొక్కుతూ సాక్షాత్తు బసవని అవతారమైన ఆబోతును హింసించే పాపులను తిడుతున్నాడు వేమన్న ప్రాణిలో శివుణ్ణి చూడలేనివాడు జడంలో చూస్తాడా అని విగ్రహారాధనను ఖండిస్తున్నాడు

కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు
సానుజాతమయ్యె సకల కులము
హెచ్చుతగ్గు మాట లెల్లరుంగవచ్చు? (డి 1721, 216)

పసుల వన్నె వేరు పాలేకవర్ణమౌ
పుష్పజాతి వేరు పూజ ఒకటి
దర్శనంబులు వేరు దైవంబు ఒక్కటి (డి 1723, 559)

అయితే "వేమన వీరశైవుడు" అని అనుకునేవారిని ఎక్కువసేపు సంతోషపెట్ట దలుచుకోలేదు. వేమన్న భ్రష్టులైన లింగధారులను తిట్టడం వలననే వేమన్నను శైవవ్యతిరేకి అని అనలేము కాని శైవానికి వ్యతిరేకమైన లక్షణాలు వేమన్నలో లేకపోలేదు. ఆంధ్రప్రదేశంలోని వీరశైవులలో అధికులు బ్రాహ్మణులే అని విజ్ఞానసర్వస్వం చెప్తున్నది[16] బ్రాహ్మణ వీరశైవులను ఆరాధ్యులంటారు. వీరశైవుల కులభేద రాహిత్యం వీరిలో అంతగా వ్యాపించలేదు. వీరు కూడ వ్యవహారంలో ఉన్న చాతుర్వర్ణ వ్యవస్థను అంగీకరించి బ్రాహ్మణాధిక్యతను నెలకొల్పారు. కాబట్టి వేమన్న అద్వైత బ్రాహ్మణుల ఆధిక్యత మీద ఎక్కుపెట్టిన బాణాన్నే వీరివైపు కూడ తిప్పివుంటాడు. వేమన్న శైవ వైష్ణవభేదం లేకుండా అన్ని పుణ్యక్షేత్రాల సందర్శనాన్ని నిరాకరించాడు.

అడవి దిరుగ లేదు ఆకసమున లేదు
అవని దీర్ఘయాత్రలందు లేదు
ఒడలు శుద్ధిచేసి ఒడయుని జూడరా! (డి 1721, 90)

వేమన్న కాశీయాత్రను పరిహసిస్తూ చెప్పిన పద్యాలు అనేకం ఉన్నాయి

కాశి కాశి యనుచు కడు వేడ్కతో బోదు
రందు గిల్గు దేవు డిందు లేడె
యిందునందుగలడు హృదయంబు లెస్సైతె (డి 1724, 281)

కాశి యాత్ర బోయి గంగ దానము జేసి
కష్టపడిరి ముక్తి గానలేక
ఎనుము తిరుగుచుండదే యెద్దు వెంబడి (డి 1721, I 376)

దాపునే ఉన్న తిరుమలను గూడ వదలలేదు వేమన్న

తిరుమలకు బోవ తురక దాసరిగాడు కాశిబోవ లంజ గిరిత గాదు
కుక్క సింహమగునె గోదావరికి బోవ (డి 1721, 242)

అదేవిధంగా తురకల మక్కాయాత్రను కూడ పరిహసించాడు

మక్కాకు బోనేల మగుడ తా రానేల?
యేకమైన కర్త యిందు లేడో?
అన్నిట పరిపూర్ణు డల్లామహమ్మదు (డి 1723, 732)

---

16 విజ్ఞాన సర్వస్వం, ఏడవ సంపుటం, తెలుగుభాషా సమితి

వీరశైవులు శైవ పారమ్యాన్ని ఉగ్గడించి మాత్రమే ఊరుకోకుండ వైష్ణవాన్ని తీవ్రంగా ద్వేషించాడు వేమన కాలంలోని శైవ వైష్ణవులనుగూర్చి గత ప్రకరణంలో చర్చించబడింది. శివకేశవభేదంలో మట్టుకు వేమన్న సమన్వయవాది ఒకరకంగా హరిహరాద్వైతచ్ఛాయలతో పద్యాలు చెప్పాడనవచ్చు.

*విష్ణుభక్తులెల్ల వెలిబూది పాలైరి*
*వాదమేల మత విభేదమేల*
*తెలియ లింగ ధరులు తిరుమంటి పాలైరి.*[17] (డి 1721, 64)

అసలు త్రిమూర్తులలోనే అభేదాన్ని దర్శించాడు వేమన

*బ్రహ్మ జంపి విష్ణు భాగంబులో గల్పి*
*విష్ణు జంపి శివుని వెలయగల్పి*
*శివుని జంపి తాను శివయోగి గావలె* (డి 1721, 369)

వీరశైవ మతానికి పూర్తిగా వ్యతిరేకమైనదీ, వేమన వ్యక్తిత్వానికి మచ్చతెచ్చినదీ అయిన మరో ముఖ్య లక్షణం వేమన పద్యాలలో కనబడుతుంది అది స్త్రీలపై గౌరవం లేకపోవడం ఈ కారణం వల్లనే 1829 లో వేమన 'జంగము'డని వ్రాసిన బ్రౌన్ 1840లో తన మాట దిద్దుకున్నాడు

"They (The Jangams) some times claim the poet Vemana as preaching their creed, but though he evidently held the Brahmins in detestation, and shows a partiality to the tenets of Basava, he does not embrace the Virasaiva tenets The insulting manner in which he speaks of the female sex furnishes another proof that he could not be a Virasaiva He also speaks of future transmigrations but the Jangams belive transmigration to have terminated[18]

*స్త్రీలు గలుగుచోట చెల్లాటములు గల్గు*
*స్త్రీలు లేనిచోట చిన్నబోవు*
*స్త్రీల చేత నరులు చిక్కుచున్నారయా!* (డి 1721, 230)

*స్త్రీలకును బెడుదురు స్త్రీల శ్రాద్ధంబులు*
*స్త్రీల యోగ్యమేమి చెప్పవచ్చు*
*స్త్రీల వేడుటకంటె శిలలవేడుట మేలు* (డి 1773, III, 1258)

17 వైష్ణవుడు వస్తే దహనం చేస్తారు శైవుణ్ణి పాతిపెడతారు విష్ణుభక్తులు శివభక్తులను ద్వేషిస్తారు బతికి ఉన్నంతకాలం బూడిదను ద్వేషించిన విష్ణుభక్తులు చచ్చి ఆ బూడిదలోనే కలిసిపోతారు! ఇక లింగధారులైన శివులు నామధారులైన వైష్ణవులతో వివాదపడ్డారు వైష్ణవుల బొట్టు తిరుమణి (మణ్-మన్ను) జీవితకాలమంతా తిరుమన్నును ద్వేషించినవారు చచ్చి మట్టిలోనే కలిసిపోయారు ఇంక వివాదమెందుకు? ఎంత జ్ఞానం! అంటున్నాడు వేమన

18 Preface to Vemana

వేమన స్త్రీజనవ్యతిరేకత ఆయన నిష్కళంక కీర్తిలో నలక వంటిది. నిష్పక్షపాతీ, తర్కశీలీ అయిన వేమన్నకు స్త్రీలపట్ల ఇటువంటి నిర్హేతుకమైన అయిష్టం ఏర్పడడానికి అతని వ్యక్తిగతకారణాలే ఆధారమని 'వేమన్న జీవితం'లో ఊహించబడింది. వేమన్నది 'ఉద్రేక ప్రకృతి' అది అతన్ని బాగా చెరిచిందని రాళ్ళపల్లివారు అభిప్రాయపడ్డారు.[19] ఇతరేతర విషయాలలో అతని ఉద్రేకప్రకృతి గుణంగానే భాసించింది. కాని, స్త్రీల విషయంలో మాత్రం అది లోపంగా మారి నిజంగానే అతణ్ణి చెరిచింది కాని ఇక్కడ కూడ కొంత ఉపశమనంగా, స్త్రీలపట్ల పూజ్యభావంతో చెప్పిన పద్యాలు వేమన్నలో కొన్ని దొరుకుతున్నాయి.

*గుణవతి యగు యువతి గృహము చక్కగ నుండు*
*చీకటింట దివ్వె చెలగు రీతి*
*దేవి యున్న యిల్లు దేవార్చన గృహంబు*[20] (డి. 1721, 68)

అయితే ఇప్పటివరకు వేదాంతప్రస్థానాలనుండి పుట్టిన మతాలను మాత్రమే వేమన్నలో వెతికాము. పరతత్త్వాన్ని నిర్వచించడంలో, దానిని చేరడానికి అనుసరించవలసిన మార్గాలలో భేదాలవల్లనే అనేకమతాలు ఏర్పడ్డాయి. కాని వేమన్న భౌతికవాదే కాని అద్వైతి కాదని అరుద్రగారు కొత్తవాదాన్ని వెలికి తీశారు

4. లోకాయతిక ధోరణులు

"వేదాన్నీ, ఉపనిషత్తుల వాదాన్నీ ఖండించే లోకాయత మతమే వారి మతం. (అది)భారతదేశంలోని ఆదిమ భౌతికవాదం. వేమన్నగారు ముమ్మాటికీ భౌతికవాదులే. లోకాయతం అవలంబించే విధానం తాంత్రిక విద్య. వీరి నిదర్శనం ఆదిమ సాంఖ్యం. వీళ్ళు ప్రకృతి ఆధిక్యతే గాని పురుషుని ఆధిక్యం అంగీకరించరు. అద్వైతులతో వాదోపవాదాలు చేశారు. ఈ వాదాః సారాన్ని గురువువల్ల తెలుసుకొన్నారు కనుకనే వేమన్నగారు చాలా ధైర్యంగా, 'వేద సారమంత వేమన యెరుగును' అని చాటగలిగారు. వేదాలలో ఉన్నది నిజంగా భౌతికవాదమే."[21]

వేమన్న, కులభేదాలను గూర్చే కాక ఆర్థిక వ్యత్యాసాలను గురించి కూడ అనేక పద్యాలు చెప్పాడు 'అప్పు'ను గురించిన పద్యానికి వ్యాఖ్యానం వ్రాస్తూ శ్రీ అరుద్రగారు పై అభిప్రాయాన్ని వెలిబుచ్చారు వేమనకాలంలో ఆస్తికమతాలేకాక, నాస్తికమతాలు కూడ ఉన్నాయి కాని వాటికి అంత ప్రాచుర్యం ఉన్నట్టు కనిపించదు లోకాయతికులు, తాంత్రికుల గుంపులు అక్కడక్కడ ఉండి ఆధ్యాత్మిక మతా ఖండన చేస్తూ ఉండి ఉంటాయి లోకసంచారీ, నిత్యసత్యాన్వేషీ అయిన వేమన్న ఈ గుంపులతో కూడ కలిసి తిరిగి ఉండవచ్చును సహజంగా తర్కశీలి కాబట్టి వారి వాదాలు కూడ అతనిని ఆకర్షించి ఉండవచ్చును

---

19 వేమన, రాళ్ళపల్లి

20 పాఠాంతరాలు యువతి గురము, చెలగుమాడ్కి (డి 1773, I 236), దివ్వార్చినట్లుయా (డి 1735, 393)

21 స్వాతి, 1915

లోకాయతికులదీ తాంత్రికులదీ దేహవాదం దేహాన్ని మించినదేదీ వారు లేదంటారు ఈ దేహవాదులు భౌతికవాదులూ, నాస్తికులూను దేహ గుణాలను అవగతం చేసుకున్న వీరు మాయావాదం, మోక్షం, పరలోకం మొదలైన వాటిని ఖండిస్తారు. శంకరాచార్యులు తన అద్వైతమతాన్ని స్థాపించేటప్పుడు ఈ దేహవాదులను ఖండించవలసి వచ్చింది వైదికాచార్యులు నాస్తిక మతాల వారిని ఎట్లా ఖండించేవారో ఆరుద్రగారు చెప్తున్నారు.

**"ఇలా కానిపనులు చేసి కడుపునింపుకొనే అగ్రవర్ణాలవారిని ఆదిలో జైనులు, బౌద్ధులు, చార్వాకులూ, లోకాయతులూ ఖండించారు. వీళ్ళందరినీ నాస్తికులకింద వైదికాచార్యులు జమకట్టారు. వీళ్ళను అవహేళన చేయడానికి దొంగసూత్రాలు రచించి, ప్రచారం చేశారు. చార్వాకులు తిండికీ, దేహ పోషణకూ ప్రాధాన్యం యిస్తారు కనుక అప్పుచేసి పప్పుకూడు తినడమే ఆ మతధర్మమని 'ఎద్దేవా' చేయడానికి 'ఋణం కృత్వాఘృతం పిబేత్' అనే సూత్రాన్ని ప్రచారం చేశారు."**22

"వేమన్న పైన జైన ప్రభావం" అనే వ్యాసంలో ఆరుద్రగారు వేమన 'దిగంబరయోగి' కావడానికి జైనశాఖలలో ఒకటైన దిగంబరజైనం ప్రభావం ఉందేమోనని అభిప్రాయపడ్డారు 23 వేమన్నపైన చార్వాక ప్రభావం కూడ ఉందంటున్నారు కాబట్టి, ఆ దృష్టితో చూస్తే చార్వాకులలో కూడ ఒకడు కనబడుతున్నాడు అతని పేరు అసిత కేశకంబళుడు చార్వాక ప్రచారకులలో ఇతడు ప్రథముడు ఇతనిని ఉగ్రభౌతికవాది అనేవారు ఇతడు మండేఎండలో, జడివానలో నిలబడి తీవ్రాలోచన చేసేవాడట అప్పుడప్పుడు సంపూర్ణ దిగంబరత్వంతో తన్మయుడయ్యేవాడట 24

అట్లాగే చార్వాకుని గురించి భారతంలో ఒక కథ ఉంది భారత యుద్ధం ముగిసిన తర్వాత ధర్మరాజు, రాజుగా ఊరేగింపుతో హస్తినలో ప్రవేశిస్తున్నాడు అయితే చార్వాకుడు ధర్మరాజుకు ఎదురువెళ్ళి **"నీ పేరే ధర్మరాజు కాని నీవు చేసిందంతా అధర్మమే"** అన్నాడట ఆ వ్యాఖ్యకు చార్వాకుడు వధింపబడ్డాడు ఇదీ కథ ధర్మరాజును అధిక్షేపిస్తూ వేమన్న వ్రాసిన పద్యమొకటి చాలా ప్రసిద్ధికెక్కింది కనిపిస్తుంది

కులము నీరు జేసె గురువును జంపించె
పొసగ యేనుగంత బొంకు బొంకె
పేరు ధర్మరాజు పెను వేపవిత్తయా' (డి 1723, 585)

అయితే వేమన్న భౌతికవాదేనా అన్నది ప్రశ్న వేమన్న వేదనిరాకరణ, కులభేదఖండన చేశాడు కాబట్టి అతడు లోకాయతికుడు అనడానికి వీలుకాదు ఆ పని శైవులుకూడ చేశారు విశిష్టాద్వైతులు కూడా కులభేదాలను పాటించలేదు పై ఖండనలు వేమన్న శైవప్రభావంతోనే చేసి ఉంటాడనేది సులభంగా నిరూపించగలిగిన అంశం లోకాయతికులు ప్రకృతి ఆధిక్యతనేగాని పురుషాధిక్యతను అంగీకరించరు కాని అన్ని ఆధిక్యతలమీద సమరం సాగించిన వేమన్న తన వ్యక్తిలోని పురుషాధిక్యతను మాత్రం జయించలేకపోయాడని అంగీకరించక తప్పదు వేమన్న మంత్రయోగం, రాజయోగం, లయయోగం అనే

---

22 స్వాతి 1976

23 నివేదిత, మాసపత్రిక, ప్రారంభ సంచిక సెప్టెంబరు, 78

24 స్వాతి, 1975

యోగాలు తెలిసినవాడైనా ఆయన ప్రచారం చేసింది మాత్రం 'సంసార యోగం' అని అరుద్రగారు అభిప్రాయపడ్డారు[25] దానికి ఈ కిందిపద్యం ఉదాహరణగా ఇచ్చారు:

వెతల దీర్చువాడు వేదాంత వేద్యుడు
రతుల నేలువాడు రసికుడగును
సతిని పెనగువాడు సంసారయోగిరా!

లభిస్తున్న ఆకరాలను బట్టి వేమన్న భావాలను ఏ ఒక్క మతం గుంజకు కట్టివేయలేమని తెలుస్తున్నది. ఏదో ఒక మతం సులోచనాలగుండా చూస్తే కనిపించేది వేమన్న పాక్షిక రూపమేకాని సంపూర్ణమూర్తి కాదు. కాని వేమన్న ఏ మత సిద్ధాంతాలను ఖండించినా, ఏ సూత్రాలను ప్రబోధించినా అన్నింటిలోనూ అనుస్యూతంగా కనిపించేది నిప్పువంటి ఆయన నిజాయితే. సూనృతమే ఆయన మతం

## 5. సూనృతం వేమన్న మతం[26]

అనేక మతాల చిత్రవర్ణాలతో ఏర్పడిన ఇంద్రధనుస్సు వేమన్నమతం. మానవుడు మానవుడుగా మనలేకపోతున్నాడే అనే ఆవేదన వేమన్న తాత్త్విక చింతనకు దారి తీసింది ప్రజాశ్రేయస్సుకోసం మతాలు ఏం చెప్తున్నాయో అనే ఆశ, మనుష్యుల దుఃఖవిముక్తి కొరకు ఏదో ఒక పరిష్కారం సాధించాలనే భావతీవ్రత వేమన్నను నిరంతర అన్వేషిగా, నిత్యపథికునిగా మార్చినాయి. ఆ యామతాల పుటలు విప్పి చూసిన వేమన్నకు వాటి తాత్త్వికాంశాలతో వివాదం ఉన్నట్టు కనబడదు కాని వేమన్నను తీవ్రమైన నిరాశకు గురిచేసిందీ, ఆగ్రహాన్ని రగుల్కొలిపిందీ ఆనాటి మతాల దంభజీవితమే

అంతరంగమందు నపరాధములు జేసి
మంచివాని వలెను మనుజుడుండు
యితరు లెరుగకుంటె యీశ్వరుడెరుగడ (డి 1727, 20)

తత్త్వాలకు, మతాలకు మధ్య దూరమే కాదు, అసలు గుర్తు పట్టలేనంత భేదంతో ఉన్నాయవి దురాచారాలను సమర్థించుకోడానికీ, వక్రవ్యాఖ్యానాలు చేయడానికీ నాటి పాండిత్యం పనికివచ్చింది 'రెండు నాలుకలు, రెండు జీవితాలు' – ఇదీ నాటి మతవ్యవస్థ మానవుడు ఎప్పుడో మరుగున పడిపోయాడు మతానుష్ఠానాలన్నింటిలో అనేకం అమానుషంగా కనిపించాయి వేమనకు ఏ మనిషి గొప్ప జీవితాన్ని ఆకాంక్షించి దానిని తెలుసుకోవడానికి బయలుదేరాడో, ఆ ప్రయాణంలో ఆ మానవుడు కుంగి, నలిగి, జీర్ణించిపోతుండడం కనిపించింది గొప్ప జీవితమేమోగాని ఇక ఉన్నజీవితమే అగాధా బాధా పాతాళాలలోనికి కూరుకుపోతున్నది ఇక ఆ మానవుని రక్షించడమే తన తక్షణ కర్తవ్యంగా నిర్ణయించుకున్నాడు వేమన ఆ క్షణంనుండి ఆ దుస్థితికి కారణాల అన్వేషణలో పడిపోయాడు

---

25 భారతీయ తత్త్వ చరిత్ర – పేజీ 38

26 నిజానికి సూనృతం జీవిత విధానమే కాని మతం కాదు వేమన్నలో అది అత్యంత గాఢమని చెప్పడానికే ఆ పేరు

ఆ కారణాలు అన్నిమతాలలోనూ దర్శనమిచ్చాయి. నిజాయితీపరుడైన వేమన్న ఈ ద్వంద్వ ప్రవృత్తికి చలించిపోయాడు. స్వభావతః ఉద్రేకి కాబట్టి ఆ పరిస్థితులకు ప్రతిఘాతంగా (reaction) స్పందించాడు మానవుని హీనస్థితికి కారణమైన వ్యవస్థలమీద తిరుగుబాటు ప్రారంభించాడు. ఈ సమరంలో ఆయన ధరించిన ఆయుధం పేరు హేతువు. ఉత్తరోత్తరా అదే వ్యక్తిత్వంలో తర్కశీలంగా స్థిరపడింది. ఈ అధిక్షేప యుద్ధంలో ఆయనకు స్వపరభేదం లేదు. ఈ కార్యంలో సహజంగా ప్రతిఘటనలే ఎదురైనాయి. అయితే వేమన్న ఏకాకికాదు. ద్వంద్వవ్యవస్థలమీద అసంతృప్తి చెందిన జనులు సమాజంలో ఉన్నారు వేమన్న ఉద్యమాన్ని అనుకూల దృష్టులతో చూసినవారే కాక అయనను వెన్నంటి నడిచే శిష్యులు కూడ తయారయ్యారు.

"He recognises the popular attitude and describes it in the most contemptous terms"27 అని Campbell వ్రాశాడు.

అయితే కేవలం ఖండనతో తృప్తిపడిన ఖండితవాదిగానే మిగిలిపోతే వేమన్న గొప్పతనం ఏమీలేదు వేమన్న జీవితపు ఋణపార్శ్వ (Negative side)న్నే చూశాడనడం తొందరపాటే కాగలదు. ఆయన లక్ష్యం మానవత అది ఎక్కడ కనిపించినా మెచ్చుకోకుండా ఉండలేదు.

"The whole comedy of life, however, has an interest for Vemana.... he is indifferent to nothing human"28

అన్ని రంగాలలో అవినీతి తాండవమాడుతున్న రోజులవి. అవినీతిని ఖండించి నీతి ప్రబోధాలు చేశాడు వేమన్న శిధిలమైన సమాజ సంస్కరణకు నడుం బిగించాడు. ఈ ప్రయత్నంలో దేనితోనూ రాజీ పడలేదు.

"He was not only, or indeed chiefly a satirist; he was an earnest reformer who felt that he had a great mission on his countrymen and refused to allow any consideration to interfere with fulfilment of it"29 W H Campbell

అయితే వేమన పద్యాలలోని మానవత్వ లక్షణాలను కొంత లోతుకువెళ్ళి పరిశీలించవలసి ఉన్నది

## II. మానవతావాది

వేమన్నను మానవతావాదిగా ప్రస్తుతిస్తూ 'Natures philospher'గా తమ 'వేమన' అనే ఆంగ్లగ్రంథంలో శ్రీ నార్ల వర్ణించారు 'Saint Vemana & His Philosophy' అనే గ్రంధాన్ని రచించిన డాక్టర్ ఈశ్వర టోపా 'మానవీకరణము' 'సంస్కృతీకరణము' కొరకు పాటుపడిన వాడిగా వేమన్నను అభిమతించారు 'Vemana the Humanist' అనే చక్కటి వ్యాసాన్ని ఎం పట్టాభిరామ్‌రెడ్డిగారు స్టేట్ ఆర్కైవ్స్‌వారి మ్యాగజైన్‌లో

27 "Vemana through western eyes"

28 "The inconsistency of the orthdox was his theme" L D Barnett "Vemana through western eyes"

29 "Vemana through western eyes"

ప్రకటించారు. Cuddapah District Manualలో J. D B. Gribble వేమన్నకు దైవదత్తంగా లభించిన ఏడుసూత్రాల మీద ఆయన బోధనలు ఆధారపడి ఉన్నాయని వ్రాశారు.

"He pretended to have received seven maxims direct from the Supreme Being, which maxims formed the basis of his teaching These maxims were -

1. Do not steal.
2. Be always merciful
3. Do not hurt the feelings of others
4. Be content with what you have.
5. Be non-jealows of another.
6. Forsake anger and be patient.
7. Be constant in the Divine services.

These maxims would seem to aim at a higher Doctrine of morality than is usually inculcated in this Country."30

పై సూత్రాలు క్రైస్తవుల పది సూత్రాల (Ten commandments) వంటివి. ఇవి, మనిషి మానవత్వం ద్వారానే దైవాన్ని చేరగలడనే క్రమంలో ఉన్నాయి. వేమన్నది దోషైక దృష్టి (Negative) అనీ, ఆయన కవిత్వంలో ఖండనమేకాని మండనం (Positive) లేదనే అభిప్రాయాలు కూడ లోకంలో ఉన్నాయి. వేమన్న ఖండించింది అమానుషత్వాన్ని, ఆయన కోపం అధర్మం మీద అని అర్థం చేసుకుంటే వేమనలో అంతర్గతంగా ఉన్న గుణపక్షపాతం తెస్తుంది పరోక్షంగానే కాక సూటిగా కూడ మానవత్వపు విలువలను ఆయన ఎలుగెత్తి చాటాడు

చంపదగిన యట్టి శత్రువు తనచేత
చిక్కనేని కీడు సేయరాదు
పొసగ మేలు చేసి పొమ్మనుటే చాలు31 (డి 1721, 23)
ఇంతటి ఉన్నతమైన ధర్మాన్ని ఏ మతాలు బోధించాయి?

---

30 Appendix 1, Page 71, 'Vemana Through western eyes'

31 "పొమ్మనుటే చాలు" అనే పాఠాంతరం ముద్రిత ప్రతులలోనికి ఎక్కి ఆ పాఠమే ప్రచారం పొందింది ఇది 'చావు' కాని 'చాలు' కాదు అముద్రిత ప్రతులన్నింటిలోని 'చావు' పాఠమే ఉంది ఉదా॥ డి 1723, 379 - పొమ్మన్న చంపుట
డి 1724, 119 - పొమ్మన్న చంపుట
డి 1725, 606 - పొమ్మన్న చంపుట
డి 1769, 302 - పొమ్మన్న చంపుట
డి 1725, 379 - పొమ్మన్న చంపుట
ఇక్కడ 'చావు' అనే పాఠమే అర్థదృష్ట్యా ఉచితంగా ఉంటే 'చాలు' అనేది లేఖక దోషమై [illegible] ఉంటుంది

వేమన్న జీవకారుణ్య దృష్టికి కింది పద్యం తార్కాణం.

జీవి జీవి జంపి జీవికి వేయగా
జీవి వలన నేమి జిక్కియుండె
జీవహింసకులకు జిక్కునా మోక్షంబు? (డి. 1721, 220)

పరుల మేలు కొరకు ప్రాణాలర్పించేవాడే నిజమైన మానవుడు:

గువ్వ కొరకు మేను కోసిచ్చి శిబిరాజు
వార్తకెక్కె నతని కీర్తి నిక్కె
వోగు నెంచబోరు వుపకారినేగాని (డి. 1723, 432)

మేలెరుగని వాని మేనెవ్వడెరుగును? (డి 1727, 552)

వేమన్న కోమల హృదయానికి పరాకాష్టగా మరో పద్యం చూపవచ్చు. ఇతరుల మనస్సు విరిచేవాడు వేమన్న దృష్టిలో పాపాత్ముడు

ఇనుము విరిగెనేని యినుమారు ముమ్మారు
కాచి యతక నేర్చు కమ్మరీడు
మనసు విరిగెనేని మరి యంటనేర్చునా (డి. 1721, 50)

శాంతబుద్ధి నుండ సమకూడును సుఖము (డి. 1770, 4, 2090)

1. సంఘ సంస్కరణ

మానవత్వమే వేమన్న మతం రూఢ్యర్థంలో మానవత్వం ఒక మతం కాదు; ఒక దృక్పథం కాని ఇది మతంకన్న విశాలమైనది మతం ఒక ప్రాంతానికి కొందరు ప్రజలకు సంబంధించిన జీవిత విధానాల విశ్వాసాల సమాహారమైతే మానవత విశ్వజనీనమైనది. మానవ జీవితానికి సంబంధించిన ప్రాథమికమైన విలువల పైనే దీని ఋజుదృష్టి కేంద్రీకరించబడి ఉంటుంది

ఏ మతానికైనా, దృక్పథానికైనా సంఘమే జన్మస్థానం. సంఘంలోని రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితులు ప్రజాజీవన పద్ధతులు – ఇవే మౌలికంగా మతవిశ్వాసాలను ప్రభావితం చేసే శక్తులు కాని కాలమాన స్థితిగతులనుబట్టి వీటిలో దేనిని ఏది ప్రభావితం చేస్తుందో చెప్పలేనంతగా ఇవి కలిసిపోయి అప్పుడప్పుడు విశ్లేషణకు లొంగవు. మానవుని మనుగడకు కొన్ని ప్రత్యక్ష కారణాలైతే కొన్ని మౌలిక హేతువులు మధ్యయుగంనాటి గ్రామజీవనంలో మనిషిని నడిపించిన ప్రత్యక్ష శక్తి మతమే. వేమన్న భావాలు మతంకుదుట్లో పుట్టి సమాజంలోనికి విస్తరించాయి గంభీరమైన తాత్త్విక చర్చలకన్న సంఘజీవనంపైన వాటి ప్రభావమే వేమన్నకు ముఖ్యం. వేదాంతాన్ని అతడెప్పుడూ సంఘం నుండి వేరుచేసి చూడలేదు తాత్త్వికం, సాంఘికం, ఆర్థికం అని ఇవి మనం సౌకర్యం కొరకు చేసుకునే విభజనలు వేమన్న జీవితాన్ని సంపూర్ణంగా (Synthesis) దర్శించినవాడేకాని అరలుగా ప్రత్యేక దృక్కోణాలలో చూసినవాడు కాదు

అయితే ఒక వ్యక్తి జీవితాన్ని శాసించేవి పై సంఘశక్తులే కాక, ఆ సంఘంలో రూపుదిద్దుకున్న అతని మనఃప్రవృత్తికూడ అతని దృక్పథాన్ని నిర్దేశిస్తుంది జనన మరణాలు, యౌవన ప్రాదుర్భావం, వివాహం మొదలైన జీవితంలోని కీలక సంఘటనలు,

ఉద్రేకపూరితములైన అనుభవాలు, తీరని కోరికలు – ఇవన్నీ వ్యక్తి దృష్టిని ప్రభావితం చేస్తాయి వేమన్నది సహజంగా ఉద్రేకప్రకృతి ఈ ప్రకృతి వలన వేమన పలుకులకు జవం, జీవం కలిగాయి. ఇది కోపరూపమైన బలహీనత కాదు ఇది ఆశాభంగం నుండి, స్వార్థం నుండి పుట్టిన కసి కాదు వేమన్నకు కోపం లేదని కాదు[32] వేమన్న ప్రదర్శించింది ధర్మాగ్రహమే. అది అతని వ్యక్తి నుండి సమాజంలోనికి విస్తరించిన ప్రతిఘటన రూపం అయితే అతని ఉద్రేక జ్వాలలు అతని సుమకోమలమూ, హిమసన్నిభమూ ఐన మనస్తత్వంనుండే వెలువడ్డాయని మరచిపోరాదు అంతేకాదు; వేమన్న ప్రబోధాలు చైతన్యగోళాలై జ్వలించడానికి ఆయన వ్యక్తిత్వంలో మరో రెండు అంతఃశక్తులున్నాయి దండలో దారంవలె వేమన్న ప్రతిపద్యంలోను అంతర్లీనమై కొనసాగిన సద్గుణాలివి 1 చిత్తశుద్ధి 2 సాహసం.

1. వేమన్న చిత్తశుద్ధికి తార్కాణంగా ఆయన పద్యాలలో దేన్నైనా చూపవచ్చు ఆయన తత్త్వానికి అదే ఊపిరి

 చిత్తశుద్ధి గలిగి చేసిన పుణ్యంబు
 కొంచెమైన నదియు కొదువ గాదు
 విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత? (డి 1721,664)

నిజాయితీ గల జీవితం నుండే సత్యం ఉద్భవిస్తుంది సత్యమే మానవత ఈ రెండింటి అద్వైతమే వేమన పద్యాలలోని సారం వేమన్న దృష్టిలో **"కల్లలాడు కంటె కష్టంబు మరి లేదు"** (డి 1727, 601) దుర్వ్యసనాల పాలై, మత్తుడైన వ్యక్తికన్న **'కల్లలాడేవాడు'** నీచుడు

 కల్లు ద్రావువాడు కల్లు ముచ్చునుగాడు
 కల్లలాడు వాడె కల్లుముచ్చు
 కల్లు ద్రావుకన్న కల్లలాడుట కీడు (డి 1723, 237)

2 కాని, సాహసం లేనివాడు సత్యం పలుకలేడు

వేమన్న పలుకులోని సాహసమే అతని వ్యక్తిత్వంలోని సౌందర్యం

అయితే వేమన్న సాహసానికి కారణం అతని నిస్వార్థత వేమన్న "కోరి విరాగి అయినవాడు, తన ధర్మం, తన మతం వదిలివేసినవాడు చివరికి గోచి గుడ్డను కూడ తీసిపారేసిన **'విముక్తుడు'** వేమన్న అటువంటివాని సత్యవాక్యూరత వలన తనకు పోయేదేమి లేదు, దోచుకోవడానికి సంపద లేదు హాని కలుగజేయడానికి దేహం మాత్రం ఉంది కాని దానిపట్ల కూడ వేమన్నకు శ్రద్ధా మమకారాలు కానరావు ఇంతటి మొండివానిని సాహసలక్ష్మి వరించక తప్పలేదు

**'తెలిసినందుకు మరీ ధీరుండు కావలె'** (డి 1721, I, 86)

అన్నది ఆయన నమ్మకం

---

32 వేమన – రాళ్ళపల్లి

ఇక వేమన దృక్పథంలో సారభూతమైన విస్మరించరాని ఒక లక్షణముంది. అదే **ఆధ్యాత్మిక భౌతిక** ప్రపంచాలను సమన్వయపరిచే ప్రయత్నం అధ్యాత్మిక విలువలు, **భౌతిక** విలువలు – ఈ రెండింటిలో వేమన దేనికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడంటే చెప్పడం సులభం కాదు అతడీ రెండింటిని వేరుగా చూడలేదు కాని **"అధ్యాత్మికములైన విలువల"** కారణంగా భౌతికములైన విలువలు ప్రమాదంలో పడితే మాత్రం ఆయన సహించలేడు ఇహపరాల మధ్య ఒకానొక తూకాన్ని వేమన్న కోరాడు

సంఘసంస్కర్తకు కావలసిన జీవ సామగ్రి ఆయనలో పుష్కలంగా లభిస్తుంది ఆనాటి సంఘం కూడ సంస్కరించబడవలసినంత దుస్థితిలోనే ఉంది సమాజవ్యవస్థ రోగగ్రస్థమై హస్తవాసి గలిగిన ధన్వంతరికోసం నిరీక్షిస్తుంది ఇక వేమన్న, నాటి సంఘలోపాల **"ఎరుక"**ను గలిగి వాటిని సరిదిద్దగలిగినంత ఎత్తు వరకు ఎదిగివున్నాడు సంఘంలోని ప్రజలను నిష్కామంగా ప్రేమించగలిగినవాడే దానిని సన్మార్గంలో పెట్టాలనుకుంటాడు. మానవతామూర్తి అయిన వేమన్న కరుణాంతరంగంతో **'గట్టి చికిత్స'**కే పూనుకున్నాడు.

**"సాంఘిక దోషములను సరిదిద్దుట యనగా మానవత్వ సిద్ధాంతములకై పోరాడుట యన్నమాట. సాంఘికములైన యధర్మ క్రౌర్యముల నుండి మానవుని రక్షించుట యాతని జీవితాదర్శము."**[33]

## 2. సర్వమానవ సమానత్వం

a) **వర్ణవ్యవస్థ:** మానవత్వ సాధనలో వేమనకు మొట్టమొదట అడ్డుతగిలింది వర్ణవ్యవస్థ కులాల పుట్టుకను గూర్చి మన ప్రాచీనగ్రంధాలలో అనేక రకాల కథలు ఉన్నాయి వాటిలో ఎక్కువ వాడుకలో ఉన్నది పురుష సూక్తంలోనిది చాతుర్వర్ణాలు పురుషుడు లేక బ్రహ్మ యొక్క ముఖం నుండి, భుజాలనుండి, తొడల నుండి, పాదాలనుండి ఉద్భవించాయి ఇది కేవలం పుక్కిటిపురాణమే అయినా ఈ పుట్టుకస్థానాలన్నీ ప్రతీకలుగానే తీసుకోబడ్డాయి వాటి జన్మస్థానాలనుబట్టే వాటి ఎక్కువ తక్కువలు వ్యవహారంలోనికి వచ్చాయి విష్ణు, మార్కండేయ పురాణాలలో మనిషీ, కులం ఒకేసారి పుట్టినట్లు వర్ణించబడింది త్రేతాయుగాంతందాకా మనుష్యులు కులాలుగా చీలిపోలేదని వాయుపురాణం చెప్తున్నది బ్రాహ్మణాలలో, ఇంకా అనేక పురాణాలలో కూడ మానవ సృష్టిని గురించి చెప్పేటప్పుడు కులాల ప్రసక్తి కనిపించదు తరువాతి అధ్యాయాలలో మాత్రం ఒక్కొక్క వర్ణంయొక్క పనినిబట్టి వాటిని గుర్తించినా, వారు సమస్త మానవాళికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్టుగా పేర్కొనబడింది ఒకచోట మనుష్యులు వివస్వతునినుండి పుట్టారని చెప్పబడింది ఒక్కచోట మాత్రమే చతుర్వర్ణాలు కల మనుష్యులందరు మనుసంభవులని ఉంది మహాభారతంలో జన్మతః మనుష్యులలో కులాలు లేవని, గుణాలూ, చేసే వృత్తులనుబట్టే అవి ఏర్పడ్డాయని చెప్పబడింది

గుర్తు తెలియని కాలం నుండి కులవ్యవస్థ ఇండియాలో కొనసాగుతున్నదని గ్రీకు, ల్యాటిన్ రచయితలు పేర్కొన్నారు ప్రాచీన హిబ్రూలకు, ఇప్పటి హిందూసంఘానికి

---

33 by Dr Iswara Topa, Translated into Telugu by Dr D Venkatavadhani Page 20

ఎన్నో పోలికలు ఉన్నాయని అబె దుబాయ్ వ్రాశాడు.[34] భగవంతుని నుండి మోజెస్‌కు సంక్రమించాయని చెప్పబడే నీతిసూత్రాలలో కులాంతర వివాహాలు నిషేధించబడ్డాయి. కులమే కాదు; కుటుంబాంతర వివాహాలు కూడ నిరసించబడ్డాయి. ఇది తప్ప భారతదేశంలోలాంటి కులాలు కానరావు.

Caste అనే పదం పోర్చుగీసు భాషనుండి తీసుకొని, ఇండియాలోని 'కులం' అన్న పదానికి సమానార్థకంగా ఐరోపా పండితులు వాడడం ప్రారంభించారు. ఆంగ్ల నిఘంటువులు Caste అన్న పదానికి "A social class in India" అన్న అర్థాన్ని ఇస్తున్నాయి. కులం అనే అర్థంతో సంస్కృతంలో వర్ణం అనేమాట వుంది దీనికి రంగు అని అర్థం. బ్రాహ్మణుని ఒంటిరంగునుండి ఇతరుల రంగు గుర్తించడానికి ఈ పదం ప్రచారంలోనికి వచ్చిందని దుబాయ్ వ్రాశాడు. మహాభారతం శాంతిపర్వంలోని భృగు, భరద్వాజ మహర్షులు జరిపే సంభాషణలో ఈ 'వర్ణ' చర్చ ఉన్నది భరద్వాజుని ప్రశ్నకు సమాధానం చెప్తూ భృగువు "బ్రాహ్మణుల వర్ణం తెల్లనిది. క్షత్రియులు ఎర్రనివారు: వైశ్యులు పచ్చగా వుంటారు శూద్రులేమో నల్లనివారు (సిత రక్త పీత నీలములు)[35] అని చెప్పాడు

అయితే ఈ వర్ణాలు ఏర్పడడానికి కూడ భృగువు కారణం చెప్పాడు. నిజానికి కులాలన్నీ వేరువేరుగా లేవు. బ్రహ్మసృష్టిలో అందరూ బ్రాహ్మణులే. వారి వారి వృత్తులవల్ల వివిధ కులాలుగా విడిపోయారు ఇంద్రియ లౌల్యానికీ, హింసా ప్రవృత్తికీ లోనైనవారు, బ్రహ్మహిత కార్యాలకు దూరమై ఎర్రటి శరీరచ్ఛాయతో క్షత్రియులుగా మారిపోయారు. వ్యవసాయంపై ఆసక్తి జనించి, యజ్ఞయాగాది కర్మలను నిర్లక్ష్యం చేసిన వారందరు వైశ్యులయ్యారు ఇక విషయవాంఛాపూరితులై, అపమార్గగాములై ఏ వృత్తిపడితే ఆ వృత్తిని స్వీకరించినవారు నల్లబడిపోయి శూద్రులుగా మారిపోయారు ఇది భృగువచనం నరకులం అనేక కులాలుగా ముక్కలై పోవడానికి కారణం చెప్పినా స్వతహాగా మానవులంతా ఒక్కటే అని భృగువు ప్రబోధించాడు అనాదికాలంలో విడిపోయిన మానవులను మళ్ళీ ఏకంచేయడానికి అనేక ప్రయత్నాలు ఆయా యుగాలలో జరిగాయి [36]

వేమన్న కాలానికి వస్తాను. ప్రాచీన గ్రామవ్యవస్థలో కులవ్యవస్థ ఎంతటి బలమైందో తృతీయప్రకరణంలో చర్చించబడింది వృత్తుల కారణంగా ఏర్పడిన కులాలు అనంతర కాలంలో ఘనీభవించి మానవులమధ్య భేదాలను శాశ్వతం చేశాయి 17వ శతాబ్దంలోని పరరాజుల దండయాత్రలు, మహమ్మదీయ మతప్రభావం, వ్యాపార సంస్కృతి ప్రవేశం మొదలైన అనేక కారణాల వలన వర్ణవ్యవస్థ పునాదులలో ప్రకంపనాలు మొదలైనాయి కులవృత్తులను త్యజించి, ఇతర వృత్తులను చేపట్టేవారు ప్రబలిపోయారు అధిక ధనార్జన చేయగలిగిన వృత్తులవైపే జనులు మొగ్గుచూపారు కులానికి కర్మను నిర్ణయించే శక్తి సన్నగిల్లింది

---

34 Hindu manners

35 మహాభారతం 'శాంతిపర్వం', చతుర్థాశ్వానం - 97వ పద్యం

36 పై సమాచారమంతా దుబాయ్ తన 'హిందువుల ఆచారాలు 'అనే గ్రంథంలో చేసిన రిసెర్చి ఆధారంగానే వ్రాశాను

కూడదేమి చేసె, కులమేమి చేసెను
భూమి యేమి చేసె బొంది కట్టి
నరుడు పడెడి పాట్లు నగుబాట్లు చూడగా (డి. 1721, 209)

అయితే సహజంగా తర్కశీలి అయిన వేమన్న ప్రాపంచిక సుఖాల కొరకు కులపుగోడలను కూలద్రోసి మళ్ళీ ఆ శిధిలాలకే కాపలాకాసే ద్వంద్వాన్ని పరిహసించాడు.

కులము లేనివాడు కలిమిచే వెలయును
కలిమి లేనివాని కులము దిగును
కులము కన్న మిగుల కలిమి ప్రధానంబు. (డి. 1721, 138)

వేమన్న సమానతను ప్రబోధించే ఉద్యమానికి సమకాలీన పరిస్థితుల దోహదమే కాకుండా ఆ వర్ణవ్యవస్థలోని అమానుషత్వం అతనికి బాధను కలిగించింది మనుష్యుల మధ్య హెచ్చుతగ్గులను నిర్ణయించి మానవ గౌరవాన్ని కించపరిచినవి కులాలే అని వేమన్న అభిప్రాయం.

"As a social philosopher, Vemana is an advocate of human equality. He believes fervently that there can be no equality so long as the caste system, with its many gradations and degradations, its totems and taboos, is not done away with"[37]

కులము హెచ్చు తగ్గు కొదవలు పని లేదు
సానుజాతమయ్యె సకలకులము
హెచ్చుతగ్గు మాట లెట్లెరుంగగవచ్చు? (డి 1721, 217)

మానవుణ్ణి ఒక కులచట్రంలో బిగించి ఉంచడం వేమన్నకు నచ్చలేదు మానవుడు తన సాంఘిక వర్ణం ఏదో ఒక దానిలోనే సభ్యుడై ఉంటున్నాడు కాని తన జాతి మొత్తంలో ఒక స్వతంత్ర సభ్యునిగా ఉండలేకపోతున్నానని వేమన గుర్తించాడు ప్రాథమికంగా మానవుడనే గుర్తింపును కోల్పోయాడని వేమన్న వాపోయాడు నైతిక ప్రమాణాలదృష్ట్యా వర్ణవ్యవస్థ సమర్థనీయం కాదని తేల్చిచెప్పాడు జాతి ఐక్యతను ఇది భంగపరుస్తుందని హెచ్చరించాడు

"Evils like social inequalities, gradations and degradations based on birth, are, generally speaking, attacked on two grounds Firstly on ethical grounds as being wrongs, secondly, on utilitarian grounds as weakening society, and leading ultimately to its destruction or subjugation by a stronger power"[38]

కాబట్టి మానవజాతి సంఘటితం కావాలని వేమన్న ఉద్బోధించాడు కులాలన్నీ ఒకేకులంగా మారాలి అదే మానవకులం దానికి వేమన్న సూచించిన ఒక సంస్కరణ మార్గం నానాకుల సహపంక్తి భోజనం

---

37 Vemana - V R Narla, Page 56

38 Dr C R Reddy, Radio talk 1950 AIR Madras Courtesy "Vemana through western eyes", Page 75

ఉర్వివారికెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలయజేసి
తలను చెయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా![39] (డి. 1721, I 126)

'కులము కన్న మిగుల గుణమె ప్రధానంబు' (డి. 1773, III, 1311)

అయితే వేమన్న 'కులాన్ని' మెచ్చుకున్నాడని ఎత్తి చూపుతూ కొందరు ఈకింది పద్యాన్ని ఉదహరిస్తుంటారు.[40]

కులములోన నొక్క గుణవంతు డుండెనా
కులము వెలయు వాని గుణముచేత
వెలయ వనములోన మలయజంబున్నట్లు (డి. 1773–4–413)

ఇక్కడ 'కులం' అంటే 'కుటుంబం' అని వ్యవహారార్థమే కాని రూఢ్యర్థం కాదని స్పష్టంగా తెలుస్తుంది. కులం అంటే group of people అనే అర్థం కూడ చెప్పవచ్చు.

**b) అస్పృశ్యత:** కులాల పరిస్థితి ఇట్లుండగా మరొక సాంఘిక శాపం అస్పృశ్యత. పరమకారుణికుడైన వేమన్న దీనిని తీవ్రంగా ఖండించాడు. చతుర్వర్ణాలకు వెలిగా పుట్టిన అస్పృశ్యత, సాంఘిక అధర్మానికి చిహ్నమైంది. అస్పృశ్యుల జీవితాలు మానవ హైన్యానికి భీకర తార్కాణాలు. పై నలుగురు సంఘంలో అనుభవిస్తున్న గౌరవాదరాలు లేక అన్నింటికీ బాహ్యులుగా ఉన్న అస్పృశ్యుల దుస్థితి వేమన్న హృదయానికి ఎంతో నొప్పి కలిగించింది. వారి పట్ల పైవారి ప్రవర్తన ఆయనలో క్రోధాగ్నిని రగుల్కొలిపింది. తర్కాయుధాన్నెత్తి పట్టుకొని వారి పక్షాన వాదించాడు.

మాలవాని నేల మరి మరి నిందింప
ఒడలనున్న మాంస మొకటిగాదె
వానిలోన వెలుగువాని కులంబేది? (డి 1721, I 423)

మాలవాని నంటి మరి నీళ్ళ మునిగేరు
మాల కర్మ చేత మాలడయ్యె
ఏల తెలియలేరొ యీ నరపశువులు (డి 1735, 323)

ప్రవర్తన వలననే మాలగాని జన్మచేత ఎవడూ 'మాల' కాడని వేమన్న వాదించాడు.

మాల మాల గాడు మహిమీద నేపొద్దు
మాట తిరుగువాడు మాలగాక
వాని మాలయన్న వాడెపో పెనుమాల (డి 1721, 131)

39 పల్నాటి కాలంలో బ్రహ్మనాయుడు అన్ని కులాలకు 'చాపకూడు' పెట్టించాడు గురునానక్ 'లంగరు'లనే వాటిని స్థాపించి ఇదే పని చేశాడు. వేమన్న కూడ ఉర్వివారందరూ ఒక్క కంచంలో "పొత్తుకుడిస్తే" (కలిసితింటే) కులాన్ని 'పొలయ' జేయవచ్చునంటాడు ఒక్క కంచంలో తినడమే కాదు – "ఈనాటి నుండి నాలో కులతత్త్వం చచ్చింది" అని ప్రతివాడు ప్రమాణం చెయ్యాలంటాడు హెచ్చుతగ్గుల్లో మానవుని క్షోభను గుర్తించి అసమానతలకు వ్యతిరేకంగా అనుకంపతో చెప్పిన పద్యమిది

40 అక్కడక్కడ సమావేశాలలో నేను విన్నాను

'మనసు నిల్పుకున్న మహిమీద మాలడు' (డి 1721, I 222)

'వాక్కు శుద్ధిలేని వాడు చండాలుడు' (డి 1721, I 207)

"అస్పృశ్యుడు వాడి జీవనవిధానం వలననే అసహ్యించుకొనబడుతున్నా"డని వాదనలు చేసే వారికి సమాధానంగా వేమన్న ఈ కింది పద్యాలు చెప్పాడు

కసువు నేరి తిన్న పసరపు మైదిన<br>
మాలడంద్రు వాని మహిని జనులు<br>
పంది కోడి దిన్న ప్రాజ్ఞుడందురు జనుల్ (డి 1721 413)

మాల మాంసము దిన మహిమీద జనులెల్ల<br>
కొవ్వు దావలేదా కోర్కె దీర<br>
కులములన్ని నొక్క కులముగా దెలియుడీ! (డి 1723, 232)

## 3. నైతిక ప్రబోధం:

వేమన్నను 'నీతికవి'గానే అనేకులు గుర్తించారు వేమన పద్యాలను నీతిశతకంగా కూడ పరిగణించిన వారున్నారు కాని వేమన్న చేసిన నీతి ప్రబోధం ఆయన స్పర్శించిన అనేకానేక విషయాలలో ఒకటేగాని అది ఆయనను నీతిబోధకుని చేసేంత ప్రబలంగా లేదు పిల్లల వాచకాలలో, శతకాలుగా ప్రచురించిన పుస్తకాలలో వివాదరహితమైన సామాన్య నీతులనే చేర్చారు కాబట్టి వాటికే అధిక ప్రచారం కలిగింది పల్లెటూరి ప్రజానీకంలో వేమనపద్యాల ప్రాచుర్యాన్ని పరిశీలిస్తే- సాధారణ నీతిపద్యాలతోపాటు బహుముఖాలుగా విస్తరించిన పలురకాల పద్యాలను వారు వినిపిస్తారు

నీతి, సంఘానికి సంబంధించింది సంఘంలోని వివిధ జీవన రీతులు నీతిమార్గాలకు కట్టుబడి ఉంటాయి సంఘం ఏర్పరచిన ఈ కట్టుబాట్లు వ్యక్తిలోని విశృంఖలత్వాన్ని అదుపులో పెడుతూ, అతని సంఘబాధ్యతను గుర్తు చేస్తుంటాయి గ్రామవ్యవస్థలో **'కుటుంబం'** ఒక ఆదర్శంగా భావించబడింది సంసార శకటానికి ప్రేమ, నైతికజీవనం రెండూ ఇరుసులు వీటిలో ఏది కొరవడినా శకటం కూలిపోక తప్పదు నాటి పరిస్థితులలో గ్రామ వ్యవస్థ ఎట్లా విచ్ఛిన్నదశలో ఉన్నదో గత ప్రకరణంలో చర్చించాను గ్రామ వ్యవస్థకు ఆత్మవంటి కుటుంబం కూడ పగుళ్ళు వారింది కుటుంబగమనం కుంటుపడడానికి కొత్తగా ప్రవేశించిన ఆర్థిక విలువలు ఒక ముఖ్యకారణం కాగా, అప్పటికే సంఘంలో శవాలై కుళ్ళిపడి ఉన్న నైతిక విలువలు కూడ ప్రధాన దోహదకారులైనాయి నైతిక పతనానికి అప్పటి మతాలు కూడ ఏదో ఒక పేరుతో హేతువులైనాయి నాటి కుటుంబ వ్యవస్థను గాఢంగా ప్రభావితం చేసింది వ్యభిచారం వేమన్న సంసారయోగాన్ని ప్రతిపాదించినవాడు

వెతల దీర్చువాడు వేదాంతవేద్యుండు<br>
రతుల నేలువాడు రసికుడగును<br>
సతిని పెనగువాడు సంసార యోగిరా

శాంతి సౌఖ్యాలకు నిలయమైన కుటుంబం, వెలుపలి నుండి నాలుకలు సాచే అవినీతి కీలలకు ఆహుతి కావడం వేమన్నను మిక్కిలి బాధించింది

అయితే ఆ పరిస్థితులలో వ్యక్తిగా వేమన్న ఏ దశలో ఉన్నాడో ఊహించవలసి ఉంది. అధికారుల కుటుంబంలో పుట్టి, యౌవనప్రాదుర్భావదశలో వేమన్న కూడ వేశ్యాలంపటత్వానికి గురి అయినాడని చెప్పడానికి ఆయన పద్యాలలోనే సాక్ష్యాలున్నాయి. జీవన పరిణామంలోని అనుభవం వలన, పెరిగిన సంఘబాధ్యతవలన అవినీతి జనితమైన దుష్చరితాలను ప్రత్యక్షంగా చూడడం వలన విశ్శృంఖల జీవితానికి స్వస్తి చెప్పాడు. విటజీవితం సంసారులకు తగదనీ, సంఘానికది హానికరమని అనుభవంతో గుర్తించినవాడు వేమన.

ఇంటియాలి విడిచి ఇల జారకాంతల
వెంట దిరుగువాడు వెర్రివాడు
పంటచేను విడిచి పరిగె యేరినయట్లు.[41] (డి. 1721, 69)

పేదవారు వేశ్యలవలలో చిక్కి మంటలో శలభాలవలె మాడిపోతున్నారని వేమన్న చెప్పాడు.

కూటికి నెడబాసి కూర్చిన మనుజుడు
వెలదుల గనుకొన్న వెతల జిక్కి
వెలిగి యగ్ని చూచు శలభంబు చాడ్పున. (డి. 1721, 72)

వారకాంతల వలపు నిజమైనదికాదు వారి ప్రేమ ధనంమీద ఇది తెలియక వారి 'మాయ'లో పడ్డవారి కళ్ళు బలవంతంగా విప్పుతున్నాడు

వారకాంత లెల్ల వలచి యేతెంతురా
పొందుజేసి ధనము పుచ్చుకొరకు
మారకమ్మ జొచ్చి మరి యిల్లు వెళ్లునా? (డి 1721, 172)

లంజ లంజకాని లావెల్ల గొనియాడు
లంజతల్లి వాని లజ్జ గడుగు
తల్లి గలుగు లంజ తగులుట దోషంబు (డి 1726, 239)

ఒకడు కూడి విడిచిన స్త్రీని మరొకడు కలియడం అసహ్యకరమైన పని అది ఒకడు నమిలి ఉమ్మివేసిన తాంబూలాన్ని మరొకడు తినడం వంటిది

ఒకడు మున్నుగూడి ఒనరంగ విడిచిన
దాని కూడినట్టి హీనుడొకడు
తమ్ముదిన్నవాని తమ్ముదాదినట్లు (డి 1727, 447)

'గుంటలోని చెప్పు కుక్క గన్నట్లయా!' (డి 1723, 113)

వ్యభిచారం నుండి దృష్టి మరల్చడానికి వేమన్న విరక్తిని బోధించాడు ధనం, దేహాదులు అశాశ్వతమనీ, చేసిన ధర్మమే చివరకు మిగిలేది అని చెప్పాడు

41 పరిగ యేరడ మంటే చేలో కోసిన పైరును మోపులుకట్టి తీసికెళ్లిన తరువాత రాలిన వెన్నుల నేరుకోవడం పూర్ణానుభవాన్ని తీసివేసి భ్రమల వెంట పరిగెత్తడమని అర్థం

తరుణి యొరుల సొమ్ము ధనము లంజల సొమ్ము
తనువు ధరణి సొమ్ము మనసునెంచ
తాను చేయునట్టి ధర్మమే తన సొమ్ము (డి 1773-1-267)

వేశ్యాలోలత్వం నుండి జనులను నిరుత్సాహపరిచే ప్రయత్నంలో వేమన్న స్త్రీలపట్ల మోహం, అసలు ఆడదానిపట్ల ఆసక్తే పాపమన్నంతగా ఖండించాడు. ఈ వ్యభిచారనిందలో భాగంగానే స్త్రీలయెడల నిరసనకూడ కొంత వ్యక్తమైంది

కాంత మేను జూచి కళవళ పడుదురు
కడుపులోని రోత గాన లేరు
యింతరోత బతుకు యీ దేహమేలరా (డి 1773-I-491)

"వట్టి మోహమిట్లు రట్టుల జేసెరా!" (డి 1721, 24)

అయితే ఆనాటి సంఘ జీవనానికి చీడపురుగువలె దాపురించిన అవినీతిని ఖండించిన వేమన, తృతీయమైన కామ పురుషార్థాన్ని నిర్లక్ష్యం చేశాడని భావించనక్కరలేదు **'కామి గానివాడు కవిగాడు రవిగాడు'** అని ఆయన యెరిగి ఉన్నాడు కాని ఆ కామం సవ్యమార్గానుగతం కావాలని వేమన్న వాంఛించాడు

### 4. మూఢనమ్మకాల ఖండన

వేమన్న జ్ఞానమార్గాన్ని బోధించాడు అసలు సిసలైన తత్త్వమే వేమన్న గమ్యం అజ్ఞానాంధకారంలో కొట్టుమిట్టాడే సామాన్యులకు కాంతి తీరంవైపు దారి చూపించాడు ఏ శక్తులు తమను నడిపిస్తున్నాయో ఆలోచించని మనుష్యులు తొందరలోనే గానుగెద్దు జీవితానికి అలవాటు పడిపోతారు వేమన్న కాలంలో తత్త్వశూన్యమైన మతవ్యవస్థ ఎట్లా విశృంఖల విహారం చేసిందో గత ప్రకరణంలో చర్చించాను ప్రజల అజ్ఞానాన్ని గురువులు స్వార్థపూజలకు ఉపయోగించుకున్నారు నిష్కల్మషమైన విశ్వాసాలు నశించి మూఢ నమ్మకాలు చోటు చేసుకున్నాయి ఈ కారుచీకటిలో హేతువును తటిల్లతవలె ఝళిపించాడు వేమన్న అందుకే **"కారణ విమర్శన శక్తికి పట్టాభిషేకము చేసిన మహాత్ముడు"**గా వేమన్నను శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి ప్రశంసించారు [42]

వేమన్న మరణించినవారికి పిండాలు పెట్టే పద్ధతిని పరిహసించాడు

పిండములను జేసి పితరుల దలపోసి
కాకులకును బెట్టు గాడ్దెలార
పియ్యిదినెడు కాకి పితరుడెట్లాయెరా! (డి 1721, 183)

చనిపోయిన వ్యక్తి భూతలం వీడి పితృలోకాలలో ఉంటాడని హిందువుల నమ్మకం ఈ విషయంలో వేమన్న దృష్టి వేరు తల్లితండ్రులు బతికి ఉన్నప్పుడు సుఖపెట్టక, చెల్లిపోయిన తర్వాత కల్లబొల్లి కబుర్లు చెప్పేవారిని వేమన్న నమ్మలేదు

42 కవిత్వ తత్త్వ విచారము

జీవిపోక ముందె జీవవస్తువులిచ్చి
జీవి నిలుపవలయు జీవనముగ
జీవి తొలగు వెనుక జీవవస్తువు లేల? (డి 1721, 17)

అదేవిధంగా ఒక్కపొద్దులుండి దేవుడి పేరుమీద తినేవారినికూడ వేమన్న వదలి పెట్టలేదు

ఒక్క పొద్దులుండి యొగి నీళ్ళలో మున్గి
కూడు వండి వేల్పు గుడువ మనుచు
దాని నోరుగొట్టి తమరె తిందురు గదా!

కాకి, గుడ్లగూబ మొదలైన పక్షుల ఉనికి అశుభసూచకమనే వెర్రిని వేమన్న దుయ్యబట్టాడు.

కాకి పక్షులందు కడు హీనమందురు
కాకి కన్న మంచి భువిని లేదు
కాకి కన్నమొసగి కాళ్ళకు మొక్కేరు (డి 1773, 5, 2163)

గూబ యెక్కినట్టి గురము పాడుగ బెట్టి
వెళ్ళిపోదురెంత వెర్రివారు
గూబ యేమిచేసె గురయేమి చేసును? (డి 1721, 232)

కానున్నది కాకమానదు దీనికొరకు తిధి వార నక్షత్రాలు, ముహూర్తాల మీద ఆధారపడడం అజ్ఞానం ముహూర్తం ప్రకారం నడిచిన వారందరికి సత్ఫలితాలే వస్తున్నాయా అని వేమన్న ప్రశ్నించాడు

విప్రులెల్ల జేరి వెర్రి కూతలు గూసి
సతి పతులను గూర్చి సమ్మతమున,
మును ముహూర్త ముంచ ముండెట్లు మోసెరా? (డి 1723, 115)

## 5. రేపటి వెలుగులో నిన్నటి నీడలు

నిర్జీవమైన పాత విలువలకు వీడ్కోలు చెప్తూ నూతనంగా వచ్చిన పరిణామాలకు స్వాగతం పలికాడు వేమన వస్తున్నమార్పులను ప్రజలకు విప్పిచెప్పడంలో, గత విశ్వాసాల మీద సమరం ప్రకటించాడు అయన దాడికి గురికాని సంఘ వ్యవస్థలు అరుదు కాని వాటిపై విరుచుక పడడంలో మానవత్వమే ఆయన లక్ష్యం ప్రగతి దాని లక్షణం అయితే ఇంతటి ప్రగతిశీల దృక్పథం ప్రదర్శించిన వేమన్నలో కొన్ని ప్రగతి నిరోధక, మానవత్వ వ్యతిరేక భావాలు కూడ మిగిలి ఉన్నాయి అప్పటి సంఘ వ్యవస్థకు సంబంధించిన కొన్ని దుర్గుణాలు అయనను విడిచిపెట్టలేదు తర్వాత అప్పటి గ్రామ వ్యవస్థ విచ్ఛిత్తిలో అతివేగంగా మారుతున్న కుటుంబ విలువలను సంస్కర్తహృదయంతో స్వీకరించలేకపోయాడు

స్త్రీలను గూర్చి వేమన్న వెలిబుచ్చిన అభిప్రాయాలు ఉదాత్తమైనవి కావు అవి అంతవరకు హిందూ సంఘంలో ఉన్నవే మార్పు అన్ని రంగాలలో ప్రారంభమై, స్త్రీ

వద్దకు వచ్చేసరికి మాత్రం వేమన్న దానిని ప్రతిఘటించాడు దీనికి సంఘకారణాలతోపాటు వ్యక్తి బలహీనతలు కూడ తోడై ఉంటాయి.

పద్మపురాణంలో వశిష్ఠుడు దిలీపునికి చెప్పిన మంచి భార్యకు ఉండవలసిన లక్షణాలను అబే దుబాయ్ పేర్కొన్నాడు. భర్త ఎటువంటివాడైనా భార్య అతనికి అనుకూలంగా ఉండాలి (**అనుకూలవతిగాని ఆలినేలుట యేల.....**) అనేది వాటి సారాంశం.

"Be her husband deformed, aged, infirm, offensive in his manners; let him also be choleric, debauched, immoral, a drunkard, a gambler; let him frequent places of ill repute, live in open sin with other women, have no affection whatever for his home; let him rave like a lunatic; let him live without honour; let him be blind, deaf, dumb, or crippled, in a word; let his defects be what they may, a wife look upon him as her god, should lavish on him all her attention and care, paying no need whatsoever to his character and giving him no cause whatsoever for displeasure "[43]

వేమన కాలంలో భార్యల పైధోరణులలో మార్పు రావడం వేమన్న పసికట్టి ఖండించాడు వాటిని సహించనేరాదనేది వేమన్న వాదం

*ఆలి తొలుత వంచ కథముడైతా వెనుక*
*వెనుక వంతు ననుట వెర్రితనము*
*చెట్టు ముధరనిచ్చి చిదిమితే బోవునా?* (డి 1727, 190)

అర్థిక కారణాలవలన భార్యలు భర్తలను గణించరని, అది పద్ధతి కాదని వేమన్న చెప్పాడు

*కలిమినాడు మగని కాముగా చూచును*
*లేమి జిక్కునాడు లేవకుండు*
*మగువ మగనినైన మడియంగ జూచును* (డి 1721-421)
*పేదవడ్డ వెనుక పెండ్లాము గతి జూడు* (డి 1735, 394)

*పతిని విడువరాదు పదివేలకైనను*
*పెట్టి జెప్పరాదు పేదకైన*
*పతిని దిట్టరాదు సతి రూపవతియైన* (డి 1721-42)

వేమన్న స్త్రీలను గురించి చులకనగా చెప్పిన పద్యాల్లో రెండు రకాలున్నాయి 1 యోగ సాధనకు ఆటంకం కాబట్టి మోహహేతువైన స్త్రీ శరీర నిరసన చేసేవి 2 సామాజికంగా కూడ స్త్రీని చిన్నచూపు చూసేవి పై పద్యాల్లో వేమన నిర్దోషిత్వాన్ని నిరూపించడానికి ప్రయత్నించడం వలన ఫలితం లేదు అదే విధంగా వేమన్నను నారీద్వేషిగా కొట్టి పారేయడం కూడ వాస్తవిక దృష్టి కాబోదు వేమన్నను సాటిమానవుడిగా అర్థంచేసుకోక సకల సద్గుణ సంపన్నుడిగా భావించినప్పుడే చిక్కులొస్తాయి

43 Hindu manners Rules of conduct married women - Page 344

మానవత్వ సాధనలో ముఖ్యభాగంగా ఉండవలసిన 'స్త్రీ గౌరవం' వేమన్న నిర్లక్ష్యానికి గురి అయింది. వేమన్న ప్రగతిశీల వ్యక్తిత్వంలో ఇదొక వెనుకంజే అయినప్పటికీ, ఇతర రంగాలలో ఆయన ప్రదర్శించిన చైతన్యం విస్మరించరానిది. సంధియుగంలోని మనుష్యుల వ్యక్తిత్వ పరిణామ క్రమంలో ఈ పరిస్థితిని ఒక కటువైన సత్యంగా పరిగణించక తప్పదు.

## 6. ఆర్థిక భావాలు

"ధర్మార్థ కామము"లను త్రివర్గమంటారు. వీటికి పురుషార్థాలని పేరు. ఈ మూడు వర్గాలకు "మోక్షము" వచ్చి చేరి చతుర్విధ పురుషార్థాలు ఏర్పడకముందు త్రివర్గమే ప్రచారంలో ఉండేది పై క్రమంలో అర్థ పురుషార్థానికి ద్వితీయస్థానం లభించింది. ధర్మార్థకామాలు ఇహలోకానికి సంబంధించినవి. మోక్షం పరమార్థం. మోక్షాన్ని సాధించడానికి పై పురుషార్థత్రయం సాధనాలు. ద్వితీయ తృతీయ పురుషార్థాలు ప్రధమ పురుషార్థానికి లోబడి – అంటే ధర్మబద్ధంగా నడవాలని భారతీయ దార్శనికులు నిర్ణయించారు. వారిదృష్టిలో ధర్మమే ముఖ్యం. ఆధునికకాలంలో పురుషార్థాల మీద నూతన దృష్టులను ప్రసరించిన వారున్నారు. ముఖ్యంగా పాశ్చాత్య శాస్త్రవేత్తలు వీటిమధ్య కార్యకారణ సంబంధాలను గూర్చి కొత్త నిర్వచనాలు చేశారు. కార్ల్‌మార్క్స్ ఆర్థిక విధానాలే ధర్మసూత్రాలను, కామనియమాలను శాసిస్తాయని నిరూపించాడు. మనోవిజ్ఞానవేత్త సిగ్మండ్ ఫ్రాయిడ్ మానవ వ్యాపారాలన్నింటికీ కామం (Sex) ప్రధాన కారణమని ప్రతిపాదించాడు ధర్మం యుగధర్మాన్ని బట్టి మారుతుంది రాజకీయాది వ్యవస్థల మీద అర్థం ఆధారపడి ఉంటుంది పై రెండింటి ప్రభావం కామ పురుషార్థం మీద పడుతుంది

ఒక కాలంనాటి ఆర్థిక పరిస్థితులను అప్పటి రాజకీయ సాంఘికాది వ్యవస్థల సమగ్ర సన్నివేశంలోనే చూడవలసి ఉంది వేమన్న ఉన్న ఆర్థిక వ్యవస్థ కేవలం అప్పటిదే కాదు దానికి ఆధారమైన రాచరికపు పద్ధతి అతి ప్రాచీనమైనది ఆ వ్యవస్థలోని తరతమభేదాలు యుగాలనుండి ఉన్నవేకాని వేమన్న కాలానికి కేంద్రంలో రాజులూ, సుస్థిర రాజ్యపాలనలేక ఆర్థిక జీవితం సంక్షోభంలో పడిపోయింది పైగా అది యుద్ధాల కాలం ఒక యుద్ధం జరిగితేనే దాని ప్రభావం చిరకాలం దాకా ఉంటుంది. ఇక ఎడతెగకుండా యుద్ధాలు జరిగే కాలంలో ప్రజల ఆర్థిక స్థితిగతులు ఎట్లా ఉంటాయో ఊహించవలసిందే పన్నులబాధతో ప్రజలు గిలగిల లాడిపోయారు పరదేశీయుల పాలనలో వ్యాపారం ప్రవేశించి ఒక జీవన విధానానికి అలవాటు పడిన ప్రజలను మరింత పేదవాళ్ళను చేసింది సన్నకారు రైతులు వ్యవసాయ కూలీలు తిండికి కటకటలాడిపోయారు అబె దుబాయ్ వర్ణించిన కింది మూడు వర్గాల పరిస్థితి దయనీయంగా మారింది పరస్పర సహకారానికి పేరుపడిన గ్రామ వ్యవస్థ విచ్ఛిత్తి దశలో గ్రామంలో ఒకరి మీద ఒకరికి విశ్వాసం సన్నగిల్లింది. పేదవారికి ఉప్పుపుట్టని స్థితి ఏర్పడింది

ఉప్పు చింతపండు ఊరిలో నుండగా
కరువదేల వచ్చె కాపులార! (డి 1723, 110)

మానవ కల్పితమైన పై పరిస్థితులకు తోడు ప్రాకృతికమైన అనావృష్టి మరికొంత కుంగదీసింది

సంపన్నులు మరీ ధనవంతులయ్యారు. వారిలో ధార్మిక దృష్టి అదృశ్యమౌతూ వచ్చింది. పేదవారికీ, ధనవంతులకీ దూరం మరీ ఎక్కువైంది.

సాంఘిక భేదాలనే ఒప్పుకోని మానవతావాది వేమన్న ఆర్థిక అసమానతలను మాత్రం సహిస్తాడా? ధనంవలన వచ్చే దుర్గుణాలను ఖండించాడు. ధనంతోపాటు మానవతను కూడ అలవరచుకోవాలని వేమన్న ప్రబోధించాడు. దానికి ఆయన దాతృత్వాన్ని ప్రోత్సహించాడు. లేనివాడిని ఆదుకోవడం ఉన్నవాడి ధర్మం అని హెచ్చరించాడు. అయినా సంపదలకు మూలమేమిటో వేమన్నకు తెలుసు

*భూమిలోన బుట్టు భూభార మెల్లను*
*తనువులోన బుట్టు తత్త్వమెల్ల*
*శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను.* (డి. 1721 I. 314)

కాబట్టి శ్రమించే వాడికే ఫలం, కాని భవిష్యత్తరాలలో రాబోయే పరిష్కారాలను వేమన్ననుండి ఆశించడం సరికాదు.

"But unlike Shaw, Vemana could not think of a Socialist solution to poverty. From a man of the medieval age, howsoever farsighted he may be, it is a thing that cannot be expected. Unable to go to the root causes of poverty, Vemana pleads with the rich to share their riches with the poor and needy."44

కాని మానవతా దృష్టితో ధనికులు, పేదలు అనే అంతరాలు తొలగిపోవాలని కోరుకున్నాడు వేమన. ధనవంతులు, పేదవారు కలిసి వియ్యమంది సమానతను సాధించమంటాడు ఒకచోట.

*కలుగువాడు లేమివాని కిచ్చుమనువు*
*కలిమిలేములు నటు గలసి యుండు*
*యేటి కలిమి జూడ లెక్కడి లేమిరా?* (డి. 1727, 560)

కండ్ల యెదుట కనిపించే పేదరికం ఎంతటి భయంకరమైనదో వేమన్నకు తెలుసు పేదవారికి వారి దారిద్ర్యం మెల్లగా పనిచేసే విషం వంటిది పేదరికాన్ని గూర్చి తెలుసుకోవడం అంటే మానవజాతిలోని అధిక సంఖ్యాకుల దుస్థితిని గూర్చి తెలుసుకోవడమే పేదరికం వల్ల సంక్రమించే అనేక దుర్గుణాలను వేమన్న ఖండించాడు నరకప్రాయమైన లేమి ఇహలోక సౌఖ్యాలన్నింటిని కాల్చేస్తుంది మనిషి శీలానికి చీడ పుట్టిస్తుంది నాలుకమీది సత్యవాక్కుల నెవరో దోచుకుపోతారు మనిషి ఆత్మగౌరవపు ఆకాశాలనుండి బానిసత్వపు పాతాళంలోనికి కూలిపోతాడు.

*పసిడి గల్గు వాని బానిసె కొడుకులు* (డి 1721 I–233)

*ధనములేమి యనెడు దావానలంబది*
*తన్ను జెరుచు దాపువాని జెరచు*
*ధనములేమి జూడ దలపనే పాపంబు* (డి. 1721, I 621)

---

44 Vemana - V R Nari, Pages 57,58

ధనములేమి సతులు తప్పాల బెడుదురు
ధనములేమి పత్ని దాకబోదు
ధనములేమెవరికి తాళికై యుండదు. (డి 1721, I 105)

ధనములేమినున్న ధైర్యము చెడిపోవు
ధనములేని నలుడు తావు దప్పి
చీరె పక్షికిచ్చి చిక్కొంది పోవడా! (డి. 1773-III-1386)
విత్తహీనుడెంత రిత్తయై పోవును! (డి. 1721, 26)
'గోచిపాతకంటె కొంచెంబు మరిలేదు' (డి. 1727, 280)
ఎక్కడి వారైనా పేదవారంతా ఒక్కటే అని వేమన్న గుర్తించాడు.

కనులు పోయినవాడు కాళ్ళు పోయినవాడు
ఉభయులరయ గూడి యుండినట్లు
పేద పేద గూడి పెనగొని యుండును (డి 1721, 127)

ఇక ధనవంతులకు ప్రత్యేకమైన ప్రబోధం చేశాడు వేమన్న. ప్రపంచంలో సాంఘిక మూల్యమే కాని అధ్యాత్మిక దృష్టిలో ధనానికి విలువ లేదు. ధనాంధకారంలో మానవత్వపు విలువలు మాటుపడి పోవడంతో, ధనికుల దృక్పథాన్ని సరిదిద్దే ప్రయత్నం చేశాడు వేమన్న ధనవంతులను ప్రభావితం చేసే శక్తి అధ్యాత్మికములైన విలువలకు ఉన్నదని నమ్మి ఆ మార్గంలో కొంత ప్రయత్నం చేశాడు మొదట అయన బతుకుయొక్క క్షణికత్వాన్ని, సంపదల అస్థిరత్వాన్ని తెలిపి, తద్వారా వారికి విరక్తిని బోధించాడు.

ఏమిగొంచు వచ్చె నేమి దా గొనిపోవు
పుట్టువేళ నరుడు గిట్టువేళ
ధనము లెచటికేగు దానేగు నెచటికి? (డి 1721, I 64)

బొంది యెవరి సొమ్ము పోషింప పలుమారు
ప్రాణమెవరి సొమ్ము భక్తి సేయ
ధనము యెవరి సొమ్ము ధర్మమే తన సొమ్ము (డి 1721, II 53)
కలిమి బలిమి రెండు తెలివికి హానిరా! (డి 1773-III-1281)

కాబట్టి 'కుడవకెల్ల ధనము కూడబెట్టుట' (డి 1721, I 46) వేమన్న ప్రకారం అజ్ఞానమే కాగలదు.

ఆకలన్నవాడికి అన్నం పెట్టనివాడు ధన్యుడు కాలేదు మనవారు పది దానాలను గూర్చి చెప్పారు

'గో, భూ, తిల, హిరణ్యా, జ్య,
వాసో, ధాన్య, గుడానిచ
రౌప్యం, లవణ మిత్యాహు
ర్దశ దానా నను క్రమాత్'

1 గోవు 2 భూమి 3 నువ్వులు 4 బంగారం 5 నేయి 6 వస్త్రాలు 7 ధాన్యం 8 బెల్లం 9 వెండి 10 ఉప్పు – ఈ దానాలు కాలక్రమాన 18 దాకా పెరిగాయి వీటిలో అన్నదానం లేదు వేమన్న అన్ని దానాలకన్న అన్నదానమే గొప్ప అంటున్నాడు

ఇంచుకంత బోన మీశ్వరార్పణమన్న
పుణ్యలోకమునకు బోవు నతడు
అన్నదానమునకు నధిక దానము లేదు (డి 1721-48)

అయితే ఈ దానంకూడ పాత్రునికే ఇవ్వాలి. అటువంటి దానాన్నే సాత్విక దానమంటారు.

అన్న మరుగ నతని కన్నంబు పెట్టిన
పారవేయు దాని ఫలితమేమి
ధనికునకు నొసంగు దానంబు లారీతి.45

పేదరికంతో బాధపడుతున్నా ధర్మమార్గాన్ని విడువరాదని వేమన్న భావం. అప్పుచేయడం కూడ 'తప్పు'గానే ప్రచారం చేశాడు.

పరుల మోసపుచ్చి పరధన మార్జించి
కడుపు నించుకొనుట కానిపద్దు
ఋణము సేయు మనుజు డెక్కువ కెక్కునా? (డి 1721-152)

అప్పుల వలన వేమనకాలంలో ప్రజలెట్లా బాధలు పడేవారో గత ప్రకరణంలో చర్చించాను

'కలిమి లేమి లేని కాలంబు కలుగునా?' (డి 1727, 38)

అని ఊరట కలిగించ ప్రయత్నించాడు వేమన్న

ధనంమీద వేమన్నకు కోపం లేదు ధనానికి గల శక్తి అతనికి తెలుసు కాని వినియోగమే సద్ధర్మమార్గంలో సాగాలని ఆయన కోరుకున్నాడు తాను తినకా, ఇతరులకు పెట్టకా, ధనం దాచిపెట్టేవాడిని, తేనెకూర్చి ఇతరులకిచ్చే తేనెటీగతో పోల్చాడు

ధనం గూడబెట్టి ధర్మంబు సేయక
తాను దినక లెస్స దాచుగాక
తేనెటీగ గూర్చి తెరవరి కియ్యదా? (డి 1721-124)

భూమి నాది యన్న భూమి పక్కున నవ్వు
దానహీను జూచి ధనము నవ్వు (డి 1721-75)

అయితే ధనాన్ని నలుగురికి పంచగలిగే దాతృత్వమే ఉంటే ఆ ధనం ఒక్కడి దగ్గరే ఎందుకు మూలుగుతుంది? ఎదుటివాడి కష్టసుఖాలను విచారించగలిగే మానవత్వమే ఉంటే వాడు అపమార్గాలలో ఎందుకు సంపాదిస్తాడు? ఈ ధనవంతులలోని లోభులు 'మేకచన్నుల' వంటివారని త్వరలోనే తెలుసుకున్నాడు వేమన

'లోభివాని నడుగ లాభంబు లేదయా' (డి 1723, 298) అనే నిర్ణయానికి వచ్చాడు వెంటనే వేమన్నలో సహజంగా ఉన్న ఉద్రేక ప్రకృతి మేలుకుంది లోభులను

---

45 దాతవ్యమితి యద్దానం
దీయతేఽనుపకారిణే ।
దేశే కాలేచ పాత్రేచ
తద్దానం సాత్వికం విదు ॥ (భగవద్గీత 17వ అధ్యాయం, శ్లోకం-20)

బండగోవులతో (డి. 1723, 296), గొడ్డుటావులతో (డి. 1721–II–302) పోల్చి తిట్టాడు, 'కరిన బుద్ధు'ల (డి. 1726. 47) వద్దనున్న ధనాన్ని కోరడం, 'కొండకింద పసిడి కోరినచందమే' (డి 1711–302) నన్నాడు నూటికో కోటికో ఒక దాత ఉంటే లోభివాడి ప్రభావంతో వాడుకూడ బిగిసిపోతున్నాడు

ఇచ్చువాని యొద్ద నీని వాడుండెనా
చచ్చుగాని యీవి సాగనీడు
కల్పతరువు క్రింద గచ్చ చెట్టున్నట్లు (డి 1721, 7)

లోభులను నిందిస్తూ రత్నాలవంటి పద్యాలు అనేకం చెప్పాడు ఉదాహరించకుండ దేనిని వదిలివేసినా బాధగానే ఉంటుంది. స్థలభీతి చేత రెండు ఉదాహరిస్తున్నాను:

దాతలేని కొంప దయ్యాల పెనువాడ
నీతిగాని మాట రాతివేటు
ప్రీతిలేని లంజ ఘాతియై తోచురా! (డి. 1773–I–259)

కుక్క గోవు కాదు కుందేలు పులి కాదు
దోమ గజము గాదు దొడ్డదైన
లోభి దాతగాడు లోకంబులోపల (డి 1721 203)

కలిమి గలనేమి కరుణ లేకుండెనా
కలిమి యేల నిల్చు కర్ములకును? (డి 1726, 207)

లోభివాడి నడుగుతూ వెంటబడేవాడు –
'తగరు వెంట తగిలిన నక్క' వంటివాడు (డి 1723, 299)

లోభిని వేడడం వ్యర్థమని దీనులకు ఎరుక చెప్పాడు 'ఎద్దు చంట పాలు ఏమైన చేపునా?' అని చమత్కరించాడు. చివరగా దానగుణంలేక అబద్ధాలతో వెళ్ళబుచ్చు సంపన్నుని ఇంట్లో లక్ష్మి ఎల్లకాలం నిలవదని వేమన్న శపించాడు

అరయ తరచు కల్లలాడెడు వారిండ్ల
వెడల కేల లక్ష్మి [illegible]ంచు
ఓటికుండ నీరు పోసిన చందాన (డి 1721, 67)

* * *

# వేమన్న కవిత్వం

## I. అనాదరణం

అభిరుచులను బట్టి లోకంలో ఒక కవిపట్ల అభిమానమో, వైముఖ్యమో ఏర్పడడం సహజం. అభిమాన కవులను అతిశయోక్తులతో భూషించడం, ఇతర కవులను మినహాయింపులతో ఒప్పుకోవడం, నచ్చని వారిని పెదవి విరిచి నిరాకరించడం ఇవన్నీ సాధారణంగా జరిగే పనులు కాని ఒక కవిని పట్టుబట్టి అనాదరణకు గురిచేయడం, గుణాలనుసైతం లక్ష్యపెట్టని వ్యతిరేకతను ప్రదర్శించడం వంటి చర్యలు మాత్రం అసాధారణమైనవని ఒప్పుకోక తప్పదు అభిరుచులను ఎవరూ ప్రశ్నించలేరు కాని 'వ్యతిరేకతకు మాత్రం' ప్రత్యేక కారణాలు ఉంటేనే తప్ప అది న్యాయం అనిపించుకోదు

వేమన్న పట్ల తలలెత్తిన ప్రతికూల ధోరణులు గత శతాబ్దంలోనే మొదలైనవి కావు నాటి సంఘవ్యవస్థల పైన వేమన్న చేసిన దాడివలన, ఆయన మాటలలోని పెలుసుదనం వలన తన జీవిత కాలంలోనే తీవ్రమైన ప్రతిఘటనలను ఎదుర్కొని ఉండవచ్చుననడానికి ఆయన పద్యాలనేకం సాక్ష్యం పలుకుతాయి అసలు ఆయన కవిత్వంలో దాదాపు సగభాగం ఆయనపై గానీ, బలహీనులపై గానీ జరిగిన అత్యాచారాలకు ప్రతిస్పందనగానే వెలువడినట్టుగా పరిశీలన వల్ల చెప్పడానికి అవకాశం కలుగుతుంది కాబట్టి వేమన్నపట్ల ఏర్పడిన అనాదరణ నిన్న మొన్నటిది కాదు, ఆయన పద్యాలు చెప్పడం ప్రారంభించినప్పటి నుంచీ ఉన్నది

కాని నేనిక్కడ ప్రస్తావించేది పండితమండలి ఆయన పట్ల ప్రవర్తించిన విధానం మాత్రమే అయితే ఈ సందర్భంగా వారి దోషాలను నిరూపించడమే నా ధ్యేయం కాదు శిష్టసాహితీ ప్రపంచంలో వేమన్నకు గౌరవస్థానం లభించడంలో జరిగిన జాప్యానికి కారణాలను వెతకడం, ప్రతికక్షుల అభిప్రాయాల ఆధారంగా వేమన్న వేదాంతాన్ని గూర్చి, కవిత్వాన్నిగూర్చి మరింత స్పష్టంగా చెప్పుకోవడానికి వీలు కలిగించడం ఇక్కడ నా దృష్టి

వేమన్నపట్ల వ్యక్తమైన ప్రతికూలతను గూర్చి చెప్పే ఆకరాలు రెండు రకాలుగా ఉన్నాయి 1 పాశ్చాత్యుల వ్రాతలు, 2 దేశీయుల నిర్లక్ష్య వైఖరి

## I. పాశ్చాత్యుల వ్రాతలు

వేమన్నను గూర్చి మొట్టమొదటిసారి పేర్కొన్నవాడు అబే దుబాయ్ అని చెప్పబడింది తనకు తెలిసినంతవరకు హిందూమతాన్నీ హిందువుల ఆచారాలనూ విమర్శిస్తూ వేదాంతపరంగా వెలువడిన గ్రంథాలేవీ బ్రాహ్మణులు రచించినవికావని దుబాయ్ వ్రాశాడు పై పద్ధతిలో వ్రాసిన కవులందరు బ్రాహ్మణేతరులే అని చెప్తూ ఉదాహరణగా పెరియ (Periah) కులానికి చెందిన తిరువళ్ళువరును, వెల్లాల (Vellala) కులానికి చెందిన పట్టనట్టు పిళ్ళే, అగస్త్యులను, లింగాయతుడైన సర్వజ్ఞమూర్తిని, కాపు కులస్థుడైన వేమన్నను

చూపించాడు బ్రాహ్మణేతర కవుల రచనల పట్ల బ్రాహ్మణులకు సద్భావం లేదని దుబాయ్ తన అనుభవాన్ని వ్రాశాడు

"Now a days they rage against the authors we have mentioned and speak of their works with contempt They cannot of course, succeed in destroying them, but they do everything in their power to prevent the reading of them "[1]

1816లో దుబాయ్ వెలిబుచ్చిన పై అభిప్రాయాన్ని, 1887లో దుబాయ్ ఫ్రెంచిభాషలో వ్రాసిన గ్రంథాన్ని ఇంగ్లీషులోనికి అనువదించిన హెన్రీ బ్యూకాంప్, పాదపీఠికలో కొంత సవరించాడు

"The last sentences of the Abbe's note are misleading, for these authors are held in great respect and are much read by educated Brahmins These latter must be distinguished from the purely priestly class of Brahmins, whose interest it may be to dissuade people from studying these works "[2]

కేవలం **పురోహిత** వర్గానికేకాని బ్రాహ్మణేతర కవులపట్ల బ్రాహ్మణులందరికీ అసహన భావం లేదనీ, విద్యావంతులు, సంస్కారులు అయిన బ్రాహ్మణులు పై కవులను మిక్కిలి గౌరవిస్తారని బ్యూకాంప్ వ్రాశాడు

బ్రౌన్ 1829లో వేమనపద్యాల ప్రథమముద్రణాన్ని సెంట్ జార్జి కాలేజీవారి ద్వారా ప్రకటించాడు బ్రాహ్మణులను పరిహసిస్తూ పద్యాలు చెప్పిన వేమన్నను బ్రౌన్ భుజాన వేసుకోవడాన్ని అక్కడి బ్రాహ్మణ పండితులు హర్షించలేదు దాని ప్రభావం వేమన పద్యాల ముద్రణప్రతుల మీద కూడా పడింది

"In 1829 I had printed Vemana, as this author satirized Brahmins they dislike or scorn his volume and at their desire the College Board sheleved it and it was forgotten about 50 copies were given to me, and 450 disappeared After ten years, I discovered these rolled up as waste paper in the library "[3] (1866)

450 కాపీలు చెత్తలో కలిసిపోగా 50 కాపీలు మాత్రమే బ్రౌన్ దగ్గర మిగిలాయి వాటిలో నుండి అనేకులకు కాంప్లిమెంటరీ కాపీలు ఇచ్చాడు బ్రౌన్ బ్రౌన్ ఇండియాను విడిచి స్వదేశానికి వెళ్ళేనాటికి ఒక కాపీ మిగిలిందనుకోవాలి లండన్‌లోని బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో ప్రస్తుతం లభిస్తున్న కాపీ, బ్రౌన్ ఆ లైబ్రరీకి వీలునామాగా వ్రాసి ఇచ్చిన తన స్వంత గ్రంథాలయంలోనిదే

కాని బ్రౌన్ నిరుత్సాహపడక 1812 దాకా వేమన పద్యాల మీద కృషి చేస్తూనే ఉన్నాడు వేమన పద్యాలే కాక అసంఖ్యాకమైన కావ్యప్రతులను సేకరించి పరిష్కరించి ప్రకటించాడు కాని వేమన్న పట్ల అయన శ్రద్ధకు, జంగముల మీద ఆయన వ్రాసిన

---

1 Hindu manners P No 274

2 Hindu manners P No 275

3 Vemana through Western eyes

వ్యాసాలకు ఫలితంగానే ఆనాటి బ్రాహ్మణ పండితులు కినుక వహించారని బ్రౌన్ వాపోయాడు

"For the last thirty years I never mixed with the Hindu society, feasts or celebrations and except those who worked with me I had few Hindu acquaintances I was rarely visited by natives and was considered a deliberate enemy to popular creed My publishing Vemana's diatribes against Brahmins and my cherishing Jangam literature Which they shun, proved my antipathy to the Hindu idolatry"4 (1866)

దుబాయ్ వ్రాసిన గ్రంధాన్ని పరిష్కరించిన డాక్టర్ పోప్ తన అభిప్రాయాలను వెలిబుచ్చాడు వాటి సారాంశ మీకింది విధంగా ఉంది

**తెలుగు ప్రజానీకంలో వేమన పద్యాలకున్న పలుకుబడి అపారమైనది. కాని ఈ ప్రసిద్ధి శూద్రులకే పరిమితం. వారిలో కూడ హిందూమతం పట్ల గౌరవ ప్రపత్తులు కలవారికి వేమన్న పట్ల ఉన్నది చిన్నచూపే. వేమన పద్యాలను ప్రభుత్వ పాఠశాలల్లోని పాఠ్యపుస్తకాల్లో చేర్చినప్పుడు ఈ వ్యతిరేకత మరీ కొట్టొచ్చినట్లు కనిపించింది. అధ్యాపకులు, విద్యార్థులూ కూడ గవర్నమెంటు ఆర్డర్‌ను తప్పించుకోవడానికి చేయవలసినదంతా చేశాడు. అనేక పర్యాయాలు, అనేక కారణాల మీద ఈ 'చేర్పు' వాయిదా వేయబడింది. చేర్చిన తర్వాత కూడ, మతంమీద దుర్బుద్ధితో కూడిన విమర్శలు ఈ పద్యాల్లో చేయబడ్డాయనే నెపంతో అధ్యాపకులు కొన్ని పద్యాలను స్వచ్ఛందంగా వదిలివేసేవారు. వేమన పద్యాలను అసహ్యించుకోవడానికి కొందరు బ్రాహ్మణులు వాటిలోని గ్రామ్యధోరణిని, అశ్లీలత్వాన్ని కారణంగా చూపేవారు.**

" Bramins in particular most cordially detest this author and in support of their view often point with triumphant scorn to the vulgarity of his style and the libertine character of his matter"5

మ్యాక్‌డొనాల్డ్ కాలంలో (1839) వేమన పద్యాల వివాదమూ, మరికొన్ని ఫిర్యాదులూ ప్రభుత్వం దృష్టికి వచ్చాయి మ్యాక్‌డొనాల్డ్ అధ్యక్షతన "Committee for the revision of English, Telugu and Tamil school books in the Madras Presidency"ని ఏర్పాటుచేశారు ఆ కమిటీ తెలుగు ప్రాంతంలో స్కూళ్ళ ఇనస్పెక్టరుగా పనిచేస్తున్న హెన్రీ బోవర్స్‌ను తెలుగు పాఠ్యపుస్తకాల పైన నివేదికను సమర్పించవలసిందిగా ఆదేశించింది నివేదికలో, వేమన పద్యాలను పాఠ్యగ్రంథాల నుండి తొలగించాలని బోవర్స్ సిఫారసు చేశాడు ఈ సందర్భంగా బోవర్స్ చేసిన కొన్ని వ్యాఖ్యలు గమనార్హంగా ఉన్నాయి వేమన పద్యాలను చేర్చుకోడానికి బోవర్స్ రెండు అభ్యంతరాలు లేవనెత్తాడు

1 "This language and style are devoid of any poetical merit and on that score, the book is too easy for the third class"

---

4 C P Brown Vemana through Western eyes

5 డాక్టర్ పోప్ అభిప్రాయాన్ని 'నార్ల' ఎడిట్ చేసిన పుస్తకంలో మ్యాక్‌డొనాల్డ్ ఇచ్చిన ఉటంకింపునుండి తీసుకున్నాను

2 " .but the chief practice and doctrine and on the difficulty which teachers find in explaining the abstruser truths embodied in some of the stanzas "[6]

అంతేకాక మద్రాసు యూనివర్సిటీకి చెందిన ఒక ప్రధానాధ్యాపకుడు బోవర్స్‌కు ఒక సూచన చేశాడు ఇదివరకు వేమన పద్యాలు మిషనరీల కోరిక మీద చేర్చబడ్డాయని, హిందువుల అభీష్టానికి విరుద్ధమైనచర్యలు, హిందువుల పిల్లలను క్రైస్తవమతంలోనికి మార్చేప్రయత్నాలు జరుగుతున్నాయనే వ్యాఖ్యానాలకు దారితీస్తాయని ఆ సూచన సారాంశం ఆ కాలంలో 80 శాతం (4/5) అధ్యాపకులు బ్రాహ్మణులే కాబట్టి వారి వ్యతిరేకతను తాను అర్థం చేసుకోగలనని బోవర్స్ వ్రాశాడు కాబట్టి వేమన్న బోధనల్లో అధికభాగంతో తాను ఏకీభవించినప్పటికీ వాటి **'తొలగింపు'**కు సిఫారసు చేయడం తప్ప గత్యంతరం లేదని బోవర్స్ వ్రాశాడు[7] అనేక వేమనపద్యాలు పిల్లల స్థాయికి పొసగవనికూడ బోవర్స్ అభిప్రాయపడ్డాడు

"There is also other matter which is not suited to young boys Many of the verses are too philosophical and some are obscure and almost mystical." వేమన్నను తన కాలంకన్న చాలాముందున్న సంస్కర్తగా (Far in Advance of his age)గా బోవర్స్ గుర్తించాడు[8] 1890లో వేమన వేదాంతాన్ని గూర్చి లోతుగా చర్చించిన క్యాంబెల్ బ్రాహ్మణులు వ్యతిరేకించినప్పటికీ తెలుగు భాష వ్యాపించి ఉన్నంత దూరం వేమన కీర్తి విస్తరించిందని వ్రాశాడు

"Wherever the Telugu language is spoken Vemana is known and honoured and although the Brahmans have always been bitterly opposed to his teaching and still speak contemptuously of his writings, the common people idolize him and hold his name in such reverence that a reference to one of his verses is considered quite sufficient to settle any question at issue "[9] (1890)

పాశ్చాత్యుల పై ఉటంకింపులోని అంశాలను పరామర్శించవలె. ఉన్నది దుబాయ్ పేర్కొన్నట్లు వేమన్న బ్రాహ్మణేతరకవి అయిన కారణం వల్లనే బ్రాహ్మణుల అసహనానికి గురి అయినాడని చెప్పడం పూర్తిగా పొసగదు సంస్కారవంతులైన బ్రాహ్మణులు వీరిని గౌరవభావంతో చూసేవారని బ్యూకాంప్ దుబాయ్ మాటలను ఖండించాడు వసుచరిత్ర రచించిన రామరాజభూషణుని ప్రశంసించని బ్రాహ్మణపండితులు మచ్చుకైన కనిపించరు కాని వేమన్నను బ్రాహ్మణులు వ్యతిరేకించారని పాశ్చాత్యులు ఐక్యకంఠంతో పలికారు ఇక్కడ వారి చిత్తశుద్ధిని గాని, నిష్పక్షపాత వైఖరిని గాని సందేహించవలసిన అవసరం లేదు వేమన్నపట్ల అప్పటి బ్రాహ్మణవ్యతిరేకత నిజమే దీనికి ప్రధాన కారణం వేమన్న హిందూమతాన్నీ, బ్రాహ్మణులనూ విమర్శించాడనేది కాని ఇక్కడ

---

6 Vemana through Western eyes

7 "My own opinion is in favour of its discontinuance, much as I approve of a good part of Vemana's teaching"

8 Vemana through Western eyes (1984)

9 Vemana through western eyes

ఒక విషయం స్పష్టంగా తెలుసుకోవాలి వేమన్న అధిక్షేపం పూర్తిగా ఏ ఒక్క వర్గానికో పరిమితమైంది కాదు ఆయన నోటివాదరకు ఎరకాని వ్యవస్థలు అప్పట్లో అరుదు తిట్టడంలో ఆయనకు స్వపర భేదం లేదు అప్పటి దంభ జీవితం మీద ఆయన విసిరిన రాళ్ళు దానితో సంబంధమున్న వారందరికీ తగిలాయి కాబట్టి తలలు బొప్పికట్టిన వారందరు ఆత్మ విమర్శ చేసుకోవడం ఉచితం వేమన్న ఏ లోపాలనైతే ఎత్తి చూపాడో అటువంటి లోపభూయిష్టులే వేమన్నను నిరసించారు భ్రష్టులైన బ్రాహ్మణులే వేమన్నను వ్యతిరేకించారు కాని ఈ వ్యతిరేక గుణాన్ని బ్రాహ్మణులందరికీ ఆపాదించడం తొందరపాటే కాగలదు ఇక పాఠ్యగ్రంథాల నుండి వేమన్న పద్యాలను తొలగించే విషయంలో హెన్రీ బోవర్స్ నిర్వహించిన పాత్రలో యుక్తి ఉన్నంతగా స్వారస్యం లేదు బోవర్స్ నివేదికలో వెలిబుచ్చిన అభిప్రాయాలను అతని ఛాందసభావాలు, బ్రాహ్మణులను నొప్పించరాదనే ప్రభుత్వ విధానం ప్రభావితం చేశాయి నూటికి ఎనభైమంది బ్రాహ్మణ అధ్యాపకులు ఉన్నారన్న స్పృహకాని వారందరి అభిప్రాయాలను తెలుసుకొని ఒక నిర్ణయానికి వచ్చినట్టు నివేదికలో తెలుపలేదు కొంతమంది పాక్షికబుద్ధుల ఒత్తిడికి బోవర్స్ లొంగిపోయి, ఆ తప్పును బ్రాహ్మణులందరి మీదికి నెట్టుతున్నాడు

ఇక బ్రౌన్ 1829 ముద్రణం తాలూకు 450 ప్రతులు చెత్తపాలు కావడానికి కాలేజీ పండితులే కారణమైతే అది వారికి వన్నె తెచ్చేపని కాదు ఇది కూడ సర్వబ్రాహ్మణ జనీనం కాదని నా అనుమానం పాండిత్య ప్రకర్షతో కళ్ళు మూసుకుపోయి, కరడు గట్టిన భావాలు గలవారు చేసిన పని యిది ఇక్కడ ఒక సంగతిని మనం విస్మరించరాదు వేమన పద్యాల పరిష్కరణలో బ్రౌన్‌కు కుడిభుజంగా నిలిచిన తిప్పాభొట్ల వేంకటశివశాస్త్రులు, అద్వైత బ్రహ్మయ్యశాస్త్రి బ్రాహ్మణ పండితులే వారి సహృదయత, నిరంతర పరిశ్రమ లేనట్లయితే బ్రౌన్ ఉద్యమం నిరాఘాటంగా సాగివుండేది కాదేమో! కేవలం బ్రౌన్ చెల్లించే డబ్బుకు ఆశపడ్డవారిగానే వారిని పరిగణించలేము

ఇక వేమన్న మీది నిరాదరణకి రెండవ కారణ సారాంశ మీవిధంగా ఉంది **వేమన పద్యాల్లో కవితాగుణం లేదు. గ్రామ్య శైలి, అశ్లీలత్వం, మూడవ తరగతి స్థాయికన్నా సులభంగా ఉన్నాయి. మార్మిక పద్యాలు అర్థం కావు.** వేమన్న కవిత్వం, శైలిని గూర్చి తర్వాత చర్చిస్తాను అశ్లీల పద్యాలు పిల్లలకు నేర్పించడం మంచిదికాదు గాని, వేమన్న వ్రాసినవన్నీ అశ్లీల పద్యాలే కావు అవి చాలా అరుదు శీలప్రతిపాదకాలైన అంశాలకు వేమన పద్యాలు గొడ్డుపోలేదు ఇక భాష సులభంగా ఉన్నంతమాత్రాన మూడవ తరగతి స్థాయికి తగిన జ్ఞానం అందులో ఉండదనుకోవడం భ్రమ ఇది కవితాగుణం తెలిసినవాడన్న మాట కాదు కాఠిన్యమే కవిత్వమనుకున్న పండితబుద్ధుల అభిప్రాయమిది కాఠిన్యానికి, భాషా జటిల్యానికి అలవాటుపడిన శుష్క పండితుల అభిప్రాయాన్నే ఇది ప్రతిబింబిస్తున్నది వేలకొలదిగా లభిస్తున్న వేమన పద్యాల్లో మార్మిక పద్యాల సంఖ్య అత్యల్పం అవికూడ గంభీరమైన వేదాంత విషయాల సందర్భంలోనే వస్తాయి

## 2. దేశీయుల నిర్లక్ష్య వైఖరి

దేశీయ కవులెవ్వరూ వేమనను తమ పీఠికల్లో పేర్కొనలేదు

మెకంజీకి కైఫీయత్తులు సేకరించడంలో తోడ్పడిన, కావలిసోదరుల్లో ఒకడైన కావలి

వెంకటరామస్వామి 1829లో ఇంగ్లీషులో 'దక్కనుకవుల చరిత్ర' వ్రాశాడు. దక్కనులోని సంస్కృత, తెలుగు, తమిళ, మహారాష్ట్ర కవులుకలిసి మొత్తం 108 మంది రేఖామాత్ర జీవితచరిత్రలు వ్రాశాడు[10] వారిలో 47 మంది తెలుగు కవులు. వీరిలో వేమన్న లేకపోవడం ఆశ్చర్యం కలిగిస్తుంది 16, 17వ శతాబ్దాలలో రాయలసీమలో జీవించిన కవులను, మహారాష్ట్రలోని కవులను (రామదాస స్వామి, తుక్కాబా, నామదేవ్, శ్రీధరస్వామి) గూర్చి, తమిళుల ఆరాధ్యకవి తిరువళ్ళువరును గూర్చి వ్రాసి (తెలుగువారి ప్రసిద్ధకవిని వదిలి వేయడం వింతలలోకెల్ల వింత) రామస్వామి వేమన్న పేరే వినలేదంటే నమ్మలేము అయన దృష్టిలో వేమన్న కవి కాడా అనేది కూడా చెప్పలేము. ఎందుకంటే, ఎందరో అతి సాధారణులయినవారిని కవులుగా ఆయన చేర్చుకున్నాడు బ్రౌన్, వేమన పద్యాలను తొలిసారి ముద్రించిన సంవత్సరంలోనే 'దక్కను కవుల చరిత్ర'ను ప్రకటించిన రామస్వామి వేమన్నను వదలివేయడం తీవ్రమైన లోపం ఈ విషయం పట్ల మ్యాక్‌డోనాల్డ్ కూడ ఆశ్చర్యం ప్రకటించాడు.[11] 1847లోని రెండవ ముద్రణంలో కూడ వేమన్నను చేర్చలేదు.

1899లో వీరేశలింగం పంతులు వెలువరించిన 'కవుల చరిత్రము'లో కూడ వేమన్నకు స్థానం దొరకలేదంటే ఆశ్చర్యంతోపాటు ఆశాభంగం కూడ కలుగుతుంది సంస్కరణకే జీవితాన్ని అంకితం చేసిన పంతులుగారు సంస్కరణ భావాలున్న వేమన్నను విస్మరించడానికి కారణం అనూహ్యం 1917 నాటి ద్వితీయ ముద్రణంలో కూడ ఇదే పరిస్థితి అయితే వేమన పద్యాలంటే పంతులుగారికి 'వెగటు' అని దీనివల్ల ఒక నిర్ణయానికి రావడం కుదరదు 1926లో స్కూలు పిల్లల కోసం ఆయనే వ్రాసిన 'మాక్మిలన్ కథా వాచకముల' వరుసలో ఏడవ తరగతి పుస్తకంలో ఆయన 46 వేమన పద్యాలను చేర్చాడు (ఒకటి రెండు తప్ప మిగిలినవన్నీ వేమన్న ప్రసిద్ధపద్యాలు కావనేది వేరే సంగతి)[12]

బ్రౌన్ తర్వాత 1914 దాకా వేమన్నను ఎవరూ పట్టించుకోలేదు దాదాపు ఒక శతాబ్దం పాటు "ఇందరు తిండికి దండగ తెలుగువారు ఉండి" కూడ వేమన్న అజ్ఞాతవాసం చేశాడు ఈ పరిస్థితిని శ్రీ నార్ల ఒక "మూగ కుట్ర"గా వర్ణించారు

"It was an amazing conspiracy of silence for which it would be difficult to find a parallel in any part of world"[13]

"బ్రాహ్మణేతరులైనా వేమనకు గౌరవము కలిగించే ప్రయత్నం చెయ్యాలనే వంగోలు వెకట సుబ్బయ్యగారి సూచన ఆరోగ్యకరమైనది కాదు వేమన్న అందరి కవి ఆయనను

10 Kavali Venkata Ramaswami's Biographical Sketches of The Dekkan Poets (First Published in 1829)

Edited with into and Notes C V Ramachandra Rao M A Ph D Nellore, 1975

11 వేరువేరు కాలాల్లో (1829, 1847) ఒకే గ్రంథాన్ని ఇద్దరికి అంకితం చేసిన గడుసుతనం రామస్వామిది (Lord Bentinck, Sir Erskine Perry) ఇతని ఈ కర్తృత్వం గురించి కూడ అనుమానాలు వెలువడ్డం నేను విన్నాను ఇతన్ని సీరియస్‌గా తీసుకోవడం అనవసరం అనిపిస్తున్నది

12 మాక్మిలన్ కథావాచకములు, ఏడవ కథావాచక పుస్తకము, మాక్మిలన్ అండ్ కంపనీ లిమిటెడ్, మద్రాసు, బొంబాయి, కలకత్తా

13 Introduction, P No 3, Vemana through Western eyes

ఏదో వర్ణానికి ముడివేసే ప్రయత్నం సంకుచితత్వాన్నే సూచిస్తుంది. వేమన పద్యాలు చదివి నేర్చుకోవలసింది **'కవులలో కూడా కులవిభజన'** చేసే ఘనకార్యం కాదు."[14]

ఆధునిక కాలంలో కొమఱ్ఱాజు లక్ష్మణరావు, కట్టమంచి రామలింగారెడ్డి వేమన్న మీదికి తెలుగుజాతిదృష్టిని మరల్చడంలో కృతకృత్యులయ్యారు వంగూరి సుబ్బారావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, బండారు తమ్మయ్య, శేషాద్రి రమణ కవులు మొదలైనవారి కృషి వలన వేమన్న మీది పరిశోధనకు దారులు పడ్డాయి రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు ఆ పరిశోధనామార్గంలో అపూర్వమైన ఫలితాలను సాధించారు దాదాపు 54 సంవత్సరాలుగా వేమన్న జీవిత కవిత్వాలను గూర్చి విపులమైన చర్చలు జరిగాయి సాహిత్యవేత్తలు ఆయా సందర్భాలలో వేమన కవిత్వాన్ని గూర్చి ప్రస్తావించడం, పద్యాలను ఉటంకించడం మొదలుపెట్టారు విమర్శకులే కాక కవులు కూడ వేమన్న ప్రతిభను తమ పద్యాలలో నోరారా కీర్తించారు **'వేమన యోగీంద్రుడు'** అనే పేరుతో శ్రీ గుఱ్ఱం జాషువా ఒకే ప్రాసతో (న) 6 మత్తేభాలను వ్రాసి ప్రకటించారు[15] 1927లో శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి 27, సీసపద్యాల 'వేమ తారావళి'తో వేమనకు కవితా పట్టాభిషేకం చేశారు.[16] వేంకట పార్వతీశ్వర కవులు వేమనపై హృద్యమైన పద్యాలు వ్రాశారు[17] పందొమ్మిది వందల ఇరవై – ముప్పైల్లో వెలువడ్డ రెడ్డిరాణి సంచికల్లో కూడ వేమన్నను ప్రశంసిస్తూ పద్యాలు కనిపిస్తున్నాయి

వేమన్నపైన సాగిన అనాదరణం గురించి చివరగా ఒక్కమాట చెప్పుకోవాలి ఈ అనాదరణ కేవలం శిష్టసాహిత్య ప్రపంచానికే పరిమితం పండితులతో ప్రమేయం లేకుండా వేమన పద్యాలు ఊరూరా వాడవాడా సామాన్య ప్రజల నాలుకల మీద ఆడుతూనే ఉన్నాయి

## II. కీర్తి విస్తృతి

తెలుగుదేశపు ఎల్లలను అధిగమించిన విశాలకీర్తి గలవాడు వేమన తెలుగుదేశమే కాదు, ఖండాంతరయానం గావించిన మొట్టమొదటి తెలుగు కవి కూడ వేమనే

ఇరుగుపొరుగున ఉన్న తమిళ, కన్నడ, మలయాళ దేశాలలో వేమన్న పేరు వినని వారు అరుదుగా ఉంటారు వేమన సూక్తులలోని సూనృతమాధుర్యాన్ని అనుభవించడానికి తెలుగెరుగని వారికి భాష అడ్డు రాలేదు, సాంస్కృతిక వలయాలు ఆటంకాలు కాలేదు ఆంధ్రేతర విశాల ప్రపంచానికి పరిచయం చేయగలిగిన కవి ఎవరంటే వేమన్న పేరే మొదట చెప్పాలని శ్రీ నార్ల అభిప్రాయపడ్డారు[18] దానికి వేమన్న దృక్పథంలోని విశ్వజనీన దృష్టి కారణం మానవత్వానికి సంబంధించిన మౌలిక హేతువులను స్పృశించినవాడు కావడంచేత ప్రతివారిని స్పందింపజేసే గుణం వేమన పద్యాల కబ్బింది

---

14 ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, 1923, దుందుభి, ఆశ్వయుజ

15 భారతి, అక్షయ సం॥ జ్యేష్ఠం, జూన్, 1926

16 ఆంధ్రపత్రిక, ప్రభవ, చైత్ర 1927

17 ఎప్పుడు, ఎక్కడ రాశారో తెలియదు వంగూరివారి పుస్తకంలో ఉదాహరింపబడ్డాయి

18 Introduction P No 7, Vemana through Western eyes

దిగ్దిగంతాల దాకా వీచిన వేడిగాలి వేమనపద్యాలు ప్రజాకవులకు సరిహద్దులకు లోబడని ప్రసిద్ధి ఏర్పడుతుంది వేమన కవి ప్రఖ్యాతికి సాక్ష్యాలు సంతరించి చూపడానికి, ప్రజాకవిత్వ స్వభావానికీ, పరిధులులేని దాని ప్రఖ్యాతికీ అవినాభావ సంబంధం ఉన్నదని భావించడమే కారణం. ప్రజాకవిత్వ నిర్వచనం, నిరూపణ మార్గాలను సుగమం చేసుకోవడం ఇక్కడ నేను ఆశించిన ప్రయోజనం

బ్రౌన్ కంటె దాదాపు నూరేళ్ళ క్రితమే వేమన పద్యాలు ఖండాంతరయానం చేశాయి. ఫాదర్ లె గాక్ (Father Le Gac) అనే ఫ్రెంచి మిషనరీ వేమన పద్యాలను ఫ్రాన్సుకు పంపి ఉన్నాడన్న దాఖలా ఒకటి బంగోరెకు వారి చెదురుమదురు పరిశోధనలో తారసిల్లింది[19] [వారిచ్చిన రెఫరెన్సు ఈవిధంగా ఉంది చూడు జర్నల్ అఫ్ ది బాంబే హిస్టారికల్ సొసైటీ వాల్యూమ్ IV, 1941 నవంబరు సంచిక 1/2 సంచిక, పేజీలు 68–93, రెవరెండ్ హెచ్.హోస్టన్, ఎస్.జె (Rev Hosten, S J) వ్రాసిన "Indian Books taken to France mostly by the Jesuits for the library of Louis XV 1720-1735" అనే వ్యాసం ]

ఇప్పుడా ప్రతి National bibliothica Library, Paris లో ఉన్నదని బంగోరె అందించిన సమాచారం ఆధారంగా దానినెట్లాగైనా సంపాదించాలని నేను కొంత ప్రయత్నించాను కాని, నా ప్రయత్నం ఇంతవరకు సఫలం కాలేదు దాదాపు 250 యేండ్ల నుండి తెలుగువారికి దూరంగా ఉన్న ఆ ప్రతి పరిశోధన దృష్ట్యా ఎంతో విలువైనదనే చెప్పాలి

అబే దుబాయ్ కాలం నాటికే వేమన పద్యాలు ఇరుగుపొరుగు భాషలలోనికి అనువదింపబడ్డాయి

"One of the most famous is Vemana whose poems, originally written in Telugu, have since been translated into several other languages"[20]

### 1. తమిళంలో వేమన:

లభ్యమైనంత వరకు తమిళంలో వేమన్నపైన వెలువడిన గ్రంథాలను పరామర్శిస్తాను

#### a) వేమన పద్దియమ్

315 పేజీలు గల ఈ గ్రంథంలో 1000 వేమన పద్యాలకు తమిళానువాదమూ, వ్యాఖ్యానమూ ఉన్నాయి 1926లో భారతీ ప్రెస్, చెన్నపురిలో ముద్రించబడింది ఇది రెండవ ముద్రణం మొదటి ముద్రణం తేదీ తెలియదు దీనికి దురైస్వామి మొదలియార్ ముందుమాట వ్రాశారు వేమన పద్యాలు తెలుగులోనే ఉండిపోవడం వలన ఆయన గొప్పభావాలు తెలుసుకొనే సౌకర్యం నిమిత్తం తమిళవ్యాఖ్యానం ఇవ్వబడిందని ఆయన వ్రాశారు 1875లో వెలువడిన 700 పద్యాల ముద్రణాన్ని ఆధారం చేసుకొని, మరికొన్ని కొత్త పద్యాలు చేర్చి దానిని ప్రకటించినట్లు ఆయన చెప్పారు దీనికి వ్యాఖ్యానం పాండిచ్చేరి నివాసియైన నారాయణ దాసర్ వ్రాశారు 4–8 పేజీలవరకు

---

19 బ్రౌన్ లేఖలు, పుట 74, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి, 1977

20 Hindu manners, customs and ceremonies

వాడుక కథలున్నాయి. వ్యాఖ్యానానికి బ్రౌన్ అనువాదం ఆధారం. ఈ గ్రంథం మీద వేమనచిత్రం చిత్రమైనది. నడుము దాకా వేలాడే కేశాలతో, కడుపుదాకా సాగిన బారెడు గడ్డంతో, ముఖమంతా వ్యాపించిన గుబురు మీసాలతో అభిముఖాసీనుడైన వేమన్న రూపమిది.[21]

b) వేమన పద్దియమ్[22]

ఇందులో వేమన్న (వేమన్న యోగీశ్వర) చెప్పిన 100 పద్యాలకు అనువాద సహిత వ్యాఖ్యానమున్నది (నూరు పాడల్ గళ్ అడంగియె). వ్యాఖ్యాత హిందూ రిలీజియస్ స్కూల్ మేనేజరైన శ్రీ సీతారామ ప్రసాద్. తమిళ పండితులైన శ్రీ టి. సి. పార్థసారధి అయ్యంగార్ దీనిని పర్యవేక్షించారు. ఈ గ్రంథ పీఠికలో, "వేమన యోగీశ్వర చరిత్రమ్" పేరుతో వేమన్న మీద వాడుకలో ఉన్న కథలన్నీ ఉన్నాయి. వ్యాఖ్యానం బాగానే ఉన్నది. అభిముఖాసీనుడైన వేమన్న చిత్రం ఉంది. ప్రసిద్ధిలో ఉన్న వేమన్న రేఖారూపానికి ఇది భిన్నమైనది.

ఇవేకాక "వేమన పద్యంగళ్" పేరుతో శ్రీ రాయదేశికన్ తమిళంలోనికి అనువదించిన శిధిలగ్రంధమొకటి లభిస్తున్నది[23] ఈయన వేమన పద్యాలను సంస్కృత శ్లోకాలలోనికి, తమిళ పద్యాలలోనికి అనువదించిన గ్రంధమొకటి కనిపిస్తున్నది.[24] కీ.శే అన్నాదురై, తమిళనాడు మాజీముఖ్యమంత్రి, వేమన పద్యాలకు సరసమైన తర్జుమాను ప్రకటించాడట. కాని దానికోసం నేను చేసిన ప్రయత్నాలు సఫలం కాలేదు కాని వేమన్న మీద ఆయన వ్రాసిన రెండు వ్యాసాలలో ఒకటి మాత్రం లభ్యమైంది.[25]

c) "వేమణ్ణా"

దాదాపు 10 అచ్చు పేజీలలో ఉన్న ఈ విలువైన వ్యాసం 8-4-1945 నాటి "ద్రావిడనాడు" పత్రికలో ప్రకటించబడింది[26] "భరతన్" అనే పేరుతో ఈ వ్యాసం వ్రాయబడింది (ఇది సి ఎన్ అన్నాదురై కలం పేరు) వేమన్న మీద అన్నాదురై వెలిబుచ్చిన అభిప్రాయాలు కొన్నింటిని ఉటంకిస్తాను

"ఆంధ్రదేశంలో ఆర్ష సంప్రదాయాలకు తలవొగ్గ నిరాకరించి, భావ స్వాతంత్ర్యంకోసం పాటుపడిన వారిలో వేమన ముఖ్యులు."[27]

---

21 Printed by I D Duraiswamy Mudaliar, Choolai, Madras, 1926

22 Printed by Muthu Vadivel Mudaliar at Phoomagal Vilasa Printing Press, Station Madras, year 1937

23 అట్టలు పోవడంవలన తేదీ మొదలైన వివరాలు తెలియరాలేదు

24 ఇది కూడ శిధిలం, వివరాలు తెలియవు

25 'వేమన వెడిగుండుగళ్' అనే వ్యాసం కూడ 'ద్రావిడనాడు' పత్రికలో వచ్చిందట

26 'ద్రావిడనాడు' సంపుటి 4, సంచిక 2, తేదీ 8-4-1945

27 అన్నాదురై తమిళంలోని సొంప్పు అనువాదంలోనికి రావడం కష్టం అంటారు నేను కోరగానే ఎంతో శ్రమకోర్చి తమిళవ్యాసమిూలాన్ని తెలుగులోనికి అనువాదం చేసి యిచ్చారు మిత్రులు బి ప్రభాకర్ (ఆంధ్రప్రభ) ఈయన బులుసు వేంకటరమణయ్యగారి కుమారులు

"నిజం చెప్పాలంటే వేమన పద్యాల ధోరణి వైదికపు కోటలను కూల్చే ఆటంబాంబు అనే చెప్పాలి."

"ఏవో కొన్ని ప్రయోజనాల కోసం నిజాన్ని కప్పిపుచ్చే ధోరణిని వేమన్న సహించలేకపోయాడు."

"చదివిన వెంటనే పామరులు కూడ అర్థం చేసుకొనగలిగే సులభశైలి ఆయనది కాబట్టే ఆయన రచన పండితుల అవసరానికి, పూజామందిరంలో పదిలపరచడానికి పనికిరాకుండా సామాన్య జనానికి మేలుగూర్చే ప్రబంధమైనది."

"వేమన్న 500 ఏళ్లకు మునుపటివాడు."

"వేమన వైదిక సంప్రదాయాలను సమర్థించి ఉంటే, ఆయనలాంటి గొప్ప మేధావి లేరని సంప్రదాయవాదులు స్తుతించి ఉండేవారు. సంప్రదాయవాదులను ఆయన ఝాడించి వదిలిపెట్టడంతో ఆయన గురించి నిజానిజాలు వెలుగులోనికి రాలేదు."

అన్నాదురై వ్యాసమంతా ఎంతో చైతన్యవంతంగా సాగినప్పటికీ, వేమన్న కేవలం బ్రాహ్మణ వ్యతిరేకి అనే అంశానికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడింది

కన్నడంలోనికి వేమన్న పద్యాలను వెంకటరామప్ప అనువదించారు.[28] "శ్రీ వేమన జ్ఞాన మార్గ పదగుళు" పేరుతో బి. భీమరాజు చేసిన అనువాదాన్ని నేనింత వరకు చూడలేకపోయాను. ప్రసిద్ధ కన్నడ కవి సర్వజ్ఞునితో వేమన్నను సరిపోలుస్తూ పరిశోధన వ్రాశారు డాక్టర్ గంధం అప్పారావుగారు [29]

## 2. సంస్కృతం

20 వ శతాబ్దం ఉత్తరార్ధంలో పండితులు వేమన పద్యాల మీద శ్రద్ధాదృక్కులు పసరించినారనడానికి సంస్కృతానువాదాలు ఒక తార్కాణం

### వేమ గీత

వేమన పద్యాలు వేయింటికి సంస్కృతానువాదం కలిగిన గ్రంథమిది అనువాదకులు శ్రీ రామనృసింహమూర్తి కవులు (గంధం శ్రీ రామమూర్తి, ఇట్టేంకి నరసింహమూర్తి) 266 పేజీల ఉద్గ్రంథమిది ఇది 1960లో ప్రకటించబడింది దీనిలో వరుసగా వేమన పద్యం క్రింద సంస్కృతానువాదం, తర్వాత తెలుగు తాత్పర్యం ఇవ్వబడ్డాయి [30] శ్రీ రామనృసింహ కవులు వేమన పద్యాలను ఆరు విభాగాలు చేశారు 1 నైతిక, 2 సాంస్కృతిక, 3 ఆర్థిక, 4 సామాజిక, 5 సాంసారిక, 6 ఆధ్యాత్మిక విభాగాలు గ్రంథాంతంలో వేమన పద్యసూచిక ఇవ్వబడింది ఈ గ్రంథం కాక నాగరలిపి

---

28 తేదీ 1962

29 'Comparative study of Vemana & Sarvajna' - thesis submitted to Karnataka University, 1970 ఇటీవల ఇది అచ్చై బయటికి వచ్చింది

30 1959లో వీరే వెలువరించిన గ్రంథంలో తెలుగు తాత్పర్యం లేదు

శ్లోకాలతో మరో గ్రంథం ప్రకటించారు ఈ రచయితలు.[31] ఇదికాక 1973లో 'వేమన శతకమ్' పేరుతో సంస్కృత శ్లోకానువాదం, ఆంగ్లానువాదం వెలువరించారు రాపల్లి శ్రీ రామచంద్రమూర్తిగారు [32] శ్రీ రామచంద్రమూర్తిగారు పోడూరు నివాసి. 'To bring the exact meaning and force of the original poems of Vemana' అని గ్రంథాదిని వ్రాసుకున్నారు ఇది బహుళార్థసాధకమైన అనువాదం. తెలుగుమూలాన్ని ఏకకాలంలో సంస్కృతాంగ్లాలలోనికి అనువదించారు సంస్కృతానువాదాన్ని దేవనాగరి లిపిలో ముద్రించడం వలన హిందీ ప్రపంచంలో సంస్కృత మెరిగిన వారికి ఉపయోగకరంగా ఉంటుంది మచ్చుకు ఈయన చేసిన సంస్కృతాంగ్లానువాదాలను ఈ క్రింద ఇస్తున్నాను:

*'ఉప్పు కప్పురంబు ఒక్క పోలిక నుండు*
*చూడ చూడ రుచుల జాడ వేరు*
*పురుషులందు పుణ్య పురుషులు వేరయా' .(2)*
*'కర్పూరాక్షీబయోర్లోకే రూపసామ్యమ్ భవత్యపి*
*దృశ్యతే గుణ భేదస్తు సదసజ్జన యోస్తథా!' (2)*

'Camphor and salt alike, still their tastes differ. So also regarding the sinners and virtuous' (2)

ఎవరో వేమన పద్యాలు కొన్నింటిని సంస్కృతానువాదం చేసి జవ్వాది షష్టిపూర్తి అభినందన సంచికలో ప్రకటించారు [33]

### 3. ఇంగ్లీషులో కృషి

మొట్టమొదటిసారి ఇంగ్లీషులోనికి భాషాంతరీకరించబడిన ఘనత వేమన పద్యాలకే దక్కింది ఆ మహాకార్యానికి శ్రీకారం చుట్టినవాడు బ్రౌన్. బ్రౌన్ 1824లో అనువాదం చేసి 1829లో ప్రకటించిన 'The verses of Vemana' అనే గ్రంథం ద్వారా వేమన సువిశాల ప్రపంచానికి పరిచయమైనాడు ఆంగ్ల విద్యావంతుల దృష్టిని ఆకర్షించాడు అనేకులు వేమన పద్యాలలోని తత్త్వధారను గురించి ఆంగ్లంలో వ్యాసాలు వ్రాశారు ఆ వ్యాసాలను వెతికి పట్టుకొని ఒకచోట చేర్చి వ్యాససంకలనం ప్రకటించారు నార్ల వెంకటేశ్వరరావుగారు [34] దానితో వేమన పద్యాలపట్ల పాశ్చాత్యులదృష్టిని తెలుసుకునే వీలు కలిగింది తర్వాత దేశీయులు కూడ వేమన్నను గూర్చి ఇంగ్లీషులో రచనలు చేశారు 'Some mile stones in Telugu literature' అనే గ్రంథంలో

---

31 వేమగీతా (ప్రథమ సహస్రమ్) నాగరలిపి శ్లోకము వీరి గ్రంథాలన్నీ శ్రీరామనృసింహ గ్రంథమాల, తోలేరు పక్షాన ప్రచురించబడ్డాయి

32 వేమన శతకమ్ (గీర్వాణ భాషాయామ్ శ్లోకాత్మనా పరివర్తితమ్) ఆంధ్రమూలమ్, ఆంగ్లభాషా యామనూదితంచ । పరివర్తన కర్తారః రాంపల్లి శ్రీరామచంద్రమూర్తి, శ్రీ భట్నుపల్లి గ్రామస్థ శ్రీ శారదా ముద్రణాలయే సంముద్రితమ్ । ప్రతులు 500, 1973, వెల రూ 1/-

33 వేమన (కొన్నింటికి సంస్కృతము), జవ్వాది షష్టిపూర్తి అభినందన సంచిక, కావ్యమాల

34 Vemana through western eyes, Edited & Introduction by V R Narla, Seshachalam & Co, Madras, Machilipatnam, Secunderabad, 1969

జి. ఆర్. సుబ్రామయ్య పంతులుగారు 'The Age of Vemana' అనే చక్కటి వ్యాసం వ్రాశారు.[35]

వేమన్న తాత్త్విక దృక్పథాన్ని గూర్చి సాకల్యంగా చర్చించినవారు ఈశ్వర టోపా.[36] ఈయన ఇంగ్లీషులో వ్రాసిన 'Saint Vemana & His philosophy' అనే గ్రంథంలో వేమన పద్యాలను లోతుగా పరిశీలించారు.[37] వేమన పద్యాల మీద ఆదరదృక్కులు ప్రసరించి, వేమన తత్త్వానికి సూఫీ వేదాంతాన్ని వర్తింపజేసిన పరిశీలనతో వేమన పద్యాలను English versesగా అనువదించారు ముస్లిం మేధావి మీర్ మహమూద్ అలీఖాన్.[38] వేమన చరిత్రను సి. రామకృష్ణారావుగారు ఇంగ్లీషులో వ్రాశారు. 'Great poets of the people' అనే పేరుతో డాక్టర్ గంధం అప్పారావుగారు వేమన్న, తిరువళ్ళువరు, సర్వజ్ఞులను గూర్చి చిరుగ్రంథం వెలువరించారు వారే దానిని తెలుగులో "ప్రజాకవులు" అనే పేర ప్రకటించారు. వేమన్న కవిత్వంలోని అలంకారాలను గూర్చి ఇంగ్లీషులో అప్పారావుగారే ఒక వ్యాసం ప్రకటింపజేశారు.[39]

ఇంగ్లీషులో వేమనపద్యాల అనువాదానికి నాటికీ, నేటికీ బ్రౌనే ప్రమాణం కాని, వాటిని మరింత నుడికారంతో భాషాంతరీకరించవచ్చునని కాబోలు విద్వాన్ పిశిపాటి కృష్ణమూర్తి గారు 100 పద్యాలను సరళమైన ఇంగ్లీషులోనికి తర్జుమా చేశారు.[40]

"This work can be profitably used by the non-Telugus to get a glimpse of the contribution of the great popular poet Vemana to Indian literature in general, and to Telugu literature in particular."

అని పరిచయ వాక్యాలలో బి.హెచ్. కృష్ణమూర్తి గారు వ్రాశారు అనువాదాన్ని గూర్చి

"There are several places where Sri P Krishnamurthi's rendering brings out the force of the Telugu idiom more aptly," అని వ్రాశారు

---

35 'Some mile stones in Telugu literature' Vol II The Age of Vemana, by G R Subramaiah Pantulu, B Narsimheswara Gupta, Madras, 1915

36 'Saint Vemana & His Philosophy', by Iswara Topa The Orient publishing co (Regd) Madras, Tenali, Hyderabad, 1958

37 ఈ గ్రంథాన్ని డాక్టర్ దివాకర్ల వేంకటావధానిగారు తెలుగులోనికి తర్జుమా చేశారు

38 'The Musings of Mystic' (Telugu poems of Vemana rendered into English verse) Mir Mohmood Ali Khan, H C S Hyd, A P India 1966

39 Reprinted from Annals of Oriental research of the University of Madras Vol XXVI 1976/1977

40 వేమన శతకము (తెనుగు మూలము) ఆంగ్లానువాదము విద్వాన్ పిశిపాటి కృష్ణమూర్తి, సికిందరాబాదు డా॥ బి.హెచ్. కృష్ణమూర్తి ఆంగ్ల పరిచయ వాక్యాలతో వెలువడింది 108 పద్యాలు, 16, 3

### 4. వేమన పద్యాలకు హిందీ, ఉర్దూ అనువాదాలు41

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ వారు వేమనవి రెండు వందల ఇరవై ఏడు పద్యాలు ఏరి హిందీ, ఉర్దూ అనువాదాలతో సహా ప్రచురించారు. నేరుగా జీవితం నుండి చీల్చుకొని వచ్చినవి కాబట్టి వేమన పద్యాల అనువాదం అంత సులభసాధ్యం కాదు. అనువాదకులు ఎంత జాగ్రత్త వహించినా కొన్ని సందర్భాలలో అపార్థానికి ఆస్కారం కలిగించారు. ఉదాహరణకు "కామిగాక మోక్షగామి కాడు" అనే పద్యంలో కామి అంటే బలమైన కోరిక గలవాడని అనువదించడం తప్పు (జో మహత్వాకాంక్ష నహీ హై). ఈ గ్రంథంలో హిందీ అనువాదానికి ఉపయోగించిన భాష అంత సొగసుగా లేదు. ఉర్దూ అనువాదానికి తీసుకొన్న శ్రద్ధ హిందీలో చూపలేదేమో ననిపిస్తుంది. చేసింది వచనానువాదం కనుక ప్రతి పద్యానికి మకుటాన్ని చేర్చడం అనవసరం ఉర్దూలో అలాగే చేశారు. పద్యాల ఎంపిక బాగానే ఉంది. పద్యాలకు ఇండెక్సు లేకపోవడం ఇందులో లోపం.

## III. కవిత్వ తత్త్వ విచారం

### 1. ప్రతిభ

ప్రయోజనాపేక్షనుబట్టి కవిత్వ నిర్వచనాలు మారుతుంటాయి. కాని ఏ కాలంలోనైనా కవిత్వపు మౌలికతత్త్వం ఒక్కటే అలంకారికులు కావ్య ప్రయోజనాలుగా పేర్కొన్న ఆనందం, ఉపదేశం అనే మాటలు పాతపడిపోయి కొత్త పదాలు వచ్చాయి కాని వాటి అనుభవ తత్త్వంలో, స్వరూపంలో భేదం లేదు ఎటొచ్చీ ఆనందానికి స్పష్టమైన నిర్వచనం వీలుకాక అనుభవ ప్రమాణం మీద ఆధారపడవలసి వస్తున్నది కాని ఈ ఆనందం అనేది అసత్యం కాదు అయితే సౌఖ్యానుభూతి, కదలిక, చైతన్యం అనే మాటలు ఆనందోపదేశాలకు బదులుగా చెలామణిలోనికి వచ్చాయి ఇవన్నీ ఆనందానికి పర్యాయపదాలు కావు అయితే కవిత్వాన్ని ఆస్వాదించడం వల్ల కలిగే సౌఖ్యావరణను గురించే ఇవన్నీ చెప్తున్నాయి అనుభవం యొక్క స్వభావంలో, ధోరణిలో, తీక్ష్ణతలో భేదాలు ఉండవచ్చుగాని పైవాటి మౌలిక తత్త్వంలో భేదం ఉండదు

అయితే కవిత్వ తత్త్వాన్ని బట్టి కాక, పర్యవసానాన్ని దర్శించే ధోరణిలోని బాహ్యభేదాన్ని బట్టి మారే కావ్య నిర్మాణ వ్యవస్థను ఆధారం చేసుకొని అనేక నిర్వచనాలు పుట్టాయి

ఆనందాన్ని కలిగించే గుణం కవిత్వానికి ఎక్కడనుంచి వచ్చింది? దానికి మూలమేమిటి? కవితామయత్వం మాటలకెలా సిద్ధిస్తున్నది? అని ఆలోచించాలి

అలంకారికులు ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసాలను కవిత్వ హేతువులుగా చెప్పారు 42 క్రిష్టఫర్ కాడ్వెల్ కవిత్వాన్ని ఈ కింది విధంగా నిర్వచించాడు

"సాధారణంగా వ్యవహారంలో ఉన్న సాధారణమైన పదజాలమే ఒక ఔన్నత్యాన్ని (Heightened) సంతరించుకొని కవిత్వమవుతుంది అయితే ఈ ఔన్నత్యం ఏమిటి? ఇది ఎట్లా సిద్ధిస్తుంది? అలంకార శాస్త్రాలన్నీ దీనికోసమే అన్వేషణలు జరిపాయి

41 "Vemana", editors M Ramappa, Dr K Gopala Krishna Rao & Dr Srirama Sarma, published by Andhra Pradesh Sahitya Academy, Hyderabad

42 కావ్యాలంకార సంగ్రహము

ఈ ఔన్నత్యాన్ని మనకు అందించడానికి అనేకమైన అంశాలు దోహదం చేస్తాయి వర్ణసంయోజనం, ఛందస్సు, లయ, యమకాద్యనుప్రాసలు, పాదవిభజన, పద్య నియమం మొదలైన లక్షణాలు కవిత్వానికొక దివ్యత్వాన్ని (ఇంద్రజాలాన్ని) సంతరింపజేస్తాయి పునరుక్తులు, అలంకారాలు, వైరుధ్యాల వర్ణన – ఇవన్నీ కవితాత్వసిద్ధికి తోడ్పడుతాయి "[43]

పై ఉటంకింపులో కార్లైల్ చెప్పిన అంశాలన్నీ ఉన్నా, మరొకటిలేకుంటే మాత్రం ఆ పదజాలం కవిత్వం కాకుండా పోతుంది అదే భావావేశం ఛందస్సు మొదలైనవి కవిత్వానికి సహకార వస్తువులేకాని భావావేశం ప్రాణం వంటిది

అయితే అలంకారికులు చెప్పిన వ్యుత్పత్తి, అభ్యాసములను స్పష్టంగా నిర్వచించవచ్చును కాని భావావేశాన్ని వర్ణించడం అంత సులభం కాదు

**"కవిత్వమందలి ముఖ్య జీవనధర్మము ఇతరుల మనసుకెక్కుట. అదే మన కర్థముకాని రహస్యము."**

**'ఇతరుల మనసుకెక్కుట'**కు కావలసిన లక్షణాలుగా కవితా గుణాదులు పోషకాలే కాని వాటికన్న ప్రధానమైనదీ, అసలు ప్రాణమైనదీ భావావేశం మాత్రమే అదిలేక అన్నీవున్న కవిత్వం అభరణాలంకృతమైన నిర్జీవ కళేబరం వంటిది అలంకారికులు చెప్పిన ప్రతిభాజన్యమే ఈ ఆవేశం

ఈ దృష్టితో ఇక వేమన్న కవా? కాదా? అన్న విషయాన్ని పరిశీలిద్దాం వేమన్నను కవి కాదనే వారు ఇందువల్ల కవి కాదు అని నిక్కచ్చిగా చెప్పినట్టు లేదు నిక్కచ్చిగా చెప్పినప్పుడు కవిత్వమంటే ఏమిటి అనే ప్రశ్నకు వారు జవాబు చెప్పవలసి ఉంటుంది కాబట్టి ఎవరూ ఇంతవరకు వేమన్నను 'అకవి'గా నిరూపించే కృషిని వ్రాతలో చేయలేదు వేమన్న కవిత్వం 'neither classical nor poetical' అని బ్రౌనే వ్రాశాడు కాని దాని అర్థం వేరు[45]

వేమన్నను కవిగా గుర్తించినవారు కూడ వేమన్నకవిత్వం వద్దకు వచ్చేసరికి చర్చను దాటవేశారు అయితే కవిగా లోకమంతా గుర్తించిన వేమన్నను మళ్లీ ఇప్పుడు నిరూపించడం అవసరమా అన్నది ప్రశ్న కాని ఇక్కడ ఒక విషయం స్పష్టపరచుకోవాలి వేమన్నకు కవిగా ప్రచారమే వచ్చింది కాని, ఎట్లా కవో అని ఎవరూ వివరించలేదు

వేమన పద్యాల్లో కవిత్వం మృగ్యమని భావించేవారు అనేకులతో నేను చర్చించాను **"వేమన్నవి ఉత్త నీతిపద్యాలు. ప్రాచీన అలంకారికులు చెప్పిన కవిత్వ రచనా సూత్రాలేవీ వేమన్నకు వర్తింపవు కేవలం ముక్తకప్రాయాలైన పద్యాలలో రససిద్ధికి అవకాశం లేదు. కవికి సహజమైన సుకుమార ప్రకృతి వేమనకు లేదు"** మొదలైన అనేక రకాలైన వాదాలు వెలువడ్డాయి వీటిని గూర్చి ఆయా సందర్భాల్లో చర్చిస్తాను

వేమన్నవి ఉత్త నీతిపద్యాలు అన్నారు నిజమే పద్యాల్లో కొన్ని నీతిపద్యాలున్నాయి కాని అవి విధి, నిషేధాలను గూర్చి మాత్రమే చెప్తున్న నిర్జీవమైన కొయ్య బొమ్మలు కావు ప్రాణవంతమైన ప్రతిస్పందనంతో, ఉత్కటమైన భావావేశంతో వెలువడిన చైతన్య భాస్వరాలు సావధానంగా చెప్పినట్లున్న కొన్ని సామాన్య నీతిపద్యాలు తప్ప సామాజిక సంఘర్షణలోంచి వెలువడిన ఏ పద్యం తీసుకున్నా, ప్రజలందరి భావోద్రేకాలు,

---

43 అనువాదం ఈ వ్యాసకర్తది Illusion and reality

45 Preface to Vemana, 1829

ఏకీకృత భావోద్రేకంగా మారిన తీక్ష్ణానుభవం కనిపిస్తుంది కేవలం ఉపదేశం వేమనపద్యాల ఆశయం కాదు. ఆ పద్యాలు "సలసల కాగే నీళ్ళు" అన్నాడు అన్నాదురై వేమన పద్యాలను అణుబాంబుల (వెడిగుడుగళ్)తో కూడ ఆయన పోల్చాడు[46] అబద్ధాల పొట్టచీల్చి విచ్ఛేదం చేయగలిగిన భావావేశ శక్తికి వేమన్న ప్రతి పద్యాన్ని ఉదాహరణంగా చూపవచ్చు

అయితే వేమన్న భావావేశం అసాత్త్వికమైనదని వాదించేవారున్నారు ద్వేషం, కోపం, అసూయ, అసహ్యం, ప్రేమ, భక్తి మొదలైనవి భావాలు వేమన్న అప్పటి సమాజపు విలువల పట్ల అసహనం, కోపం ప్రదర్శించాడు కాని ఆ కోపం వ్యక్తిగతకోపం కాదని నాటి జడీభూత వ్యవస్థపైన ప్రకటించిన ధర్మాగ్రహమని మరచిపోరాదు వ్యక్తిగతకోపాన్ని వేమన్నే ఒకచోట ఖండించాడు

కోపమునను ఘనత కొంచెమైపోవును
కోపమునను మిగుల గోడుజెందు
కోపమడచెనేని కోరిక లీడేరు (డి 1721, 52)

జుగుప్సనుకూడ ఒక స్థాయీభావంగా అలంకారికులు గుర్తించడం యాదృచ్ఛికం కాదు వేమన మనోహర భావాలతోకూడ పద్యాలు చెప్పాడు

1 కప్పురంపు పొది కస్తూరి యెరువులో
పుల్లినాటి నందనోదకంబు
పోసి పెంప కంపు బోనట్లు ఖలుడురా!
(డి 1727, 533, ఇంకా అనేక ప్రతులు)

2 తేనె పంచదార తియ్యమామిడి పండు
తిన్నగాని తీపి తెలియరాదు
కన్న నింపుబుట్టు కామిని యధరంబు
(డి 1726, 138, ఇంకా అనేక ప్రతులు)

3 కొప్పు చెలువుగన్న కుచకుంభములు గన్న
చెప్పరాని తావు చెలిమి గన్న
ముట్టగోరుచుండు మునికైన మోహంబు
(డి 1723, 84, ఇంకా అనేక ప్రతులు)

ఇక రససిద్ధాంతాన్ని యధాతథంగా వేమన్నకు వర్తింపజెయ్యడంలో కొన్ని యిబ్బందులు లేకపోలేదు రస నిర్వచనాలను ఖండించ నవసరం లేకుండానే వేమన పద్యాలకు వర్తించే సూత్రాలను పరామర్శించడానికి వీలున్నది

"విభావానుభావ వ్యభిచారి సంయోగాత్ రస నిష్పత్తిః"

అనే ప్రసిద్ధమైన ఈ నిర్వచనం నాటకదృష్టిలో చేయబడిందనేది సర్వవిదితం ప్రేక్షకుడు ప్రదర్శనలో లీనమై క్రమంగా ఒక స్థాయిని చేరుకొని రససిద్ధిని పొందడానికి అనేక అంశాల దోహదం అనివార్యమైంది రసపారమ్య స్థితిని పొందడానికి విభావాదులు

---

46 వేమన – అన్నాదురై, తమిళవ్యాసం

ఉద్దీపకాలుగా పనిచేసి, అనుకూలమైన వాతావరణాన్ని కలుగజేస్తాయి కాబట్టి రససిద్ధికి కథ, నాయకాదిపాత్రలు ఆలంబనగా ఉంటాయి కాబట్టి వేటికవి వేరువేరుగా విడిపోయే వేమనపద్యాల్లో, కథన తిరస్కారదృష్టి కలిగిన వేమనపద్యాల్లో, రససిద్ధికి అవకాశం లేదు అనేది వాదం. వస్తువును గూర్చి చెప్పేటప్పుడు ఈ అంశాన్ని వివరంగా చర్చిస్తాను.

పై సిద్ధాంతాన్ని ఖండించనవసరం లేకుండానే, సంవిధాన దృష్టితో కొద్ది మార్పులు చేసి వేమన పద్యాలకు వర్తింపజేసే వీలుంది. "కవిత్రయం" అనే వ్యాసంలో మహాకవి శ్రీశ్రీ ఇదే అభిప్రాయం వెలిబుచ్చాడు **"....తిక్కన గాని, వేమన గాని, గురజాడ గాని రాసిందంతా ఆద్యంతం నాటకం. నాటకంలోనే కవిత్వం పరాకాష్ఠ అందుకుంటుంది. వేమన్న రాసిన ప్రతి పద్యం ఒక నాటకం అనుకో. ఆ మాటకొస్తే వేమన్న జీవితమంతా ఒక నాటకమే. ఆటవెలది ఛందస్సు అతని నాటకరంగం. నాలుగు పాదాలలో 'విశ్వదాభిరామ వినురవేమ' అని అభిర్న అనక తప్పదు కదా! ఇక మిగిలినవతనికి మూడే పాదాలు. ఆ మూడు పాదాలలో మూడు లోకాలకీ ముళ్ళు కట్టిన వేమన్నని మహాకవిగా గుర్తించని వాళ్ళు వెర్రివాళ్ళు....తిక్కన వేమనల రచన పరోక్ష నాటకం."**[47]

వేమన్న పద్యాల్లో వస్తువు సమాజం ఇది భౌతికమైన ఆలంబన కాదు సమాజమనేది ఒక వ్యవస్థ ఆ సమాజ వ్యవస్థలోని లోపాలను ఎత్తి చూపడం వేమన దృష్టి వాటి నిర్మూలన ఆ దృష్టి వల్ల ఆశించిన ఫలితం సమాజంలో విరుద్ధశక్తుల సంఘర్షణలున్నాయి 'సమాజంలోని ప్రజాజీవనవిధానం ఒక జీవనాటకం వంటిది సమాజంలోని సభ్యులందరూ ఏకకాలంలో ఆ నాటకంలోని పాత్రలుగా, సామాజికులుగా కూడ ఉన్నారు సంఘపు తెర యెత్తి వేమన చూపే సంఘలోపాలు ఎవరికీ కొత్త కాదు ఆ లోపాలపట్ల అనేకులు భావోద్రేకాలకు లోనవుతునే ఉన్నారు వేమనపద్యం ఒక సత్యాన్ని తళుక్కుమనిపించినప్పుడు, అది అంతవరకు సమాజవాతావరణంలో ఒక స్థాయికి చేరుకున్న శ్రోతలకు చైతన్యస్ఫూర్తిని కలిగించింది అదే కొత్త పద్యమై, వారి జీవితాలకు అపరిచితమైనదైతే వారిలో ఇటువంటి జలదరింపు వెంటనే కలగదు చెదురు మదురుగా అప్పటికే వారిలో తలయెత్తిన భావావేశాన్ని, ఏకీకృతంచేసి కవితావేశంగా మార్చి కిరణాలు కేంద్రీకరించినప్పుడు ఏర్పడే తీక్ష్ణకాంతిలాగా వేమన్న పలికినప్పుడు, వారిలో ఏర్పడిన సౌఖ్యావరణ (లేదా – చైతన్యస్ఫూర్తి) – ఇదే ఏ కవిత్వానికైనా ఉండే పరమావధిగా అవగతమౌతుంది ఒకరకంగా లాక్షణికులు చెప్పిన ప్రాణవంతమైన ఉపదేశమే ఈ చైతన్యం

సమాజమంటే నాటి సన్నివేశమనీ, అంటే నాటి కాలపరిస్థితులనీ అంగీకరిస్తే, కవిత్వపర్యవసానాన్ని అర్థంచేసుకునేటప్పుడు కాలం ఒక ముఖ్యలక్షణం అవుతుందని అంగీకరించవలసి ఉంటుంది శ్రోతకు ఉండవలసిన దృష్టిని గూర్చి చర్చించేటప్పుడు కాలాన్ని మళ్ళీ ప్రస్తావిస్తాను

అయితే ఆనందం, చైతన్యం అనేమాటలు ఇంకా అస్పష్టంగానే ఉన్నాయి కారణం, ఇవి అనుభవైకవేద్యాలు కావడమే ఆనందం, చైతన్యం రెండింటి తాత్వికాంశ ఒకటే

---

47 "కవిత్రయం" – రేడియో ప్రసంగం, ముద్రణ – 'తెలుగు దేశం', 1954, అక్టోబరు 2 వ తేదీ

అయినా స్వభావరీత్యా వీటికి కొంత భేదం కనిపిస్తుంది. చైతన్యం ఒట్టి సహజాతం (Instinct) కాదు. ఒక లక్ష్యంవైపు మానవుని ఆవేశాన్ని దృఢపరిచే అనుభవశక్తి చైతన్యం. పై రెండూ భౌతికమైన ఆలంబనలవల్ల సిద్ధించినవే ఐనప్పటికి వాటి స్థితిలో తారతమ్యముంది. ఈ తారతమ్యం వల్లనే వాటికి దోహదం చేసే వాతావరణ వ్యవస్థయొక్క స్వరూపంలో తేడా వచ్చింది.

ఆలంకారికుల నిర్వచనాలు కవిత్వాన్ని కవిత్వపరిధిలోనే దర్శించినవి కావడంవల్ల, వేమనపద్యాలకు అవి పూర్తిగా వర్తించలేకపోయాయి. వేమన పద్యాలకు మూలమైన సమాజాన్ని వాటినుండి వేరుచేసిచూడడంవల్ల, కవి నిర్దేశం, వస్తునవ్యత, శ్రోతృప్రాధాన్యం వంటి అంశాలను కొత్తగా సమన్వయించి చూసుకోకపోవడంవల్ల వేమన్న కవిత్వంవల్ల శ్రద్ధాదృక్కులు ప్రసరించబడలేదు.

'వేమన యోగి' అనే వాడుకకూడ అతడు వేదాంత విషయాన్ని కూడ తన కవిత్వానికి ఎన్నుకోవడంవల్లనే కలిగింది. వేమన్నలో వేదాంత లక్షణాలకన్నా కవిత్వ లక్షణాలే ఎక్కువ 48

**'కవిత్వము నందలి ఆవేశము, రసోత్పాదన శక్తి - యివి తగ్గి విచక్షణాజ్ఞానము హెచ్చినప్పుడు, కవి కావలసినవాడు వేదాంతియగును.'**

హృదయము, బుద్ధి – వీటిపాళ్ళను అనుసరించే కవా; వేదాంతా అనే భేదాన్ని చూడాలి వేమన్న మౌలికంగా కవే అని చెప్తూ వంగూరి సుబ్బారావుగారు –

**'ఒకరి కష్టసుఖముల దనవిగా భావింపగల రసహృదయుడు వేదాంతి కాడు. కవికి హృదయమెక్కువ'**49 అని భావించారు

పద్యాలు చెప్తున్న ఆ కాలంలోకూడ వేమన సాంప్రదాయకపండితుల దృష్టిలో పడినట్టులేదు. కనీసం తిట్టడానికైనా వేమన్నను పేర్కొనకపోవడమే ఈ ఊహకు ఆధారం రాజుల ఆదరణతో జీవించవలసిన కావ్య కవిత్వం ఒకవైపు సాగిపోతుండగా దారిపక్క ఒదిగివుండి వేమనపద్యాలు అశేష సామాన్య పామరజనాభిమానంలో తలమున్కలయి ప్రవర్తిల్లుతున్నాయి

ఒకవేళ పండితుల దృష్టిలో పడినప్పటికీ వేమనపద్యాలను కవిత్వంగా, వేమన్నను కవిగా గుర్తించడానికి వారివద్ద సిద్ధంగా ఉన్న ప్రమాణాలు అడ్డువచ్చి ఉంటాయి

వేమన్నపైన సాగిన అనాదరణం, పాశ్చాత్యులు వేమన్నపైన వెలిబుచ్చిన అభిప్రాయాలు, వీటిలోంచే వేమనపద్యాలను కొలవడానికి కావలసిన ప్రమాణాలు స్పష్టరేఖలతో బయట పడవలసి ఉంది వేమన్నకు ముందుగాని, సమకాలంలోగాని వెలువడిన కావ్యప్రబంధాలకన్నా వేమన్నపద్యాలు ఎట్లా వేరైనవి అనే వివేచన జరగవలసి ఉంది

వేమన పద్యాలు " is neither poetical nor classical" అని బ్రౌన్ వెలిబుచ్చిన అభిప్రాయం వేమన విద్వత్కవులవంటివాడు కాడనే అంశాన్ని ధ్వనిస్తున్నది 'Poetical' అనే దానికి "కావ్య సంబంధమైన" అన్నది ఆయన అర్థం 50 Macdonald కొంత

---

48 వేమన–వంగూరి పేజీ, 85

49 వేమన – వంగూరి, పేజీ, 68

50 English - Telugu Dictionary, P No 857 adj కావ్యసంబంధమైన a poetical expression కావ్యశబ్దం, poetical authority కావ్య ఉదాహరణము, poetical కావ్యసరణిగా

ఉదారంగా వేమన్న "is a poet, but not a good poet" అనడంలో కూడ 'good poet' కాదు అంటే కావ్యసంబంధపు కవికాదు అనే అర్థంలోనే ఉపయోగించాడు. మ్యాక్‌డోనాల్డ్ మాతృభాష తెలుగు అయివుంటే దీనికి భిన్నమైన అభిప్రాయం వెలిబుచ్చి ఉండేవాడని శ్రీ నార్ల వ్రాశారు (Introduction). గోవర్ వేమన్నను తిరువళ్ళువరుతో పోల్చి కవితాశక్తిలో వేమన్న ఆయనకు చాలా దూరమని వ్రాశాడు. "Very for below Tiruvalluvar in moral feeling, and still further away in poetical power."[51]

ఇక్కడ కూడ తిరువళ్లువరును, వేమన్నను కలిపి పోల్చడం వల్లనే యిబ్బంది వచ్చిపడింది. విమర్శకులు తరచుగా తిరువళ్లువరును, వేమన్నను యాంత్రికంగా సరిపోల్చి చూస్తారు కాని నిజానికి ఇద్దరూ భిన్న సంప్రదాయాలకు చెందినవారు తిరువళ్లవరు కుదురుగా కూర్చొని వ్రాసినవాడు కావ్యసంప్రదాయపు నగిషీ పనితనం ఆయన కవిత్వంలోని గుణం సమాజాన్ని దర్శించిన దృక్పథంలో కూడా ఇద్దరికీ తేడా ఉంది

ప్రొఫెసర్ వినయకుమార్ సర్కారు వేమన్నను కబీరు, చైతన్యలతో పోల్చి వారితో సమానమైన, కాకపోతే వారికంటే అధికమైన స్థానమిచ్చారు. "..His place in Hindu positivism is of same rank as that of Kabir, Chaitanya and others, if not even higher."[52]

## 2. వస్తువు

వేమన్న తన కవిత్వానికి ఎన్నుకొన్న వస్తువు సమాజం అది అప్పటి సాహిత్యజగత్తులో ఉన్న అభిరుచికి అనుగుణమైనది 17వ శతాబ్దంలో ప్రబంధ ధోరణికి భిన్నంగా పద కవితలు మొదలైనవి కూడ వెలువడుతున్నాయి

"వేమన్న కవులని పేరు సంపాదింపని కవులలో జేరిన వాడంటిని. పేరు వచ్చుటకు రెండు హేతువులు: ప్రజ యొక్క యభిరిచి నెరిగి వారికి తృప్తిగా వ్రాసిన వానికి వచ్చును; కవి యొక్క గొప్పతనము నెరుగగల ప్రజ యున్నను వచ్చును. వేమన విషయమునందీ రెండును లేకపోయినవి."[53]

రాళ్ళపల్లి వారు 'ప్రజ' అంటున్నారు కాని నిజానికి ఈ ప్రజలు పండితులే అసంఖ్యాకులైన సామాన్యులకీ అభిరుచి సరికొత్తది కాదు వారిలో ప్రచలితంగా ఉన్న భావాలకు వేమన పద్యాలు అద్దం పట్టాయి కాబట్టి ఆయనకు కావలసిన కీర్తి వారినుండి రానే వచ్చింది

అయితే వేమన్నను నూత్నాభిరుచిని ప్రవేశపెట్టిన ధీరునిగా రాళ్ళపల్లి అంగీకరించారు "ఉన్న యభిరుచికి ఉదాహరణము లిచ్చువారే కాని, దీనిని సరియైన త్రోవలో మార్చి దిద్దగలిగిన ధీరులు లేరైరి."[54]

భావనాప్రపంచంలోని ఘటనలను కాక స్వానుభవంలోంచి వ్రాయడం అప్పటికి కొత్త సామాజిక సంఘర్షణలోంచి వేమన్న కవితావస్తువు పుట్టింది మానవుల కష్టసుఖాలను,

---

51 Vemana through Western eyes

52 Vemana through Western eyes

53 వేమన పుట 139

54 వేమన పుట 139

వాటికి కారణాలను గాఢమైన అభినివేశంతో చిత్రించాడు వేమన్న. ఈవిధంగా వేమన్న వస్తుస్వీకరణలో స్వతంత్రమార్గం తొక్కినాడని చెప్పాలి అప్పటివరకు నిరాఘాటంగా వస్తూన్న వస్తు నియమాన్ని వేమన్న ఉల్లంఘించాడు

పాఠకునిలో లేక శ్రోతలో రసోత్పత్తి జరగడానికి ఇతివృత్తం ఉండాలని ఆలంకారికుల ఉద్దేశం కథ యొక్క క్రమ వికాసంలో, విభావాదులు కల్పించే వాతావరణం వలన రసానుభూతి కలుగుతుందని సారాంశం కేవల ముక్తక ప్రాయమైన పద్యాలలో రసాన్ని అనుభవించే స్థాయి పాఠకునికి ఉండకపోవచ్చునని వారి వాదం

ముక్తకమంటే ఏమిటో పరిశీలిద్దాం ఆలంకారిక గ్రంథాలలో ముక్తక లక్షణాలను గూర్చి విపులమైనచర్చ జరగకపోవడానికి ఇతివృత్త ప్రధాన కావ్యాలే రసపర్యవసితాలని భావించడం వల్లనే బ్రౌన్ వేమనను Epigramatist అని పిలిచాడు.

**ఏకమాత్ర విషయ పరిమితి గలిగి పూర్వాపర సంబంధ రహితమైన స్వతంత్రమైన చిన్న పద్యం ముక్తకం.**

ముక్తక లక్షణాలు ఎన్ సైక్లోపీడియా బ్రిటానికాలో తెలుపబడ్డాయి ఆంగ్ల ముక్తకాలను దృష్టిలో పెట్టుకొని లక్షణం చేసినా అవి అన్నింటికి వర్తిస్తాయి

ముక్తకం సాధారణంగా వ్యంగ్యపూరితమైన రచన ఈ ప్రక్రియ ధారణానుకూలమైనది ముక్తకపద్యాన్ని తేనెటీగతో పోల్చవచ్చు తేనెటీగలాగే పరిమాణంలో చిన్నదై, స్వభావంలో తియ్యగ ఉంటూనే అందులో దాని 'కొండి' లాగ గుచ్చుకునే వ్యంగ్యం ఉంటుంది

ముక్తకం మొదటి చూపు (వినుట) లోనే పఠితమస్తిష్కాన్ని మేలుకొలుపుతుంది సద్యఃస్ఫూర్తి దీని ప్రధాన లక్షణం ముక్తకాన్ని వినడం ప్రారంభించగానే పఠితలో ఉద్బుద్ధమయ్యే కుతూహలాన్ని పద్యం ముగిసేలోగా తృప్తిపరచగలగాలి సాధారణంగా పద్యంలో రెండుపాదాలున్నా, నాలుగుపాదాలున్నా చివరిపాదంలో ఓ మెరుపువాక్యంతో పూర్వభాగమంతా జిగేలుమంటుంది[55] అంటే అనుకోని విధంగా ముగియడం దాని ముఖ్యలక్షణం పూర్వ పాదాల్లో లేవనెత్తిన ప్రశ్నలకు చురుకైన సమాధానాల్లో రెండు వైరుధ్యాలను సృష్టించి, వాటి సంఘర్షణలో పుట్టిన పరిష్కారాలతో ఉన్న ముక్తక రచన సజీవంగా ఉంటుంది ముక్తకానికి క్లుప్తత అందం ఈ సంక్షిప్తతే అనవసరమైన విషయ వివరణ అనే దోషం పట్టకుండా దీనిని కాపాడుతుంది

పై ముక్తకలక్షణాలు చాలావరకు వేమనపద్యాలకు వర్తిస్తాయి సద్యస్ఫూర్తి కలగడానికివెనక బోలెడంత నేపథ్యం ఉన్నదనీ, అందుకే పఠిత మస్తిష్కం వెంటనే జాగృతమవుతున్నదని విస్మరించరాదు వేమన్న కవితా వస్తువు ఏమిటో శ్రోత మనసుకు తెలుసు కాబట్టి వేమన పద్యార్థాన్ని అనుభవించడానికి వివృత ద్వారాలతో సిద్ధంగా ఉంటుంది

వేమన పద్యాల ఉద్యమం పండితుల, రాజుల దృష్టిలో బలంగా పడేంతవరకు వచ్చి ఉండదు వారికన్నా తన కవిత్వం భిన్నమైనదన్న స్పృహ వేమన్నకున్నదన్న దాఖలా వేమన్నలో కనిపిస్తుంది వేమన్నది లోకదృష్టి లోకదృష్టిలేని కవులు వేమన్నను కవిగా

---

55 Encyclopedia of Britanica

పరిగణించి ఉండరు. అయితే సామాజిక వ్యవస్థ మీదనే ధ్వజమెత్తాడు కాని నాటి కవితాపీఠాలను ఎదుర్కోవాలన్న దృష్టి వేమన్నకు లేదు. సంప్రదాయ కవిత్వ ప్రభావం వేమన్న మీద లేనట్టే అతని ప్రభావం కూడ దాని పైన పడలేదు. కాని నాటి కవితాపీఠం పోకడలను ఈసడించుకునే పద్యమొకటి వేమన్నలో కనిపిస్తున్నది.

తోట కూరకైన దొగ్గలి కైనను
తవిటి కుడుముకైన తవిటికైన
కవిత చెప్పనట్టి గండ్యాలు ఘనులైరి. (డి. 1723, 579)

ప్రబంధ కవిత్వాన్నీ, ప్రౌఢంగా వెలువడిన ఇతర శతకాలనూ దృష్టిలో ఉంచుకొని వాటిప్రకారం వేమనపద్యాలకు విలువకట్టడం వలన ఇవి కవిత్వం కాకుండా పోయాయి అయితే వేమన్న ఎన్నుకున్న వస్తువు అతడు తన పద్యాలకు ఎంచుకున్న శ్రోతలనుబట్టి ఏర్పడింది తన పద్యాలకై శ్రోతలకు ఆమోదయోగ్యం కాగలిగినటువంటి లోకవృత్తాన్ని ఎన్నుకున్నాడు. చాతుర్వర్ణ్య వ్యవస్థ మీద ఖండన, ఆర్థిక అసమానతల నిరాకరణ, అమానుష విలువలన్నింటి మీద ధ్వజమెత్తడం – ఇవన్నీ తెలుగు సాహిత్యంలోనే మొదటిసారిగా వేమన్నకు కవితా వస్తువులయినాయి.

వేమన పద్యాలలోని వస్తువుకి అప్పటి సామాజిక సన్నివేశ సందర్భమే ఆశ్రయం. 17వ శతాబ్దపు మత సాంఘిక పరిస్థితుల నుండి వాటిని వేరుచేసి చూడడంవల్ల ఆ కవిత్వపు అసలు తత్త్వం మరుగున పడిపోయే ప్రమాదం ఉంది వాటి ప్రేరక శక్తుల అవగాహనలేక వాటికి సరియైన విలువను నిర్ణయించలేము అప్పటి పరిస్థితుల లాంటివి ఇప్పటికీ కొన్ని ఉండడంవల్ల వాటికి సందర్భశుద్ధి ఇంకా నశించిపోలేదు అటువంటి పద్యాలే ఇంకా ప్రజలనోటిమీద ఆడుతున్నాయి

అంతేకాక వేమన పద్యాలలోని వస్తువు అతని వ్యక్తిగత (Subjective) అనుభవం కాదు "విశ్వదాభిరామ వినుర వేమ" అని తన్ను తాను సంబోధించుకున్నట్టు కనపడినా వేమన్నలో ఆత్మాశ్రయ ధోరణి లేదు అతని అనుభవం వస్తువైన సమాజ పరిశీలన ఫలితంగా కలిగింది అతని అనుభవం ద్వారా శ్రోతలు సమాజాన్ని దర్శిస్తున్నారు అతనిలాంటి అనుభవమున్నవారికి, కనీసం అటువంటి అనుభవాన్ని ఎరిగినవారికి అతనికవిత్వం ఆస్వాద్యమానస్థితిలో ఉన్నదన్నమాట అతని కవిత్వాన్ని విని ప్రతిస్పందించడానికి తగిన 'అభిరుచి' వారిలో సిద్ధంగా ఉన్నదన్నమాట

3. కవి నిర్దేశం

తన కాలంలోని పరిస్థితులనుబట్టి కవి తన దృక్పథాన్ని ఏర్పరచుకుంటాడు ఆ దృక్పథాన్ని ప్రచారంచేయడమే తన కవిత్వపు ధ్యేయంగా నిర్ణయించుకుంటాడు ప్రాచీనకాలంనుండి కవులు ఏదో ఒక ధర్మాన్ని ప్రచారం చేస్తూనే ఉన్నారు పురాణ కవులు తమ రచనల్లో తమ ధర్మనిరూపణ బాధ్యతను స్వీకరించారు.56 ప్రబంధకవులు ధర్మప్రయోజనాన్ని తమ లక్ష్యంగా చెప్పినా ధర్మప్రచారం వారి రచనల్లో పరోక్షస్థితినే

56 ధర్మార్థ కామ మోక్షేషు వైచక్షణ్యం కలాసుచ ప్రీతింకరోతి కీర్తించ సాధుకావ్య నిషేవణం – లభినవగుప్తుడు

పొందినది ఆచరణలో వారు శృంగార వర్ణనకు అనుకూలమైన సన్నివేశాల ఎన్నికలోనే మక్కువ చూపారు జీవితవాస్తవికతలకు ప్రాధాన్యంలేక కల్పితేతివృత్తాల పైన, ముఖ్యంగా శృంగార వర్ణనకు వీలున్న ఘట్టాలు ఎక్కడున్నా వెతికి పట్టుకున్నారు. ఆ కాలపు ప్రభుతకు, విద్వన్మండలికి అలవాటైన అభిరుచిని దృష్టిలో ఉంచుకొని కావ్యసృష్టిని గావించారు ఈ అభిరుచికి భిన్నంగా రచించినవారు ఆ కాలంలో దాదాపు లేరనే చెప్పాలి

వేమన రాజధానులలో ప్రవర్తిల్లుతున్న 'కవితాభిరుచిని ఎరుగని వాడు' కాదు. కాని అతడు తన కవిత్వానికి ఎంచుకున్న శ్రోతలు ప్రభువులు కారు జీవిత వాస్తవాలతో కలతచెందినవాడు కావడం వలన కల్పితేతివృత్తాల ధోరణికి అతని స్వభావం చుక్కెదురైంది అలంకారిక నిర్వచనాలన్నీ కావ్యగత విశేషాల పరిధిలోనే సాగడంవల్ల కావ్యేతరనిర్దేశంతో వెలువడిన పద్యాలు ఆ నిర్వచనాలకు బాధకమైనాయి కావ్య జగత్తులోని పాత్రలద్వారా ధర్మనిరూపణ జరగడంపోయి బాహిరజగత్తులోని వాస్తవికతలతో పేచీపడడం, వాటిని సరిదిద్దే ప్రయత్నంలో సరికొత్త దృక్పథం ఏర్పడడం జరిగేసరికి నాటి విద్యావంతులకు ఇదెట్లా కవిత్వం అవుతుందో తెలియలేదు శ్లేషలు యమకాది పాండిత్య ప్రదర్శన లేక స్వానుభవం నుండి వెడలిన వేమనపద్యాలను కవిత్వమనలేకపోయి ఉంటారు

పైగా వేమన్న, నాటి అభిరుచుల కన్నా వేరుగా చెప్పి ఊరుకున్నవాడు కాదు. నాటి అభిరుచుల కన్నా భిన్నంగా, ముఖ్యంగా వాటికే వ్యతిరేకంగా ధ్వజమెత్తాడు నాటి సంఘవ్యవస్థలన్నింటి మీద బాహాటంగా యుద్ధం ప్రకటించి, నీతి నిజాయితీల పునరుద్ధరణకు నడుం బిగించాడు శిథిలమైన విలువలపట్ల తీవ్రమైన అసహనంతో, దుర్భరమైన భావోద్రేకంతో కోపాన్ని వెలిగక్కినవాడు కాబట్టే, అతన్ని మెచ్చుకోవడానికి భేదాభిప్రాయాలను పక్కకు నెట్టి కనీసం గుణపక్షపాతాన్నికూడ చూపలేకపోయారు

"తన కిష్టములేని పనులుచేయువారిని, తన మాటలను విననివారిని జూచి వారి యజ్ఞానమున 'కయ్యోపాప' మనుటకు బదులు ఇతని కసహ్యము జనించును. ఆ యసహ్యము మనసులో నుండక నోటినుండియు యసహ్యముగానే పలుమారు వెడలును! అట్టి సందర్భములలో తానాడు మాటలలో యుక్తి యున్నదా లేదా యని కూడ విచారింపడు."57

ఇక్కడ 'తన కిష్టము లేని పనులు' అనడంకన్నా సంఘానికి కీడుచేసే పనులు అనడం న్యాయం మానవుని పట్ల అంతులేని ఆర్ద్రత గలవాడు వేమన తిట్టడంలో అతనికి పక్షపాతం లేదు

మానవత్వ వ్యతిరేక గుణాలను నిర్దాక్షిణ్యంగా వేలెత్తి చూపడం, అట్లా చూపగలిగిన సాహసం, ఆ సాహసానికి ఊపిరిపోసే భావావేశం, ఆ భావావేశాన్ని కవితావేశంగా మార్చే సహజశక్తి – ఇవి వేమన్న కలవడిన నిసర్గగుణాలు డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి వేమనను సహజ కవిగా వర్ణిస్తూ –

"Vemana is a poet of nature and a natural poet"58 అని పేర్కొన్నారు

---

57 వేమన – రాళ్ళపల్లి, పుట 103
58 Radio talk, 1950, AIR, Madras, quoted in Vemana, V R Narla, Page 48

## 4. శ్రోత

కవిత్వ రచనా ప్రక్రియలో కవి ఒక భాగం మాత్రమే. పాఠకుడు లేక శ్రోత దానిని ఆస్వాదించేవరకు కవితాసృష్టి పూర్తికాదని భావించవచ్చు

నాటకదృష్టిలో నిర్వచించినప్పటికీ తాత్త్వికంగా సార్వకాలిక నిర్వచనం చేసిన లాక్షణికులు సామాజికుడు 'సహృదయుడు' అయి ఉండాలని గుర్తించారు

'నాయకస్య కవేః శ్రోతుః సమానో అనుభవస్తతః' అని భట్టతౌతుడు సహృదయుని గూర్చి చెప్పాడు కవి, నాయకుల హృదయాలతో సమానమైన అనుభూతిని పొందగలవాడే సహృదయుడు పాశ్చాత్య విమర్శకులుకూడ కావ్యం చదివే పాఠకునికి ప్రధానంగా ఉండవలసింది 'Sympathy' అని చెప్పారు అయితే ఈ సహృదయుడు ఎటువంటివాడు? అతని యోగ్యతలేమిటి? అనే అంశాన్ని ధ్వన్యాలోక వ్యాఖ్య లోచనంలో అభినవగుప్తుడు వివరించాడు:

యేషామ్ కావ్యానుశీలన వశాత్
విశదీభూతే మనోముకురే వర్ణనీయ
తన్మయీ భవన యోగ్యతాతే హృదయ
సంవాద భాజః సహృదయాః

(అనేక కావ్య పరిశీలనం వల్ల, బాహ్య విషయ స్పృహ తొలగిన శుద్ధమైన అద్దంవంటి మనస్సు ఉంటే దానిలో కావ్యంలో వర్ణించబడిన విభావాదులు స్పష్టంగా ప్రతిఫలిస్తాయి. అప్పుడు కావ్యగత నాయకాదులతో తన్మయత్వం సిద్ధిస్తుంది. అటువంటివారు సహృదయులు )

కావ్యాస్వాదనవల్ల సహృదయునికి కలిగే తన్మయత్వాన్ని భావప్రకాశికాకారుడు ఇలా వర్ణించాడు -

యస్తుష్టౌ తుష్టి మాప్నోతి శోకే శోకముపైతి చ
క్రోధే క్రుద్ధో భయే భీరు స్సశ్రేష్ఠః ప్రేక్షకః స్మృతః

(ఎవడు నాయకుని తుష్టిలో తాను తుష్టిని అనుభవిస్తాడో, శోకంలో శోకం పొందుతాడో, క్రోధంలో క్రుద్ధుడవుతాడో, భయంలో భయపడతాడో వాడు శ్రేష్ఠుడైన ప్రేక్షకుడు అంటే సహృదయుడు )

పై ఉదాహరణల్లో కవితో (అతడు సృష్టించిన నాయకునితో కూడ) సమానమైన హృదయానుభూతిని పొందగలిగినవాడే సహృదయుడని తెలుస్తుంది అతనిని ఇక్కడ శ్రోత అందాం

కవి రచన చేస్తాడు రచనలో అతడు వ్యక్తమొనర్చిన భావాలు శ్రోతకు కొత్తకావు; అవి అతనిలో అంతకుముందు వాసనారూపంగా ఉన్నవే కవిత్వంలోని కవి అనుభూతులు శ్రోతలోని అనుభూతులను జాగృతం చేస్తాయి కవి తన భావోద్రేకాలను భాషలో నిక్షిప్తం చేసిపెట్టిన ఆ భావోద్రేకాల సహాయంతో లేక అవి సాధనాలుగా - శ్రోత వాటిని తన హృదయంలో మళ్ళీ సృష్టించుకోవలసి ఉంది శ్రోత హృదయానుభూతిని పొందినప్పుడే కవిసృష్టి కవిత్వ మవుతుంది అది కవిత్వం కావడానికి సాధనాలను మాత్రమే తన రచనలో కవి సిద్ధం చేసి పెట్టాడు ఆ సాధనాలు ఆ కవి అనుభూతి

నుండి జనించినవే కాబట్టి శ్రోత మనసును తట్టిలేపే విచిత్ర శక్తి వాటికి వస్తుంది. అయితే కేవలం ఉద్రేకాలను ప్రకోపింపజేసి మాత్రమే ఆగిపోతే కవిత్వ ప్రయోజనం నెరవేరదు. పైగా దానిని పొందడానికి ఇది ఆటంకం అవుతుంది. కవితానుభూతి ఒక లక్ష్యోన్ముఖం కాగలిగినప్పుడే కవిత్వానికి చరితార్థత లభిస్తుంది

ఏ కవైనా కేవలం ఆత్మానందం కోసమే రచన చెయ్యడు. కవితా రచనలో కవికి ఆనందం ఉంటుంది కాని దానిని ఇతరులచేత అనుభవింపజేయ గలిగినప్పుడే ఆ ఆనందం పరిపూర్ణమౌతుంది కాబట్టి కవితారచనకు ఈ కొసన ఉన్న కవికి, అవతలి కొసన ఉన్న శ్రోత ఎప్పుడూ దృష్టిలోనే ఉంటాడు అంటే శ్రోత యొక్క వ్యక్తిగత ఇష్టానిష్టాలు కవి దృక్పథాన్ని పూర్తిగా శాసిస్తాయని కాదు కాని తన కవిత్వానికి ఎటువంటి శ్రోత కావాలో కవి నిర్దేశించుకుంటాడు తన కవితావేశం వారిలో ప్రతిఫలింప జేయడానికి కావలసిన రచనావ్యవస్థను నిర్ణయించుకుంటాడు.

రచనాశిల్పిగా కవి తన బాధ్యతను నెరవేర్చినా చివరికి శ్రోత యొక్క సానుభూతినే అపేక్షిస్తాడు. అయితే ఇక్కడ శ్రోత మనస్సును లోబరచుకోవడానికి అతణ్ణి ప్రశంసించడం వల్ల లభించే సానుభూతి తాత్కాలికమైనది దీనివల్ల కవిపట్ల అతనికి సావధాన చిత్తం ఏర్పడవచ్చును గాని కవిత్వానికి సహజమైన ప్రతిస్పందన అతనినుండి రాదు. మౌలికమైన మానవత్వాన్ని ఆవిష్కరించినప్పుడు అతని హృదయానికి తాకవలసినవిధంగా తాకి వాసనారూపమయిన మానవభావాలు జాగృతమవుతాయి

అయితే అభినవగుప్తుడు సహృదయుని 'మనో ముకురత్వాని'కి కావ్యపరిశీలనను కారణంగా చెప్పాడు. కాని సహృదయుడు విద్యావంతుడే కానక్కర్లేదు విద్యా గంధం లేని సామాన్యునికి లోకవృత్తపరిశీలనమే దానికి నేపథ్యంగా నిలుస్తుంది లోకంలో పొందిన అనేక అనుభవాలతో అతని హృదయం క్షాళితశుభ్రమై ఉన్నప్పుడు లోకంలో చెలరేగిన భావోద్రేకాలు అతని హృదయంలో నిద్రించి కవిత్వస్పర్శ తగలగానే జాగృతమౌతాయి

వేమన్న పద్యాలకు కూడ పై రెండు రకాల శ్రోతలున్నారు మొదటి రకానికి చెందిన పండితులు కవిత్వం చెవిని పడగానే కవితా ద్రవ్యాలు అందులో ఉన్నాయా, కావ్య నియమాలు పాటించబడ్డాయా అని వెతుకుతారు అలంకారా లెటువంటివి? గుణాలేవి? అని మొదలైన శాస్త్రవిధులు నిర్ణయించిన దృష్టితో, సిద్ధంగా ఉన్న ప్రమాణాలను వర్తింపజేసి చూస్తారు ఆ కవిత్వం ఏ మాత్రం మేర మీరినా వారి కవిత్వాస్వాదనకది అడ్డుతగిలి భంజకత్వ మేర్పడుతుంది ఒక విధంగా వీరు శాస్త్ర పరతంత్రులు వీరు కొత్తపుంతలలో వెలువడిన కవిత్వం, పాత నియమాలకు లోబడి ఉండనందువల్ల, శాస్త్ర జన్య సంస్కారానికీ, ఈ కవిత్వానికీ లంకె కుదరకపోవడం వల్ల, అంతటితో ఆగిపోయి దానిని తిరస్కరించకుండా ఉండలేకపోతారు

అయితే వేమన బోధనలు తిరస్కరింపబడడానికి రాళ్ళపల్లి ఇంకో రకమైన కారణాలు చూపిస్తున్నారు

1. 'అతని సిద్ధాంతములు చదువుకున్న వారికే అర్థము గానివి.'
2. "వానియందేమేని సత్యము గలదేని, యది యతనివలెనే కష్టపడి దేహమును మనస్సును దండించినవానికితప్ప ఇతరుల కనుభవమునకు రాదు."[59]

---

59 వేమన – రాళ్ళపల్లి, పుట 111

కాని వేమన సిద్ధాంతములు అర్ధముగాని వేమన పద్యాలెన్ని? గంభీరమైన వేదాంత విషయములున్న పద్యాలు, వేమన పద్యాలన్నింటిమీద సామాన్య వ్యాఖ్య చేయగలిగినంత అధిక సంఖ్యలో లేవు. కొరుకుడువడని మార్మిక (Mystic) పద్యాల సంఖ్య కూడ స్వల్పమే పైగా వేమన్న చెప్పేది అద్వైతమా? అనే మీమాంస అతనిపద్యాలు విని ఆనందించడానికి ఏమాత్రం ఆటంకాలు కావు. ప్రాథమికమైన మానవత్వపు విలువలు వేమన పద్యాలన్నింటా అనుస్యూతంగా ధ్వనిస్తూనే ఉన్నాయి.

కారణాలవి కావు. వేమన్న చేసిన విమర్శలకు వీరు నొచ్చుకున్నారు. ఒక ప్రత్యేక వర్గనిర్దేశం లేక సామాన్యంగా అందరి బాహిర కృత్రిమ వేషాలపైన శరపరంపరను విసరడం వల్ల అవి వారికి కూడ తగిలి వేమన పద్యాలకు ద్వారాలు మూశారు. **"కావుననే వేషములను, కర్మములను నిందించిన వారెవ్వరుగాని సఫల మనోరథులు కాలేదు."**[60] ఇదీ నిజమైన కారణం. కాని ఇక్కడ సఫల మనోరథపు ప్రసక్తి లేదు. అందరికి ఆమోదయోగ్యమైన వారు ప్రపంచంలో ఎవరూ పుట్టలేదు పైగా వేమన నిర్దేశించిన ప్రత్యక్షశ్రోతలు వీరు కాదు. శ్రోతలుగా సామాన్యులే ఉద్దేశింపబడినప్పటికీ, లాక్షణిక నియమాలను ఉల్లంఘించిన స్వతంత్ర బాణిలో వేమనపద్యాలు సాగినప్పటికీ, సర్వమానవ సహజమైన అంశాలు వాటిలో ఉన్నాయనీ, కవికి మౌలికంగా ఉండవలసిన భావావేశం పుష్కలంగా ఉన్నదనిఅయినా అతనిని ఆదరించే సహృదయత నాటి సమాజంలోని పండితులకు లేకపోయినది

**"కావ్యమునందు అన్ని భావములును హృద్యములుగానే యుండును. మనకు దేనిపై కోపమో, ప్రీతియో కలదో దానిపై కవికిని యట్లే యుండవలయునని తలచుట అన్యాయము; అసాధ్యము. మనకు కావలసినది ఆ భావమును కవి యెంత నిజముగా తీవ్రముగా తా ననుభవించి, మనల ననుభవింపజేసినాడనుటయే కాని వేరుకాదు."**[61]

కాబట్టి కవితాప్రపంచంలో 'అహంకార రాహిత్యం' అవసరమని రాళ్ళపల్లివారు అభిప్రాయపడ్డారు (P 147)

ఇక వేమన్నకు ఆనాడు ప్రత్యక్ష శ్రోతలైన సామాన్యులందరూ వేమన్న పద్యాలను ఆమోదించారని కూడ చెప్పలేము వీరిలో కొన్ని స్థిరమైన అభిప్రాయాలున్న వారు, ఆయా మతాలకు గుడ్డిగా దాసులైన వారు వేమన పద్యాలను ఈసడించుకొని ఉండవచ్చును కాని వారిలో కొందరు వేమన్న కవిత్వం విని సంతోషించారు, ఆదరించారు, నోరారా పాడుకున్నారు వాటిని హృదయంలో పదిలంగా దాచుకొని జీవితంలోని వివిధ సందర్భాల్లో ఉదహరించి, వాటిని విశ్వవ్యాప్తం గావించారు వారిలో చెలరేగే భావాలను వేమన పద్యాలలో దర్శించుకొని ఉత్తేజం పొందారు వీరు కూడ నాటి సంప్రదాయ ప్రవాహంలోని వారే అయినప్పటికీ మానవునిలోని ప్రాథమికాంశాలను గూర్చి చెప్పడం వలన వేమన పద్యాలను విని సంచలించిపోయారు

60 వేమన - రాళ్ళపల్లి, పుట 111
61 వేమన - రాళ్ళపల్లి, పుట 146

## IV. వేమన్న శైలి - భాష

శైలి అనే పదం Style అనే ఇంగ్లీషు పదానికి సమానార్థకంగా వాడుకలో ఉంది. 'శైలి'కి "రచనా కౌశలము గల భాషా సౌష్ఠవము" అని శబ్దరత్నాకరకారుడు అర్థమిచ్చాడు. బ్రౌన్ Style అనే పదానికి తన ఇంగ్లీషు–తెలుగు నిఘంటువులో 'Mannor of writing with regard to language' అనే అర్థం చెప్పాడు. బ్రౌణ్యార్థంలో శైలి అంటే 'ఒక ప్రత్యేక పద్ధతి' అని ద్యోతకమవుతుంటే శబ్దరత్నాకరకారుడు 'అదొక నేర్పు' అనే అర్థాన్ని ధ్వనింపజేస్తున్నాడు. నిజానికి శైలి భారతీయ ఆలంకారికులు ప్రయోగించే పదం కాదు. 'శయ్య' అనే పదమే వాడుకలో ఉంది.

*"యా పదానాం పరా అన్యోన్య మైత్రీ*
*శయ్యేతి కథ్యతే"*

అనేది శయ్యకు నిర్వచనం. 'పదాల యొక్క ఉత్కృష్టమైన మైత్రి' అని భావం. 'పరా' అనేది అస్పష్టమైనది పైన చెప్పిన "ప్రత్యేకత, నేర్పు"లు కూడ ఇటువంటివే. వీటిని నిర్వచించుకోవడంలో అనేక భేదాభిప్రాయాలు ఏర్పడుతుంటాయి 'The problem of style' అనే గ్రంథాన్ని రచించిన మిడిల్‌టన్ ముర్రే అనే సాహిత్య విమర్శకుడు Style ను ఈక్రింది విధంగా నిర్వచించాడు

"Style means that personal idiosyncracy of expression by which we recognize a writer "62

అభివ్యక్తి ద్వారా కవి స్వభావవిన్యాసాన్ని గుర్తించే ప్రయత్నమే శైలి అంటున్నాడు ముర్రే "ప్రత్యేకత, నేర్పు"ల వలెగాక కొంత స్పష్టంగా కవి స్వభావానికీ శైలికీ గల సంబంధాన్ని నొక్కి చెప్తున్నాడు కవి స్వభావమంటే అతని గాఢమైన భావావేశం (decisive emotion), పదార్థాల నిర్దేశం, వాటి ద్వారా అతడు ఆశించిన ప్రయోజనం – వీటిని లెక్కలోకి తీసుకోవాలి

కవి భావోద్రేకం నిరర్థకంగా పుట్టదు అది అతని లక్ష్యానికి ఉన్ముఖంగానే అభిగమిస్తుంది కవిలో కలిగిన భావశబలత వ్యక్తమయ్యే పద్ధతిని భావవిధానమనవచ్చు

"A style must be individual, because it is the expression of an individual mode of feeling "63

ఈ విధంగా శైలి కవిస్వభావంలో ఒక భాగం స్వభావం యొక్క వ్యక్తరూపం ఫలానా విధంగా తప్ప మరో విధంగా రచించలేని అనివార్యత (inevitability) ఉన్నప్పుడే కవి శైలిలో కవి స్వభావాన్ని గుర్తించవచ్చు ఒక కవి ఓజోగుణ ప్రధానమైన భాషలో తప్ప రచించలేడు దాని కతని భావవిధానమే కారణం

ఒక కవి తనదైన ఒక ప్రత్యేకశైలీవిన్యాసంపట్ల ప్రజలకు అభినివేశాన్ని కలిగిస్తాడు

అయితే తనదైన శైలిని ఏర్పరచుకోవడానికి కవి 'ప్రత్యేకత'ను ప్రదర్శించే అంశాలు ఈ కింది విధంగా ఉంటాయి

62 The problem of style - Middleton Murray London, Oxford University press First edition 1922 Reprinted in 1961 and 1965 Page 4

63 Problem of style Page 5

1 వర్ణసంయోజనం
2 పదబంధాల కూర్పు
3 అర్థవ్యక్తీకరణ విధానం
4 వ్యాకరణ విశేషాలు

కొన్ని రకాల వర్ణ సంయోజనం, పద సంయోజనం, వాక్య నిర్మాణాలను ప్రత్యేకమైన అభినివేశంతో, ప్రీతితో ఉపయోగించినట్టయితే అది అతనిశైలిలో భాగంగా గుర్తించబడుతుంది ఈ ప్రీతి అనేది అతని స్వభావంతో ముడిపడి ఉంటుంది

ఛందస్సు కూడ శైలిని శాసిస్తుంది. ఛందస్సు విధించిన పరిమితులకు అనుగుణంగానే కవి తన భావవిధానాన్ని మలుచుకుంటాడు ప్రతిభావంతుడైన కవికి ఛందోబంధనాలు కూడ అలంకారాలుగానే భాసిస్తాయి అంటే ఛందస్సు – కూడ అతని భావాని కనుగుణంగానే ఉంటుంది

కొందరి విషయంలో శైలి ఫలానా విధంగా ఉండడానికి కాలం కూడ ఒక కారణం కావచ్చు తన కాలంలో కవి ఎవరిని శ్రోతలుగా నిర్దేశిస్తున్నాడో తన కవిత్వానికి ఎటువంటి ప్రయోజనాన్ని ఆశిస్తున్నాడో – వాటి మీద కూడ శైలీ విన్యాసం ఆధారపడుతుంది

కాబట్టి పై దృష్టితో వేమన పద్యాలలోని భాషాశైలులను గూర్చి పరిశీలిస్తాను వేమన తన పద్యాల్లో ఎక్కువగా ఏ పదాలను ప్రయోగిస్తాడు? ఎటువంటి పదబంధాలను కూరుస్తాడు? అర్థవ్యక్తీకరణ విధానంలో అతని ప్రత్యేకతలేమైనా ఉన్నాయా? మొదలైన అంశాలను గూర్చి చూడవలసి ఉంది అయితే ఇక్కడ వేమన పద్యాలలోని భాషను గూర్చి బ్రౌన్ ఈ కింది అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు

"It now remains to give some account of my author, Vemana, whose writings are peculiarly useful to those who study the language - the style being simple and variety of topics very extensive These adages exemplified thousands of words inadmissible into more dignified poetry The thought and connection are often abstrue while terms used are quite familiar "64

వేమన్న వాడిన భాష సరళమైనది అని ఒప్పుకుంటూనే, ఆయన వాడిన అనేక పదాలు కావ్యభాషాదృష్టితో అంగీకారయోగ్యాలు కావనీ, పదాలు బాగా తెలిసినవే ఐనప్పటికీ చాలాసార్లు అర్థం కఠినంగా ఉంటుందని బ్రౌన్ వ్రాశాడు

బ్రౌన్ పై అభిప్రాయం చాల ఆశ్చర్యం కలిగిస్తుంది బ్రౌన్ మొట్టమొదటిసారి వేమన పద్యాలలోని భాషాసారళ్యాన్ని చూసే ఆకర్షించబడ్డాడు తెలుగు నేర్చుకుంటున్న విదేశీయులకది ఉపయోగకరమని భావించాడు అటువంటి వాడు వేమన భాష మీద అభిప్రాయం చెప్పవలసి వచ్చినప్పుడు సాంప్రదాయక ప్రమాణాలనే వర్తింపజేశాడు ఇక వేమనపద్యాల్లో అర్థకాఠిన్యమున్న పద్యాలు ఎన్నో బ్రౌన్‌కు మాత్రం తెలియదా?

## 1. పద సంయోజనం

కవిత్వంలోవలెనే వేమన్న తాను ఉపయోగించే భాషకు ఒక ప్రత్యేక ప్రయోజనాన్ని ఆశించినట్టు కనిపిస్తుంది అతని శ్రోతలను బట్టే అతని భాషావ్యవస్థ రూపుదిద్దుకున్నది

---

64 Preface to Vemana 23 Nov 1824

శ్రోతకు సద్యఃస్ఫూర్తిని కలిగించే పద ప్రయోగం అతని ధ్యేయం నాటి కాలంలో వాడుకలో ఉన్న పదాలు, శ్రోతకు తెలిసిన పదాలు, కావ్యభాషలో ఉన్న పదాలు మొదలైనవన్నీ వేమన పద్యాల్లో దొర్లినవి ఇక్కడ వేమన్న అభిరుచి పెక్కు పోకడలు పోయింది తనకు పూర్వమున్న చారిత్రక రూపాలు, వాటి అర్వాచీన రూపాలు, తన కాలంలోని భిన్నమాండలిక రూపాలు మొదలైనవన్నీ అప్రయత్నంగానే అతని అభిరుచికి అనుగుణంగా, ప్రజల అవగాహనకు అనుకూలంగా ప్రయోగించబడ్డాయి

పదాలను ఎన్నిక చేసుకోవడంలో వేమన్నకు చెవికింపుగా ఉండాలనే దృష్టికూడ ఉంది నన్నయ్య చెప్పుకున్న అక్షర రమ్యతకూడ దాదాపు ఇటువంటిదే కాని ఆయన లిఖిత సంప్రదాయపు దృష్టితో చెప్పాడు

వేమన్న కొన్నిరకాల పదప్రయోగాలమీద ఎక్కువ మక్కువ చూపిస్తాడు వేమన పద్యాల్లో వాటికి గల తరచుదనాన్ని (Frequency) బట్టి దీనిని గ్రహించవచ్చు అప్పటి సామాన్య జన వ్యవహారంలో వాటికిగల ప్రాచుర్యాన్ని కూడ దీనినిబట్టి ఊహించవచ్చు అతడు తీసుకున్న వర్ణ్య వస్తువునుబట్టికూడ ఈ పద ప్రయోగాలు అనివార్యమై ఉంటాయి వేమన్న పద్యాల్లో తరచుగా కనిపించే కొన్ని పదాలను చూడవచ్చు.

1 అంగం 2 దేబె 3 గురుడు 4 చిన్నెలు 5 బ్రహ్మము 6 సొడ్డు 7 ఎంగిలి 8 నరుడు 9 ఎడ్డె 10 మొప్పె 11 ఎరుక 12 తొత్తు 13 కష్టుడు 14. గురము 15 వెర్రి 16 ఓగు 17 పసిడి 18 పచ్చ

## 2. పద బంధాలు

సమర్థములైన పదాలు ఒక పదంగా కూర్చబడడం సమాసమని వ్యాకరణకర్తలు నిర్వచించారు రెండు పదాలు సమసించడానికి తగిన నియమాల ఆధారంగా అనేకములైన కొత్త సమాసాలను కూర్చగలిగే వీలును భాషకుగల సృజనాత్మకశక్తిగా ఆధునిక భాషాశాస్త్రవేత్తలు వర్ణించారు

సమాస కల్పనల్లోని సాంకేతిక లక్షణాలను డాక్టర్ భద్రిరాజు కృష్ణమూర్తి ఈ క్రింది విధంగా వివరించారు [65]

'పొడిమాటలు అంకెలలాంటివి. పదబంధాలు సంఖ్యలలాంటివి. అంకెలకు వాటి స్థానాన్నిబట్టి వాటి విలువలను కలిపేతీరును మనం గుర్తుపెట్టుకోవాలి గాని సంఖ్యలను గుర్తుపెట్టుకో నక్కరలేదు. ఏ కొత్త సంఖ్యనైనా మనం సృష్టించగలం. అలానే భాషలో మాటలు నేర్చుకొంటేనేగాని రావు. వాటి కలయికతో పదబంధాలు సృష్టించే తీరులు మనకు భాషాగతంగా అలవడుతాయి. ప్రతి కొత్తసమాసాన్ని మనం గుర్తుపెట్టుకోము. 'మట్టిబొమ్మ' అంటె మట్టితో చేసిన బొమ్మ! 'మట్టి', 'బొమ్మ' అనే మాటలు నేర్చుకోవాలి. ఆ రెండూ ఆ వరసలో కలిస్తే వాటి మధ్య 'తో చేసిన/చేసే' అనే సంబంధం గతార్థమౌతుంది. ఈ నియమం తెలుగు వచ్చిన వాళ్ళందరికి వారికి తెలియకుండా ప్రవర్తించే సమాన సూత్రం. దాన్నిబట్టి 'గాజుసీసా, వెండికంచం, స్టీలుకుర్చీ' లాంటి పదబంధాలు అంతకుముందు భాషలో

---

65 తిక్కన పద ప్రయోగ కోశము – వాల్యూమ్ 2, పీఠిక – డా॥ భద్రిరాజు కృష్ణమూర్తి

వినలివికూడ సృష్టించుకొంటారు. ప్రతి భాషకు విలక్షణంగా ఈ సృజనాత్మక శక్తి ఉంటుంది.'

నుడికారమే ప్రాణధాతువుగా వేమన్నపై సృజనాత్మక శక్తిని పుష్కలంగా ఉపయోగించుకున్నాడు. భాషలో ఇదివరకు నలిగిపోయిన సమాసాలు వేమన పద్యాల్లో అరుదుగా కనిపిస్తాయి. కొత్తకొత్త పదబంధాలకు ఆయన పద్యాలు నిధులు. మాటలను ఎవరూ సృష్టించరు. కాని సాహిత్య గ్రంథాలలోని మాటలు కాక తన కాలంనాటి జానపదుల వాడుకలోని మాటలనే వేమన్న ఏరుకొని ప్రయోగించడం చేత అవి పునఃసృష్టించబడినంత కొత్తమెరుగులు సంతరించుకున్నాయి. రెండు పదాలను మించిన దీర్ఘసమాసాలు వేమన్నలో చాలా తక్కువ.

వేమన నూటికి తొంబదివంతులు దేశ్యపదాలను వాడాడు. సంస్కృత సమాసాలకు కూడ దేశ్య పదాలతోనే కొన్నింటికి అనుకరణలను కూర్చినాడు వేమన వాడిన కొన్ని పదబంధాలను ఈ కింద ఇస్తున్నాను. వీలయిన చోట్ల పదాల మధ్య సంబంధాన్ని కూడ పరిశీలిస్తాను.

*1.* ***బొమ్మగుడ్డు:*** సంస్కృత రూపం బ్రహ్మాండము. బొమ్మకు 'బ్రహ్మ' అని బ్రౌణ్యం అర్థమిచ్చింది. "పరగ బొమ్మగుడ్డు పరికింపజూచిన కులములన్ని యందు..." (డి 1721, 208.)

*2.* ***పుట్టుచావులు:*** జనన మరణములు (సంస్కృత రూపము). "పుట్టుచావులందు బోయిన విధమున" (డి 1723, 931) 'పుట్టు' అనే ధాతువుకు జన్మించు అని అర్థం బ్రౌన్ 'పుట్టు' విశేషణంగా ఇచ్చాడు దీనిని విశేష్యంగా పరిగణించి జననము అనే. అర్థంలో వాడడం అరుదు.

*3.* ***కల్లపుడమి:*** మిథ్యా జగత్తు (లేక జగన్మిథ్య) అనే సంస్కృత సమాసం వల్ల ఏర్పడి ఉండవచ్చునిది. "కల్లపుడమి నొంది కడతేర నేరక" అని ప్రయోగం. (డి. 1773, IV 1628)

*4.* ***బానిస కొడుకులు:*** 'దాసీపుత్రులు' అని సంస్కృత నాటకాల్లో వాడతారు బహుశా ఆనాడిది పెద్ద తిట్టేమో! వేమన్న దీనిని తరచుగా ప్రయోగిస్తాడు "పసిడి గల్గువాని బానిస కొడుకులు" (డి 1721, II 233)

*5.* ***పదటి కొడుకులు:*** 'పదరు' అనే తమిళ పదం నుండి ఏర్పడిన తెలుగుపదం పదడు పదడుకు trash, rubbish అని బ్రౌణ్యం అర్థం చెప్తున్నది "పదటి కొడుకులకును భ్రమయేల దీరదో" (డి 1727, 365) 'పదడైన చేతలు' అని వేమన్న మరోచోట వాడాడు

*6.* ***ఓగుబాగులు:*** "ఓగు బాగెరుగని వొట్టి మూఢజనంబు" (డి 1721, I 120) ఓగు అనే పదం వేమన్న ఎక్కువగా ఉపయోగిస్తాడు 'ఓగునోగుమెచ్చు' (డి 1721, I 31) అని మరోచోట ప్రయోగిస్తాడు Evil, harm, wickedness, a fool, a weak creature అన్నవి బ్రౌనిచ్చిన అర్థాలు ఇప్పుడు 'బాగోగులు' అన్న తిరగేసినరూపం వాడుకలో ఉంది వేమన్న కాలంలో ఓగుబాగులనే వాడుక ఉందేమో!

*7.* ***మరగాలు:*** కృత్రిమ పాదం అని బ్రౌన్ 'మరగాళ్ళు వేసుకు కూర్చోవడం' అనే అర్థంలో వేమన ప్రయోగించాడు "మాట వినని యాలుమగనికి మరగాలు" మరగాలు వేసుకొని కూచోవటం అశుభమని నమ్ముతారు

*8. దొంగతెలివి:* 'దొంగతెలివిచేత దొరకునా మోక్షము.'

*9. లంజకాడు:* వారకాంత 'లంజ' అయితే ఆమెను చేరబోయే విటుడు 'లంజకాడు' అంటాడు వేమన తద్ధిత ప్రత్యయాలు చేర్చిన మరికొన్ని ప్రయోగాలు ఈవిధంగా ఉన్నాయి· లేమికాడు, తిరిపెకాడు (బిచ్చగాడు), తెరవుగాడు (బాటసారి), చాకిగాడు (చాకలి).

*10. వాడవదినె:* "వాడవదినె కేల వావివర్తనములు"(డి. 1721, 235) వేశ్యకు బదులుగా వాడిన అసామాన్య ప్రయోగమిది వేమనకు మూడువందలేండ్లు తరువాతివాడైన శ్రీశ్రీ ఈ పదబంధాన్ని ఒక అనువాదంలో వాడుకున్నాడు. 'వెర్రివాడి పెళ్ళాం వాడకెల్లా వదిన' అనే సామెత కూడా ఉంది.

*11. నడపీనుగ:* 'కుడువ ముడువలేక కూడు బెట్టగలేక, విడువనుడువలేక విద్యలేక, నడువ నేరనివాని నడపీనుగందురు' (డి. 1723, 309) 'జీవచ్ఛవ' శబ్దానికి పర్యాయపదమిది. ఇంటిముందు సజీవమాత్రుడు ఉన్నవాడు అని అర్థం చెప్పకోవచ్చు తిక్కన **నడమోదుపులు, నడదివియలు** అని ప్రయోగించాడు రాజులకు గౌరవ సూచకంగా నడదివియలు పట్టుకొంటారు, నడదివియలు అంటే నడవనడవకు (మెట్టుమెట్టుకు లేక అడుగడుక్కీ) ఒక దీపం అని అర్థం ఊరేగింపులో పట్టే దివిటీలను 'నడదివియ' లంటారు సామంతరాజుల కిరీటకాంతులే నడదివియలుగా ధర్మరాజుకు ఉన్నాయని భారతంలోని వర్ణన సుమతికారుడు కూడ **"నడపీనుగ వచ్చెననుచు నగుదురు"** అని వాడాడు తెలుగు వ్యవహారాన్నీ, నుడికారాన్నీ పట్టించుకున్నవారే ఇటువంటి ప్రయోగాలు చెయ్యగలరు

*12. వార్తకాడు:* "వార్తకెక్కు" అని ప్రయోగం అంటే ప్రసిద్ధికెక్కుట (డి 1721-2-296) అనే సామాన్యార్థంలో కూడ వాడాడు కాని ఇక్కడ 'వార్తకాడు'ను వాగుడుకాయ అనే అర్థంలో వాడాడు బ్రౌన్ కూడ ఈ పదబంధానికి talkative person, మాటకారి అని అర్థాలిచ్చాడు 'నేర్తునన్నవాడు వార్తకాడు' అన్నది ప్రయోగం

*13. చేడెకొడుకు:* 'చేడెకొడుకు' మిగుల సేయు నాచారము' (డి 1773 Vol IV, 1847)

ఈ పదబంధంలో 'చేడె'కు విడిగా స్త్రీపరంగా మంచి అర్థమే ఉన్నది damsel, lass అని బ్రౌణ్యం కాని పై పద్యంలో 'లంజకొడుకు' అనే నిందార్థమే ఉద్దేశించాడు వేమన

*14. కానిపద్దు:* 'ఒరుల మోసపుచ్చి యొకరూక పాతికె, కడుపు నించుకొనుట కానిపద్దు, రుణము మోసి నరుడు రూఢికి నెక్కునా?' (డి 1727, 460)

కాని పద్దు అంటే 'అన్యాయమైన పద్దు' అనే జాతీయార్థంలోనే వాడబడింది లెక్కలోనికి రాని పద్దు అన్నమాట పరాన్నభుక్కుల జీవితం లెక్కలోనికి రానిది అని అర్థం పురముగాని పద్దు, లెక్కసరిగా లేనిపద్దు, తప్పులు పట్టేందుకు, అవమానించేందుకు వీలయిన పద్దు "నీ పద్దు నే నొప్పకోను" అని కడప జిల్లాలో విన్నాను 'కాని' అంటే పూర్తికాని అనే సామాన్యార్థంతో వాడిన పదబంధాలు కూడ వేమన్నలో కనిపిస్తున్నాయి "కాని పనులు కానెకావు భువిని" (డి 1726, 112)

*15. కష్టలోభి:* 'కష్ట' అనేది పూర్వపదంగా అనేక పదబంధాలు చేశాడు వేమన్న 'కష్టుడు' అంటే నీచుడు (ఉదా చూడు. డి 1727, 42).

ఇవేకాక ఈకింది మరికొన్ని పదబంధాలు చూడవచ్చు

*16. కూలినాలి:* కూలి అంటే ఒక ఏర్పాటు. నాలి అంటే ఏర్పాటులేని వెట్టిచాకిరి. అంటే పట్టెడన్నానికి పని దంచడం, విసరడంలాంటి పనులు నాలిపనులు ఆ పనులకు ఇంత బువ్వ, అదీ ప్రేమతో పెట్టేది కాదు. పని దొంగకు నాలిముచ్చు అని ఉపయోగిస్తాడు.

*17. వట్టి బీరం,* 18 మొండిదొర, 19 సుఖశీలి, 20 పేద విటుడు, 21 దిమ్మరితనం, 22 పర్రెనోరు= పర్రెగా మాత్రమే మిగిలివున్న నోరు, మంచినోరు కాదన్నమాట. సారంలేని నోరు, 23 మద్యపాని, 24 కల్లుముచ్చు= కల్లు దొంగిలించి తాగేవాడు, 25. పంజ కొడుకు, 26 కూలి విటుడు= ఎదురుడబ్బు తీసుకునే విటుడు, వెలవిటుడు, 27 చిక్కుబంతి= గుండ్రటి దారపు ఉండ, 28 బండ సంసారము= లాలిత్యంలేని కుటుంబమన్నమాట, 29 కొదవ విటుడు= రెండవ విటుడు

3. రాయలసీమలో వాడుకలో ఉన్న ప్రయోగాలు

వేమన్న పద్యాల్లో దొర్లిన కొన్ని పద్యాలనుబట్టి వేమన్న రాయలసీమవాడై ఉండవచ్చునని బ్రౌన్ ఊహించాడు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు కూడ వేమన్న రాయలసీమ వాడనడానికి ఓ ఆధారంగా వీటిని నిరూపించారు అయితే ఈ దారిలో భాషాశాస్త్ర ప్రమాణాల సాయంతో ప్రత్యేక పరిశోధన జరగవలసి ఉంది వేమన్న నాడు వ్యవహారంలో ఉన్న అనేక పదాలు నేటి వ్యవహారంనుండి తొలగిపోయి ఉండవచ్చు నేటికీ వ్యవహారంలో ఉన్నవి కొన్నింటిని కింద ఇస్తున్నాను ఇవి తెలంగాణా, సర్కార్లలో లేకుండా రాయలసీమలో మాత్రమే ఉన్నవి అయితే ఈ సమాచారం నేను జరిపిన విచారణల ఆధారంగా ఇస్తున్నదే ఇందులో వాస్తవ విరుద్ధాలేమయినా ఉండి సహృదయులు నా దృష్టికి తెస్తే దిద్దుకోవడానికి సిద్ధంగా ఉన్నాను

*1. బిత్తలి:* దిసమొలవాడు(ది) అని అర్థం 'వెలది సురతవేళ బిత్తలై యుండదా?'

*2. మెట్ట:* 'ఏరుదాటి మెట్టకేగిన పురుషుండు' 'మెట్ట'ని ఒడ్డు అనే అర్థంలో వాడాడు ఈ అర్థమే ఇప్పటికీ వ్యవహారంలో ఉందట! గుంపుగా కూర్చునే నిర్ణీత స్థలాన్నికూడ కర్నూలు జిల్లాలో మెట్ట అంటారట

*3. వల్ల దప్పట:* "వల్లదప్ప వెనుక వంటకమే మిత్తి" రాయలసీమ జనుల రసనాగ్రాలమీద నేటికీ ప్రాణంతో ఉందీ ప్రయోగం అనుకున్నట్టు జరగనిది, చేయిదాటిపోవడం అని దీనికర్థం

*4. పలుకుట:* బదులు పలుకుట అనే అర్థంలో ఉంది "పలుకుమన్న నేల పలుకక ఉన్నావు?" అని వేమన ప్రయోగం

*5. దుద్దుట:* కొట్టుట

*6. ఎద్దె:* "ఎద్దెరెడ్డి కులమదేమని చెప్పదు" అని వావిళ్ళ ప్రతిలోని ప్రయోగం ఎద్దెతనం అంటే Brutishness అని బ్రౌన్ అర్థమిచ్చాడు రాయలసీమలో నేను

విన్నంతవరకు ఎడ్డేలేదు – ఒడ్డె ఉంది రాతిగోడలను కట్టే శ్రామికులను ఒడ్డెలంటారు. ఒడ్డెకు వికారం అని కూడా అర్థం ఉంది సరిగ్గా అలంకరించుకోలేనివాణ్ణి "ఒడ్డెనాయాల" అంటారు ఎడ్డె, ఒడ్డె రూపాంతరాలు అవునోకాదోగాని పాండురంగ మాహాత్మ్యంలోని ప్రయోగాన్నిబట్టి సమానార్థకాలు వినిపిస్తున్నాయి. "ఎడ్డెతనపు కైసేతలె – అడ్డులు నడచిరి పురస్సర దార్యముగా"

*7. కొల్లి:* సమృద్ధిగా, ఎక్కువగా అనే అర్థాలున్నాయి "కొల్లగా కళ్ళంనిండా గింజలు రాసిపోసినారు, కొల్లపోయిందేమి? (ఊడుకొనిపోయిందా?) కొల్లలుగా వెల్లువొచ్చింది" అని వాడుకలు "వాడు ఒట్టి కొల్లముండాకొడుకు" అని డబ్బుదుబారా చేసేవాణ్ణి అంటారు ఇవేకాకుండా పచ్చ = బంగారం; తెలుపు = వెండి; దేబె; ముప్పె; తుత్తు; తిర్రి; గుల్ల = గవ్వ; వలికి = శ్మశానం; కడుగు = బియ్యం కడిగిననీరు మొదలైన మాటలు వేమన పద్యాల్లో కనిపిస్తున్నాయి

## 4. రూపాంతరాలు

కావ్యభాషలో పదాలకు రూప వైవిధ్యం కలగడానికి చారిత్రక అర్వాచీన రూపాలు సంఘంలోని వర్గమాండలికాలు కారణమైనప్పటికీ, వేమన్న వంటి ప్రజాకవి వాడే పద్యాల భాషలోని రూపాంతరాలకు అతని కాలంలోని భిన్న ప్రాంతాల ప్రజల వాడుకలలో ఏర్పడ్డ ఉచ్చారణ భేదాలు ముఖ్యకారణమై ఉంటాయి

*1. ఎద్దు మద్దుదు:* 'ఎద్దు మొద్దడు' అనేరూపం వ్యవహారంలో ఉంది బ్రౌన్ కూడ దీనినే ఆరోపంగా ఇచ్చాడు brobbery, great hulking boy అని బ్రౌనిచ్చిన అర్థాలు వేమన్న ప్రయోగంలో ఇది 'ఎద్దుమద్దుడు'గా రూపాంతరం చెందింది

'ఎద్దుమద్దుని కేల వేద శాస్త్రంబులు' (డి, 1723, 369)

*2. 'ఆర్త విద్యలు':* 'ఆర్త విద్యలెల్ల యపకీర్తిపాలాయె, వార్తకెక్కు ఎంతవారికైన, యార్తవిద్యలెల్ల ధూర్తుల పాలాయె' (డి 1721 II 296) అర్ష విద్యలు కావచ్చునిది.

*3. వాచారి:* "యోనియందె బుట్టి యోనికి వాచారి, యోని లోపలి చవి గానలేరు, యోనిజూచి పరమయోగంబు మరతురో" (డి 1777 V 3183) 'వాచరచి'కి రూపాంతరం కావచ్చు వాచరచికి మొత్తుకోవడం అని అర్థం వా = నోటిమీద, చరుచుకుంటూ అరవడం అన్నమాట

*4. గురము:*

*గురము గూడుగ జేసి గుణము వత్తిగ జేసి*
*సరవి కర్మ సమితి జపము జేసి*
*మూల నొక్క జ్యోతి ముట్టించిచూడరా!* (డి 1773 V 2069)

ఇది 'గృహము' నకు బదులుగా వేమన మాత్రమే వాడిన రూపమని బ్రౌన్ వ్రాశాడు వేమన పద్యాల్లో పెక్కుచోట్ల ఈ ప్రయోగముంది బ్రౌన్ దీనిని నిఘంటువులో ఒక ఆరోపంగా చేర్చుకున్నాడు రాయలసీమలో నేను వాకబు చేసినంతవరకు ఎవరూ ఇది వ్యవహారంలో ఉన్నట్టు చెప్పలేదు వేమన్న నాడు వ్యవహారంలో ఉండి నేటికి వ్యవహారచ్యుతమయి ఉంటుంది నాగరికత వలన ఉచ్చారణలో మార్పులు వస్తాయి కదా!

*5. కొంచబోడు:* కొనుచుబోడు (తీసుకొనిపోడు) రాయలసీమ ప్రాంతాలలో ఇప్పటికీ వాడుకలో ఉంది. 'కొంటబోడు' అని మరో రూపం కూడ ఉంది.

## 5. వ్యాకరణ విశేషాలు

*1. ఎర్రనాడు దాని:* హ్రస్వ ఇకారానికి సంధి చేయడం చాలా అరుదు కాని వేమన చాలాచోట్ల ఇత్తునకు సంధి చేస్తాడు

ఉదా॥ అన్నిటందు, మేదినందు, ముక్తేల, పైడాస మొదలైనవి.

*2. కంతయందు వెడలి:* "కంతయందు వెడలి కంతకు నాశించి, గాసిపడగనేల కంతచేత, కంత విడుచువాడు ఘనమైన యోగిరా" (డి 1773 V 3170) ఇప్పుడైతే 'కంత నుండి పుట్టాడు' అని అంటాము కాని వేమన్న సప్తమిలో ప్రయోగించాడు

*3. మంటజేసిన పులి:* "మహిమ లేని వేల్పు మంటజేసిన పులి" (డి 1724, 149) 'మన్నుతో జేసిన పులి' 'మంటన్' అనగానే సప్తమ్యంతంగానే స్ఫురిస్తుంది ఇక్కడ తృతీయావిభక్తిలో వాడబడింది

*4. నీటిలోని వ్రాత:* నీటిమీది వ్రాత అనే ప్రయోగానికి బదులుగా 'లోని'ని వేమన్న వాడాడు 'నీటివ్రాత' అనే వాడుక కూడ ఉంది

కొన్ని అన్యదేశాలుకూడ వేమన పద్యాల్లో కనిపిస్తున్నాయి

1. **జింజిరీలు:** 'చిన్నచిన్న శిశువులు జింజిరీలు' (డి 1723, 418)–గొలుసులు జంజీర్ జింజిరుగా మారి ఉంటుంది A chain, గొలుసు అని బ్రౌన్ మిశ్రభాషా నిఘంటువులో లర్థమిచ్చాడు వేమన పద్యాల్లో అన్యదేశ్యాలు ఐదారు కన్నా ఎక్కువ లేవు అవికూడ గులాము, అల్లా, బిక్క, మహమ్మదు, జంజీర్ వంటి రాజకీయ మతపరమైనవి వేమననాటికి హిందూ జీవితంలోనికి మహమ్మదీయ ప్రభావం గాఢంగా చొచ్చుకొనిపోకపోవడంవల్ల ఇంకా అనేక పదాలు ప్రవేశించి ఉండవు

2. **బిక్కలు:** 'బిక్కలు బడుగులు పెక్కండ్రు గూడిన, కాకపోదు యంత కార్యమైన, నారమోకు చేత నరులు తేరును దియరె' (డి 1723, 936) బీఖ్ (బిక్షము) నుండి వచ్చి ఉంటుంది 'దిక్కుమాలిన బిక్క పకీరితనము' Abject Poverty అని బ్రౌన్ మిశ్రభాషా నిఘంటువు

ఇంతవరకు పై ప్రయోగాలు చాలావరకు వేమన పద్యాల్లో ముఖ్యమైనవి వేమన్న చెప్పిన భావాలు ఎక్కువగా ఈ పదాల సహాయంతోనే వ్యక్తమైనాయి వేమన పద ప్రయోగకోశం కనుక అవతరిస్తే వేమన్న శైలిని సమగ్రంగా ప్రదర్శించడానికి వీలు కలుగుతుంది

భాషాదృష్టితో ఇతర కవులెవరికి లేని విశిష్టత వేమన్నకుంది వేమన్న భావాలను ఆదరించనివారు కూడ వేమన అలతి అలతి పదాల భాషను అభిమానించకమానరు ఈ విషయంలో వేమనతో పోల్చదగిన మరో తెలుగు మహాకవి తిక్కన సోమయాజి మాత్రమే ఈ సందర్భంగా వేమనభాషను గూర్చి శ్రీ నార్ల వెలిబుచ్చిన ఈ క్రింది అభిప్రాయం ఉటంకించదగింది

"Even those who are averse to the thought of Vemana have to admit that his poetic diction is unique. It is simple without being banal. Sweet without being cloying It has all the verve and variety of popular speech of which, as stated in the first chapter, he is a supreme master. True, at places his poetry lacks clarity, but this happens only when he is dealing with highly mystical experience "66

## V. సంవిధాన శిల్పం

ఆటవెలది పద్యాలను ఎందరో అల్లారు. కాని అది వేమన సొంతమైంది. దానికాయన కవిత్వమంతా ఆటవెలదులలో సాగడమే కాకుండా దాని నిర్మాణంలో ఆయన ప్రదర్శించిన ప్రత్యేకతలు కారణం ఈ పద్యరచనలో ఆయన సాధించిన చందో వైలక్షణ్యంతోపాటు అర్థాభివ్యక్తికి అనుగుణంగా పద్య శరీరాన్ని మలుచుకోవడంలో ఆయన ఏర్పరచుకున్న పధకం (Formula) వేమన్న శైలికి ఒక విశిష్టగుణాన్ని సంతరించిపెట్టింది ఆటవెలది ఛందస్సులో ఆయన చూపిన మెళకువలను గురించి ముందు ముందు వివరిస్తాను

మకుటం పోగా మిగిలిన మూడు పాదాలలో అభివ్యక్తికి వేమన్న అనుసరించిన పద్ధతిని గూర్చి శ్రీశ్రీ ఈ క్రింది విధంగా విశ్లేషించారు

"....సాధారణంగా తన పద్యంలో వేమన్న యేం చేస్తాడో తెలుసా? Marx చెప్పిన Thesis, Antithesis ల synthesis చూపిస్తాడు. చూడు, మొదటి పాదంలో ఒక సంగతి చెబుతాడు. ఆ రెండూ ఒకదానితో ఒకటి పోరాడుతూవుంటే మూడోపాదంలో తానుగా సాక్షాత్కరించి సమన్వయం చేస్తాడు. ఉదాహరణకి ఉప్పుకప్పురం పద్యం తీసుకో. 'ఉప్పు కప్పురంబు నొక్క పోలిక నుండు' అని మొదటిపాదంలో చెప్పి వెంటనే రెండవపాదంలో "చూడ చూడ రుచుల జాడవేరు" అంటాడు. ఈ పరస్పర వ్యతిరేక శక్తుల సంఘర్షణలోంచి ఒక సమన్వయం, ఒక ఉపదేశం, ఒక నీతి, 'పురుషులందు పుణ్య పురుషులు వేరయా' లాంటిది మన కందిస్తాడు."67

శ్రీశ్రీ చెప్పినట్లు పై పద్యంలో రెండు విరుద్ధ శక్తుల సంఘర్షణ లేదు dialectics పరిణామాన్ని సూచిస్తుంది పై పద్యంలో రెండు వేరువేరు పదార్థాల రూప సామ్యం, గుణవైరుధ్యాల ఆధారంగా (లేక దృష్టాంతంగా తీసుకొని) ఒక లోకసత్యాన్ని చెప్పే ప్రయత్నం జరిగింది శ్రీశ్రీ భావించినట్టు మొదటి పాద భావం రెండవ పాద భావంతో పోరాడటం లేదు

శ్రీశ్రీ చెప్పిన అభిప్రాయాన్ని 'విమర్శకుడుగా శ్రీశ్రీ' అనే వ్యాసంలో డాక్టర్ చేకూరి రామారావు వేమన పద్యాల్లో dialectical materialisism technique లేదని ఈ కింది విధంగా ఖండించారు

66 Vemana - V R Narla, Page 48

67 కవిత్రయం – శ్రీశ్రీ వ్యాసం, రేడియో ప్రసారితం, హైదరాబాదు కేంద్రం ముద్రణ తెలుగుదేశం, 1954, అక్టోబరు 25

"ఈ Technique పైవేమన పద్యంలో ఎక్కడుందో ఈ వ్యాసకర్తకు అందటంలేదు. ఉప్పు - కప్పురం రెండు వేర్వేరు పదార్థాలు. అవి వేరుగ ఉండటం వాటిగుణాల్ని చెప్పటమే కాని, పరిణామాన్ని సూచించటం కాదు గదా - పరిణామమే లేనప్పుడు ఇక dialectics ఎక్కడ? శ్రీశ్రీ ఆపాదించదల్చుకున్న dialectic technique శాస్త్రప్రమాణానికి నిలవదు. అంటే శ్రీశ్రీ thesis, antithesis, synthesis అనే మూడు మాటలకు ముగ్గుడె, అవి పరిణామ గతిని సూచించే పదాలన్న సంగతి విస్మరించాడన్న మాట."[68]

"భిన్నశక్తుల సంఘర్షణ కాక, విరుద్ధగుణాలను దృష్టాంతంగా తీసుకొని, వాటిని ఆధారంగా చేసుకొని ఒక తెలిసిన సత్యాన్నే ప్రాణవంతంగా ప్రతిపాదిస్తాడు", అని చెప్పుకుంటే వేమన్న భావవ్యక్తీకరణ కెన్నుకున్న కొన్ని మూసల్లో ముఖ్యమైన మూసగా దీనిని భావించవచ్చు

మరో ఉదాహరణ చూద్దాం·

మేడిపండు చూడ మేలిమై యుండును
పొట్ట విచ్చి చూడ పురుగులుండు
పిరికివాని మదిని బింకమీలాగురా!

ఇక్కడ పైకి బింకంగా ఉండి మదిలో కుళ్ళుతో ఉండేవానిని గూర్చి చెప్పదల్చుకున్నాడు దీనిని వర్ణ్యం అనవచ్చు. అటువంటి వాడిని పైకి మేలిమిగా కనపడ్తూ లోపల పురుగులుండే మేడిపండుతో పోల్చి చెప్పాడు ఒక వస్తువులో రెండు వైరుధ్యాలను దృష్టాంతంగా తీసుకొని ఒక వ్యక్తిలోని ద్వంద్వ భావాలను విశదం చేస్తున్నాడు

"Generally speaking, he (Vemana) devotes the first two lines of his ataveladi to state the idea he wants to convey, to drive it home, he then gives a brilliant analogy in the third The fourth line is only an ornament, a makuta It should be evident from this analysis that the whole beauty of the stanza rests on his singular analogy or dristanta given in the third line A good shot may occasionally miss his mark, but not Vemana his analogy His poetic skill and greatness depend, to a large extent, upon it In his hands it has gained novelty and freshness Very often it takes the form of an epigram of similes Vemana is one of analogies"[69]

కాని కృష్ణారావుగారు తిరగవేసి చెప్తున్నారు సాధారణంగా వర్ణ్యం మూడవ పాదంలో ఉంటుంది

సామాన్యంగా వేమన పద్యాలలో ఎక్కువ భాగం ఈ పథకం ప్రకారమే రచించబడ్డాయి కాకపోతే కొన్ని స్వల్ప భేదాలుంటాయి ఒకచోట, వేరువేరు వస్తువుల సామ్యవైరుధ్యాలు

68 'విమర్శకుడుగా శ్రీశ్రీ'- డాక్టర్ చేకూరి రామారావు, సృజన, శ్రీశ్రీ సమాలోచన సంచిక, ఫిబ్రవరి, 1970

69 Dr V Krishna Rao, Vemana - His poetry and philosophy (Published in Half way, the Golden Book presented to V R Narla on his fifty first birthday), 1958

కనపడితే మరోచోట ఒకే వస్తువులోని భిన్న ప్రకృతులు కనపడుతాయి క్వాచిత్కంగా మొదటి రెండు పాదాలు దృష్టాంతమైతే, తరచుగా మూడవ పాదం దృష్టాంతమౌతుంది

## 1. ప్రశ్నార్థక ప్రయోగాలు

వేమన పద్యంలోని మూడవ పాదం ఎక్కువగా దృష్టాంత రూపంలోనే ఉంటుంది ఇది శ్రోతనుద్దేశించి వేసిన జవాబు నపేక్షించని ప్రశ్న (anticipatory interrogation) లాగ ఉంటుంది అంటే – అది విషయ ప్రతిపాదనమే కాని ప్రశ్నరూపంలో ఉంటుంది

1 కంచు మోగునట్లు కనకంబు మోగునా?
2 తలలు బోడులైన తలపులు బోడులా?
3 విత్తనంబు మర్రి వృక్షంబునకు నెంత?
4 చిత్తశుద్ధిలేని శివపూజ లేలరా?
5 పచ్చికుండ నీళ్ళు పట్టిన నిలుచునా?

ఈ ప్రశ్నార్థక వాక్యాలే లోకోక్తులై, సామెతలై తెలుగువాకిళ్ళలో ప్రతిధ్వనించాయి.

"The greatness of his style lies in the use of simple and uninvolved constructions, choice of native idioms and metaphor, and the placement of certain clauses of anticipatory interrogation, all of which stand in contrast to the style of classical poetry These characteristics have made his verses a popular code of ethics and they have come to stay as proverbial sayings in the Telugu language "70

శ్రోతను ఎదురుగా ఉంచుకొని అతనితో మాట్లాడుతున్నట్లుగా ఈ వాక్యాలు కనపడతాయి ఆశుకవిత్వానికి ఇదొక విలక్షణమైన గుణం

## 2. ఒకే చట్రంలో రెండు పద్యాలు

కొన్నిచోట్ల ఒకే కుదుట్లో రెండు పద్యాలు పుట్టడం వేమన పద్యాల్లో కనిపిస్తుంది ఉదాహరణకు

*1* కులములోన నొకడు గుణవంతుడుండెనా
కులము వెలయు వాని గుణము చేత
వెలయు వనములోన మలయజంబున్నట్లు

*2* కులములోన నొక్క గుణహీనుడుండెనా
కులము చెడును వాని గుణము వలన
వెలమి చెరుకునందు వెన్నుపుట్టిన రీతి

పై రెండు పద్యాలలో గుణవంతుడు – గుణహీనుడు, వెలయు – చెడును అన్నపదాలు కీలకమైనవి రెండు పద్యాల తాత్పర్య మొక్కటే ఐనా పై పదాల మార్పిడి

---

70 Forword, Dr Bh Krishnamurthy -
వేమన శతకము, విద్వాన్ పిశిపాటి కృష్ణమూర్తి ఆంగ్లానువాదం, 1977

(replacement) వలన వ్యక్తీకరణలో భిన్నధోరణు లేర్పడ్డాయి (Positive & negative). పద్యవ్యవస్థకు భంగం కలుగకుండా చెప్పే విధానం మారడం వలన తృతీయ పాదాలలో క్రొత్త పోలికలు వచ్చిపడ్డాయి

కొన్ని పద్యాలలో పద్య వ్యవస్థలో కొంత మార్పు ఉన్నప్పటికీ విరుద్ధ భావాలను చెప్పడం కనిపిస్తుంది

ఉదాహరణకు:

*1 చిత్తశుద్ధిగల్గి చేసిన పుణ్యంబు (డి. 1721, 194)*
*2. చిత్తశుద్ధిలేని శివపూజ తనకేల? (డి 1725, 498)*

### 3. పునఃపద ప్రయోగాలు

వేమన పద్యాలలో పదాల అవృత్తులు కొట్టొచ్చినట్టు కనపడే మరో ప్రత్యేకత అసంఖ్యాకమైన వేమన పద్యాలు ఈ రీతిలో రచింపబడ్డాయి ఈ అవృత్తులు వ్యాకరణ పరిభాషలోని అమ్రేడితాలే ఇవి అధిక్యార్థాన్ని సూచిస్తాయి వీటిని పునఃపదాలు అనవచ్చు

ఈ పునఃపద ప్రయోగం రెండు రకాలుగా జరుగుచున్నది.

1 పద్యంలో ఒక పాదంలో శకలాలుగా ప్రయోగించడం

2 పద్యమంతా ఇదే మూసలో సాగడం

ఉదాహరణకు 1 చూడ చూడ రుచుల జాడవేరు
2 అనగననగ రాగ మతిశ యిల్లుచునుండు

పునఃపద బాహుళ్యంతో చెప్పబడిన వేమనపద్యాల సంఖ్య గణనీయంగానే ఉంది

తరువ తరువ బుట్టు తరువున ననలంబు
తరువ తరువ బుట్టు దధిని ఘృతము
తలప తలప బుట్టు తనువున తత్త్వంబు (డి 1721, I 209)

తిరిగి తిరిగి తిరిగి తిరుగంగ తిరుగంగ
తిరిగి తిరిగి కొంత తిరిగి తిరిగి
తిరిగి తిరుగని త్రోవ తిరుగలేడాయెరా (డి 1723, 975)

చదువ చదువ చదువ సభలందు రంజిల్లు
పెనగి పెనగ పతికి ప్రేమ పుట్టు
వినగ వినగ మాట విశ్వాసమైయుండు (డి 1725, 336)

### 4 మూడు దృష్టాంతాలు

మూడవ పాదంలోనే దృష్టాంతంకాక మూడు పాదాలూ దృష్టాంత సహితమైనవీ, ఒక అర్థసూత్రంతో ఉన్నవీ అయిన పద్యాలు కొన్ని కనిపిస్తాయి వీటిలో ఒక పాదం తీసివేసి అలాంటిదే మరోపాదం వేసినా బాధలేదు

ఉలిపి కట్టెకేల నుయ్యేల మంచంబు?
పందికేల చిలుక పంజరంబు?
ముక్కిడి సతికేల ముత్తెంపు ముంగర? (డి 1721, 321)
వీటిలో వర్జ్యం వాచ్యంగా ఉండదు ధ్వనిగా ఉంటుంది

5 వేమన పద్యాలు ఉపమాలంకారాల తెట్టెలు పోలికలులేని పద్యమే దొరకదు అయితే పాదపాదంలో పోలిక కాకుండా పద్యంమొత్తంలో ఒక ప్రధానమైన పోలిక ఆధారంగా ఏర్పడిన పోలికలతో ఉన్న పద్యాలు క్వాచిత్కంగా వేమన్నలో కనిపిస్తాయి వీటిలో ఉపమానోపమేయాలకు అభేదం ఉంటుంది

చిత్తమనెడు వేరు శిథిలమైనప్పుడు
ప్రకృతి యనెడు చెట్టు పట్టును పిదప
కోర్కులనెడు పెద్ద కొమ్మలెండును గదా! (డి 1762, 184)

పైన చూపించినవేకాక వేమన్నకు మాత్రమే ప్రత్యేకమైన కొన్ని మూసపాదాలు ఈవిధంగా ఉన్నాయి.

ఉన్నవాడు యెవడు కన్నవాడెవ్వడు? (డి 1727, 310)
పుట్టనేమి వాడు గిట్టనేమి? (డి 1772, 21)
ఘనుడు గాడు హీనజనుడు గాని (డి 1727, 382)

ఇంతవరకు చూపిన ఉదాహరణల వలన వేమనపద్యాల రచన ఐదారు రకాల పడికట్టు పద్ధతుల్లో సాగుతున్నదని తెలుస్తున్నది పడికట్టు పద్ధతిలో రచన జరగడం అశుకవితాలక్షణమని వెల్చేరు నారాయణరావుగారు తమ సిద్ధాంతగ్రంథంలో నిరూపించారు[71] వేమన పద్యాలు "వ్రాసిన"వాడు కాకపోవడంవల్లనే ఏర్పడిన ఆశుశైలి పైపద్యాలది

5. "వ్యర్థపదాలు"

పద్యాలు వ్రాసేవాడికి లేక చెప్పేవాడికి వ్యర్థపదాలు తప్పవు

రూఢిగాను, కడక, కడగి, కరము, తొడరి, మిగుల, వేగ, మొనసి మొదలైన పదాలు వేమన పద్యాలలో కొల్లలుగా కనిపిస్తాయి వీటికి విడిగా అర్థాలు ఉన్నప్పటికీ, పద్య పరిసరాలలో వీటి అర్థం లెక్కలోనికి రాదు ఇవి లేకున్నా పద్యార్థానికి ఏ మాత్రం భంగం కలగదు అసలు వీటికి పద్యార్థంతో సంబంధమే లేదు అయితే వీటి ఉనికివల్ల కూడ పద్యార్థానికి ఎటువంటి బాధ రాదు లిఖిత సాహిత్యంలో వీటిని వ్యర్థ పదాలంటారు తరచుగా ఛందస్సు కారణంగా ఇవి రచనలలోనికి ప్రవేశిస్తాయి వీటిని పాదపూరణాలని కూడ పిలుస్తారు కాని ఆశుసాహిత్యంలో ఇవి గుణాలే అని వెల్చేరు నారాయణరావుగారు వ్రాశారు[72]

"లిఖిత సాహిత్య ప్రభావం దృష్ట్యా ఇవి నీరస పునరుక్తులుగా కనిపిస్తాయి. కాని కథాశ్రవణం దృష్ట్యా, ఇవి కథనప్రక్రియకి చైతన్యవంతమయిన అలంబనాలు.

---

71 'తెలుగులో కవితా విప్లవాల స్వరూపం – ఆశు సాహిత్యం' ఆంధ్ర కళాపరిషత్తునుండి 1974 లో డాక్టరేటు పట్టం పొందిన సిద్ధాంత వ్యాసం, పుట 8

72 కవితా విప్లవ స్వరూపం – పుట 10

**శ్రోతలు ఈ విధానాన్ని గమనించి రాబోతున్న కథనాన్నీ, అందులో ఆశుకవి అనబోతున్న మాటలనీ ముందే గుర్తించి పాటతో తాదాత్మ్యాన్ని పొందగలుగుతారు. అదీగాక, రచన దృష్ట్యా ఇది ఆశుకవికి కథనం సులువుగా ఒడుపుగా చేసుకుపోగల అవకాశం ఇస్తుంది. సమయసందర్భాలకి అనువుగా కథని పెంచడమో తగ్గించడమో చేసుకోగలగడానికి అవకాశం కలిగించేదికూడా ఈ పడికట్టు పద్ధతే."**

వేమన పద్యాల్లో కనిపించే పాదపూరణ పదాలు కొన్నింటిని ఈ కింద ఇస్తున్నాను. తనర, తగ, మొనసి, సొరది, ఒనర, ఎనసి, ఒప్పగ, తెలియ, కడక, పరగ, ఎలమి, నెరి, అరసి, నెర, అల, తలప, భూమి, తొడరు, కలయ, తలిర్ప, గొబ్బున, మానుగ, నరగ, మహి, మరి, పనుపుగ, ఒగి, చెలగి, అల్ల, ఎలిమి, కదిసి మొ॥వి

## VI. ఆటవెలది

వేమన్న ఆటవెలది ఛందస్సును ఎన్నుకోవడానికి దాని పేరుతో ఏమీ సంబంధం లేదు వేమన్నను గూర్చి ఉబుసుపోకకు మాట్లాడుకునేటప్పుడు చేసే చమత్కారమిది అది దేశీయ ఛందస్సు కావడం, దాని గమన వైలక్షణ్యం చెవికింపుగా ఉండడం మొదలైన కారణాలు సహేతుకంగా కనిపిస్తాయి

ఛందో దృష్ట్యా వేమన ఆటవెలదిని ఉపయోగించుకున్న తీరుకు విశిష్టమైన ప్రయోజనం ఉన్నదని విస్మరించలేము తెలుగులో ఏ కవి పద్యాల కన్నా కూడ వేమన పద్యాలే ఎక్కువగా గళగ్రహణ యోగ్యతను సంతరించుకున్నాయి కాబట్టి వేమన పద్యాలలో ఛందోరహస్యాలు ఏవైనా ఉంటే వాటిని ధారణానుకూల శిల్ప రహస్యాలుగా కూడ పరిగణించవచ్చు

ఒక పాట గాని, పద్యం గాని ప్రజల నాలుకల మీద నిలిచిపోయిందంటే దానికి కారణం ఇదమిత్థంగా తేల్చి చెప్పడం కష్టమే వాటికి కలిగిన విపరీత ప్రచారమే వాటి నిలకడ (retention) కు స్థూలమైన తార్కాణంగా చూపవచ్చు అయితే ఆ ప్రచారం కొన్నింటికే ఎందుకు రావాలి? అనే ప్రశ్నలకు సమాధానాలు చెప్పకుంటే కొంత స్పష్టత ఏర్పడుతుంది

ఒక పద్యం హృదయాకర్షకంగా ఉండి మనసుకు హత్తుకొని, జ్ఞాపక శక్తిచేత రక్షించబడడానికి – విషయం, ప్రక్రియ ఈ రెండూ తుల్య ప్రాధాన్యం వహిస్తాయి వేమన పద్యాలకు ప్రజలలో ఉన్న "పలుకుబడి"ని గూర్చి రెండవమాట లేదు **'వానలో తడియనివారు వేమన పద్యాల బారయనివారు లేరు'** అన్నంత వ్యాప్తి వాటికున్నది అట్టడుగు సామాన్యునికి సైతం హత్తుకునే వ్యక్తీకరణ వ్యవస్థను ఏర్పరచుకోవడం వేమన్న ప్రత్యేకత వేమన్న అభివ్యక్తికి వాహికగా నిలిచిన ఆటవెలది ఛందస్సును గూర్చి, దానిలో ఆయన ప్రదర్శించిన విశేషాలను గూర్చి పరిశీలిస్తాను

వేమన పద్యాలలో ప్రసిద్ధికెక్కిన పద్యాలు ఆటవెలదులు కావడంవల్ల, అతడే రచించిన కందాలు అతనివి 'అవునా, కాదా?' అని కూడ అనుమానిస్తుండడంవల్ల, వేమన పద్య ప్రచారానికి, అది ఆటవెలది కావడం ముఖ్యమని నిర్ణయించడంలో సందేహమక్కరలేదు

## 1. ఆటవెలది లక్షణాలు[73]

తెలుగు పద్యరచనలో ప్రసిద్ధంగా ఉన్న సంప్రదాయాలు మూడు: 1. వృత్తాలు 2 జాతులు 3. గేయాలు

ఛందఃశాస్త్రవేత్తలు ఆటవెలదిని జాతులలో మరో విభాగమైన ఉపజాతులలో చేర్చారు తేటగీతి, ఆటవెలది, సీసం, ఉపజాతులలో చేరుతాయి వృత్తాలలో గురు లఘు క్రమం, అక్షర సంఖ్యా నిర్దిష్టంగా ఉంటాయి అందుకే వాటిని అక్షర గణాలు అంటారు ఇక జాతిపద్యాల (ఉపజాతులుకూడ) నిర్మాణం మాత్రాసంఖ్యతో ఏర్పడ్డ గణాల మీద ఆధారపడి ఉంటుంది వీటిని మాత్రాగణాలంటారు మాత్రాగణాలలో గురులఘువులను మార్పుచేసే వీలుంది, మాత్రాగణాల క్రమానికి కొన్ని రకాల గురు లఘుక్రమాలను సహించే వీలుంది అంటే లక్షణంలోనే పద్య పరిమాణాన్ని మించిన గణాలు ఇవ్వబడతాయి కాబట్టి వాటిలో నుండి అవసరమైన గణాలను ఏరుకొని వాడుకునే సులువు జాతులలో ఉంది. కాబట్టి వృత్త రచనలో లేని సౌలభ్యం జాతులకు ఉంది ఈ కారణం వల్లనే ఆంగ్లంలో ఛందఃశాస్త్రం రచించిన బ్రౌన్ వృత్తాలకు Fixed or Uniform metres అనీ, జాతులకు Changing metres అనీ పేర్లు పెట్టాడు. ఛందఃశాస్త్రంలో ఆటవెలదికి ఈ కింది విధంగా లక్షణం చెప్పబడింది

*ఇనగణత్రయంబు ఇంద్రద్వయంబును*
*హంస పంచకంబు నాటవెలది*

ఆటవెలదిలో నాలుగుపాదాలుంటాయి దీనిలో 1, 3 పాదాలకు ఒక లక్షణం, 2, 4 పాదాలకు ఒక లక్షణం ఉంటుంది కాబట్టి 1, 2 పాదాలకు లక్షణం చెప్తే మొత్తం పద్యానికి చెప్పినట్టవుతుంది మొదటి పాదంలో క్రమంగా మూడు సూర్యగణాలు, రెండు ఇంద్రగణాలు ఉండాలి రెండవ పాదంలో ఐదు సూర్యగణాలు ఉండాలి రెండుపాదాల్లో కూడ మొదటిగణపు ప్రథమాక్షరానికి, నాలుగవ గణపు ప్రథమాక్షరానికి యతి చేయాలి ప్రాస యతి నియమం కూడ ఉంది

ఆటవెలదికి నియమించిన ఆరు ఇంద్రగణాలలో మూడు (భ, ర, త లు) వృత్తాలలోని త్ర్యక్షరగణాల నుండి స్వీకరించినవే ఇక మిగిలిన మూడు నల, నగ, సలలు ఇవి అక్షరగణాల్లోని నగణానికి వరుసగా లఘువు గురువు, మరియు సగణానికి లఘువు చేర్చగా ఏర్పడ్డాయి

మాత్రలదృష్టితో ఆటవెలది పాదం పొడవు 19 మాత్రలను మించదు, 17 మాత్రల కన్నా తగ్గదు రెండవ పాదం పొడవు 15 మాత్రలు దీని పొడవు స్థిరము అంటే ఆటవెలది పద్యంలో మొత్తం మాత్రల సంఖ్య 68 ని మించదు 65 మాత్రల కన్నా తగ్గదు వేమన పద్యాల్లో సీసపద్యపు నడకతో కూడ కొన్ని ఆటవెలదులు కని పిస్తాయి సామాన్యంగా వృత్త పద్యపాదాల్లో చివరి అక్షరం గురువుగా ముగుస్తుంది జాతుల్లో

---

73 "ఆంధ్రగీర్వాణఛందము" – The prosody of the Telugu and Sanskrit languages explained by C P Brown (reprint of 1827 edition with introduction & notes), Browns project, Sri Venkateshwara University, Tirupati, 1977 Page 33 (In collaboration with State Archives, Hyd)

పాదాలు సాధారణంగా లఘువుతోనే అంతమవుతాయి వేమన పద్యాల తాళపత్ర ప్రతుల్లో ఛందోజ్ఞానం లేని అపండిత లేఖకులు అనేకచోట్ల గురువుతో ముగిస్తారు, (ఉ॥ వేమా, వినురవేమా).

గురు లఘువుల నియత క్రమం వలన పద్యానికి లయ లేక తూగు ఏర్పడుతుంది గురు లఘువుల మధ్య ఒకానొక తూకం కుదిరినప్పుడు పద్యం నడక బాగుందనిపిస్తుంది ఆటవెలదిలోని పొట్టి (2,4), పొడుగు (1,3) పాదాల వలన సిద్ధించే గమన వైవిధ్యం శ్రుతి సుభగంగా ఉంటుంది ఆటవెలది ప్రథమ పాదంలో ఒకే గురువును పెట్టి మిగతావన్ని లఘువులే ఉంచి కూడ అల్లవచ్చు ఒక గురువు ఉన్నప్పుడు లఘువులు 15, 16 దాకా ఉంటాయి. ఇది నిజంగా పరుగే కాని నాట్యం కాదు కాని సమతూకం లేక నడక వల్ల చేకూరే శ్రవణసుఖం దీనివల్ల రాదు గురు లఘు సంఖ్యల మధ్యన ఉండే నిష్పత్తి 2, 3, 4 అంకెల తేడాతో ఉంటే పద్యాలు బాగుంటాయి

ఆటవెలదిలో మెళుకువలన్నీ మొదటిపాదంలో చూపెట్టడానికే ఎక్కువ అవకాశముంది లక్షణం చెడగొట్టకుండా అనేక వేల గణక్రమాల (Combinations)తో అసంఖ్యాకమైన గతి భేదాలను సాధించవచ్చు

కొంత స్వేచ్ఛ ఉన్నప్పటికీ ఈ యాంత్రికమైన చట్రాన్ని ఉపయోగించుకోవడంలో వేమన్న చూపిన ప్రత్యేకతలను పరిశీలిస్తాను

## 2. పదాల కూర్పు

ఏదో రకంగా గణాలు లెక్కకు వస్తే చాలని రచించిన పద్యాలన్నీ ప్రసిద్ధికెక్కవు పద్యానికి నడక ముఖ్యం తెలుగు పద్యరచన పైన ఈ దృష్టితో పరిశీలనలు జరిపిన డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి కొన్ని విలువైన విషయాలను బయట పెట్టారు[74] క్లుప్తంగా వాటి సారాంశమిది

అన్ని భాషలలో కూడ పదగతాలైన అక్షరాల మీద ఊనిక (Accent) ఉంటుంది[75]

1 1

సాధారణంగా ఈ ఊనికలు పదాలు లేక పదఖండాల (కప్పరంబు) ప్రారంభాలను సూచిస్తాయి ఊనికలవల్ల ఉచ్చారణ కొక శ్రుతి సౌఖ్యం ఏర్పడుతుంది వాటి స్థానాలను ఈ కింది విధంగా గుర్తించవచ్చు

1 పదాద్యక్షరం మీద సాధారణంగా ఊనిక ఉంటుంది

2 గుర్వక్షరాల మీద కూడ ఊనిక ఉంటుంది

3 పదం మొదటి అక్షరం లఘువై, రెండవ అక్షరం గురువైతే, ఊనిక రెండవ అక్షరం మీదనే ఉంటుంది

4 గుర్వక్షరంలోని రెండు మాత్రల్లో మొదటి మాత్రమీదనే ఊనిక ఉంటుంది

పదాల మార్పుకు సంబంధించి పద్యగతి యొక్క విశిష్టత ఈ ఊనికల మీదనే ఆధారపడి ఉంటుంది శ్రవ్య దృష్టిగల కవి పద్యపాదంలోని మొత్తం మాత్రల్లో ఏ

---

74 "పద్య రచన" – డాక్టర్ గిడుగు వేంకట సీతాపతి, సారస్వత వ్యాసములు – నాలుగవ సంపుటము సంపాదకుడు పురిపండా అప్పలస్వామి, ప్రచురణ ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1971

75 దానిని ఆయన 'ఊత' అని పిలిచారు

మాత్రమీద ఊనిక ఉండాలో, దేనిమీద ఉండకూడదో, ఏ స్థానంలో ఐచ్ఛికమో నిర్ణయించుకుంటాడు సీతాపతిగారి పరిశీలనను వేమన పద్యాలకు సమన్వయం చేసి చూస్తే ఫలితాలు ఈ కిందివిధంగా ఉన్నాయి మొదటి పాదాన్ని చూద్దాం.

1 1 1 1 1 1
1 ఉప్పు కప్పు రంబు నొక్క పోలిక నుండు[76]

పై పాదంలో 1, 4, 7, 10, 13, 17 వ మాత్రలమీద ఊనికలున్నాయి.

1 1 1 1 1
2. చంప దగిన యట్టి శత్రువు తన చేత

ఈ పాదంలో 1, 4, 10, 16 వ మాత్రల మీద ఊనికలున్నాయి

మొదటి ఉదాహరణలో పాదం పొడవు 19 మాత్రలు రెండవ దానిలో 17 మాత్రలు ఆటవెలది మొదటి పాదంలో 15 మాత్రల నుండి 19 మాత్రల దాకా ఉండడానికి అవకాశమున్నప్పటికీ వేమన పద్యాల్లో, 17, 18, 19 మాత్రల పొడవున్న పాదాలే సర్వసాధారణంగా కనిపిస్తాయి సామాన్యంగా 17 వ మాత్ర మీద ఊనికను తప్పకుండా విధిస్తాడు 16 వ మాత్ర మీద కూడ తరచుగా ఊనిక కనిపిస్తుంది కాని 17 తో పోలిస్తే చాలా తక్కువ అయితే ఈ 17 వ లేక 16 వ ఊనిక విధిగా ఆ పాదంలో చివరి ఊనికై ఉంటుంది ఈ ఊనిక ఉండే గణం సలము (IIUI) నూటికి మూడు వంతులు వేమన పద్యాల మొదటిపాదాలలోని చివరిగణంగా సలము ప్రయోగించబడటం వల్ల అక్కడ సలము వేయడం అతని ప్రత్యేకతగా గుర్తించవచ్చు అయితే మూడవ పాదం చివర సలము వైకల్పికం సగణానికి తర్వాత లఘువు చేరిస్తే సలము అవుతుందని లాక్షణికులు చెప్తారు కాని ఇంగ్లీషువారికోసం ఛందఃశాస్త్రం వ్రాసిన సి పి బ్రౌన్ జగణానికి ముందు లఘువు చేరిస్తే 'సలము' ఏర్పడిందని భావించాడు అందుకే దీనికి లజం (IIUI) అని పేరు పెట్టాడు[77] కాని దీనిలో జగణ స్ఫూర్తికే కాక జగణ భ్రాంతికికూడా అవకాశం లేదు[78]

ఇంతవరకు చెప్పిన లక్షణాలు ఈక్రింది ఉదాహరణలలో చూడవచ్చు

1 1 1
1 తిరుమలకును బోవ తురక దాసరి గాడు
17వ మాత్ర మీది ఊనిక విధించిన గణం సలము
2 కులము గల్గు వారు గోత్రంబు గలవారు
3 పనస తొనల కన్న పంచదారల కన్న
4 చంపదగిన యట్టి శత్రువు తనచేత
5 పొట్లకాయ రాయి పొడుగు త్రాటను గట్టి

---

76 నిలువు గీతలు ఊనికలకు గుర్తులు

77 ఆంధ్ర గీర్వాణ ఛందము – పుట 34

78 అక్కడక్కడ జగణస్ఫూర్తితో కొన్ని పాదాలు కనిపిస్తాయి 'కులములో నొకండు గుణవంతుడుండెనా' కాని 'కులములోన నొకడు' అనే పాఠాలు కూడ కనిపిస్తాయి అల్లాగే 'హీనుడవ గుణంబు మానలేడు' కూడ పాఠాంతరాలతో కనిపిస్తుంది

6. ఆలి వంక వారు ఆప్తబంధువులైరి
7 అనువు గాని చోట నధికుల మనరాదు
8 అనగననగ రాగ మతిశయిల్లుచునుండు.
9 చాకి కోకలుదికి చీకాకు పడజేసి.
10 పాల సాగరమున పవ్వళించిన వాడు
11 కోతిబట్టి దెచ్చి కొత్త పుట్టము గట్టి
12 ఉర్వి వారికెల్ల నొక్క కంచము బెట్టి
13 పెక్కుజనుల గొట్టి పేదల వధియించి
14 కూలి నాలి జేసి గుల్లాము పనిజేసి
15 యేరు దాటి మెట్ట కేగిన పురుషుండు

సమపాదాల్లో వేమన్న సాధించిన గతిశిల్పానికి వేమన్న మకుటమే పరాకాష్ఠ సమపాదాల రచన అంతా సామాన్యంగా మకుటం మూసలోనే సాగుతుంది

1 1 1 1 1
విశ్వ దాభి రామ వినుర వేమ

ఆటవెలదిలోని సమపాదాల పొడవు 15 మాత్రలు ఇది స్థిరము పై పాదంలో 1, 4, 7, 10, 13 మాత్రల మీద ఊనికలున్నాయి తరచుగా 11, 12 మాత్రల మీద ఊనికలను నిషేధిస్తాడు వేమన్న ఈ మాత్రలు ఉండే గణం నాలుగవ గణం క్వాచిత్కంగా ఈ గణం మూడవ గణంగాను, రెండవ గణంగాను కూడ కనిపిస్తుంది ఇది నగణం అంటే సమ పాదాల్లో నగణం ఒక్కటే (మిగతావి గలములు) ఉండడం తరచుగా కనిపిస్తుంది

ఉదాహరణలు ఈ కింది విధంగా ఉన్నాయి

1 పొట్ట విచ్చి చూడ పురుగులుండు
2 కొంచెముండు టెల్ల కొదువగాదు
3 మైలదీసి లెస్స మడిచినట్లు
4 తల్లివంక వారు తగిన పాటి
5 కాశికేగ పంది గజము గాదు
6 మూగచింతపల్లి మొదటి యిల్లు
7 బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
8 అలుగాదు నుదుటి వ్రాలు గాని
9 ఆరయ నిందలకును ఆలయంబు
10 చూడచూడ రుచుల జాడ వేరు
11 వేద మేల మత విభేద మేల?
12 కాచి యతుక నేర్చు కమ్మరీడు

అయితే పై పరిశీలనలు ప్రసిద్ధ పద్యాల్లో సాధారణంగా కనిపించేవి మాత్రమే వీటికి విరుద్ధమైన ప్రయోగాలు కూడ కనిపిస్తాయి

### 3. అక్షర (ధ్వని) సంయోగం

కాలికి సరిపోయే జోడులాగ వేమన్న వాడే పదాలు తరచుగా గణాతిక్రమణ చేయనివిగానే ఉంటాయి ఇది సూర్యగణాలకు బాగా వర్తిస్తుంది. రెండక్షరాలు, మూడక్షరాల అలతి అలతి పదాలే వేమన్న పద్యాల్లో ఎక్కువగా కనిపిస్తాయి. కాబట్టి పదం ముగిసిన చోట్లలో ఎక్కువగా గణం కూడ ముగియడం వేమన్న ప్రత్యేకత.

### 4. యతి

యతికి వేమన పద్యాల్లో లభించినంత 'మర్యాదా', శ్రుతిరమ్యతా మరెక్కడా కనిపించవు. అడుగడుగునా యతి నియమాన్ని స్పష్టంగా పాటించడంలో అతని అప్రయత్నత అద్భుతంగా ఉంటుంది సర్వసామాన్యంగా యతిస్థానం వద్ద పదాలు తెగ్గొట్టినట్టు విరిగిపోతాయి. పదమధ్యంలో యతిస్థానం ఇరుక్కుపోవడమనేది సామాన్యంగా కనిపించదు. వేమన పద్యాల్లో ఏ పాదానికి ఆ పాదం ఒక ప్రత్యేక అకృతి (Unit) గా విరిగిపోయి దానితో పాటు భావం కూడ పూర్తవుతుంది

## VII. మకుటార్థం

అన్ని పద్యాలకు ఒకేరకమైన మకుటం ఉండడం శతకాలలో కనిపిస్తున్నది. వేమన పద్యాలకు గల మకుటనియమం ఒక కారణంగా వేమనను పండితులు శతక కవులలో చేర్చడం జరిగింది 1. 'వేమా', 2. 'విశ్వదాభిరామ వినురవేమ' అనేవి వేమన్న వాడిన మకుటాలు. 'వేమా' అనే చిన్న మకుటం కొన్ని ఆటవెలదులకు మరియు ఆటవెలదులుకాని అన్ని పద్యాలకూ ఉండగా, 'విశ్వదాభిరామ వినురవేమ' అనేది ఆటవెలదులకు మాత్రమే ఉన్నది 'వేమా' అని చెప్పిన పద్యాలు తొలిదశలో చెప్పినట్టుగా శ్రీ ఆరుద్ర ఊహించారు

"తొలి రోజులలో ఆ పద్యాలకు 'వేమా' అనే రెండక్షరాల మాటే మకుటంగా ఉండేది. ఆ తరువాత 'విశ్వదాభిరామ వినురవేమ' అనే పెద్ద మకుటం పెట్టి కవితా పట్టం కట్టారు."[79] కాని ఆటవెలదులు కాని పద్యాలు వేమన్నవి కావనే నమ్మకానికి వెనక ఉపపత్తులు చూపబడ్డాయి

ఆటవెలది పద్యంలో నాలుగుపాదాలుంటాయి వేమన్న ఆటవెలదిలో నాలుగవ పాదం మకుటం వేమన్న తాను చెప్పవలసినదంతా మొదటి మూడు పాదాలలోనే చెప్తాడు మకుటం లేకున్నా అర్థ సంపూర్తికి విఘాతం కలగదు[80] అందుకే దీనిని కేవలం Chorus or refrain అని పిలిచాడు బ్రౌన్[81] కాని అర్థదృష్ట్యా హాని లేనప్పటికీ, మకుటం లేకుంటే పద్య నిర్మాణ పరిపూర్ణతకు మాత్రం భంగం వాటిల్లుతుంది అంటే మకుటం లేక అర్థం పూర్తవుతుంది కాని పద్యం పూర్తికాదు

---

79 సమగ్రాంధ్ర సాహిత్యం సంపుటం-III కడప సుభాకవులు

80 " But the sense of each verse is complete without it" 1829, Brown

81 Most of the verses in Vemana are written in ataveladi metre, which consists of four lines, but the fourth line, with some exceptions, is a mere refrain or chorus in these words 'విశ్వదాభిరామ వినురవేమ'– బ్రౌన్, 1829

అయితే ప్రసిద్ధమై, శ్రవణసుందరమైన 'విశ్వదాభిరామ వినురవేమ' మకుటానికి తృప్తికరమైన అర్థం చెప్పినవారు లేరు. ఇదికాక మరికొన్ని 'మకుటాలు' వేమన పద్యాలలో లభిస్తున్నాయి.

*1. విమల గుణ యోగీంద్ర వేమనార్య.*

*2. రాజయోగి వేమా.*

*3. వివిధ విద్యాకళాత్రాణ వివరి వేమ.* (127,168)

మొదటిది బందరుప్రతిలో కొన్ని తేటగీతులకు తగిలించబడింది రెండవది ఒకటి రెండు ఆటవెలదుల చివర ఉన్నది. ఇక సర్వజనుల నోటికెక్కిన 'విశ్వదాభిరామ వినురవేమ'కు అర్థాన్ని అన్వేషించే ముందు దీనికిగల పాఠాంతరాలను పరిశీలించవలసి ఉంది.

*1. విశ్వదాభిరామ వినర వేమ.*

*2. విశ్వతాభిరామ వినుర వేమ.*

*3 విశ్వతోభిరామ వినుర వేమ*

*4. విశ్వతాభిరామ వివరి వేమ*

పై నాలిగింటిలో మొదటిమూడు సరళమైన ఉచ్చారణకు పూర్తిగా విధేయమైనవి కావు. ధారాళమైన వేమన్న పద్యధారకు ఎదురు గుణం ఈ పాఠాలకున్నది నాలుగవది తంజావూరులోని ఒక తాళపత్ర ప్రతిలోనే ఉన్నది. ఇది లేఖక ప్రమాదం వలన ఏర్పడిన పాఠంగానే ఉన్నది[82] ఒకవిధంగా చూస్తే పై పాఠాంతరాలన్నీ లేఖకుల సృష్టిగానే తోస్తున్నది.

## 1. అర్థ నిర్ణయం

"విశ్వదాభిరామ వినురవేమ!"ను "Listen, O Vemana! dear to the Lord of all!" అని బ్రౌన్ అనువదించాడు[83] వేమన పద్యాలను (100) ఇంగ్లీషులోనికి అనువదించిన విద్వాన్ పిశిపాటి కృష్ణమూర్తిగారు కూడ బ్రౌన్ అడుగుజాడలలో నడుస్తూ "O Vemana, the beloved of the Gods" అని అన్నారు[84] కాని ఈ మకుటానికి తాను చెప్పిన అర్థం తిరుగులేనిదనే నమ్మకం బ్రౌన్‌కు లేదు 'The import of the chorus is obscure' అని వాపోయాడు[85] వేమన్న మకుటానికి అర్థంచెప్పే ప్రయత్నంలో అసలిది అర్థాపేక్షితంకాని కేవల పద్యపూరణం ప్రయోజనంగా ఉద్దేశింపబడిన శ్రుతి మనోహరమైన వాక్యమని సరిపెట్టుకొన్నారు వంగోలు వేంకటరంగయ్యగారు[86] కాని దీనిని కేవలం పాదపూరణగా భావించి ఎవరూ తృప్తిపడలేదు ఎవరికి తోచిన అర్థాన్ని వారు చెప్పారు

---

82 నెం 457 ఇందులో 215 పద్యాలూ ఇదే మకుటంతో ఉన్నాయి

83 1829 Edition

84 వేమన శతకము, సికిందరాబాదు, 1973

85 1829 Edition

86 వేమన - ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, సంపుటం - 11, దుందుభినామ సంవత్సరం, ఆశ్వయుజ, 1923

సూత్రప్రాయమైన వేమన్న మకుటాన్ని నిర్మాణదృష్ట్యా మూడు విభాగాలు (Units) చేయవచ్చు:

1 వేమ

2. విశ్వదాభిరామ

3. వినుర!

అన్వయాపేక్షతో ఒక రకమైన కూర్పుకే అవకాశమున్నది. దీనిలో విశ్వదాభిరాముడైన వేముడు సంబోధించబడుతున్నాడు. నిర్మాణ దృష్ట్యా చేసిన మూడు భాగాలను విడివిడిగా పరిశీలిస్తేగాని వాటి మధ్యన ఉన్న అన్వయ క్లిష్టత తొలగకపోవచ్చు కాబట్టి ఒక్కొక్కదానినే పరిశీలిద్దాం

## 2. వేమ

ఈ సంబోధనలోని వేముడు మన వేమన్నే అని అందరికి వెంటనే స్ఫురించే సంగతి. కాని ఈ వేమన్న పెద్దన్న (Elder brother) అయిన వేముడని కొందరి భావమని బ్రౌన్ వ్రాశాడు.[87] అయితే వేమన్న కొండవీటి నేలిన రెడ్డిరాజసోదరులలో ఒకడనే నమ్మిక ఈ అభిప్రాయానికి కారణం వేమన మకుటాన్ని గురించి చర్చించిన వారందరూ వేమన్న తనకు తాను సంబోధించుకున్నాడనే విషయంలో ఏకాభిప్రాయం ప్రకటించారు అయితే అట్లా సంబోధించుకోవడంలో గల పరమార్థాన్ని గూర్చి తలో రకంగా చెప్పారు.

"శిష్యులకు చెప్పినప్పుడు వేమా యని తనను సంబోధనమేల చేసికొనవలయునని కొందరడుగవచ్చును. శిష్యులను ముందుంచుకొని తన్ను గూర్చి చెప్పుకొనిన యెడల శిష్యులకు బోధయగుననియు, తాను అహంకరించి వారికి చెప్పినట్లుండక తన్నే నిందించుకొన్నట్లును తనకే బుద్ధి చెప్పినట్లుండునని తలచి యట్లు చేసెను. అటు తరువాత మౌనము ధరించి స్వస్థచిత్తుడై యుండెను."[88]

వంగూరి సుబ్బారావుగారి చర్చ సారాంశ మీకింది విధంగా ఉంది[89] తమను తాము సంబోధించుకొనే సంప్రదాయం శతకాలలో ఉన్నది కవి చౌడప్ప, తదితరులు కీర్తికోసం అలా చేసి ఉంటారు విరాగమూర్తి అయిన వేమన్నకు కీర్తి కాంక్ష ఉన్నదనడం పొసగదు ఈ సంబోధనం వలన పరులు వేమన్న నుద్దేశించి పలికినట్టుగా కొందరు వాదిస్తున్నారు

కాబట్టి సంబోధన యొక్క హేతువుకు వేదాంతపరంగా వ్యాఖ్యానం చెప్పారు సుబ్బారావుగారు [90]

'వేమన్నయను పేరు గూడ నశ్వరమగు శరీరము వంటి మానవ కల్పితమగు బాహ్య శరీర సంబంధమయిన సాంకేతికమనియు, జ్ఞానియగు వేమన్న, అజ్ఞాని యగు తన మనస్సుతో అనగా పరమాత్మయగు తాను, జీవాత్మయగు నజ్ఞాని

87 "Some believe that 'Vema' so addressed was the elder brother of the moralist" - Brown, 1829

88 వేదాంత సిద్ధాంతము – పుట 14

89 వేమన యోగీంద్ర చరిత్రము – పుటలు 70, 71, 72, 73, 74

90 వేమన – పుటలు 172, 173

వేమన్నతో నీ వేదాంతము బోధించినట్లును - మనకు దట్టుచున్నది. లేదా వేమన్నకే గలిగిన సందేహములను, తట్టిన యూహలను 'చెప్పరా వేమా' 'చాటరా వేమా' అని తాను బ్రహ్మజ్ఞానానందమును నోలలాడు సమయమున వినిపించిన దనవచ్చును. తనయందేయున్న సుబుద్ధి కుబుద్ధికి వేదాంతమును సంబోధించి చెప్పినట్లు మనము తలంప వీలగుచున్నది.'

స్థూలంగా వేమన్న తనకు తాను ఉపదేశించు కొన్నట్లు అంకితంలో కన్పిస్తున్నా 'ఆత్మనా పూరితం విశ్వమ్' అన్నట్లుగా, సూక్ష్మవిచారణ చేస్తే జీవబ్రహ్మాల ఐక్యాన్నే ధ్వనించాడని వంగోలు వేంకట రంగయ్యగారు అంటూ వంగూరి వారి దారిలోనే నడిచారు.[91]

ఈ సంబోధనలో బ్రౌన్‌కు ఎటువంటి వేదాంత రహస్యం గోచరించలేదు సమాజం నుండి విడివడి ఒకరకమైన వెలిని అనుభవించిన ఒంటరిజీవితం వలన వేమన్న తనను తానే సంబోధించి పద్యాలు చెప్పాడని బ్రౌన్ ఊహించాడు ఇట్లా సంబోధించుకోవడంలో వేమనకు అహంకారం కలదని నిర్ణయించడం కుదరదని బ్రౌన్ అభిప్రాయపడ్డాడు[92]

### 3. విశ్వదాభిరామ

దీనిలోని 'అభిరామ' శబ్దం వలన 'అభిరామయ్య' కథ పుట్టింది. అభిరామయ్య కథకు కాళ్ళు లేవని రాళ్ళపల్లివారు వెనుక ఖండించారు 'విశ్వద' అనేది ఒక వేశ్య పేరని ప్రచారం జరిగింది[93] దీనికెవరి ఆమోదమూ లభించలేదు

పై పదబంధంలో అర్థకారిన్యాన్ని విచ్ఛిన్నం చేయడానికి నిస్తంద్రమైన ప్రయత్నం జరిగింది ఈ ప్రయత్నాలలో 'విశ్వదాభిరామ' అనేది 'వేమ'కు విశేషణమని చాలామంది గుర్తించారు కాని 'విశ్వదాభిరామ'లోని చిక్కే విడిపోలేదు దీనికి పండితులు చెప్పిన అర్థాలను ఈకింద ఇస్తున్నాను

1 బ్రౌన్
Dear to the Lord of all

2 శ్రీ అచంట సాంఖ్యాయన శర్మ, పార్వతీపురము
విశ్వ = సమస్తమును (జ్ఞానమున్నిటికంటె గొప్పది), ద = ఇచ్చుట (చేత), అభిరాముడు = మనోజ్ఞుడు (అగు), వేమా = వేమన్న

3 వేంకట శేషకవి[94]
విశ్వ = సకలమైన వానిని, ద = ఇచ్చెడి, అభిరామ = ప్రియమైనవాడా! వేమా! ఓ వేమనా, వినుర = వినుము

---

91 వేమన ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక - 1923

92 This solitary life had led him to address in many verses to himself which, if this be not recollected, certainly look with the grossest egotism - this practice is far indeed from peculiar to Vemana Preface to Vemana composed 23 November, 1824

93 ఈ అర్థాన్ని చెప్పినవారు పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు, పిఠాపురం విశ్వద = వేశ్య పేరు (వేమన్న యుంపుడు కత్తె), దీనికి అభిరాముడు = ఇష్టుడు, ప్రియుడు (అగు) వేమా! = వేమనా! (దీనిని వంగూరి వారు ఉదాహరించారు)

94 వేమన శతకము - టీకా తాత్పర్యము, కాలం శిథిలం

4. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

"అసలీ పాఠమే తప్పని "విశ్వతాభిరామ" యను పాఠమునే గ్రహించి, విశ్వత = ప్రపంచము = అనగా సర్వమును తానై యుండుట – దీనిచే నభిరాముడు అనునొక యర్థము బైలుదీసి యుంటిని."95 కాని 'వేమన' ఉపన్యాస గ్రంథంనాటికి రాళ్ళపల్లి వారు ఈ వ్యాఖ్యానాన్ని వదులుకున్నారు. "విశ్వదుడు = ప్రపంచమున నందరిని ఖండించినవాడు, అగుటచే నభిరాముడు, అనగా అన్ని జాతులగు వారి పద్ధతులను జంకు లేక ఖండించిన వాడగుటచే అందరును తమ్ము దిట్టిన పద్యములను మరచి యితరులను దిట్టినది మాత్రము చెప్పుకొని సంతోషింతురు కావున నితడందరికిని అభిరాముడే! ఇట్టి టీకలకేమి లెండు. సహజమైన యర్థము దీనికిదివరకు లభింపలేదు."96

రాళ్ళపల్లి వారన్నట్టు మనలో వ్యాఖ్యానాలు వస్తుస్థితిని చెప్పడానికి కాక తమతమ శక్తి ప్రదర్శకాలుగానే ఏర్పడ్డాయి అవిధంగా పై సమాసానికి మరెన్నో విగ్రహ వాక్యాలు చెప్పడానికి వీలున్నది 97

ఉన్న చిక్కు అంతా విశ్వ–అభిరామ శబ్దాల మధ్యనే ఉన్నది నిఘంటువు లేమైనా సాయపడతాయేమో చూడాలి· విశ్వకి 'శబ్ద కల్పద్రుమః' 'సకలం' అనే అర్థం చెప్తున్నది 98

సంస్కృత సర్వనామ శబ్దాలలో రెండవది 'విశ్వ'. ఇది విశేషణం కాబట్టి విశ్వద అన్నప్పుడు వెనక అందరు చెప్పినట్టు విశ్వదుడవైన, విశ్వాన్ని ఇచ్చినవాడవైన అంటే సృష్టికర్తవైన అని అర్థం చెప్పుకోవచ్చు అటువంటి వాడికి ఇష్టుడన్న మాట వేముడు అంటే మిగతావారికి ఇష్టుడైనా కాకున్నా సృష్టికర్తకు ఇష్టుడైనవాడు అని ధ్వనించినాడని భావించవచ్చు

కాని తృప్తికరమైన అర్థం స్ఫురించే దాకా మకుటం మీద చర్చ అసమగ్రంగానే మిగిలిపోతున్నది "విశ్వతోభిరామ" పాఠం కొంత అన్వయసహంగా కనిపిస్తున్నది కాని అది ప్రసిద్ధికెక్కలేదు పైగా చెవికింపుగా లేదు అర్థం కుదరడం లేదు కదా అని 'విశ్వదాభిరామ వినురవేమ' విలువ తగ్గదు వేమన పద్యాల నుండి దానిని పరిహరించ లేనంత బలమైన ప్రచారం దానికున్నది. వేమన పద్యాలతో దానికి గల సంబంధం అద్వైత ప్రాయమైనది ఈ మకుటంలేక వేమన పద్యాలను ఊహించలేము ఏమైనా వేమన కవిత్వానికిది కోహినూరు కిరీటమే

## VIII. వేమన్న సూక్తులు

"వేమనగారు బంగారం చేశారో లేదో తెలియదు గాని పలికిందెల్లా బంగారం చేశారు" అని ఆరుద్రగారు వేమన పలుకులను గూర్చి సూక్తిలాంటి మాట చెప్పారు

95 వావిళ్ళ పీఠిక – పుట 18

96 వేమన – పుట 17

97 వేమన పుట 17

98 విశ్వః త్రి (విశ్+క్వన్) సకలమ్ ఇత్యమరం యథా–
యస్తు విశ్వస్య జగతో బుద్ధి మాక్రమ్య తిష్ఠతి
తల ప్రాహురద్యాత్మ విదో విశ్వజిన్నామ పావకమ్!
మహాభారతే 3 218 16 శ్లోకము

దాదాపు వేమన చెప్పిన ఉక్తులన్నీ సూక్తులే. ఆయన పలికిన అసంఖ్యాక పద్యపాదాలు సామెతలై తెలుగువారి నాలుకల నలంకరించాయి.

సామెతలు అన్ని భాషల్లోనూ ఉంటాయి. సామెతకు ఒక్కమాటలో నిర్వచనం చెప్పడం కష్టం. మానవ జీవన మథనంలో, అనుభవాల ప్రతిస్పందనలోంచి పుట్టిన మీగడవంటి, సారభూతమైన నానుడులు సామెతలు. అందరికి అనుభవంలోకి వచ్చిన సత్యాలు, నీతి బోధనలు విశిష్టమైన నిర్మాణంలో సామెతలుగా రూపుదిద్దుకుంటాయి. సుదీర్ఘమైన జీవనపథంలో అప్పుడప్పుడు వెలువడే విశ్రాంతిని చేకూర్చే నిట్టూర్పుల వంటివి సామెతలు. సకల మానవుల సమష్టి విజ్ఞానం నుండి వెలువడిందే సామెత బిందువులో సింధువును దర్శించినట్టుగా సామెతలో అవధులు లేని జీవితానుభూతిని పొందవచ్చు.

చురుక్కుమనిపించే ఒకానొక చమత్కార గుణం సామెతల సొత్తు.

సాధారణంగా సామెతలు ఒక వాక్యం, అరుదుగా రెండు వాక్యాల పరిమాణం కలిగిఉంటాయి క్లుప్తత సామెతల సహజ లక్షణం. జీవన ప్రవంతిలో మనుపులు దీరి చెక్కితీర్చినట్లు వెలువడిన సాలగ్రామాల వంటివి సామెతలు. నిర్మాణ దృష్ట్యా పూర్వాపర సంబంధరహితమై, స్వతంత్రమైన వ్యక్తిత్వం సామెతలది; శ్రుతిచేసిన వీణతీగవలె బిగువు సామెతలకు జీవలక్షణం.

సామెతకు అనుప్రాసలు అలంకారాలు శబ్దచమత్కార రహితమైన సామెతలు చాలా తక్కువ

నుడికారమూ, జాతీయాలసొబగు తెలిసిన ఏ కవీ కూడ సామెతలను తన రచనల్లో పొదుగుకోకుండా ఉండలేదు సామెతలు ఒకరు కుదురుగా కూర్చొని రచించినవి కానప్పటికీ, కొందరు కవులు వాడిన వాక్యాలు సూక్తులై, సామెతలై ప్రజాజీవనంలో కలిసిపోయాయి అదేవిధంగా జనంవాడుకలో ఉన్న అనేక సామెతలను కూడ సందర్భోచితంగా కవులు కూడ వాడుకోవడం కద్దు కవి వాడిన సామెత వర్ణ్యవస్తువుకు సహాయకారిగా ఉండి శ్రోత హృదయానికి హత్తుకోవడంలో అమోఘమైన ప్రయోజనాన్ని నెరవేరుస్తుంది వేమన పద్యాలు సామెతలపుట్టలు సమకాలంలోని సామెతలన్నింటిని దండగుచ్చి తన ముద్రతో లోకంమీద జల్లాడు ఎటువంటి వాక్యమైనా ఆటవెలది పాదంగా ఒదిగిపోవలసిందే అదేవిధంగా వేమన్న స్వయంగా అల్లిన పలుకులెన్నో చైతన్యం తొణికిసలాడే సామెతలైనాయి అవి తరచుగా దృష్టాంత రూపాల్లో ఉంటాయి

వేమన్న వాడిన సామెతలు చాలావరకు నాటి గ్రామ జీవనానికి సంబంధించినవే వాటిలోని పెలుసుదనం, నిష్కల్మషమైన హాస్యం ఆస్వాదనకూ, ధారణానుకూలతకూ యోగ్యతను కల్పిస్తున్నాయి

ఈ కింద కొన్ని వేమన్న సూక్తులు ఇవ్వబడ్డాయి

1 దొంగ గొడ్డు- మెడను దుంగ గట్టిన రీతి
2 చేత వెన్నబట్టి నేతికేడ్చినయట్లు
3 ముక్కు గోయ నెత్రు మొనసి తాగినయట్లు
4 దొబ్బనేర్చు కుక్క దుత్తలు మోసునా?
5 వనములోని కోతి వసుమతి నడుపునా?
6 చెట్టుముదర నిచ్చి చిదిమితె బోవునా?

7. యెద్దు చంటపాలు యేమైన చేపునా?
8. భూమి కొత్తయైన భుక్తులు కొత్తలా?
9. కుక్క ముట్టినట్టి కుండ దొంతెక్కునా?
10. పుట్ట మీద గొట్ట భుజగంబు చచ్చునా?
11. గొడ్డుటావు పాలు గోకితే చేపునా?
12. కొయ్యబొమ్మ దెచ్చి కొట్టితే గుణియౌనె!
13. యేటి వంకదీర్ప నెవ్వరి తరమయా?
14. ఇనుప గుదియ బట్టి యేరీద వచ్చునా?
15. ఫక్కి దెలసి పలుకు నొక్క పద్యమె చాలు?
16. తడికె బిర్రుబెట్ట తలుపుతో సరియౌనె?
17 యెనుము గొప్పదైన యేనుగు బోలునా?
18 పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా?
19. పేద పేద గూడి పెనగొని యుండును
20. వెల్గు కన్న దిక్కు వేరెవ్వరున్నారు?
21 తలలు బోడులైన తలపులు బోడులా?
22. వెన్నబట్టి నెయ్యి వెదకిన చందము.
23 నూనె లేక దివ్వె నువ్వుల మండునా?
24. కలిమి లేమి లేని కాలంబు గలుగునా?
25. తల్లి తానెరుగును తనయుని జననంబు
26 తన్ను గానలేదు తత్త్వ మేమెరుగును?
27 పిల్లి బట్టు కోడి పిలిచిన బలుకునా?
28. కొంకి నక్క జావ గొర్రెలేమిటి కేడ్చు?
29 నీతి హీనునొద్ద నిర్భాగ్యులుందురు
30 ఊరకుంట మిగుల ఉత్తమంబు.
31 సంతపాక కొడుకు సజ్జనునెరుగునా?
32 కరువనున్న పాము నెరిదాచుకొనియుండు
33 తనువు తీరెనేని తలపు తోడనె తీరు
34 చేడె గాదుర అది చేవాడి కత్తిరా!
35 చూలు వలన బుట్టు సుఖదుఃఖములు రెండు
36 పదుగురాడు మాట పాటియై ధరజెల్లు
37 నొసటవ్రాయు వ్రాత నుసిలితే బోవునా?
38 మద్యపాని కేల మహిమీద తత్త్వంబు
39 తనువు నిత్యమన్న దైవంబు నవ్వడా?
40 దూరమరుగ వలయు దుర్జనుడన్నను
41 తేజభానుని జూచి తిమిరంబు నిల్చునా?
42 నీరు ముత్తెమైన నీరుగా బోవునా?
43 ముక్కువంక జూచి ముకురంబు దూరుట
44 పండ్లు బడ్డ కుక్క పసరము పీకునా?
45 ఇసుక బావి త్రవ్వ యెవ్వరి వశమయా?

46. తల్లి నెరుగువాడు దైవంబు నెరుగును.
47. వెఱ్ఱి కుక్క బట్టి వేటాడవచ్చునా?
48. కుక్క సింహమగునె గోదావరికి బోవ?
49. పసిడి కన్న మిగుల పడతి మాటలు తీపి.
50 తొత్తుతోడి పొందు తొఱ్ఱి పెసల మూట.
51. రాళ్ళు దేవుడైన రాసులు మింగవా?
52. పెద్దలుసురుమన్న పెనుమంట లెగయవా?
53 దానమీయనివాడు ధన్యుండు గాడయా?
54 కాసులకును తిరుగ కలుగునా మోక్షంబు?
55 దొంగతెలివి చేత దొరుకునా మోక్షంబు?
56 చేతగాని కూత చెల్లదెపుడు
57. నిజము గననివాని నిలువెల్ల రోతరా!
58. దోచుకొన్న యట్టి దోషమెక్కడబోవు?
59 తేనె నీగ గూర్చి తెరువరి కియ్యదా?
60 దుష్ట బుద్ధులకును దుర్మరణము సుమ్ము!
61 నీరు జొరక లోతు నిజముగా దెలియదు
62. గుడ్డివాని కేల గురుతైన రత్నంబు?
63 అడదాని బలిమి అడనే జూడరా!
64 నెలవు దప్ప చోట నేర్పరి కొరగాడు
65 స్థానబలిమిగాని తనబలిమి గాదయా!
66 పోరువాడు బంటు పనికిరాడెందును
67 చెప్ప గొరుకు కుక్క చెరుకు తీపెరుగునా?
68 పట్టు విడుచుకంటె ప్రాణమిడుట మేలు
69 పంది పంది గూడి పడదొక్కో రొంపిలో!
70. అరయు తిండ్లు వేరు ఆకలి ఒక్కటి
71 నిలువదగిన చోట నిలువ నిందలు వచ్చు
72 కులముకన్న మిగుల గుణమె ప్రధానంబు
73 పులిని పూచి నక్క పూతబూసిన యట్లు
74 వ్యాధి తెలియలేని వైద్యుడు మరి యేల?
75 వానతోడ వచ్చు వడగండ్లు నిల్చునా?
76 ప్రాణులెల్ల యముని బారి గొఱ్ఱెలు సుమీ!
77 విల్లు మెత్తనైన వెడలునా బాణంబు?
78 శ్రమములోన బుట్టు సర్వంబు తానౌను
79 గొఱ్ఱె చంకబెట్టి గొల్ల వెదకు రీతి
80 మనసు దిద్దరాదు మహి నెంతవారికి
81 కుక్కయిల్లు జొచ్చి కుండలు వెతకదా?
82 తిలల తైలమట్లు తేజరిల్లు జీవాత్మ
83 చేటు కాలమునకు చెడు బుద్ధి పుట్టును
84 లోభివాని నడుగ లాభంబు లేదయా!

85. మొండివాని కేల ముంజేతి కడియాలు?
86. తిండిపోతు వశమె తెలియ సుజ్ఞానంబు.
87. తాను దేవుడైన దైవము గొల్చునా?
88. రాజవరుల కెల్ల రణరంగముల చింత.
89. నిండు నీట గుండు నిలుచునా మునుగక?
90. చేటు కాలమైన చెరుపనల్పుడు చాలు.
91. ఆడుదాని వంక నందరు చుట్టాలు.
92. కుక్క వంటి మనసు కూర్చుండ నియ్యదు.
93. లోను చూడ చూడ లోకాభిరామంబు.
94. వల్లదప్పి వెనక వంటకమే మిత్తి.
95. వాక్కుశుద్ధి లేని వాడు చండాలుడు.
96. మారకమ్మ జొచ్చి మరియిల్లు జొచ్చునా?
97. వ్రాత కజుడు కర్త సేతకు తాకర్త.
98. ఏనుగు పడియున్న ఎత్తునా మశకంబు?
99. వేలి మీద పుండు వెండి ఉంగ్రము కాదు.
100. జీవులందె గాని శిలలందు యేముంది?

## IX. ప్రజాకవి లక్షణాలు

కవిత్వాన్ని రాజాశ్రయంనుండి తప్పించి సామాన్యప్రజల పరం చేయడంవల్లనే వేమన్నను గురించి వేరు విధంగా ఆలోచించడానికి పునాదులు పడ్డాయి. వేమన్న ఆశుకవితా సంప్రదాయ లక్షణాలు పుష్కలంగా కలవాడనీ, కావ్య కవిత్వ లక్షణాలను పూర్తిగా వదులుకున్నవాడు కాడనీ వెనక చర్చించాను. ఒకవైపు రాజుల ఆదరణలో ప్రబంధ కవిత్వం ప్రవర్తిల్లుతున్నప్పుడే. దాని ప్రమేయం లేకుండా, ఆ మార్గానికి సమాంతరంగా పద రచయితలు, కీర్తనకారులు, శతక కవులు తమ ధోరణిలో కవితలల్లుకుపోతున్నారు. శివకవుల కాలంలో ప్రజాసామాన్య భాషలో గ్రంధాలు వెలువడి, మత సహాయంతో ఒక ఉద్యమరూపం ధరించి అవి సంప్రదాయ సాహిత్యాన్ని కొంతవరకు ప్రభావితం జేశాయి అదే విధంగా తదనంతరకాలంలో శివకవులే పాండిత్యప్రకర్షతో కూడిన లిఖిత సాహిత్యాన్ని అనుకరించారు[99] మార్గ, దేశి అనే పదాలు చలామణిలోనికి వచ్చాయి. సంస్కృత భాషా ప్రభావంలోని తరతమ భేదాల ఆధారంగా ఆయా కాలాల్లో మార్గ, దేశి పదాలు నిర్వచింపబడ్డాయని వెల్చేరు నారాయణరావుగారు నిరూపించారు[100] అయితే, మార్గ, దేశి రీతులు కేవలం భాషా సంబంధమైనవే

భాషకు సంబంధించినంతవరకు శతక కవులలో చాలామంది దేశికవులే నోటిమాటల భాషలో పదాలు, కీర్తనలు వెలయించిన క్షేత్రయ్య, రామదాసువంటివారుకూడ దేశికవులే వేమన పద్యాలలోని భాష మాండలిక రూపాలను కూడ స్వీకరించి భూమికి నిలువెత్తు స్థాయిలోనే పరిభ్రమించింది దేశీయపదాలకు 'Some grammatical forms of the verb too are local Desy are words the roots of which are unknown' అని

---

99 ఈ వ్యాసంలోని కొన్ని భావాలకు వెల్చేరు నారాయణరావుగారి సిద్ధాంత గ్రంథం ఆధారం
100 కవితా విప్లవాల స్వరూపం

బ్రౌన్ అర్థం చెప్పాడు. భాషా దృష్ట్యా, ఈ అర్థానికి పూర్తిగా సరిపోయే అచ్చమైన దేశీయకవి వేమన.

కవిత్వం రాజాస్థానం ఆవరణను అధిగమించడంవల్ల వచ్చిన ఫలితం కేవలం భాషా విప్లవమే కాదు, రాజులతో ప్రమేయం లేకపోవడంవల్ల దేశికవుల శ్రోతలు మారిపోయారు. కళ్ళ ఎదురుగా కనిపించే సామాన్య జనం తమకవసరమైన కవిత్వంయొక్క పుట్టుకకు కారణభూతులైనారు. కావ్యకవులకు శ్రోతలు పండితులు కాబట్టి వారిని అలరించే ప్రౌఢభాషకు భిన్నంగా, పల్లెల్లో దేశీయ భాషలో కవిత్వం ప్రవహించసాగింది. సామాన్యులకోసం ఉద్దేశించబడిన చాలామంది శతక కవులను రాజులూ, పండితులూ ఎవరూ ఆదరించిన దాఖలాలు లేవు. ఎవరో కొందరు కావ్యకవులు కొన్ని శతకాలు వ్రాసినట్టు పీఠికల్లో కనిపిస్తున్నది. కాని అవి తరచుగా అలభ్యాలు.

వేమనను ప్రజాకవి అనడానికి భాషాగతమైన కారణాలతో పిలువబడిన దేశికవి అవడం మాత్రమే చాలదు; వేమన్న చేసిన తీవ్రమైన సంఘవిమర్శల వలన అతనిని ప్రజాకవి అనవచ్చు. కాని ఇతర శతక కవులు, చివరకు సంగీత ప్రధానమైన కృతులు పాడిన త్యాగయ్య కూడ సంఘ విమర్శలు చేశారు. గోగులపాటి కూర్మనాధుడు, నరసింహ శతకకారుడు మహమ్మదీయుల దాడుల ఫలితంగా వచ్చిన కడగండ్లను దయనీయంగా వర్ణించారు; కోపాన్ని వెలిగక్కారు. కాని అవన్నీ సాంఘిక చైతన్యంతో చేసినవి కాక, తీవ్రమైన నైరాశ్యంతో భగవంతునికి నివేదించుకున్న శరణాగతి శతకాలు అప్పటి పరిస్థితిని భగవంతుడే వచ్చి మార్చాలనుకున్నారు కాని, ఆ పరిస్థితులకు తమ సంఘంలోనే కారణాలను వెతికిన వారు కారు. త్యాగయ్యలో సంఘవిమర్శ వ్యంగ్యంగా, గుప్తంగా ఉంటుంది. ఆయన దృష్టికూడ సంగీతంద్వారా భగవంతుణ్ణి ప్రసన్నం చేసుకొనే ప్రయత్నంగానే పర్యవసించింది.

వేమన్నకు సమాజమంటే స్పష్టమైన అవగాహన ఉంది సమాజంలోని ప్రతి చిన్న కదలికకు ప్రతిస్పందించిపోయే సున్నితమైన స్పృహ ఉంది సమాజంలో ఏదో ఒక వర్గానికి కట్టుబడిపోయి, మిగిలిన సంఘవ్యక్తులను పట్టించుకోని తత్త్వం వేమనకు లేదు సమాజసర్వస్వాన్ని ఒక దర్శనంతో చూసి, మొత్తాన్ని తన 'ఇంటిలోని' పోరుగా భావించే స్థితికి ఎదిగాడు. కవితాపీఠాలతో సంబంధం లేకుండా కేవలం శుద్ధ సమాజాన్ని తన కవిత్వానికి ఆలంబనగా ఏర్పరచుకున్నాడు

అయితే వేమన్న భావించిన సంఘానికి, కళ్ళఎదుట కనిపించే సమాజానికి పోలికలేదు అక్కడ పుట్టుకొచ్చాడు వేమన్న కవి వేమన్న ప్రజాకవి వేమన్నగా పరివర్తనం చెందుతున్నాడు అసమానతల ఉక్కుకౌగిళ్ళలో నలిగి కొన ఊపిరితో ఉన్న మానవత, ద్వంద్వనీతితో పుచ్చిపోయిన కట్టుబాట్ల జీవగఱ్ఱ- ఇవే ఆనాడు వేమన్న చూచినవి మత గ్రంథాలలోని గొప్ప సూక్తులు, ప్రవక్తల వచోనైపుణ్యాలు ఇవేవీ వేమన్నకు వినిపించలేదు మోసపోతూ, దైన్యానికీ హైన్యానికీ ప్రతిరూపాలుగా ఉన్న అసహాయుల గుండె మూల్గులే వేమన్న కర్ణపుటాల్లో ప్రతిధ్వనించాయి వేమన్న సమాజరుగ్మతను గుర్తించాడు; గుర్తించి తన పద్యాల్లో దానిని ప్రతిబింబించాడు

సమాజాన్ని పట్టించుకొని, సమాజంలోని సమస్యల్ని గుర్తించి, ఆ సమస్యల్ని తన కవిత్వంలో వర్ణించడం ప్రజాకవి మొట్టమొదటి లక్షణం

ప్రజాకవికి మిగిలిన లక్షణాలు చెప్పకునేముందు ప్రజలంటే ఎవరో తెలుసుకోవాలి.

ప్రజాకవి, ప్రజలకవి, జనంకవి అనేమాటలు ఇటీవల వ్యవహారంలోకి వచ్చినవే. "ప్రజాకవి వేమన" అనే వాడుక బహుళ ప్రచారానికెక్కింది ఈమధ్యనే. ఒక మాటను వాడేవాడు ఒక అర్థంలో ప్రయోగిస్తే వినేవాడు మరో అర్థంలో గ్రహించడం అప్పుడప్పుడు చూస్తుంటాము ప్రజాకవి అంటే ఎవరు? ప్రజాకవి అన్నప్పుడు అప్రజాకవులు, ప్రజేతరకవులు ఉన్నారని అర్థమా? అసలు ప్రజలంటే ఎవరు? అన్న ప్రశ్నలకు సమాధానం చెప్పకోవలసిన అవసరం ఉంది.

వ్యక్తికి బహువచనం ప్రజలు అంటే వ్యక్తులసమూహమే ప్రజలు. అయితే కనిపించే ప్రతి సమూహం ప్రజలేనా? People అనే పదానికి ఆంగ్ల నిఘంటువులు అనేక వర్గాలను ఇచ్చి వారందరు ప్రజలే అన్నాయి ఆ వర్గాలు ఈ కింది విధంగా ఉన్నాయి:

**People:**

1. ఒక కులాన్నిగాని, తెగనిగాని, జాతినిగాని యేర్పరచే వ్యక్తులు.
2. ఒక ప్రాంతానికి చెందిన వ్యక్తులు.
3. ఒక అధికారం కింద మసలే వ్యక్తులు
4. సమాన గుణాలు కలిగిన వ్యక్తులు.
5. సామాన్యులు (పామరులు, అలగాజనాలు).
6 విముక్తులైన వ్యక్తులు అంటే ప్రజాసామ్యంలో అధికారానికి మూలకారకులు అంటే ఓటర్లు

సంస్కృత నిఘంటువులు ప్రజలు అనే మాటకు 'లోకులు, జనులు, మనుష్యులు, జానపదులు' అన్న పదాలేకాక సందర్భాన్నిబట్టి వర్గము, వర్ణము, గణము అనే అర్థాలు చెప్తున్నాయి పై అర్థాలన్నీ సామాన్య దృష్టితో చెప్పినవే

అయితే వేమన్న దృష్టిలో ప్రజలెవరు? కొన్ని కులాలకు చెందినవారు వేమన్న ప్రజలని చెప్పడం ఆయన సువిశాల దృష్టిని కించపరచడమే కులాలవారీగా విడిపోయిన వారందరిని కలిపిచూడాలని కలలుగన్నవాడిని ఒక కులానికి చెందినవాడని ముడిపెట్టరాదు.

అలాగే వేమన్నకు ఒక ప్రాంతమని లేదు ఉన్న ఊరు తప్ప బయటి ప్రపంచం నెరుగనివాడు కాదు ప్రతి గ్రామమూ తన గ్రామంగా భావించి, విస్తృత సంచారం చేసిన వేమన్నకు ఏ ప్రాంత ప్రజలైనా వారి బాధలు, సమస్యలూ, వారి జీవిత విధానంలోని లోపాలు ముఖ్యం

పామరులు, అలగాజనాలే వేమన్న ప్రజలందరూ? ఇది వేమన్నను మిగిలిన వర్గాలనుండి విడదీయడమే అవుతుంది పామరులు వేమనపద్యాలకు ప్రత్యక్ష శ్రోతలు మాత్రమే వారి అజ్ఞానానికి కలతజెంది, వారికి జరిగే అన్యాయానికి ఆగ్రహించి వారికి సత్యం తెలియజెప్పాలనే తపనతో పద్యాలు చెప్పాడు కాని, కేవలం వారినే ఉద్దేశించి కవిత చెప్పలేదు అగ్రవర్ణాలవారిని దుయ్యబట్టడం వేమన కవితాధ్యేయం కాదు వేమన్న అగ్రవర్ణస్థుల వ్యతిరేకి అని ముగిస్తే వేమన్నకు న్యాయం జరిగినట్టుకాదు. వ్యక్తులకన్న వ్యవస్థలమీద తన దాడిని కేంద్రీకరించిన వానిని ఏదో ఒక వర్గానికి ముడివేయడం తొందరపాటే కాగలదు. అయితే కవి బాధితులపట్ల కొంత పక్షపాతవైఖరి నవలంబించడం అసహజంకాదు

ఆధునిక కాలంలో ప్రచారానికి వచ్చిన ఆర్థికదృష్టి (మార్క్సిజం)తో ఏర్పడిన వర్గాలు కూడ వేమన్నకు వర్తించవు. వేమన్న ఆర్థిక భావాలలో ఆయన దృక్పథం ప్రస్ఫుటంగా వివరించబడింది. సాంఘిక, మత దురన్యాయాల పైననే వేమన్న యుద్ధం ప్రకటించాడు. మౌలికంగా వేమన్నది సంస్కరణ దృక్పథం. కాబట్టి వేమన్నకు సమాజం పట్ల సమగ్ర దృష్టేకాని, పాక్షిక దృష్టి లేదు అని చెప్పడంవల్ల ప్రస్తుతానికి నిర్వచనపరమైన చాలా చిక్కులు కొంతవరకు తొలగిపోతున్నాయి.

తరువాత ప్రజాకవి అన్నవాడిని సందర్భం నుండి వేరుచేసి చూడడం సాధ్యం కాదు. 17 వ శతాబ్దంనాటి సన్నివేశంలోనే వేమన్న ప్రజాకవిత్వ లక్షణాలు ఋజువు అవుతాయి.

సమాజమనే మేడిపండు పొట్టవిచ్చి పురుగుల్ని కూడ చూపించడం ప్రజాకవి లక్షణం అని చెప్పకున్నాము. కాని సమాజంలో లోటుపాట్లను చిత్రించడంతో ప్రజాకవి బాధ్యత మొదలవుతుందే తప్ప తీరదు వేమన సంఘంలోని అన్యాయాలకు, దుర్మార్గాలకు కారణాలను అన్వేషించాడు. నాటి మేధావుల దంభ జీవితమే అన్నిటికి కారణమని తెలుసుకున్నాడు. ఈ ప్రయాణంలో హేతువే ఆయన దారిబత్తెం ఉత్తరోత్తరా అదే ఆయన ఆయుధం కూడ.

సమాజంలోని సమస్యలకు కారణాలు చెప్పడం ప్రజాకవి రెండవ లక్షణం

ఆ కాలంలో న్యాయాన్ని కొలిచే ధర్మశాస్త్రపు కొలతబద్ద యొక్క వక్రత్వాన్ని, అది కొలిచే మోసపు పద్ధతిని తిరస్కరించాడు వేమన్న దానిని ఎదిరించడం ప్రారంభించాడు. వర్ణవ్యవస్థ మీద రాజీలేని యుద్ధం ప్రకటించాడు అస్పృశ్యతను అసహ్యించుకున్నాడు ఈ ఖండనలో వేమన్నకు స్వపర భేదం అడ్డురాదు వేమన్న చేసిన సాంఘికమైన ఈ తిరుగుబాటు తెలుగు సాహిత్యంలోనే మొట్టమొదటిది.

సమాజ సమస్యలకు కారణాలు చెప్పడంతోనే ఆగకుండా ఆ కారణాలను ఖండించడం ప్రజాకవి మూడవ లక్షణం.

ఎంత నిస్వార్థంగా తిట్టినా, కేవలం తిట్టినవాడే కవి కాలేడు తిట్టు కవులకు మన సాహిత్యంలో కొదవలేదు కవికి ఒక దర్శనం ఉండాలి ఆశయం వుండాలి అస్తవ్యస్తతలు లేని ఒకానొక ఆదర్శ ప్రపంచం అతని మనోనేత్రాంచలాల్లో ప్రకాశిస్తూ ఉండాలి

కాబట్టి సమస్యల కారణాలపై దాడి చేయడంతో సరిపెట్టుకోక వాటికి పరిష్కారాలను దర్శించడం ప్రజాకవి నాలుగో లక్షణం

వేమన్న కేవలం వ్యతిరేక దృష్టిగల వ్యంగ్య కవి (Satirist) అనడంలో సబబు లేదు మాయమర్మాలు లేని, లోకంపైన నాకాన్ని సృష్టించే కుటుంబ వ్యవస్థను ఆయన ఆకాంక్షించాడు

సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
స్వర్గమేటికయ్య సంసారికింకను

'వెతలు దీర్చువాడు వేదాంత వేద్యుడు' అంటాడు; ఏ తత్త్వమైనా ప్రజలకు మేలు చేయాలని వేమన్న కోరతాడు.

ఇంటియాలి విడిచి ఇల జారకాంతల
వెంట దిరుగువాడు వెర్రివాడు
పంటచేను విడిచి పరిగలేరినయట్లు.

తొలి దశలో చెప్పిన చిలిపిపద్యాలనుబట్టి వేమన్నను అరాచకవాది (Anarchist) గా పరిగణించనక్కరలేదు. నీతిబద్ధమైన బాధ్యత గలిగిన సమాజాన్నే వేమన్న ఆకాంక్షించాడు. కాని అతని నైతికచక్రానికి ఇరుసు ప్రేమ.

* * *

# ప్రజాకవిత్వ సంప్రదాయంలో మరికొన్ని మణులు

ఒక్కమాటలో చెప్పాలంటే వేమనలాంటి కవి వేమనే అనితరసాధ్యమైన విచిత్ర మార్గంలో నడచిన అపూర్వమైన కవి వేమన తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు సంఘ వ్యవస్థలోని కుళ్ళును బయటపెట్టిన ప్రజాకవుల్లో వేమన్న ప్రథముడు

అయితే వేమన్న పేరు చెప్పగానే వీరు వేమన్నలాగే చెప్తున్నారు అని పేర్కొన్న గలిగిన కవులు కొందరు కనిపిస్తారు వీరు వేమన్నకు సమకాలికులు కావచ్చును. లేక పూర్వోత్తర కాలాలకు సంబంధించిన కవులు కావచ్చును. అలాగే భారతదేశంలోని ఇతర భాషా కవులలో, విదేశీ భాషలకు సంబంధించిన కవులలో కూడ వేమన్న భావాలకు సామ్యాలు కొన్ని కనిపిస్తాయి వీరిలో వేమన్నకు సాక్షాత్ ప్రతిబింబాలనదగిన కవులు ఏ ఒకరిద్దరోతప్ప కానరారు

నేను ఈ ప్రకరణంలో ఆయా కవులను గూర్చి ప్రస్తావన మాత్రంగానే చర్చించాను వారిలో వేమన్నతో పోల్చదగిన అంశాలు తత్త్వంలోగాని, కవిత్వ సంప్రదాయంలోగాని ఉన్నాయా అనేది ప్రధానంగా నా దృష్టి ఇతర కవులను గూర్చి నిర్దిష్ట కోణాల్లో పరిశీలించడంవల్ల వేమన్నను గూర్చి మరింత సుస్పష్టంగా చెప్పుకోవడానికి వీలు కల్పించడం ఇక్కడ నే నాశించిన ప్రయోజనం తులనాత్మక పరిశీలన వల్ల రెండు పక్షాలలోని తాత్త్వికాంశాలు స్ఫుటంగా భాసించినప్పటికీ, స్వరూపాలు మరింత స్పష్టరేఖలతో బయటపడినప్పటికీ వేమన్నను గూర్చిన గాఢమైన అవగాహనకోసమే ఇక్కడ నేను ఎక్కువగా ప్రయత్నించాను

## 1. టావో మత స్థాపకుడు

వేమన్న తాత్త్విక దృక్పథాన్ని గూర్చి చర్చిస్తూ శ్రీ ఆరుద్ర ఈ క్రింది వాక్యాలు వ్రాశారు

"చైనాలోని టావో మతస్థుల గీతాలు కూడా వేమన పద్యాల లాగే వుంటాయి టావో మతం దేహవాద మతం వేమనగారిదీ అదే ఈ నూతన పరిశోధనల సాయంతో వేమనగారి మతాన్ని నిర్ణయించాలి"[1]

టావో ఒక చైనీయ దర్శనం పేరు దీనిని లావోట్జూ అనే తత్త్వవేత్త ప్రతిపాదించాడు ఇతడు చైనాలోని హోనాన్ రాష్ట్రంలో క్రీ పూ 604 లో జన్మించాడు లావోట్జూ

1 "వేమన - రాళ్ళపల్లి" అనంతరాగం - రాళ్ళపల్లి అభినందన సంచిక, 1977

కన్ఫ్యూసియస్ కన్న 50 ఏండ్లు ముందటివాడు 'టావో టే చింగ్' అనేది అతని కృతి అని సంప్రదాయం చెప్తుంది

లావోట్జు, చౌ ఆస్థానంలో ఉద్యోగిగా (పునరావృత్త లేఖల – archieves – రక్షకుడుగ, లేక కోశాధ్యక్షుడుగా) ఉండేవాడు చౌరాష్ట్రం పతనం కానున్నదని గుర్తించి ముందుగానే ఉద్యోగం వదిలివేసి ఏకాంతంగా అజ్ఞాతంగా సన్యాసి జీవితం గడిపాడు అప్పటినుండి అతని జాడ ఎవరికీ తెలియదు. వెళ్ళడానికి ముందు పర్వతప్రాంత పాలకుడైన ఇన్హి అనే వానికి తన మతాన్ని బోధించి, తన కృతి నతని కిచ్చాడు లావోట్జు కన్ఫ్యూసియస్‌ను రెండుసార్లు కలుసుకున్నాడట ఇది ప్రాచీనకాలం నుండి వస్తున్న వాడుక కథ కొందరు ఆధునికులు దీనిని నమ్మరట

మొత్తం టావో మతం చైనీయులలో బాగా వ్యాపించింది కొందరు చక్రవర్తుల కాలంలో ఉచ్ఛస్థితినంది, మరికొందరి కాలంలో క్షీణదశనందుతూ వచ్చింది. ఛింగ్ (మంచూ) రాజ్యవంశ కాలంలో (1644–1911) దానికి మరీ చెడ్డరోజులు వచ్చాయి

లావోట్జు రచించిన 'టావో టే చింగ్' కృతి బోధనలు ఈ విధంగా ఉన్నాయి

టావోకు మార్గమని అర్థం జనుల జీవిత పథమనీ, ప్రకృతి విధానమనీ, పరమ తత్త్వం యొక్క తీరు అనీ మార్గానికి వ్యాఖ్యానం చెప్పకోవచ్చు

సమస్త వస్తువుల సహజ స్వభావమూ సారమూ టావో అంటే ప్రపంచంలో సదసత్తులూ, చావుపుట్టుకలూ చక్రంలాగ నిరంతరం ఒకదాని తర్వాత ఒకటి సంభవిస్తున్నాయి ఇదంతా టావో కోరికలు, అహంకారం లేనివారి అంతర్దృష్టికి ఈ రహస్యం కనిపిస్తుంది; తన చేతలలో టావోను అనుసరించేవాడు దానితో తదాత్మ్యం చెందగలడు విరక్తిచేత, త్యాగంచేత, సన్యాసంచేత టావో సిద్ధిస్తుంది

టావో ననుసరించి నడుచుకొంటే వానిలో 'టే' ప్రకటితమవుతుంది 'టే' అంటే సద్వర్తనం, ధర్మం, నైతికశక్తి, ఇతరులకు మార్గదర్శి కాగల ప్రభావం

సుఖం, దీర్ఘ జీవితం (వీలైతే అమరత్వ ), సంపద – సాధారణంగా మనుష్యులు వీటిని కోరుతారు కాబట్టి వీటిని పొందడాని టావో మార్గం చూపించింది తపస్సు వలన, ప్రాణాయామాది (An-Pan) క్రియలవల్ల, మంత్రౌషధులవల్ల, బ్రహ్మచర్యంవల్ల, కొన్ని తాంత్రిక మైథున ప్రక్రియల వల్ల అజరత్వమూ, అమరత్వమూ లభిస్తాయని టావో బోధించింది టావో మూల సిద్ధాంతాల మీద భారతీయ దర్శన ప్రభావం, అనంతర టావోయిజం మీద హఠయోగ, రాజయోగ, తంత్రసాధనల ప్రభావం ఉందని కొందరి ఊహ

టావో మతం మనిషి యొక్క స్వాతంత్ర్యాన్ని ఉద్ఘాటించింది విశ్వంతో ప్రకృతితో సామరస్యం పొందడమే ఆనందం అన్నివిధాలైన సంస్థలు, కట్టడులు మనుష్యుల స్వాతంత్ర్యాన్ని అరికట్టేవే మనుష్యులందరి స్వభావం ఒకేరకంగా ఉండదు కాబట్టి అందరినీ ఒకేరకంగా, అందరికీ ఒకే రకపు విలువలను, ప్రమాణాలను నిర్ణయించడం అనుచితం

టావో ప్రకారం ప్రపంచంలో ఉన్నదంతా – అన్ని వస్తువులు, అన్ని ఆచారాలు సమానాలే ఒకటి మంచిది, మరొకటి చెడ్డది అని నిర్ణయించడానికీ ఒకటి సుందరం, మరొకటి కాదు అని నిర్ణయించడానికీ ప్రమాణం లేదు టావో ప్రకారం అన్ని విధాలైన

అస్తిత్వాలు సమానమే. మరణం, జీవితం, దుఃఖం, సుఖం, అన్నీ వికారాలు. ఇవన్నీ ఒకటి మరొకటిగా మారుతుంటాయి. సమబుద్ధి కలిగినవాడే బంధం నుండి ముక్తుడవుతాడు. సమస్త వస్తువుల ఏకతయే విశ్వం. ఈ ఏకతను దర్శించి దానితో తాదాత్మ్యం చెందితే, ఆద్యంతాలకు, భేదాలకు, ద్వంద్వాలకు అతీతత్వం కలుగుతుంది. ఇది టావో మతసారం.

అయితే తొలిదశలో టావో మతావలంబకులు క్షుద్రలోహాలను బంగారంగా మార్చడం, చావులేకుండా చేసే మూలికలను లేక రసాయనాన్ని కనుక్కోవడం మొదలైన నానావిధ అంధ విశ్వాసాలకు దాసులు కావడం జరిగింది మరల కొంత కాలానికి ఇటువంటి విశ్వాసాలు నశించి తత్త్వ బోధనలు బయటికి వచ్చాయి.[2]

ఆరుద్రగారు అభిప్రాయపడ్డట్టు టావోయిజం అచ్చమైన దేహవాదంగా కనిపించదు మనిషి స్వతంత్రంగా, స్వాభావికంగా ఉండాలనే సహజవాదం కనిపిస్తున్నా భౌతికమే టావో మత పారమ్యంగా తోచడంలేదు. ఎందుకంటే టావో మతసారంగా చెప్పబడిన వాక్యాల్లో సమస్త వస్తువుల ఏకత్వమే విశ్వమనీ, ఆ ఏకతను దర్శించి దానితో తాదాత్మ్యం చెందితే, ఆద్యంతాలకు, భేదాలకు, ద్వంద్వాలకు అతీతత్వం కలుగుతుందనీ చెప్పబడింది ఇది అద్వైత సిద్ధాంతంలాగే కొంతవరకు కనిపిస్తుంది. అయితే ఆరుద్రగారు అభిప్రాయపడ్డట్టు ఈ మతబోధనా సంవిధానంలో భౌతికవాదచ్ఛాయలు కనిపించడం అబద్ధం కాదు.

వేమన్న ఆయా వాదాలను గూర్చి చెప్పేటప్పుడు అతడు చెప్పే విధానంలోని తీవ్రతవల్ల వాటికే చెందుతాడా అని అనిపిస్తుంది వేమన్న భౌతికవాది కాదు అట్లాగని వాస్తవ ప్రపంచానికి వీడ్కోలు చెప్పిన శుద్ధవేదాంతీ కాదు. ఇహపరాల్లో వేటినీ ఆయన విడిచిపెట్టలేదు అధిభౌతిక విషయాల కారణంగా భౌతిక విషయాలకు విఘాతం కలిగితే మాత్రం ఆయన సహించలేదు వీటికి ఉదాహరణలుగా అనేక వేమన పద్యాలను చూపవచ్చు

## 2. తిరువళ్ళువరు

దాదాపు రెండువేల సంవత్సరాల క్రిందట తమిళుల జీవితాన్ని తన రచనల్లో ప్రతిబింబించిన ఒక మహానుభావుడు జన్మించాడు అతని పేరు తిరువళ్ళువరు అతడు రచించిన పద్యసంపుటం పేరు 'కురళ్'

ఇతని అసలు పేరు తెలియదు 'తిరువళ్ళువ నాయనార్' అనేది సాధారణంగా అందరికీ తెలిసిన పేరు మాదిగ కులానికి చెందిన భక్తుడని దీనికి అర్థం (Lit 'The sacred devotee, priest or soothsayer of the paraya caste') అతడు భగవంతుడనే బ్రాహ్మణుడికీ, 'ఆది' అనే చండాల స్త్రీకి పుట్టిన వాడని వాడుక కథలున్నాయి తిరువళ్ళువరు నేతగాడుగా జీవించాడని కూడ వాడుకలున్నాయి

కురళ్ 133 అధ్యాయాలుగా విభాగించబడ్డది ప్రతి అధ్యాయంలో 10 పద్యాల చొప్పున మొత్తం 2660 పాదాల రచనాసర్వస్వం కురళ్ కురళ్ అంటే (Any thing short) చిన్న పద్యం అని అర్థం తమిళ ఛందస్సుల్లో కురళ్ అన్నింటికన్న చిన్నది ఇది

---

2. విజ్ఞాన సర్వస్వము – ఏడవ సంపుటము (దర్శనములు – మతములు) తెలుగు భాషా సమితి, హైదరాబాదు, మద్రాసు, వాల్తేరు పేజీలు 169–174, 1962

తెలుగులోని ద్విపద వంటిది. కన్నడంలోని త్రిపది వంటిది. కురళ్ అంటే పొట్టి (కుబ్జ) అనే అర్థాన్ని కూడ వ్యవహరిస్తారు. వామనుడు రెండు అడుగులతో భూమ్యాకాశాలను కొలిచినట్లే, తిరువళ్ళువరు కురళ్ పాదాల్లో బ్రహ్మాండమంత భావాన్ని ఇమిడ్చాడు.

విషయాన్ని బట్టి 'కురళ్' మూడు బృహద్విభాగాలు చేయబడింది. అవి - 1. ధర్మం, 2. అర్థం, 3. కామం. తొలి మూడు పురుషార్థాలను గూర్చి రచన చేసిన వళ్ళువరు మోక్షాన్ని ఎందుకో ఉపేక్షించాడు. మోక్షభాగాన్ని గూర్చి రచించిన భాగం దొరకలేదా? లేక భౌతిక ప్రపంచాన్నే కాని పరలోకాన్ని వళ్ళువరు నమ్మలేదా? అనే ప్రశ్నలకు తమిళపండితులకు తృప్తికరమైన సమాధానాలు ఇప్పటికీ లభించలేదు.

అయితే అతని మొగ్గు భౌతిక ప్రపంచం వైపే ఎక్కువగా కనిపిస్తుంది. అతడు కలలు గన్నది భౌతికాతీతమైన ఊహాప్రపంచం కాదు. అతడు తన సమకాలీన సంఘాన్ని చూసి గర్వించాడు అంటే ఆనాటి సమాజంలో కుటిలురూ కుత్సితులూ లేరని కాదు. కాని అప్పటి సాంఘిక వ్యవస్థ తిరువళ్ళువరుకు సంపూర్ణమైన తృప్తినిచ్చినట్టుగా దానిని మరింత దృఢపరచడానికే అతడు కృషి చేసినట్టుగా కనిపిస్తున్నది. అప్పటి మానవుని నైతికజీవితాన్ని పటిష్టంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించాడు. ఆనాడు వివిధ స్థానాల్లో ఉన్నటువంటి మనుష్యుల విధులను స్పష్టంగా నిర్వచించాడు.

తమిళులు "కురళ్"ను తమ అంతర్గత చైతన్యానికి ప్రత్యక్ష ప్రతీకగా గుర్తించి ఆదరించారు. ధర్మం, న్యాయం, నీతి, మానవత్వ సంబంధాలు మొదలైనవాటిని వర్ణించడంలో వళ్ళువరు అమోఘమైన ప్రతిభను కనపరిచాడు.

మానవ ప్రకృతికి విరుద్ధమైన అంధ విశ్వాసాలను ఖండించాడు. తన కాలానికే కాకుండా సార్వకాలికమైన శాశ్వత విలువలను తన రెండు పాదాల చిట్టి పద్యాల్లో సంతరించాడు.

తమిళుల సాంస్కృతిక సంపదలో కురళ్ ఒక తరగని గని మద్రాసులోని మైలాపూర్ (శాన్-తోమ్)లో నివసించిన నేతగాడు సముద్రాభిముఖంగా కూర్చొని, వచ్చిపోయే కెరటాలను పరికిస్తూ కురళ్ను లిఖించాడు మానవ జీవితానికి సంబంధించిన సర్వవిషయాలు వళ్ళువరుచేతిలో కవి తత్త్వసిద్ధిని పొందాయి

వేమన్న వలెనే వళ్ళువరు - తన పద్యాల్లో తన్ను తాను సంబోధించుకున్నాడని ఎం. ఎరియెల్ వ్రాశాడు

"That which above all is wonderful in the kural is the fact that its author addresses himself, without regard to castes, peoples, or beliefs, to the whole community of mankind "[3]

వళ్ళువరు రచనల ద్వారా అతని ఆరాధ్య దేవత లెవరో, అతని మతమేమిటో తెలియడం కష్టం తన గ్రంథం మొదట్లో ఏ దేవుని పేరు పెట్టి స్తుతించక సృష్టికారకుడైన ఆది భగవానుని ప్రార్థించాడు

'అకళమ్ ముదల ఎళుత్తు ఎల్లామ్
ఆది భగివన్ ముదట్రే ఉలకు'

(అక్షర ప్రపంచానికి "అ" మొదటిదయినట్లు, ప్రపంచానికి భగవంతుడే ఆది)

3 M Ariel - journal Asiatique (November, December - 1848) As quoted in Tirukkural

తిరువళ్ళువరుకు జైనుల బోధనలు తెలుసు క్రైస్తవ మత భోదనలతో కూడ సంబంధముండేదని జి. యు పోప్ వ్రాశాడు తమిళదేశంలోని వివిధ మతస్థులు 'కురళ్' తమదంటే తమదని వాదులాడుకున్నారు వళ్ళువరు పద్యాలకు తమ మతసూత్రాలను వర్తింపజేసి వ్యాఖ్యానగ్రంథాలను వెలయించారు. ముఖ్యంగా జైనులు తిరువళ్ళువరును తమ వాడిగా భావిస్తారు వళ్ళువరు దర్శనాన్ని గూర్చి వ్రాస్తూ జి యు. పోప్ ఈ క్రింది అభిప్రాయం వెలిబుచ్చాడు

' .But in as far as it is oriental. Tiruvalluvar's teaching is just such as the study of Hinduism, in the light of Sankara's reforms, combined with that of Jain system in its latter developments, and of Bhagwathgeetha, might have produced '[4]

వళ్ళువరు పద్యాలు వివాదస్పదమైనవి కావు. వివిధ చారిత్రక యుగాలు ఆయన పద్యాల్లో ప్రతిబింబించవు

వళ్ళువరుపద్యాల్లో కవిత్వం ఉన్నత ప్రమాణాలకు చెందినది ఇవి తీరికగా కూర్చొని నగిషీలు చెక్కిన ముక్తక పద్యాలు. క్లుప్తత వీటికి ప్రాణం ఛందోభంగాలు ఉండవు. అన్నియుగాల వారినీ అలరించిన కవిత వళ్ళువరుది అన్ని వర్గాల వారికి ఆదరపాత్రమైన దాయన కవిత

వళ్ళువరుకూ, వేమన్నకూ కొన్నిభావాలలోనే సామ్యమున్నది. కాని మౌలిక స్వభావాన్ని బట్టి వేరువేరు సంప్రదాయాలకు చెందిన కవులు వేమన్న ఆశుకవితా సంప్రదాయానికి చెందినవాడు వేమన పద్యాలు ఒక క్రమపద్ధతిలో ఒక్కచోట కూర్చినట్టివి కావు తిరువళ్ళువరు అట్లా కాదు ఒకచోట కుదురుగా కూర్చొని శిల్ప సమన్వితంగా అల్లిన పద్యాలాయనవి గృహస్థాశ్రమ ధర్మాలు, రాజనీతి విశేషాలు మున్నగు అంశాలు ఒక ప్రణాళిక ప్రకారం కూర్చబడ్డాయి

వేమన్న భావావేశపరుడు స్వతంత్రమార్గ సంచారి యథేచ్ఛగా దేశమంతా తిరిగి దురాచారాలను చూచి ఒళ్లుమండి వేడిగా, వాడిగా కవిత్వం చెప్పినవాడు దానికాయన జీవించిన కాలపరిస్థితులు కూడ కొంత కారణం కాని స్వభావతః వేమన్న ఉద్రేకి వళ్లువరు ఋషి వంటివాడు సాత్త్వికి భావసంపన్నుడు తననాటి సంఘ వ్యవస్థలతో ఎక్కువ పేచీ పడకుండా, భావసంయమనంతో నీతి ప్రబోధం చేశాడు సంప్రదాయకమైన ధర్మశాస్త్ర వాసనలు తిరువళ్ళువరులో మెండు ధార్మిక బోధనల కాయన పద్యాలు నికషోపలాలు వేమన్న దృష్టి వేరు యావత్ సంఘానికీ శ్రేయోదాయకమైన వాటినే ఉత్తమ ధర్మాలుగా ఆయన గుర్తించాడు ఎంతటి నిరూఢ మార్గాలయినా అవి మానవత్వ వ్యతిరేకమైతే వాటితో రాజీలేని యుద్ధం చేశాడు వళ్ళువరు ప్రజలు దారి తప్పకుండా వారిలో నైతికాభిరుచులు మొలకెత్తడానికి ప్రయత్నించాడు వళ్లువరు హేతువును ఉపేక్షించలేదు కాని వేమన్న చేతిలో అదే ప్రధాన ఆయుధంగా మారింది

అయితే ఇద్దరి గమ్యమొక్కటే – వారు కోరింది విశ్వకళ్యాణం అసమానతలు లేని ఆదర్శ సమాజాన్ని వారు కాంక్షించారు ఇద్దరూ సామాన్య ప్రజలకు అర్థమౌతూ, పండితులను మెప్పించే సజీవభాషలో కవిత్వమల్లారు అలతి అలతి పదాల శుక్తిముక్తాఫలాల వంటి శక్తివంతమైన సూక్తులను ప్రజల లోగిళ్ళలో కుప్పలు పోశారు వేమన్నకుగాని

4 Tirukkural, Introduction - G U Pope

వళ్ళువరుకుగాని ఒక దేవుడని లేదు. అన్ని మతాల్లో, సకల దేవతల్లో ఒకే బ్రహ్మాన్ని దర్శించారు. వారి ఈశ్వరుడు ఒక్కడే.

వేమన్నవలె వళ్ళువరు వర్ణ వ్యవస్థను పనిగట్టుకొని తీవ్రంగా ఖండించినవాడు కాదు. కాని విశ్వవిశాల భావముతో కులభేదాలు మంచివి కావనీ, కులంకన్న గుణమే ప్రధానమనే ధోరణిలో పద్యాలు చెప్పాడు.

పిరప్పొక్కుం ఎల్లావుయిర్కుం సిరప్పొవ్వా
సైధొలిల్ వేటుమైయ్యాన్ (972)

All human beings agree as regards birth but differ as regards their characteristics, because of the different qualities of their action.[5]

ఆర్థిక భావాలలో వళ్ళువరుకూ వేమన్నకూ పోలికలున్నాయి. వళ్ళువరుదృష్టిలో కూడ దారిద్ర్యమంత భయంకరమైనది మరొకటి లేదు

ఇన్మైయిన్ ఇన్నాగదు యాదెనిన్ ఇన్మైయిన్
ఇన్మైయే ఇన్నాదదు (1041)

There is nothing that afficats (one) like poverty.

ఇన్మై ఎనవోరు పావి మరుమైయుమ్
ఇమ్మైయుం ఇండ్రివరుమ్ (1042)

When cruel poverty comes on, it deprives one both the present and future (bliss)

వేమన్న కూడ ధనము లేమిని దావాగ్నితో పోల్చి చెప్పాడు

ఇరువురు కూడ దారిద్ర్యవిద్రావణానికి ధనవంతులు వితరణగుణం అలవరచుకోవాలని ప్రబోధించారు అయితే వేమన మరికొంత ముందుకు వెళ్ళి, దానగుణం లేని లోభులను తూర్పార బట్టాడు. అయితే పాత్రత నెరిగి దానమీయాలని వళ్ళువరు బోధించాడు

వరియార్కొండ్రు ఈవదే ఈగై మట్రెల్లామ్
కురియెదిర్పై మీరతుడైత్తు (221)

To give to the destitute is true charity All other gifts have the nature of (What is done for) a measured return

ఇలనెన్నునమ్ ఎవ్వమ్ ఉరయ్యామై ఈదల్
కులనుడయ్యాన్ కన్నె ఉళ (223)

(Even in a low state) not to adopt the mean expedient of saying "I have nothing," but to give, is the characteristic of the man of noble birth

'కోపమునను ఘనత కొంచెమై పోవును' అని వేమన్న చెప్పాడు అయితే వేమన్న సంఘవ్యవస్థల లోపాల పట్ల తీవ్రమైన కోపాన్ని ప్రదర్శించాడు కాబట్టి వేమన్న వద్దంటున్నది వ్యక్తిగత కోపం మాత్రమే ధర్మాగ్రహాన్ని వెళ్ళగక్కడానికి వేమన్న వెనుకాడలేదు

---

5 Translation by Rev Drew - Tirukkural

వళ్ళువరు కూడ తన కోపమే తనకు శత్రువనే అర్థంలో పద్యాలు వ్రాశాడు. అయితే ఇది సాత్త్వికస్వభావాన్ని అలవరచుకొమ్మని చేసే ప్రబోధం.

మరత్తళ్ వెగుళియై యార్ మాట్టుమ్ తీయ
తిరుత్తళ్ అదనాన్ వరుమ్ (303)

Forget anger towards every one, as fountains of evil spring from it.

నగైయుమ్ వువగైయుమ్ కొల్లుం శిలత్తిన్
పగైయుం ఉళవోపిర (304)

Is there a greater enemy than anger, which kills both laughter and joy?

అపారమైన మానవతావాది వేమన్న. అసమానతలలోని కనపడని హింసను వెలికీడ్చిన సుమకోమల హృదయుడు. ఇటువంటివాడు జంతువులపట్ల హింసను మాత్రం సహిస్తాడా? జీవహింస చేసేవారికి మోక్షం దక్కదని నిక్కచ్చిగా చెప్పాడు హింసాత్మక కృత్యాలవలన మానవునిలోని ఇతర సుగుణాలు కూడ మంటగలుస్తాయని వళ్ళువరు బోధించాడు.

అరవినై యాదెనిళ్ కొల్లామై కోరల్
పిరపినై ఎల్లాన్ తరుమ్ (321)

Never to destroy life is the sum of all virtuous conduct The destruction of life leads to every evil

వళ్ళువరు సుఖమయమైన గృహస్థ జీవితంతో, పరమ సాధ్వియైన అర్ధాంగి 'వాసుకి'తో పొందిన ప్రశాంతమయ జీవితం గలవాడు వేమనకు ఇంటిలోని పోరు ఇంతింతకాదు. వళ్ళువరుకు అన్నివర్గాల తమిళులూ బ్రహ్మరథం పట్టారు వేమన పరిస్థితి అట్లాంటిది కాదు

## 3. కబీరు

కబీరుదాసు పేరు విననివారు ఉత్తర భారతంలోనే కాదు - సమస్త భారత దేశంలోనూ లేరు ప్రజాకవిగా, సంఘ సంస్కరణాభిలాషిగా లోకంలో ఆయనకున్న స్థానం అమూల్యమైనది

వేమన్నను కబీరుతో పోల్చడానికి ఉన్నంత వీలు మరే కవితోనూ కనిపించదు కబీరు వేమన్నవలెనే ఆశుకవితా సంప్రదాయంనుండి వచ్చినవాడు వేమన్నకు కనీసపు చదువు సంధ్యలైనా ఉన్నాయి కాని కబీరుకు అవి కూడ ఉన్నట్టులేదు కబీరు నిరక్షరాస్యుడు ఏ గురుసన్నిధిలో కూడ ఓనమాలు దిద్దిన పాపాన పోలేదు ఈ రాతకోతలు రాని సామాన్య నేతగాణ్ణి హిందీ సాహిత్య విమర్శకులు సరస్వతీపుత్రుని (**వాణీకా వరద్ పుత్ర్**)గా సంభావించడం వింతలలోకెల్ల వింత అవును, కబీరు సహజకవి. విద్యావివేకవంతులెందరికో శిరోధార్యుడైన మహాకవి

వేమన్నవలెనే కబీరు కాలం కూడ నిక్కచ్చిగా తేలలేదు అనేక భేదాభిప్రాయాల మధ్య 14 నుండి 15 వ శతాబ్దం వరకు అతని కాలనిర్ణయాలు వెలువడ్డాయి ఆశుకవులందరి విషయంలో కాలనిర్ణయం సాధ్యంకాకపోవడం సహజలక్షణమనిపిస్తున్నది

కబీరు పద్యాలేవి? కానివేవి? అనే పరిస్థితి ఇక్కడకూడ ఉంది. అయితే ఈ శిరోవేదన అలహాబాదు యూనివర్శిటీలోని పరశునాథ్ తివారిగారి విపుల పరిశోధన వలన చాలావరకు తగ్గిందట.[6]

వేమన కొంతకాలమైనా పండితుల అనాదరణకు గురైనాడు. కబీరుకాగతి పట్టలేదు. కాని అతడు జీవించి ఉన్న కాలంలో రామానందుడనే గురువు కబీరు శూద్రుడైన కారణంగా శిష్యునిగా స్వీకరించలేదని చెప్పే వాడుక కథలు ప్రచారంలో ఉన్నాయి. కబీరు చిత్తశుద్ధికి ముగ్ధుడై ఉత్తరోత్తరా శిష్యునిగా అంగీకరించాడట! వేమన రాయలసీమ సర్కారులు, కొంత తమిళ ప్రాంతం పర్యటిస్తే కబీరు ఉత్తరభారత దేశమంతటా సంచరించిన దాఖలాలున్నాయి. వేమన్న శిష్యులను గూర్చి ప్రత్యక్ష సాక్ష్యాలు లేవుగాని కబీరు శిష్యులెందరో చరిత్రకెక్కారు

కబీరుది శ్రుత పాండిత్యం సంస్కారజనితమైన ప్రతిభ, లోకవృత్త పరిశీలన మతని అభ్యాసవిద్య అతని పాండిత్యం ప్రజల భాషకు సంబంధించినదే కాని కావ్యభాషకు సంబంధించినది కాదు అతడు వాడిన భాషను 'సాధుక్కడి' (దేశ సంచారులైన సాధువులు వాడే మిశ్రభాష) అంటారు.

కబీరు రచనా సర్వస్వాన్ని 'బీజక్' అంటారు దానిని మూడు భాగాలుగా విభజించవచ్చు.

1 సాఖీ, 2 పద్, 3 రమైనీ

సాఖీ, సాక్షి అనే మాటకు రూపాంతరం తాను చెప్పే బోధనలకు సాక్షీభూతుడుగా తనలోనే దేవుడున్నాడని కబీరు తాత్పర్యం సాఖీ విభాగంలో కబీరు చెప్పిన ద్విపద పద్యాలే (దోహా ఛందస్సు) ఎక్కువగా ప్రజల నోళ్ళకెక్కాయి దాదాపు వేయి ద్విపదలవరకు చెప్పి ఉంటాడని అంచనా అతడు ఆశురచన చేస్తుంటే అతని శిష్యులు వ్రాసిపెట్టిన ద్విపదులే మనకు మిగిలిన పెన్నిధులు వ్రాతకెక్కక ప్రజలనాలుకల మీద మిగిలిపోయినవెన్నో!

కబీరును కన్న తల్లితండ్రులెవరో తెలియదు. మహమ్మదీయ దంపతులచే పెంచబడినాడనే వాడుక కథలున్నాయి ఈ కారణంవల్లనే కావచ్చు – అతడు హిందూ ముస్లింల ఐక్యతను తన కవితలద్వారా ప్రబోధించాడు అల్లా, విష్ణు, కృష్ణ, గోవింద, ఖుదా మొదలైన వాటిని ఒక నిర్గుణ బ్రహ్మమును సూచించే వివిధ నామాలుగా కబీరు విశ్వసించినప్పటికీ 'రామ' శబ్దం మాత్రం అతని కత్యంత ప్రీతిపాత్రమైనది అయితే అతని రాముడు మన రామాయణ రాముడు కాదు వేదాతీతుడై త్రిలోకాలలోను విలక్షణమైన పరమాత్మ తత్త్వం

కబీరు భక్తుడు నిరంతర చింతనచే భగవంతుని చేరుట సాధ్యమని అతడు నమ్మాడు దేవునియందు లీన మొనరించు హృదయ ప్రాప్తి దాని గమ్యం కబీరు దానిని భావభగతి (భావభక్తి) అని పిలిచాడు ఇది వర్ణనాతీతం అనుభవైకవేద్యం వేమన అనేక పద్యాలలో వర్ణించిన అద్వైతానుభవం వంటిదే ఇది ఇతని పైన హఠ యోగుల ప్రభావం ఉన్నట్టు కూడ అనిపిస్తుంది అద్వైత సిద్ధిని పొందిన అవస్థను కబీరు 'సహజ సమాధి' అని

---

6 "It is a complicated question as to what are the original works and texts of Kabir Dr Tiwari, by his deep and thorough study, has done a commendable job in clearing this confusion" - Dr Vasudeva Sharan Agarwal's comment (back cover of Kabir)

పిలిచాడు. కబీరు ప్రకారం కూడ తత్త్వం తనువులోనే పుడుతుంది. కాబట్టి నీలో ఉన్న పరమాత్మను తెలుసుకొమ్మంటాడు.

తేరా సాయీ తుఝ్‌మే రమతా
జో ఫూహూపన్ మే చాన్
కస్తూరీ కా మృగజ్యో
ఢూండై ఫిరి ఫిరి గాస్.

(పువ్వులో సౌరభమున్నట్టుగా దేవుడు నీలోనే ఉన్నాడు. ప్రతి గడ్డిపోచను వాసన చూస్తూ వెతుకుతుంది కాని, కస్తూరిమృగం తన నుండే ఆ పరిమళం వెలువడుతుందని తెలుసుకోలేదు.)

తనలోనే తత్త్వముండగా అజ్ఞానంతో తీర్థాలను సేవించడం, పుణ్యక్షేత్రాలను సందర్శించడాన్ని కబీరు ఖండించాడు

పానీ బిచ్ మీన్ పియాసీ
మోహి సున్ సున్ ఆవే హాంసీ
ఘర్ మే వస్తు నజర్ నహీ ఆవత్
బన్ బన్ ఫిరత్ ఉదాసీ
ఆతమ్ జ్ఞాన్ బినాజగా ఝూటా
క్యా మధురా క్యా కాశీ!

(అంతటా జలముంది కాని చేపకు (ఆత్మ) దాహం తీరదు. అటువంటి వారిని చూస్తే నాకు నవ్వొస్తుంది నువ్వు వెతుకుతున్న వస్తువు నీ యింట్లోనే ఉందని కానక అజ్ఞానంతో వనాల్లో తిరుగుతావు ఆత్మజ్ఞానం లేనప్పుడు నువ్వు మధుర, కాశీ మొదలైన పుణ్యక్షేత్రాలకు ఎక్కడికి వెళ్ళినా వ్యర్థమే)

కబీరు తన కాలంలోని వేషధారులను ఖండించాడు శాస్త్రాలలోనే అంతా ఉందని ప్రచారం చేస్తూ చిలుక పలుకులు వల్లించే షేకులను సాధువులను నిలదీసి మరీ విమర్శించాడు స్వానుభవమే ముక్తి సాధనమన్నాడు

తేరా మేరా మన్ వా కైసే ఇక్ హోయిరే
మై కహతాహూ ఆంఖిన్ దేఖా
తూ కహతా కాగద్ కి లేఖీ
మై కహతా సుర్ ఝూవన్ హోరీ
తూ రాఖిమో అరు ఝూయిరే

(పండితులు, షేక్, సాధువులతో కబీరు ఈ విధంగా అంటున్నాడు "మీరూ, నేను ఒకటి ఎట్లా అవుతాము? నేను నా కళ్ళతో చూసింది చెప్తాను మీరు శాస్త్రాల్లో చదివింది వల్లిస్తారు నేను భ్రమలను పటాపంచలు చేస్తాను. మీరు వాటిని అలాగే కాపాడతారు")

కబీరు ఒక ప్రత్యేకమైన చారిత్రక పరిస్థితులలో ఉద్భవించాడు మహమ్మదీయ మత ఆగమనం వలన ఆధ్యాత్మిక సాంఘిక రంగాలలో ఏర్పడిన గందరగోళ పరిస్థితిని రూపుమాపడానికి తత్త్వాన్వేషణకు పూనుకున్నాడు పరశనాథ్ తివారి రచించిన

'కబీరు' గ్రంధానికి వ్రాసిన ముందుమాటలో కబీరు నిర్వహించిన చారిత్రక బాధ్యతను గూర్చి బి వి. కేస్కర్ ఈ కింది అభిప్రాయాన్ని వెలిబుచ్చారు:7

"Amongst the great saints and reformers who created a religious and social transformation in medieval period, Kabir ranks with the most remarkable. A mystic, a sworn enemy of ritualism who tore to shreds rituals and ceremonies by showing the hypocricy and cant involved in them, a bridge between Hindus and Muslims, he is amongst the most renowned saints of that revolutionary age. His thoughts and sayings penetrated practically everywhere in the country and helped in furthering the cause of religious reformation."

కబీరు గొప్ప సంస్కర్త. తన తత్త్వాన్వేషణలో అడ్డువచ్చిన మూఢనమ్మకాలు - అవి హిందూ ముసల్మాను మతాలు అనే భేదం లేకుండా ఖండించాడు. వేషధారితనం, కుల వ్యవస్థ, విగ్రహారాధన మొదలైన పెక్కు అంశాలపైన వేమన్న వలెనే కబీరు దాడి చేశాడు.

నజాన్ సాహెబ్ కైసాహై
ముల్లా హోకర్ బాంగ్ జోదేవే
క్యా తేరా సాహెబ్ బహరా హై
కీడీ కే పగ్ నేవర్ బాజే
సోబీ సాహెబ్ సున్‌తాహై
మాలాఫేరి తిలక్ లగాయా
లంబీ ఝటా బడాతాహై
ఆంతర్ తేరీ కుఫర్ కటారీ
హా నహి సాహెబ్ మిల్‌తాహై

(ముల్లాలతో కబీరు అంటాడు "దేవుడెట్లా ఉంటాడో మీరెరుగరు. కాని దేవుణ్ణి చూపించగలమని అంటారు ఉదయం పూట అంత గట్టిగా అరుస్తారేం (నమాజ్)? మీ దేముడికేమన్నా చెవుడా? దేవుడు చీమకాళ్ళ చప్పుడు కూడ వినగలడు (సాధువులతో) మీరు రుద్రాక్షమాలలను తిప్పుతారు, తల మీద నామాలు ధరిస్తారు కానీ మీ హృదయాల్లో కామక్రోధాదులను జయించకుండ ఏ రకంగా దేవుణ్ణి దర్శిస్తారు?")

వేమన్న 'కులము కన్న మిగుల గుణము ప్రధానంబు' అని అంటే కబీరు సాధుపుంగవుల కులమెన్నడం అవివేకం అంటాడు వారికులం కన్న జ్ఞానమే ప్రధానం

జాతీ నపూఛో సాధూకీ
పూఛ్ లీజియె జ్ఞాన్
(మహాత్ముల కులమెంచరాదు జ్ఞానమే ముఖ్యం)

7. KABIR Parasanath Tiwari Translated by J P Uniyal Forward by B V Keskar National Biography Series, National Book trust of India, New Delhi, 1967

ఇంకా ఇట్లా విస్తరిస్తాడు:

సంతన్ జాత నపూఛో నిర్గుణియా
సాధు బ్రాహ్మన్ సాధు క్షత్రియ, సాధై జాతీ బనియా
సాధన్ మా ఛత్తీస్ కామ్ హై టేడీ తోర్ పూఛనియా
సాధైనావూసాధై దోబీ, సాధ్ జాతీహై బరియా
సాధన్ మారయిదాస్ సంత్ హై
ఫిర్ సుపచ్ ఋషీ సోభాంగియా
హిందూ తుర్క్ దుహీయీ దీన్ బనేహై
కచూనహీ బహ చనియా.

(గొప్పవారి గోత్రాలను గూర్చి అడగకు. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య మొదలైన అన్ని కులాల్లోనూ సాధువులుంటారు. సాధువుల్లో అనేకవృత్తుల వాళ్ళుంటారు. చాకలి, మంగలి, చెప్పులు కుట్టేవాడు అందరిలో సాధువులుంటారు. కాబట్టి కులమెన్నడం వ్యర్థం, అజ్ఞానం.)

కబీరుకూడ మూర్తిపూజను నిరాకరించాడు:

పాహన్ కూ కా పూజియే
జే జనమ్ నదేయీ జాబ్
అంధానర్ ఆసాముఖీ
మోహీ కోపై అబ్[8]

(రాతినెందుకు పూజిస్తారు? అది జన్మనిస్తుందా? మాట్లాడుతుందా? మనిషి తన శక్తిని మరచిపోయి అంధుడై ఎండమావి (False hope) వెంట పరుగులు తీస్తున్నాడు.)

కబీరు సాహసి మానవులందరినీ ప్రేమించగలిగిన మహనీయుడు. మానవునిలో మాధవుని దర్శించిన మహిత భక్తుడు

లాలీ మేరే లాల్ కీ జిత్ దేఖీ తిత్ లాల్
లాలీ దేఖన్ మైచలీ హోగయి లాల్.

(లాలీ=ఎరుపురంగు, అనురాగానికి గుర్తు)

## 4. అరుణగిరినాధుడు

అరుణగిరినాధుడు వేమన్నతో కొంతవరకు పోల్చదగిన ద్రవిడకవి అని తమిళ పండితుల్లో ఒక అభిప్రాయముంది వంగూరివారు కూడ "వేమన్న పోలిక కవులు" అనే శీర్షిక క్రింద అరుణగిరినాధుని గూర్చి కొద్దిగా వ్రాశారు.[9]

---

8 ఈ వ్యాసంలో ఉదాహరించిన పద్యాలు 'కబీరు' అనే గ్రంథం నుండి గ్రహించబడ్డాయి "హిందీ గ్రంధ రత్నాకర సీరీస్" కబీరుకే వ్యక్తిత్వ, సాహిత్య ఔర్ దార్శనిక్ విచారోంకి ఆలోచన – లేఖక్ డా. హజారీ ప్రసాద్ ద్వివేది, డి లిట్ ప్రకాశక్· హిందీ – గ్రంధరత్నాకర్ కార్యాలయ, బొంబాయి–4, 1963

9 వేమన – వంగూరి, పేజీ 141

అరుణగిరినాథుడు 15 వ శతాబ్దానికి చెందినవాడు (క్రీ. శ. 1465). ఇతడు తిరువణ్ణామలైలో జీవించాడు. ఇప్పటికీ అక్కడ అరుణగిరినాథుని పేర ఒక గుడి గోపురముంది

ఇతని జీవిత విశేషాలను గూర్చి ఒక విచిత్రమైన కథ వాడుకలో ఉంది.

ఉత్తర ఆర్కాటు జిల్లాలో తిరువణ్ణామలై క్షేత్రం పంచభూత క్షేత్రాల్లో తేజోలింగ క్షేత్రం. అరుణాచలేశ్వరుడు అక్కడి అధిష్ఠాన దైవం

పెద్ద పెద్ద దేవాలయాల్లో దినాని కొక దేవదాసి స్వామికి నాట్య నివాళి అర్పించడం ఆ కాలంలోని ఆచారం. అరుణాచలేశ్వరుని ఆలయాన్ని సేవించుకునే దేవదాసీలలో ముత్తు ఒకతె దేవదాసికి స్వామియే దయితుడు బహుశః లౌకిక దయితుని ఉనికిని గుప్తంగా ఉంచుకునేవారేమో!

ముత్తుకొక కుమార్తె ముత్తుకెటువంటి లోటు లేకుండానే జీవయాత్ర గడుస్తున్నది ఒకనాడామెకు ఒక కుమారుడుంటే జీవితం ధన్యమవుతుందనే అభిలాష కలిగింది. స్వామిని ప్రార్థించింది స్వామి ఆమెకు స్వప్నంలో కనిపించి, తానామె కడుపున పుడతానని అనుగ్రహించాడు

ముత్తుకు కొడుకు పుట్టాడు. అసలే సరళహృదయం దానికితోడు అరుణాచలేశ్వరుడే ఈ నిసుగని ఆమె నమ్మకం ఇక ముద్దుముచ్చట్లకు కొదవ లేకపోయింది. కొడుకు పేరు అరుణగిరినాథుడు కాని, వాడు పెరుగుతున్నకొద్దీ అతనిలో ధూర్త లక్షణాలే మిక్కుటంగా కనిపించాయి అయితే అతడు తనను పరీక్షించడానికే అట్లా అల్లర చిల్లరగా ప్రవర్తిస్తున్నాడని ముత్తు తలపోసింది

ముత్తుకు వృద్ధాప్యం, అరుణగిరినాథునికి యౌవనం కలిసి వచ్చాయి ఆమె కాటికి కాళ్ళు చాచుకొని ఉంది అతనికి ఎప్పటికప్పుడు నూతన తరుణీ సమావేశ కామ్యంతో కాలు నిలువదు అయినా, అతడు దైవాంశ అనే ఆ పిచ్చి తల్లి విశ్వాసం ఆమెకు ఆలయంలో నాట్యం చేసే శక్తి సన్నగిల్లింది కూతురు వెళ్ళి నాట్యం చేసి వస్తున్నది

ఆ స్థితిలో ముత్తుకు అవసానం వచ్చింది కొడుకు దైవాంశ సంభూతుడనీ, అతని కోర్కె దేనినైనా తృణీకరించరాదనీ కూతురును చేరబిలుచుకొని చెప్పింది కుమార్తె తాను ముత్తులాగానే అరుణగిరినాథునికి వాత్సల్య లోపం లేకుండా సంభావిస్తానని మాట యిచ్చింది ముత్తు సంతుష్టి చెంది మరణించింది

అరుణగిరినాథుని అల్లరికి మితిలేదు అక్క ఏమీ అనదు కనీసం విసుక్కోదు ముత్తు కూడబెట్టిన ఆస్తిపాస్తులన్నింటిని కరగదీశాడు ఒకనాడు డబ్బు కావాలనీ, తెమ్మని అక్క నడిగాడు ఆమె దగ్గర ఉన్న ధనమంతా అయిపోయింది లేదని చెప్పడానికి మనసొప్పలేదు డబ్బెందుకని అడిగింది "కొత్త పిల్లొకతి వచ్చింది దానిని అనుభవించాలి" అన్నాడు "అట్లయితే నేటికి నన్ను కూడి సంతుష్టుడవు కమ్మ"న్నది

తల తిరిగిపోయింది అరుణగిరినాథునికి అక్కతో కూడటమా? తానంత భ్రష్టుడ య్యాడా? అక్క ఎంత మాటంది! నిర్విణ్ణుడైపోయాడు వెంటనే వెళ్ళి అరుణాచలేశ్వర దేవాలయం ముంగిట గల రాజగోపురం మీదికెక్కి తలకిందులుగా దూకేశాడు అప్పుడు శివుడతణ్ణి అందుకొని రక్షించాడని చెప్తారు అది మొదలు అరుణగిరినాథుడు శివ సంకీర్తనం చేస్తూ జీవితాన్ని భగవత్ ప్రీతిగా గడిపాడు లోకాన్ని భగవత్ప్రసాదంగా

సంభావించాడు తమిళనాడులో నేటికీ అరుణగిరినాథర్ విరచితమైన "తిరుప్పగళ్" గేయాలను భక్తిపారవశ్యంతో గానం చేస్తారు.10

వేమన్న జీవితాన్ని కూడ విద్యుద్ఘాతంవంటి ఇటువంటి సంఘటనే అనుకోని మలుపు తిప్పినదన్న వాడుక కథ ఉంది దీనిని నమ్మినా నమ్మకున్నా వేమన్న కూడ తొలి దశలో భోగజీవితాన్ని అనుభవించి అనంతర జీవితాన్ని జ్ఞానమార్గంలో గడిపినట్టు అతనిపద్యాలలోని పరిణామాన్ని పరిశీలిస్తే అనిపిస్తున్నది

అరుణగిరినాథుడు తన రచనల్లో వేశ్యల మాయలను వర్ణిస్తూ, భగవదనుగ్రహం వల్ల తాను వారి బారినుండి బయటపడ్డానని అర్థం వచ్చే గేయాలు అనేకం వ్రాశాడు. ఇతడు 'తిరుప్పగళ్' అనే కావ్యాన్ని 1600 పదాలతో వ్రాశాడట. 1200 మాత్రం ఇప్పుడు దొరుకుతున్నాయి ఇతని కృతులు పండిత, పామర రంజకాలు. ఇతడు సుబ్రహ్మణ్యస్వామి భక్తినీ, కౌమార సమయాన్నీ బోధించాడు ఇతని ఇతరకృతులు·

1 కందరనుభూతి, 2. కందరలంకారము, 3 తిరుహూపు మొ॥వి.

అరుణగిరినాథుని వాక్యాల మాధుర్యాన్ని పండితులు మెచ్చుకున్నారట. 'వాక్కిర్క రుణగిరినాథ' అనే నానుడి ఉన్నదట

వంగూరివారు ఉదాహరించిన అరుణగిరినాథుని పదమొకటి ఈ కింద యిస్తున్నాను·11

పంగమే వుంపిఅప్ పందకారందనిల్
బందపా సందనిల్ – తడుమారీ
పంచపాణం పడప్ పుణ్ పడావంచకప్
పణ్ బిలా డంబరప్ – పొదుమాదర్
తంగళా లింగనక్ కాంగెయా పెంబడ
సంగెమాల్ కొండిశైల్ – తయరాదే
తండై శూళ్ కిణ్ కిణిఫ్ పుండరీ కంతనైల్
తీందునీ యన్ బువైల్ – తరుళ్వాయే
అంకైవేల్ కాణ్డంక్ కన్పరదా పంకెడుల్
తండవే తండుముట్ (+) పడవేతాన్
ఆంజవే తిణ్డిఅల్ కొణ్డలా కణ్డలర్
కండంలో కంకొడుల్ – తరుళ్వాయే
తింకళాల్ కొణ్డైమల్ తంతుళాయ్ తుస్రుపార్ (+)
చెంజడా పంజరల్ – తరుతోప్పై
చిరితైయేయ్ తెన్రిసైల్ తెన్రిసైల్ తెన్రల్ పీ సుంపాశిల్
సెందిల్ వాల్ సెంతమిళ్ప్ – పెరుమాళే
(తిరు చెందూర్ తిరెప్ పుహాళ్)

**అర్థం:** జన్మ అనే చీకటి చేతా, సంసారమనే పాశం చేతా, మదనుని బాణాల దెబ్బలకు డస్సి, వనితల చేతా, వేశ్యల మోసపు కౌగిళ్ళనూ, ముద్దులనూ వదలలేక నన్ను

---

10 ఈ కథను నాకు జి కృష్ణ (ఆంధ్రప్రభ ప్రత్యేక విలేఖరి) గారు చెప్పారు
11 వేమన – వంగూరి, పేజీ 142

నేను మరచియున్న నాకు వేలాయుధుడూ, శూర పద్మ దనుజ సంహారకుడై యింద్రునికి స్వర్గాన్ని అర్పించిన ప్రతాపశాలీ, మయూరవాహనుడూ అయిన సుబ్రహ్మణ్యస్వామే దిక్కు.

వేమన్నకూ అరుణగిరినాధునికీ పోలికలు ఎక్కువగా లేవు. కాని వేమన్నను తలచేటప్పుడు అరుణగిరినాధుడు గుర్తుకొస్తాడు తమిళులకి – అంతే!

## 5. గురునానక్

గురునానక్ కూడ ఒక ప్రత్యేకమైన సంధికాలంలో మానవతాదృష్టిని ప్రబోధించాడు. ప్రజల మూఢత్వాన్ని పెంచే కర్మకాండల నితడు ఖండించాడు. తత్త్వరహితమైన మోసపుమాటలతో ప్రజలను పక్కదారి పట్టించే స్వాముల బారినుండి సామాన్యులను తప్పించడానికి కృషి చేశాడు. మహమ్మదీయ పరిపాలన ప్రారంభదినాలలో, ఆధ్యాత్మిక సంబంధమైన గందరగోళ పరిస్థితులలో నానక్ తత్త్వాన్వేషణకు పూనుకున్నాడు. నానక్ నాటి పరిస్థితులను గూర్చి బి వి. కేస్కర్ ఈవిధంగా వ్యాఖ్యానించాడు:

'One of the outstanding figures of middle ages is Nanak. He came during a period of great social, political and spiritual crisis in the history of India. A few centuries before, Muslim rule had come to India and Babar had just established the Moghal dynasty. The coming of new religion and the political conquest of the country by the victors, naturally, created a spiritual and social upheaval in the country This led to a spiritual reaction which can be considered a mental conflict and effort to find a new way to answer the challenge posed by the new spiritual thoughts that came with the Muslims.'[12]

నానక్ పంజాబులోని తల్ వంది (ఇప్పుడు నాన్ కనా సాహెబ్) గ్రామంలో 1469లో జన్మించాడు (వైశాఖ మాసంలో ఏప్రిల్ నుండి మే మధ్యవరకు)[13] నానక్ పుట్టగానే అతని మహమ్మదీయ మంత్రసాని, అతడు పుట్టగానే నవ్వాడనీ, గొప్పవాడవుతాడనీ చెప్పింది.

నానక్ చిన్నప్పటి నుండీ స్వతంత్రమైన వ్యక్తిత్వం కలవాడు. ఆధ్యాత్మిక ధోరణి పసిప్రాయం నుండే అలవడింది. దానితోపాటు తర్కం కూడ

నానక్ తండ్రి అతణ్ణి పశుపాలనలో పెట్టాడు కాని పశువులను వాటి మానాన వదిలివేసి మర్రిచెట్టు క్రింద కూర్చొని భగవద్ధ్యానం చేసేవాడు పశువులు పక్కవాడి చేనిలో దూరేవి.

ఉపనయనం వయస్సు వచ్చింది ఉపనయన మహోత్సవంలో నానక్ జంధ్యం ధరించడానికి ఒప్పుకోలేదు. నేను ధరించే జంధ్యం వేరు అన్నాడు దానికి కరుణయే దూది, సంతుష్టి దారం, జితేంద్రియత్వం గ్రంధి, సత్యంపురి – ఇటువంటిదే ఆత్మకు నిజమైన జంధ్యం నశించే శరీరానికివేసే నూలుపోగు వల్ల లాభంలేదు పువ్వు పుట్టగానే పరిమళించినట్టు నానక్ సంస్కారణోద్యమం బాల్యంలోనే మొదలైంది

---

12 B V Keskar, Forword to second Edition GURU NANAK - Gopal Singh National biography series, National Book Trust India, New Delhi, 1967

13 కాని ఎందుకో గురునానక్ జయంతిని కార్తీక పున్నమి (నవంబర్) నాడు చేస్తారు

పెండ్లి చేస్తే పిచ్చి కుదురుతుందని సులాఖిని అనే కన్యనిచ్చి వివాహం చేశారు. ఇద్దరు కొడుకుల తండ్రైనాడు నానక్. కాని ఫలితం లేకపోయింది.

తండ్రి నానక్‌ని వ్యాపారంలో పెట్టి లాభసాటి వ్యాపారం చెయ్యమని ఉపదేశించాడు. డబ్బంతా పేదలకు దానంచేసి మొదటికే మోసం తెచ్చాడు నానక్. తండ్రి మందలిస్తే ఆర్తులను ఆదుకోవడం వల్ల వచ్చే పుణ్యంకన్నా గొప్పలాభం ఏముంది? అని సమాధానం చెప్పాడు

తండ్రి వ్యవసాయంలో పెట్టాడు. కాని అది కూడ నిలువలేదు శరీరమే పొలంగా, ఆత్మయే హలంగా మరో విచిత్ర వ్యవసాయం మొదలుపెట్టాడు నానక్.

ఇంటివైపు దృష్టి మరల్చడానికి ఎందరో ప్రయత్నించారు. తండ్రి బాధపడ్డాడు. తల్లి బతిమిలాడింది ఊరి పెద్దమనుష్యులు నచ్చచెప్పారు. నానక్ మారలేదు. 'నేను మనుష్యులను రక్షించాలి. అజ్ఞాన జ్వాలల్లో మసికాకముందే కాపాడాలి' అన్నాడు. మతి చెడిందేమోనని వైద్యుణ్ణి పిలిపించారు. వైద్యుడు వచ్చి నానక్ నాడిని పరీక్షించాడు. నానక్ చిరునవ్వు నవ్వి, 'ముందు నీ నాడిని పట్టుకో, నీ గురించి తెలుసుకో' అన్నాడు.

ఈవిధంగా నానక్ గృహస్థ జీవితాన్ని వదిలేసి దేశంమీద పడ్డాడు అతడు ఉత్తర భారతదేశమంతా పర్యటించాడు. ఆసియాలోని కొన్ని దేశాలకు కూడా వెళ్ళివచ్చాడు. హిందూ, ముస్లిం అనే భేదం లేకుండా మానవతా సందేశం వినిపించాడు. వర్ణవ్యవస్థ, అస్పృశ్యతల్లో అతనికి నమ్మకం లేదు. "లంగరు"లనే వాటిని స్థాపించి, నానా జాతి సహపంక్తి భోజనం పెట్టించాడు అతని దృష్టిలో దేవుడొక్కడే మానవుడొక్కడే (అంటే – మానవులంతా సమానులే) మోక్ష సాధనకు సన్యాసమే సాధనం అనే తన కాలంలోని సన్యాసుల వాదనల నితడు అంగీకరించలేదు. మానవుడు కష్టించి పనిచేయాలనీ, ప్రాపంచిక బంధాలను తెంకోనవసరం లేదనీ, సంసారం ద్వారా దేవుణ్ణే పొందవచ్చునని బోధించాడు ఇటువంటి బోధనలే కొన్ని ప్రత్యేకతలను సంతరించుకొని ఆధునిక సిక్కుమతంగా రూపుదిద్దుకున్నాయి లక్షలాదిమంది ప్రజలు నానక్ పంథాను అనుసరించారు

నానక్ తన రచనలన్నీ ఉత్తర భారతదేశంలో సామాన్య ప్రజల భాషలో చేశాడు దానిని "సాధు-భాష" అంటారు ఉత్తర దేశంలోని ప్రజలందరికీ ఇది అర్థమౌతుంది

ఆధ్యాత్మిక సంస్కరణ పూరిత భావాలతో ఉన్న నానక్ రచనల ఇంగ్లీషు అనువాదాలు కొన్ని ఈ కింద ఉదహరిస్తున్నాను (అనువాదాలు బి వి. కేస్కర్)

ON GOD:

Blessed is the township of the body in which abide the five great ones - truth, compassion, contentment, discrimination, righteousness - and over them rules the One Detached, wrapped in absolute trance

(Maru M I.)

THE GURU:

The True Guru is one who uniteth one with all (Sri Rag M I.)

**GOOD AND EVIL:**

Where the deeds are good, there is perfect mind too.
(Sri Rag. M I 3 30)

**THE PRACTICE OF THE WAY:**

We know the Truth if we abide at the pilgrim-station of the self, and as in the Guru's will, so abide (Ibid)

The Yoga's way is of knowledge, of the Brahmins the way is of Vedas, of the Kshatriyas the way is of heroism, of the Sudras of the service of others. The way of ways, however, is the way of the Word He who knows its mystery, of him Nanak is a slave. Yea, he himself is the manifestation of the immaculate God (Asa M I Uar Shloka M 2)

**FORMS AND RITUALS:**

They read the holy books, perform prayers . And they worship stocks and stones and then, like the herons, enter into a pseudotrance In their mouth is falsehood, though their body be decked with piety, and the three lines (of Gayatri) they recite three times a day Round their necks is a rosary, and on their foreheads the saffron - mark and the unstitched cloth upon their loins, and a cover on their heads But if they knew the nature of their God, they would know these rituals to be false (Ibid)

**PILGRIMAGES:**

Thou goest to bathe at the pilgri . - stations with an evil mind and the body of a thief So while the one part is washed, the other parts are sullied twice (Shloka M I Rag Suchi, Var M 3)

నానక్ భావాలు అనేక సందర్భాలలో వేమన్నతో సామ్యం వహించినప్పటికీ నానక్‌కు కవిగాగాక మత ప్రవక్తగానే ప్రసిద్ధి వచ్చింది

## 6. సర్వజ్ఞుడు

వేమన్నకు దాదాపు ప్రతిబింబ మనదగిన కన్నడకవి సర్వజ్ఞుడు వేమన, సర్వజ్ఞులను గూర్చి ప్రొఫెసర్ కె సుబ్బరామప్పగారు ఈ కింది విషయాలు వెల్లడించారు

"మైసూరు రాష్ట్రమున అన్ని విధాలా వేమనను పోలిన సర్వజ్ఞుడను ప్రజాకవి ఉండినాడు ఈ త్రిపదులు వేమన ఆటవెలదులవలె జనాదరణ పొంది బహుళ ప్రచారములో ఉన్నవి ఇంచుమించు వీరిరువురును సమకాలీనులే అని విమర్శకుల భావన దేశాటనలో ఇరువురు ఒకనెడ కలిసి సంభాషించుకొన్నట్లు 'సర్వజ్ఞ – వేమన సంవాద' అనే చిన్న కన్నడ పుస్తకము ద్వారా తెలియుచున్నది ఇది పాతకాలపు

ప్రింటు. మైసూరు రాష్ట్రంలో కూడ వేమన పరిచితుడు. వేమన జయంతులు కూడ ధార్వాడ ప్రాంతమున జరిపెదరు."15

రాళ్ళపల్లివారి ఉపన్యాస సప్తకంలో కూడ సర్వజ్ఞునిగూర్చి కూలంకషమైన చిన్న వ్యాసం ఉన్నది. డా॥ గంధం అప్పారావుగారు వేమన, సర్వజ్ఞులను సరిపోలుస్తూ సిద్ధాంత వ్యాసమే వ్రాశారు.16 "సర్వజ్ఞుడు – ప్రజాకవి" అని వారే వ్రాసిన ఒక వ్యాసం వారి పరిశోధనకు చిహ్నంగా నిలిచిపోయింది. వీటి ఆధారంగా కొన్ని విషయాలు చెప్పుకోవచ్చు.

వేమన్నను గూర్చి ఆంధ్ర పరిశోధకులు పడ్డ పాట్లన్నీ సర్వజ్ఞుని కొరకు కన్నడ పండితులు అనుభవించారు. సర్వజ్ఞుని కాలనిర్ణయంలోని చిక్కులు వేమన్న తాతను మించిపోయినవి. సర్వజ్ఞుడు రచించిన "త్రిపది" పద్యాల పాఠాంతరాలు అసంఖ్యాకం

సర్వజ్ఞుని జీవిత చరిత్ర కూడ వాడుక కథల పుట్ట. "బసవరసు" అనే ఆరాధ్య బ్రాహ్మణునికీ, అంబలూరు గ్రామంలోని కుమ్మరి వితంతువు "మాళి" అనే స్త్రీకి ఇతడు జన్మించినట్లు ఒక కథ. "సర్వజ్ఞుడు" అనేది అతని అసలు పేరో కాదో తెలియదు, కాని మానవ జీవితానికి సంబంధించిన అసంఖ్యాక విషయాలను గూర్చి రచించడం వలన 'సర్వజ్ఞ' నామధేయం సార్థకం అనిపిస్తుంది

సర్వజ్ఞుడు రచించిన పద్యాలన్నీ 'త్రిపది' అనే ఛందస్సులో సాగినవి. దీనికి సంగీతానుగుణమైన లయగతి ఎక్కువ. కాబట్టి దీనిని పద్యం అనడం కన్న పాట అనడమే మేలు అని రాళ్ళపల్లి వ్రాశారు సర్వజ్ఞుడు కూడ ప్రతి పద్యంలో స్వీయ సంబోధనం చేశాడు పద్యం మూడవ పాదం చివర 'సర్వజ్ఞ' అనే మకుటం ఉంటుంది

సర్వజ్ఞుడు బసవేశ్వరుడు ప్రతిపాదించిన వీరశైవ మతానికి చెందినవాడు ఇతడు ఎంతటి దృఢమైన శైవుడంటే – శివపక్షపాతంతో ఇతర దేవతలను అనాదరించగలిగినంత!

వేమన్న మతం ఇతమిత్థంగా నిర్ణయించడం కష్టం. అసలు వేమన్న ఒక మతం పిడికిలిలో ఇమిడినవాడు కాదనీ వెనుక చర్చించాను వేమన్న శైవులను మెచ్చుకున్న పద్యాలూ, వారిని అపహసించే పద్యాలూ రెండూ లభిస్తున్నాయి కాబట్టి స్థూల దృష్టికి వేమన్న భావాల్లోని వైరుధ్యాలపరిస్థితి సర్వజ్ఞునిలో కనిపించదు

వేమన్నవలె సర్వజ్ఞుడు కూడా భావావేశపరుడే. వేమన్నకు కాబట్టని విషయం లేదు అమానుషమనుకున్న దానిమీద శివమెత్తుతాడు వెనుకముందులు చూడడు అతని ధోరణి ఫలానాలక్ష్యం మీద బాంబు విసరడం అది పేలి, చుట్టూ ఉన్న వ్యక్తులకు వాటి పెంకులు గుచ్చుకుంటే వారి బాధ్యత వేమనకు లేదు.

సర్వజ్ఞుని ఆవేశం అన్నివేళలా లౌకికపు సరిహద్దులు దాటింది కాదు అవసరాన్ని బట్టి ఎత్తుగడను కొంత మార్చుకునే గడుసుతనం సర్వజ్ఞునికున్నది ముందు వెనుకలు చూసుకొని కొంత రాజీపడగలిగిన నేర్పు తీర్పులు సర్వజ్ఞునికున్నవి మానవుడు దంతాల మధ్య నాలుకవలె జాగ్రత్తగా మెలగాలని బోధించాడు

---

15 ప్రొఫెసర్ కె సుబ్బరామప్ప చేబ్రోలు చిన్నయ బ్రహ్మకవి రచించిన 'విశ్వదాభిరామం'నకు పంపించిన పండితాభిప్రాయమిది – 1973

16 ప్రజాకవులు (Great Poets of the People) University of Madras, Madras - 5, 1974

దంత పంక్తియ నడువె ఎంతిప్పదదు జిహ్వా
నెలవన్ను ముగిలన్ను హోలి వరుంటెందరన
హోలివరు హోలివరెన బేకు
మూర్ఖనలి కలహ బెడెంద సర్వజ్ఞ

(ఈ భూమినీ, ఆకాశాన్నీ కలిపి కుట్టగలిగినవారు ఉన్నారని అంటే 'కుట్టగలరు కుట్టగలరు' అనాలి. మూర్ఖులతో కలహం వద్దు )

సర్వజ్ఞుని గృహస్థ జీవితం సంతృప్తికరమైన దనిపిస్తుంది. తన పద్యాల్లో ప్రశాంతమైన గార్హస్థ్యాన్ని వాంఛించాడు. వెచ్చని ఇల్లు, వెచ్చాలకు ధనం, రెండెడ్లు, ఐదుగురు కొడుకులు, ఎప్పుడూ పాలిచ్చే ఆవు, పనిచేసే కోడండ్రు, ఒక ముసలి అవ్వ, మనసెరిగి వర్తించే గుణవతియైన భార్య – ఇదీ సుఖమయ జీవితానికి సర్వజ్ఞుని నిర్వచనం. "ఇవన్నీ ఉంటే స్వర్గానికి నిప్పంటిస్తాడు సర్వజ్ఞుడు" (స్వర్గక్కెకిచ్చు హచ్చెంద సర్వజ్ఞ) అని అనజాలినవాడు.

వేమన్న కూడ దాదాపు ఇటువంటి జీవితాన్ని కోరుకున్నాడు

"సుగుణవంతురాలు సుదతియై యుండిన
బుద్ధిమంతులగుచు పుత్రులొప్ప
స్వర్గమేటికయ్య సంసారి కింకను?"

కాని వేమన్న జీవితంలో శాంతి ఒక కలగానే మిగిలిపోయింది వ్యక్తిగత జీవితంలోని తీవ్రమైన అసంతృప్తి, సంఘజీవితంలోని అవకతవకలూ వేమన్నను అనవసరమైన తపన కలవానిగా, నిరంతర అన్వేషిగా తయారుచేశాయి

సాంసారిక జీవితంలో కొంత వరకు సుఖశాంతులు పొంది, స్వభావతః కొంత లౌకికం కలిగిన సర్వజ్ఞుని అన్వేషణ కొన్ని హద్దులలోనే ఆగిపోయినట్టు కనిపిస్తుంది సర్వజ్ఞుడు అద్వైతానుభూతి పొందిన దాఖలాలేవీ కనిపించడం లేదని రాళ్ళపల్లివారు వ్రాశారు

అద్వైత కోడాది యద్దుదను హోగాడి
ఉద్దన మరద తుదిగేరి, కైజారి
బిద్దు సత్తంతె సర్వజ్ఞ

(అద్వైతం కొరకు తిరగడం ఉన్నది పోగొట్టుకోవడమే – పొడవైన మాను చివరికెక్కి చేయిజారి పడి చచ్చినట్టు )

వేమన అద్వైతానుభూతిని గూర్చిన అనేక పద్యాలు రచించాడు

సర్వజ్ఞుడు జ్ఞానభక్తిని బోధించాడు జ్ఞానభక్తే మోక్ష సాధనమని నమ్మి, దానికి అడ్డువచ్చే మూఢ నమ్మకాలను ఖండించాడు వేమన్న చేతిలో వలెనే హేతువాదం ఈయన చేతిలో కొత్త పదునులు తేరినది

కులభేదాల నితడు వేమనంత తీవ్రంగా ఖండించాడు

నడెవు దొందె భూమి కుడివు దొందె నీరు
నుడువగ్ని మొందె తిరలు
కులగోత్ర నడువె యత్తణదు సర్వజ్ఞ

(మనుష్యులందరూ ఒకే భూమి మీద నడుస్తూ, ఒకే నీరు తాగుతూ చివరకు ఒకే నిప్పులో కాలి నశిస్తుంటే ఇక కుల గోత్రాల గొప్ప ఎక్కడిది?)

ಅವಯವ ಗಳೆಲ್ಲರಿಗೆ ಸಮವಾಗಿ ಯಿರು ತಿರಲು
ಭವಿ ಭಕ್ತ, ಶ್ವಪಚ ಶೂದ್ರ ವಿವರಿಂತೆಂಬ
ಕವನ ವೆತ್ತಣದು ಸರ್ವಜ್ಞ.

(మానవులందరికీ అవయవాలన్నీ సమానంగా ఉన్నాయికదా! ఇక ఇతడు భవి, ఇతడు భక్తుడు, ఇతడు శ్వపచుడు, అతడు శూద్రుడు అనే భేదమెక్కడినుండి వచ్చింది?)

ಜಾತಿಹೀನನ ಮನೆಯ ಜ್ಯೋತಿ ತಾ ಹೀನವೆ?
ಜಾತಿ ವಿಜಾತಿ ಯೆನ ಬೇಡ
ದೇವ ನೊಲಿ ದಾತನೆ ಜಾತ ಸರ್ವಜ್ಞ

(జాతి హీనునింట వెలిగే జ్యోతి హీనమవుతుందా? జాతి, విజాతి అని అనరాదు. దేవునికి ప్రియమైనవానిదే ఉత్తమ జాతి.)

వేశ్యలను గూర్చి సర్వజ్ఞుడు అనేక పద్యాలు చెప్పాడు. స్త్రీవశీకరణం గురించిన పద్ధతులు కూడ చెప్పాడు. వేశ్యలకు డబ్బు యెగకొట్టి దగా చేసేవాడే జాణ అనేంతవరకు వెళ్ళాడు

వేమన్న కూడ ఒక దశలో వేశ్యాలంపటములో చిక్కినవాడే అది అతడు వేశ్యలను తిట్టిన పద్యాల వలన తెలిసిందే కాని వేశ్యావృత్తిని మెచ్చుకొంటూ వేమన చెప్పిన పద్యమొక్కటి కూడ కానరాదు ఉత్తరోత్తరా వ్యభిచారాన్ని అతడు తీవ్రంగా ఖండించాడు కూడ

సర్వజ్ఞుడు తన కాలంలో రాజులను మంత్రులను ఆశ్రయించి, వారికి అనుగుణంగా మెలిగినవాడు స్వామికార్యం కోసం చచ్చి తీరాలి అనే విశ్వాసం కలవాడు వేమన్న ఈ ప్రవృత్తికి వ్యతిరేకి 'రాచమూక నమ్మరాదురన్న' అన్న నిర్ణయానికి తొలిరోజుల్లోనే వచ్చినవాడు

దేవుని యొక్క ఉనికిని గూర్చి సర్వజ్ఞుడు చెప్పిన విధానం పరమ రమణీయంగా ఉంది

ಸಣ್ಣನೆಯ ಮಳಲೊಳಗೆ ನುಣ್ಣನೆಯ ಶಿಲೆಯೊಳಗೆ
ಬಣ್ಣಿಸಿ ಬರೆದ ಪರದೊಳಗೆ, ಇರುವಾತ
ತನ್ನಲ್ಲಿ ಯಿರನೆ ಸರ್ವಜ್ಞ

(సన్నని ఇసుకలో, నున్నని రాతిలో, రంగుల పటంలో ఉండగలిగినవాడు, నీలో నాలో మాత్రం ఉండలేడా?)

వేమన్నకు లేని బహు శాస్త్రజ్ఞానం సర్వజ్ఞునిలో కన్పిస్తున్నది

వ్యక్తీకరణలో వేమన పద్యాలకున్నంత ధారణానుకూల శిల్పం సర్వజ్ఞుని పద్యాలకూ ఉంది జనసామాన్యం మాట్లాడుకునే సరళమైన భాష, సాఫీగా సాగిపోయే నడక, అందరికి అనుభవంలో ఉన్న పోలికలు, దాపరికం లేని సూటిదనం – ఇవన్నీ సర్వజ్ఞుని పద్యాల్లో ఉన్నాయి

## 7. పోతులూరి వీరబ్రహ్మం

ఏదైనా విపరీతం జరిగినప్పుడు "కాలం మారింది - బ్రహ్మంగారు ఏనాడో చెప్పారు" అని తెలుగునాట పెద్దవాళ్ళు స్వంతంగా అనుకోవడమో, ప్రకాశంగా అనడమో కద్దు. ఇప్పటికీ ఆంధ్రదేశమంతటా బ్రహ్మంగారి కాలజ్ఞాన తత్త్వాలు పాడి పైసలు సంపాదించుకునే బిచ్చగాళ్ళను చూస్తుంటాము.

బ్రహ్మంగారిని వేమన్నతో పోల్చడానికి కాలజ్ఞానతత్త్వం కారణం కాదు. వీరబ్రహ్మం వేమన వలనే అచలతత్త్వాన్ని ప్రబోధించాడని రాళ్ళపల్లివారు వ్రాశారు.[17] అయితే వీరబ్రహ్మానికి లోకంలో కలిగిన ప్రసిద్ధి కాలజ్ఞాన సంబంధంగానే కనిపిస్తుంది.

వీరబ్రహ్మం కాలాన్ని గురించి కూడ వేరువేరు అభిప్రాయాలు ఉన్నప్పటికీ 17 వ శతాబ్దం మధ్య భాగంలో జీవించినవాడని రాళ్ళపల్లివారు తేల్చారు. అంటే ఇంచు మించు వేమన కాలంవాడే వీరబ్రహ్మం. ఒకే కాలం వారయినప్పటికీ ఇద్దరూ ఒకరినొకరు కలుసుకున్నారా? వేమనకు వీరబ్రహ్మం శిష్యుడా? అనే ప్రశ్నలకు సమాధానం చెప్పగలిగిన సాధనాలు వారిద్దరి రచనల్లోనూ, చరిత్రలోనూ కానరావు.

వీరబ్రహ్మం జీవితచరిత్రను గూర్చి అనేక గ్రంథాలు వెలిశాయి వాటిలో ఎన్. వి. గోపాల్ అండ్ కో వారు ప్రకటించిన శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారి జీవిత చరిత్ర ఒకటి.[18] వేమన్నను గూర్చి ఉన్న విధంగానే అనేకమైన వాడుక కథలు ఇందులో ఉన్నాయి. ఆయనను గురించి వివరాలు ఈ కింది విధంగా ఉన్నాయి.

వీరబ్రహ్మం కమసాలి కులంలో పుట్టాడు. నందికొండ గ్రామ వాస్తవ్యులైన యనమరల వీరభోజాచార్యులు, వీరపాపమాంబ అనే పుణ్యదంపతులకు దత్తపుత్రుడు బాల్యంలో కర్నూలు జిల్లాలోని బనగానపల్లెలో గరిమరెడ్డి అచ్చమ్మగారి పశువులను మేపుతుండేవాడు అప్పుడే ఆయన అనేక మహిమలను చూపాడు తాను మేపుతున్న పశువుల చుట్టూ ఒక గిరి గీయగా అవి ఆ పరిధిలోనే గడ్డిమేస్తూ ఉండేవి క్రూరమృగాలేవీ ఆ గిరి దాటి వచ్చేవి కావు ఆ సమయంలో తాను అరణ్యంలోని ఒక గుహలో కూర్చొని తాళపత్రాలపైన కాలజ్ఞాన తత్త్వాలు వ్రాసుకునేవాడు ఒకనాటికి అచ్చమ్మగారు అతని మహిమలను గూర్చి తెలిసికొని, శరణువేడి అతనికి శిష్యురాలైనది

అంతేకాక ఆయన ఆ గ్రామంలో ఒక చచ్చిన ఆవును, మరణించిన మనిషిని బ్రతికించాడు మరోసారి పోలేరమ్మ జాతరకు ఊరి పెద్దలు చందాలిమ్మని అడగగా, అప్పుడు తన దగ్గర ధనం లేదని తర్వాత ఇస్తానన్నాడు ఊరిపెద్దలు ఊరుకోక రచ్చచేయగా అతడు గుడికెదురుగా తిన్నెపై కూర్చొని చుట్ట ముట్టించుకోవడానికి నిప్పు తెమ్మని పోలేరమ్మను అడిగాడు వారందరి ఎదుట పోలేరమ్మ ఒక బాలిక రూపం

---

17 వేమన పేజీ 132

18 ఇంతేకాక, తాడికొండ రాఘవాచార్యులుగారు 'వీరబ్రహ్మం గారి జీవిత చరిత్ర'ను, జవంగుల నాగభూషణదాసుగారు 'వీరమహేంద్ర స్వాముల చరిత్ర'ను, జక్కుల స్వామినాథయ్య 'బ్రహ్మంగారి జీవిత చరిత్ర'ను వ్రాశారని శ్రీ బాలాంత్రపు రజనీ కాంతారావు 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము'లో పేర్కొన్నారు నేను వాటిని చూడలేకపోయాను

ధరించి వచ్చి వీరబ్రహ్మం చుట్టకు నిప్పంటించింది. పెద్ద వానలో నిలబడి తడియకుండా వచ్చాడు.

మహిమల సంగతి ఎట్లున్నా విశ్వబ్రాహ్మణ కులంలో పుట్టిన వీరబ్రహ్మం పశువులను కాసేవాడనీ, రాయలసీమ జిల్లాల్లో పర్యటించి సామాన్య ప్రజానీకానికి తత్త్వబోధ చేశాడని చెప్పకోవచ్చు.

వీరబ్రహ్మం పశుపాలనను గూర్చి పేర్కొంటూ తూమాటి దొణప్పగారు 'వేమన-వీరబ్రహ్మేంద్రుల తాత్త్విక ధోరణులు' అనే వ్యాసంలో ఒక సామాన్య పరిశీలనను ప్రకటించారు:

"ప్రపంచంలోని మత ప్రవక్తలూ సంస్కర్తలూ చాలామంది పశుపాలక వర్గంనించి వచ్చినట్లుగా కనిపిస్తారు. గీతాచార్యుడు ఆలకాపరి, ఏసుక్రీస్తు గొర్ల కాపరి కొడుకు; గొర్ల చావడిలో పుట్టినవాడు. జోరస్టర్ మత స్థాపకుడైన జోరాస్టర్ కూడ ఒంటెలకాపరి. వేమన, వీరబ్రహ్మేంద్రులు కూడ ఒకనాడు గొర్ల కాపరులే. ఈ పసుల కాపరులు గొర్రెదాటు మూర్ఖజనుల కాపుదల కోసం ప్రయత్నించినట్లు కన్పిస్తుంది."[19]

వీరబ్రహ్మం తన ఆశ్రమంలో శైవ, వైష్ణవ దేవతాభేదాలను, హిందూ, మహమ్మదీయ మతభేదాలను, కులభేదాలను పాటించలేదు బ్రాహ్మణులు మొదలు చండాలుర వరకు అన్ని కులాలవారు, ఆయనకు శిష్యులైనారు మహమ్మదీయుడైన దూదేకుల సిద్దయ్య ఆయనకు ప్రియశిష్యుడు. బ్రహ్మంగారు బోధించిన తత్త్వానికి మూలకారణాలను గూర్చి ఏటుకూరి బలరామమూర్తిగారు ఈవిధంగా అభిప్రాయపడ్డారు:

".......పోతులూరి వీరబ్రహ్మం అను ఒక తత్త్వజ్ఞాని బయలుదేరాడు. కలికాలం వచ్చిందని, లోకం అంతా చెడిపోయిందని, అయితే ఎప్పుడో మంచిరోజులు వస్తాయని కర్మవాదాన్ని ప్రచారం చేశాడు. ఈయన కంసాలి. ఈయన శిష్యులలో ఎక్కువమంది చేనేతవారు. గృహ పరిశ్రమలు విచ్ఛిన్నం గావటంతో మొట్టమొదట ఏ కులాలు దెబ్బతిన్నవో ఆ కులాలలో నుండి ఈ నిరాశాపూరిత తాత్త్విక ప్రచారం బయలుదేరడం గమనార్హం."[20]

వీరబ్రహ్మం కూడ సంసారయోగాన్నే బోధించాడు కందిమల్లయ్యపురంలో గోవిందమ్మ అనే కన్యను పరిణయమాడి గృహస్థాశ్రమాన్ని నిర్వహించాడు సన్యాసులకే కాని సంసారులకు మోక్షమలభ్యమనే అంధవిశ్వాసాన్ని వమ్ము చేశాడు వీరబ్రహ్మం

సమకాలికులు కాబట్టి వేమన – వీరబ్రహ్మేంద్రుల తత్త్వాలకు చారిత్రక నేపథ్య మొకటే వేమన దృష్టి ప్రత్యేకంగా పడనిదీ, బ్రహ్మంగారు కృషి చేసినదీ అయిన విషయమొకటుంది – అది హిందూ మహమ్మదీయ మత సామరస్యం అతని ప్రియశిష్యుడు దూదేకుల సిద్ధయ్య అని చెప్పకున్నాం అతనికి బ్రహ్మం ఉపనిషత్తులూ,

19 వేమన – వీరబ్రహ్మేంద్రుల తాత్త్విక ధోరణులు – ప్రొఫెసర్ తూమాటి దొణప్ప, డాక్టర్ సి ఆర్ రెడ్డి కళాశాల సిల్వర్ జూబ్లీ సావనీర్, 1977

20 ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర – పేజీ 213

యోగతత్త్వ రహస్యాలూ నేర్పాడట కడప, కర్నూలు, సిద్దవటం మొదలగు ప్రదేశాలను సందర్శించి తత్త్వాలకులైన నవాబులకు మత సామరస్యమును బోధించి, తన మహిమలు చూపి వారిని తమ శిష్యులుగా చేసుకొని మత సమైక్యానికి పునాదులు వేశాడట.[21]

## అచల మతం

యోగానికి సంబంధించిన పద్యాలు వేమన్నలో కనిపిస్తున్నాయి హఠయోగం, రాజ యోగం మున్నగు వాటిని గూర్చిన పద్యాలు ప్రశంసించేవీ, ఖండించేవీ దొరుకుతున్నాయి. వేమన్న హఠయోగుల గుంపులతో తిరిగి ఉంటాడనీ, యోగసాధన చేసి ఉంటాడనీ అనంతకృష్ణ శర్మగారు వ్రాశారు. యోగసమాధి ద్వారా కైవల్యావస్థను పొందడాన్ని గురించిన వేమన పద్యాలున్నాయి ఈ యోగమతానికి మన దేశంలో అచలమతమనే పేరు కూడ వ్యవహారంలో ఉన్నదని రాళ్ళపల్లివారు వ్రాశారు

కాలజ్ఞాన తత్త్వవేత్తలు, ముఖ్యంగా వారికి శిఖర ప్రాయుడైన వీరబ్రహ్మం, అచలమతాన్ని అనుష్ఠించే విధానాన్ని తేలికైన దేశీయభాషలో తత్త్వాలుగా రచించి సామాన్య ప్రజల పరం చేశారు సుఖ దుఃఖ సమాన బుద్ధి, ఇంద్రియ నిగ్రహము, అచల సమాధి మొదలైన వాటిని అభ్యసించమని వారు ప్రబోధించారు

బ్రహ్మంగారి తత్త్వాలు జాతరల్లో, సంతల్లో, రైలు పెట్టెల్లో బిచ్చగాళ్ళ, బైరాగులనోట వెలువడుతూ ఉంటాయి వీటిని పాడుతూ కొందరు బైరాగులు ఏకనాదం (ఏక్ తారా) మీటుతూ కనిపిస్తారు

కాలజ్ఞాన తత్త్వాలు ఒక వీరబ్రహ్మమే కాక ఆయన శిష్యుడు సిద్ధయ్య రచించినవీ, ఆయన మనుమరాలు గోవిందమ్మ రచించినవీ కూడ ప్రచారంలో ఉన్నాయి కాలజ్ఞాన తత్త్వాల పరంపరలోనివారైన మరికొందరి పేర్లు రజనీ కాంతరావు గారు సేకరించి ప్రకటించారు

"బ్రహ్మంగారి శిష్యులో ప్రశిష్యులో అయిన పూదోట రామన్నగారు, చిత్తూరు నరసింహదాసు, కాలువ కోటయ్య, కోమళ్లూరి వీరరాఘవులు, తాడిచెర్ల చలమయ్య, తాడిచెర్ల శేషయ్య, నాసరయ్య, నాసరయ్య దయతో అహోబలదాసు, సున్నపుగుండ రాఘవులు, మహమ్మదు హుసేను, తరిగొండ భ్రమరాంబా నరహరి గార్లూ, జక్కులేటి కంబగిరి, ఘంటయ్య అనువార్లూ రచించిన తత్త్వాలన్నింటినీ చేర్చి. కాలజ్ఞాన తత్త్వాలు అను పేర పరిమి వీరాచార్లు అనే అచల మతావలంబి, తన రచనలతో కూడా చేర్చి, కూర్చినాడు."[22]

అయితే కాలజ్ఞాన తాత్త్వికులు బోధించినంత స్పష్టంగా వేమన అచలమతాన్ని బోధించలేదు

## సంస్కరణ దృష్టి

వేమన్న వలెనే వీరబ్రహ్మం కూడ సామాన్య ప్రజల అజ్ఞానాన్ని పారదోలి, వారి కళ్లు విప్పే ప్రయత్నం చేశాడు నాటి కుహనా వేదాంతుల, గురువుల వంచనాశిల్పాన్ని

---

21 విజ్ఞాన సర్వస్వము – మూడవ సంపుటము, తెలుగు భాషా సమితి

22 ఆంధ్రవాగ్గేయకారుల చరిత్రము – పేజీ, 449

బట్టబయలు చేశాడు ఇద్దరూ కూడ శాస్త్ర గ్రంథాలలోని చిలుకపలుకులను వల్లించక స్వానుభవం నుండి వెడలిన ప్రత్యక్ష వేదాంతాన్ని ప్రజలకు బోధించారు వీరబ్రహ్మం భక్తిమార్గాన్ని ఆదరించాడు వేమన్నకూడ భక్తిని పొగడిన పద్యాలు లభిస్తున్నాయి

మతభేదం పాటించని వీరబ్రహ్మం కులభేదాలను మాత్రం సహిస్తాడా? కుల వ్యవస్థను నిర్ద్వంద్వంగా నిరాకరించాడు

వీరబ్రహ్మం కూడ విగ్రహారాధనను ఖండించి బోధించాడు

చిల్లర రాళ్ళకు మ్రొక్కుచు ఉంటే
చిత్తము చెడునుర వొరే వొరే
చిత్తము నందలి చిన్మయజ్యోతిని
చూచుచు నుండుట సరే సరే
వొక్క ప్రొద్దులని యుండుక నుంటే
వొనరగ చెడుదువు వొరే వొరే

వీరబ్రహ్మం గుహలో కూర్చొని తాటాకులపైన వ్రాశాడని వాడుక కథల్లో ఉన్నప్పటికీ ఆయన తత్త్వాలు వ్రాసిన గేయరీతులు వేమన్నవలెనే ఆశుకవిత సంప్రదాయానికి చెందినవి కొంత శిష్ట వ్యావహారికంలో, చాలా వరకు గ్రామ్యభాషలో రచించబడిన బ్రహ్మంగారి తత్త్వాలకు వేమన పద్యాలకున్నంత ప్రచారం ఉంది

అయితే ఎన్ని పోలికలున్నప్పటికీ వేమనకున్నంత స్పష్టమైన సంఘదృష్టి వీరబ్రహ్మానికి కానరాదు వీర బ్రహ్మం చేసిన సాంఘికపరమైన విమర్శలు నిరాశతో కూడుకొన్నవే కాని వాటిలో ప్రతిఘటన శక్తి కనిపించదు కాలజ్ఞానం వల్లనే బ్రహ్మంగారికి ప్రసిద్ధి కలిగింది కాలజ్ఞానమంటే ఏమిటో రాళ్ళపల్లివారు వ్యాఖ్యానించారు **"కాలజ్ఞానమనగా భూతమును భవిష్యత్తుగా చెప్పుట. జరిగిన దానిని జరుగబోవునదిగా చెప్పి తన కాలమును తానే వెనుక కీడ్చుకొనుట."**23

అయితే ఈ వేదాంతం ప్రజలకు ధైర్యోత్పాదకంగా ఉండేదని రజనీకాంతారావు వ్రాస్తున్నారు

**"కలియుగంలో జరుగబోవు వర్ణ సంకరం, పర పరిపాలనం, పరిపాలకుల నిరం కుశత్వంలో అమాయకుల కడగళ్ళు - ఈ విధంగా దుష్టాత్ముల పాడుకృత్యములూ ...... దారిద్ర్య, క్షామ, భూకంప, ప్రజావిప్లవాది దురాకృత ప్రకృతి వైపరీత్యములు జరిగి, తుదకు భూమి నుద్ధరించే అవతారమూర్తిగా వీరభోగ వసంతరాయలను ధర్మాత్ముడవతరించి రామరాజ్యమును స్థాపిస్తాడని వీరబ్రహ్మంగారు బోధిస్తూ వుండేవారు. నిత్యమూ మహమ్మదీయ దండయాత్రలలోను, పరస్పర మత వైషమ్యములలోను కష్టనిష్ఠురముల పాలయి, భయ ప్రకంపితులై శంకాకులిత జీవులై యుండిన ఆనాటి సామాన్య ప్రజానీకానికి యీ కాలజ్ఞాన బోధ ఆశాజనకంగా, ధైర్యోత్పాదకంగా ఉండేది. గ్రామ గ్రామాలలో బ్రహ్మంగారికి పెద్ద శిష్య పరివారం పెరిగింది."**24

---

23 వేమన - పేజీ 132

24 ఆంధ్రవాగ్గేయకారుల చరిత్రము - పేజీ 453

'ఆశాజనకంగా' అని రజనీకాంతారావు అంటున్నారు కాని బ్రహ్మం గారి కాలజ్ఞానంలో ఆశావాదం ఉందా అనేది అనుమానమే రాజకీయంగా, సాంఘికంగా, మతపరంగా వస్తూన్న అనేక పరిణామాలను చూసి నిరుత్తరులై నిల్చుండిన సామాన్య ప్రజలకు భవిష్యత్తును మరింత విపరీతంగా, భయంకరంగా చూపించాడు ఎట్టఎదుట ప్రబలిపోతున్న కురీతులకు వ్యతిరేకంగా వారిని సమాయత్తం చేయకుండా **"అదంతా కాలమహిమ, ముందు ముందింకా మరింత పాడుకాలముంది"** అని జ్యోతిషం చెప్పాడు బ్రహ్మంగారు చెప్పిన జోశ్యానికి లోకంలో దృష్టాంతాలు కనిపించి బ్రహ్మంగారు చెప్పింది నిజమనే నమ్మకం కలిగింది నైరాశ్యంలో ఉన్నవానికి లోక నైరాశ్యాన్ని చూపి వాడికి తాత్కాలిక ఉపశాంతి కలిగించడమే కాలజ్ఞానం చేయగలిగింది లోక నిరాశలో తన నిరాశను దర్శించుకొని తృప్తిపడిన మానవుని ప్రతిఘటనశక్తిని జోలపాట పాడి నిద్రలోకి జార్చింది బ్రహ్మంగారి తత్త్వం

వేమన్న జీవితంలో నిరాశ లేదు. వేమన్న తన సమకాలీన పరిస్థితులను ఎదుర్కొన్నాడు. శైశిర నిస్తబ్ధతను పారద్రోలేందుకు పద్యాలనెగళ్ళతో చలిమంటలు వేశాడు

కొన్ని ప్రసిద్ధికెక్కిన బ్రహ్మంగారి తత్త్వాలను ఈ క్రింద ఉదాహరిస్తున్నాను

చెప్పలేదంటనగ బొయ్యేరు (అనకబొయ్యేరు కాదు)
నరులార గురుని
చేరి మొక్కితే బ్రతుక నేర్చేరు ॥చె॥

చెప్పలేదంటనక పొయ్యేరు
తప్పదిదుగో గురుని వాక్యము
తప్ప దోవను పోవు వారల
చప్పరించి మ్రింగే శక్తులు ॥చె॥

మొప్పెతనమున మోసపొయ్యేరు
అదిగాక కొందరు
గొప్పతనమున గోసుమీరేరు ॥చె॥

ఇప్పుడప్పు డనగరాదు
ఎప్పుడో ఏ వేళనో మరి
గుప్పు గుప్పున దాటిరి
యేడు గుజ్జుపడుగులు ఏరు పడును ॥చె॥

జోకలోడుత తల్లి పిల్లలు
జోడు బాసి యడవులందు
కాకి శోకము జేసి ప్రజలు
కాయ గసురుల నమిలి చత్తురు ॥చె॥

ఆకాశము ఎఱ్ఱ నౌను
అరుమతము లొక్కటౌను
లోకమందు జనులు అందరు
నీరు నిప్పున మునిగిపోదురు ॥చె॥

.... ..... ..... ..... .
... .... . . . . ..... ..
కీడు లైనను కూడనందురు
ఒన గూడినప్పుడు
యేడ జూచిన వాడు కొందరు
వేడుకతో పోతులూరి
వీర భోగ వసంత రాయలు
యేడు దీవులు యేకచక్రము
నేలును బ్రహ్మాండమంత ॥చె॥

## 8. ఏగంటి లక్ష్మప్ప

వీరబ్రహ్మంగారి తత్త్వాలతో పాటు ఏగంటి వారి తత్త్వాలూ, దూదేకుల సిద్దప్ప గారి తత్త్వాలుకూడ ప్రజల నోళ్ళకెక్కాయి. వీటిలో ఎవరివి ఏవి అన్నంత కలివిడిగా ఇవి ప్రసిద్ధికెక్కాయి వీరబ్రహ్మంగారి తత్త్వాలు అచ్చువేసేవారు లక్ష్మప్ప తత్త్వాలను పక్కనే చేర్చి ప్రకటించడం కనిపిస్తుంది. అద్వైతాన్ని బోధించే పాటలు **"ఏగంటి వారి వచనాలు"** అనే పేరుతో మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంధాలయంలో ఉన్నాయనీ, శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు తమకు చూపారనీ రాళ్ళపల్లివారు వ్రాశారు[25]

బ్రహ్మంగారి పాటలు పాడే వారందరికీ లక్ష్మయ్యగారి పదాలు కూడా వస్తాయి పల్లెటూరి జనసామాన్యంలో వీటికి చాలా వ్యాప్తి ఉన్నది పద్యాలు చేయలేని పనిని పాటలు చేస్తాయని వీటికున్న ప్రచారాన్నిబట్టి తెలుస్తుంది గంభీరమైన తాత్త్విక భావాలను అరటిపండు వొలిచి పెట్టినట్లుగా, అలతి అలతి పదాలతో, ప్రజాసామాన్యపు యాసతో రచించడం వీటి ప్రత్యేకత, ఏగంటివారి తత్త్వాలు కొన్నింటిని ఈ కింద చూడవచ్చు[26]

ఇల్లు వాకిలి నాది యిల్లాలు నాదనుచు
యేల భ్రమసితయ్య మనసా!
కాలుని వలలోను కానకను జిక్కితిని
కడతేరుటే త్రోవ మనసా!
తనయులు చుట్టాలు తనవారలని నమ్మి
తలపోయకే వెఱ్ఱి మనసా!
తనువు విడచి వెళ్ళే సమయంబు లోపల
తనవెంట రారెవరు మనసా!

---

25 వేమన - పేజీ 134
26 కాలజ్ఞాన తత్త్వములు - ఎన్ వి గోపాల్ అండ్ కో, మద్రాసు-1, 1978

ఆరు మూడిట తేరి ఆపస్తేజము గని
మేటి స్థానములోను మేటి స్థానమునందు
సూటి తప్పక చూడు మనసా!
……… . . . . ………….
… .. … . . ….. ……
అంటి అంటని పండు ఆరింట వెలుగుచు
నింటిలో నున్నదే మనసా
ఒంటిగా యాగంటి దాసుని మదిలోన
జంట బాయక వుండు మనసా!

ఏగంటివారి పేరుతో కొన్ని ఏలలు కూడ కనిపిస్తున్నాయి. ఇవి ప్రతీకాత్మకాలు:

1 సూర్య సోమా వహ్ని నడుమా
శౌర్య మానె చిలుకా గంటి
సూర్య దీప్తి కాయుచుండగా
యాగంటి లింగా
చూడ చూడ యాశ్చర్య మాయెగ
కంటి నిండా చూడ చూడ
గంటి యుదయగిరి మీదను
పాము చేసే సంజ్ఞ తెలిసితే
యాగంటి లింగా
సారమైన పుట్ట చేరును ॥సూ॥

2 సన్నంపు దిడ్డి వాకిట
పున్నమ వెన్నెల బైటా
కిన్నరాల నాదమింటిరా
ఓ వినగా వినగ వింతలాయెరా ॥స॥
ఎఱ్ఱమాను ఒడ్డు క్రిందెని
మీది ఊడాలున్నవి
ఊడ యూడలెంచి చూచితే
ఓ యుగము జగములందె యున్నవి ॥స॥
నల్లగుంట నట్ట నడుమా
తెల్ల దామర పువ్వున్నది
తెల్ల దామర పువ్వులో
ఓ తెలియపరిచే దేవుడున్నాడు
ఆకాశాన గుంటా నిండా
పంట పండె కుప్పకాలి అప్పుదీరును
ఓ దీని భావము నీకే తెలియును ॥స॥

రొమ్మున గోరలు మంచి
కమ్మ తేనె పెరుగుండ
నమ్మికతో వేట బోతేను
ఓ తుమ్మెద ఝుంకారమాయెరా ॥స॥

మరికొన్ని తత్త్వాల తొలి చరణాలు:

1 జీవుడు తనలో దండిగ నుండగ
తెలియదాయె మానవ పశువునకు
2. గుణమూ కుదురదు ఏమి సేతు శ్రీరామయ్య
గుణము కుదురదు ఏమి సేతు
3. ఉదరపోషణ కొరకై వేషములన్ని
ఉదర పోషణ కొరకై
యొసగి భక్తిని కుందా రాదనుడైన
పాండు రంగని వేడించ ॥ఉద॥
4 చదివినందుక మోక్ష సాధనం చేయ
చదువకుండిన ఘనుడు సాధించలేదా

ఏగంటివారిని గూర్చి వివరాలేమీ తెలియవు కాని ఇతర రచనలన్నీ వీరబ్రహ్మం గారి మార్గంలోనే ఉండడంవల్ల దూదేకుల సిద్ధయ్యవలె ఇతడు కూడ బ్రహ్మంగారి అనేక శిష్యుల్లో ఒకడై ఉండవచ్చు

కేవలం వేదాంత విషయాలు పాడేటప్పుడు కూడ నాటి చారిత్రక విషయాలు అప్రయత్నంగా చోటు చేసుకున్నట్లు ఈ కింద తత్త్వాన్ని చూస్తే తెలుస్తుంది

గండుపిల్లి లోకమెల్ల
గారవించి యేల గాను
కొండ యెలుక లొక్క రెండు
కొలువు చేయనూ ॥గం॥
అండ కొలిచి చిలుక లైదు
అరుగు గాచుచుండ గాను
పండు కోతులొక్క రెండు
ప్రహరి దిరిగెనూ ॥గం॥

గుట్టు తేట తెలివి
గురుతు తెలియ సుజ్ఞానులకును
బట్ట బయటి నుండు దీని
భావమెల్లను ॥గం॥

నాటి పరిపాలన పరిస్థితులను ప్రతీకలుగా తీసికొని వేదాంతపరంగా అన్వయమేదో చేశాడని గ్రహించవచ్చు. ఇతని తత్త్వాల్లో మార్మికతా ధోరణులు (Mysticism) కనిపిస్తున్నాయి.

## 9. దూదేకుల సిద్ధప్ప

వీరబ్రహ్మంగారి ప్రియ శిష్యుడు దూదేకుల సిద్ధయ్య. వీరు సాహెబు, అదం బీబీల కలలపంట. మహమ్మదీయుడైనా బ్రహ్మంగారి బోధల చేత ఆకర్షింపబడి అతని శిష్యుడయ్యాడు. ఫలితంగా స్వమతస్థుల చేత అవమానాలు పొందాడు. కోపతాపాలు, కష్టనిష్ఠూరాలను సహించాడు బ్రహ్మంగారి తత్త్వబోధల వైపు సిద్ధప్ప ఆకర్షితుడు కావడం విచిత్రమైన విషయం. పదిహేడవ శతాబ్దంలోని రాజకీయ పరిస్థితుల్లో ప్రారంభమైన మత సామరస్యానికీ భావాల సర్దుబాటుకీ ఇది ప్రారంభం కావచ్చును లేక విగ్రహారాధన నిరాకరించడం, కులభేదాలను పాటించకపోవడంవంటి బ్రహ్మంగారి బోధనలు మహమ్మదీయుడైన సిద్ధప్ప జీవన విధానానికి సమీపంగా వచ్చి ఉండవచ్చును. అంతేకాక రాజకీయంగా మహమ్మదీయులు పాలకులైనప్పటికీ, తాత్త్వికంగా హిందూ, ఇస్లాం మతాలు ఎంత భేదించి, సంఘర్షించినప్పటికీ, కింది వర్గాల్లోని సామాన్య ప్రజానీకంలో కొంత సాంస్కృతిక ఆదాన ప్రదానం జరుగక తప్పలేదు. ఇప్పటికీ ముస్లిం పీర్లను పూజించడం, దర్గాలను, సమాధులను సందర్శించడం తెలుగు దేశంలోని కొన్ని ప్రాంతాల్లోని హిందూ ప్రజలకు అలవాటు మొహర్రం పండుగ సంబరాల్లో హిందూ ముస్లిం లిద్దరూ పాలు పంచుకుంటారు

వీరబ్రహ్మం సిద్ధప్పకు పాడు హిందూతత్త్వాలు నేర్పుతున్నాడని, అతన్ని మత భ్రష్టుణ్ని చేశాడని మహమ్మదీయులు కొందరు మండిపడి సిద్ధవటం నవాబుకు ఫిర్యాదు చేశారట నవాబు బ్రహ్మంగారిని ఆస్థానానికి పిలిపించి, అతని కాలజ్ఞానాది మహిమలకు ఆశ్చర్యపడి తాను కూడ శిష్యుడైనాడని వాడుక

ఒకనాటి వైశాఖ దశమీ ఆదివారం నాడు వీరబ్రహ్మం సజీవసమాధి చెందాడు సమాధిగతుడు కావడానికి ముందు సమాధిలో చల్లడానికి పుష్పాలు తెమ్మని బనగానపల్లెకు సిద్ధప్పను పంపాడు సిద్ధప్ప తిరిగి రాకముందే కందిమల్లయపల్లెలో బ్రహ్మంగారు బ్రహ్మ సాయుజ్యం చెందాడు తిరిగివచ్చిన సిద్ధప్ప గురువుగారికోసం ప్రాయోపవేశం చేసి దుఃఖించాడు శిష్యుణ్ణి ఓదార్చడానికి బ్రహ్మంగారు సమాధి నుండి వెలికి వచ్చి అతనికి తన పాదుకలు, రుద్రాక్షతావళం, బెత్తం యిచ్చి అదృశ్యమైనాడట అపూర్వమైన ఈ గురుశిష్య సంబంధం ఆధారంగా "బ్రహ్మంగారి వంటి గురుడు లేడు, సిద్ధయ్య వంటి శిష్యుడు లేడు" అని లోకోక్తి ఏర్పడింది

దూదేకుల సిద్ధయ్య చెప్పిన తత్త్వాలు కొన్ని ఈ కింద విధంగా ఉన్నాయి

1 ఇది సిద్ధయ్య రచించిన తత్త్వాలతో చాలా ప్రచారం పొంది ప్రజల నోళ్ళకెక్కింది

ఏ కులమని నను వివరమడిగితే
ఏమని చెప్పాదు లోకులకూ
లోకులకు పలుగాకులకు
దుర్మార్గులకు ఈ దుష్టులకూ //ఏ//

పాల భాగమున యాలలు బాడుచు
భావము కన్నది నా కులము ॥వి॥
ముట్టున బుట్టిందీకులము
ముట్టంటున పెరిగిందీకులము
ముట్టులో హరుడు ముట్టులో శివుడు
ముట్టులో బ్రహ్మం ముగ్గురు మూర్తులు
మూలము దెలిసిందీకులము ॥వి॥
అంగమె మూర్ధామనే బ్రహ్మము
లింగము ముందర బెట్టుక ప్రపంచమంతా
పూజలు నడిపిందీకులము
అంగములోన మేకను బట్టి
లింగముతోనే గొంతుక కోసి
శాస్త్రమనే పాళ్ళు వేసి చతుర్బ్రహ్మలకు
పంచి పెట్టినది నా కులము ॥వి॥
ఇంటి లోపలను యిల్లు గట్టుకొని
మంట లోపల రాటం బెట్టుక
కంటిలోపల కదురు బెట్టుకొని
ముక్కు లోపల యేకు బెట్టుకొని
చెవులో బాక చేతికి తీసుక
నారాయణ యను నరము తీసుకొని
అష్టాక్షరి యను తడిక వేసుకొని
పంచాక్షరి యను మంచ దీసుకొని
తధిమితధిమ గుబదెబ గుబదెబ
ఏకినకులమే మా కులము ॥వి॥
ఏకులు పిసికిన పిందెలు
లోకమంత నొక పాకము జేసుక
ఏకిన కులమే మా కులము ॥వి॥
రొమ్మున లక్ష్మి చీర కట్టుకొని
చక్కగా సిరి పావడ దొడగి
అందమైన వీరబ్రహ్మం
శాల్వ కప్పుకొని నిండి యున్నదే నా కులము
ఒంటరి గాదె నా కులము ॥వి॥
గురు జంట తిరుగును నా కులము
అండపిండ బ్రహ్మాండ మెల్లను
నిండి యున్నది నా కులము ॥వి॥

అప్పటి హిందువులు కూడ సిద్ధప్ప చుట్టూ చేరి **'నీదే కులం సిద్ధప్పా'** అని ఎద్దేవా చేసి వుంటారు ఎగసి వచ్చే రోషాన్ని అణచుకొని, ఎక్కుతున్న కోపాన్ని తొక్కిపట్టి **'ఓరి అజ్ఞానులారా! వినండి నా కులం'** అని వేదాంతపరంగా సమాధానం చెప్పి వారి కళ్ళు విప్పి వుంటాడు

ఇటువంటిదే మరో పాట పల్లవి:

2 కులమెంచగా నేల
గుణమె కారణము
కుల బిందు కులమాయె కులమెక్కు వేది?
........ .... . . .

## 10. భద్రాద్రి రామదాసు:

రామదాసు వాగ్గేయకారుల కోవకు చెందుతాడు. రామదాసు రచించిన కీర్తనలు తెలుగునాట మారు మ్రోగాయి సాహిత్య దృష్టితో పెద్ద ప్రాధాన్యం లేనప్పటికీ, రామభక్తి పూరితమైన భజనలకు పనికివచ్చే రచనలే చేసినప్పటికీ సామాన్య ప్రజాకవిత్వ సంప్రదాయంలో నిలువగలిగిన, పాడడాని కనువైన పాటలు రచించడమే ఆయన ప్రత్యేకత ఈ కారణంవల్లనే వేమన్న గూర్చి చెప్పుకునేటప్పుడు ఏదో ఒక రకంగా జనజీవితంలో కలిసిపోయిన రామదాసును తలచుకోవడం అప్రస్తుతం కాదు.

రామదాసును తలచుకోవలసిన అగత్యం కలగడానికి ఆయన జీవించిన కాలం కూడ ఒక కారణం రామదాసు క్రీ.శ. 1650 ప్రాంతంలో గొలకొండ సామ్రాజ్యాన్ని అబుల్ హసన్ తానాషా పరిపాలించే కాలంలో ఉన్నాడు సరిగ్గా ఇదే కాలంలో వేమన్న పద్యాల రచన కొనసాగుతున్నదని భావించవచ్చు రాజకీయంగా రాయలసీమ పరిస్థితులకు, గోలకొండ పరిస్థితులతో కించిద్భేదం ఉన్నప్పటికీ, మొత్తం మీద రెండు ప్రాంతాలు పరస్పర ప్రభావితం చేసుకుంటున్న దశ అది రెండు ప్రాంతాల పరిస్థితులను విడదీయడానికి వీలుగాదు.

రామదాసు అసలు పేరు కంచర్ల గోపన్న ఇతడు నేటి ఖమ్మం జిల్లాలోని నేలకొండపల్లిలో జన్మించాడు కంచర్ల లింగనమంత్రి, ఆయన భార్య కామాంబకు రామానుగ్రహంవల్ల జన్మించిన ఏకైక సంతానం గోపన్నకు చిన్నతనం నుండి కూడ రామభక్తి మెండు రామతారక మంత్రోపదేశం పొంది సిద్ధిపొందాడు రామభక్తి కారణంగా గోపన్నకు రామదాసు అనే పేరు రూఢికెక్కింది

రామదాసు **'దాశరథీ కరుణా పయోనిధీ'** అనే మకుటంతో దాశరధీ శతకాన్ని రచించాడు ఇందలి పద్యాలన్నీ రామ భక్తి పరమైనవే ఈ పద్యాల ధారాశుద్ధి ధారాళమై రామదాసు సిద్ధహస్తాన్ని వ్యక్తం చేస్తాయి శతక సాహిత్యంలో రామదాసు పద్యాలు అనేకం నోళ్ళ కెక్కాయి "శ్రీ రఘురామ చారు తులసీ దళదామ" అనే పద్యం రానివారు అరుదు

తానీషా గోలకొండ పరిపాలించేటప్పుడు మంచిపేరు తెచ్చుకున్నాడు ప్రజాహితంగా పరిపాలన చేశాడని చరిత్రకారులు వ్రాశారు ఇతనివద్ద అక్కన్న అనే సేనాని, మాదన్న అనే ప్రధానమంత్రి ఉండేవారు వీరిద్దరు అన్నదమ్ములు కంచర్ల గోపన్న అక్కన్న మాదన్నలకు మేనల్లుడు గోపన్న భద్రాచలం తహసీల్దారుగా ఉండేవాడు సర్కారు డబ్బుతో దేవాలయం నిర్మించాడు శిస్తు చెల్లించనందుకు గోపన్నను పన్నెండేండ్లు తానీషా ఖైదు చేసి, ఆ తర్వాత అతడు గొప్ప భక్తుడని గుర్తించి వదలివేశాడు బందిఖానాలో అతడు భక్త్యావేశంతో, దుఃఖావేశంతో చెప్పిన కీర్తనలే రామదాసుకీర్తనలుగా ప్రసిద్ధికెక్కాయి

ఈ కీర్తనలన్నీ దాసభక్తితో ప్రపత్తి ధోరణిలో చెప్పినవే. వీటిలో సాంఘికపరమైన ప్రజల కష్టాలేవీ ఉండవు. అయితే రామదాసు వ్యక్తిగత దుఃఖం పొంగిపోయి కనిపిస్తుంది ఇది రామదాసు వ్యక్తిగత దుఃఖమే అయినప్పటికీ నాటి కాలంలో రాజకీయ మత రంగాల్లో వ్యాపించిన నైరాశ్యం రామదాసు గొంతులో కొంతవరకు ప్రతిధ్వనించిందని చెప్పకోవచ్చు అప్పటి పరిస్థితిని గూర్చి ఏటుకూరి బలరామమూర్తిగారు ఈవిధంగా వ్యాఖ్యానించారు.

**"11 వ శతాబ్దము నాటి వీరశైవ ఉద్యమంలో పుట్టిన భక్తి వాఙ్మయం మత ప్రచారం కొరకు, అన్యమతాలను ఖండిస్తూ పుట్టింది. 18 వ శతాబ్దంలో ఆంధ్రలో వ్యాపించిన భక్తి అలాంటిది కాదు. ఇది వైష్ణవ భక్తి. దాస భావంతో, ప్రతిఫలాపేక్ష లేకుండా కేవలం ఆత్మ సంతృప్తికై దేవుని పూజించటం ఇందులో ప్రధానాంశం. పాత సమాజం శిథిలమైపోతున్నది. కొత్త సమాజం ఎలా ఉంటుందో ఎవరికీ తెలియదు. ఈ సంధియుగంలో 'భారమంతా నీదే'నసే ప్రపత్తి ధోరణిలో ఈ భక్తి వాఙ్మయం సాగింది. తెలుగులో దాశరథీ, మానసబోధ, వేణుగోపాల మొదలైన భక్తి శతకాలు ఇట్టివాటిలో ముఖ్యమైనవి."**[27]

రామదాసు కీర్తనలు ఈ క్రింద కొన్ని ఉదాహరిస్తున్నాను.[28]

*1 నాదనామ క్రియ రాగం – ఆదితాళం.*

*పొయ్యేటప్పుడు వెంటరాదుగా*
*పుచ్చిన వక్కయిన*
*వెయ్యారులు దాచుకొనియు నర్థుల*
*కియ్యలేని లోభులయ్యయో* ||పొ||
*ఇచ్చిన మాత్రం బిచ్చును దైవము*
*హెచ్చుడిగిన రాదు*
*వచ్చేటప్పుడు వెంటనేమైన*
*తెచ్చుకొనగలేదు* ||పొ||

*2 నాదనామ క్రియ రాగం – ఆదితాళం*

*ఏ తీరున నను దయ చూచెదవో*
*యినవంశోత్తమ రామా*
*నా తరమా భవసాగర మీదను*
*నళినదళేక్షణ రామా* ||ఏ||

---

27 ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర – పేజీ 212
28 భద్రాచలం రామదాసు బందిఖానా (ఫుట్‌పాత్ పుస్తకం)
ప్రకాశకులు శ్రీలక్ష్మీనారాయణ బుక్‌డిపో, రాజమండ్రి – 1978

... . ... .
... ... .. ... ... ...
క్రూర కర్మములు నేరక చేసితి
నేరము నెంచకు రామా
దారిద్ర్యము పరిహారము సేయవే
దైవ శిఖామణి రామా. ॥ఏ॥
... ... .. ... .. ...
... ... .. .. .. ..

3. ధన్యాసి రాగం – ఆదితాళం
తారక మంత్రం కోరిన దొరకెను
ధన్యుడనైతిని ఓరన్నా
మీరిన కాలుని దూతల పాలిటి
మృత్యువు యని నమ్మకయున్న ॥తా॥
మచ్చికతో నితరాంతంబుల
మాటలలో పడబోకన్న
హెచ్చుగ నూట ఎనిమిది తిరుపతు
లెలమి తిరుగ పని లేదన్న
ముచ్చటగా నా పుణ్యనదులలో
మునుగుట పని యేమిటి కన్న
వచ్చెడి పర్వపు దినములలో సుడి
బడుటయు మానకయున్న ॥తా॥

4 ఆనందభైరవి రాగం – రూపక తాళం
కలియుగ వైకుంఠ భద్రాచలం –
నిలయము సేవింతము
అలివేణులార మీరానందముగ వేగ
విలసితమైనట్టి వేడుక చూడరె ॥కలి॥

చక్కని స్త్రీ పురుషులు పట్టణమందు
పిక్కటిల్లగ వింతలు, బ్రాహ్మణులు
మక్కువతో పూజలు, వేదశాస్త్ర తార్కిక వైష్ణవులు
గక్కున వారి కన్నుల జూచి
ఎక్కువైన పుణ్యమేమని తెల్పుదు ॥కలి॥

భక్తిపారవశ్యాన్ని కలిగించే కీర్తనలలో రామదాసువి మేలితరాలు వీటిలో అనేకం తెలుగునాట ఆబాలగోపాలము నోటికెక్కాయి ప్రత్యేకంగా భిక్షాటనం చేసే దాసరులు వీటిని పాడుతూ తిరుగుతుంటారు రామదాసు కీర్తనలలో ఇరువది యైదు రాగాలు

ప్రయోగించబడ్డాయి. ఎక్కువ కీర్తనలు నాదనామ క్రియలో ఉన్నాయి. అసావేరి, వరాళి, పున్నాగవరాళి, ఆనందభైరవులలో కూడ కీర్తనలున్నాయి. రామదాసు రచించిన కీర్తనలు పదయమకాలతో ధారాళమైన నడకతో హాయిని గొలుపుతాయి

## 11. తుకారాం

తుకారాం శివాజీ సమకాలికుడు మహారాష్ట్ర ప్రజావాఙ్మయంలో వెలలేని మణి వంటివాడు తుకారాం. ప్రజలపైన ఇతని ప్రభావం దృష్ట్యా వేమన్నతో పోల్చదగిన కవి తుకారాం. మహమ్మదీయుల దండయాత్రల సమయంలో మహారాష్ట్రంనుండి వెడలిన భక్తులందరికన్న తుకారాం గొప్పవాడు.

శివాజీకి ఖడ్గబలమెంత ఉన్నా, హిందూమత పునరుజ్జీవన మహోద్యమంలో, ప్రజలలో జాతీయ చైతన్యాన్ని ఉజ్జీవింపజేసి వారిని ఏకతా సూత్రంలో బంధించజాలిన బోధనలు తుకారాంవి.

తుకారాం పదాలను పలకని నాలుక మహారాష్ట్రంలో కానరాదు. నిత్య జీవిత సందర్భాల్లో తుకారాం సూక్తులు దారిబత్త్యాల వంటివి. తుకారాం పాటలను వేద వాక్యాలుగా భావించే భక్తులెందరో బయలుదేరారు.

తుకారాం 1608లో జన్మించాడు పూనా సమీపంలో వున్న 'దేహు' అనే గ్రామంలో తుకారాం జన్మించాడు. ఇతడు శూద్ర కులస్థుడు ధాన్యపు వర్తకం చేసేవాడు. అతనిది భక్తుల కుటుంబం పండరిపురంలోని విఠోభా భక్తుడు తుకారాం

శూద్రుడైన కారణంగా తుకారాంకు కూడ నాటి సంఘంలో అనాదరణం తప్పలేదు. అతని గొప్పతనాన్ని చూచి ఓర్వలేక ఒకనాడు ఇతడు రచించిన గ్రంధాన్ని, 'దేహు' గ్రామం పక్కనగల 'ఇంద్రాయణి' నదిలో పారవేయించారట అయితే దేవుడే దానిని రక్షించాడని వాడుక కథలున్నాయి

తుకారాం వ్యక్తిగత జీవితం కూడా ప్రశాంతంగా సాగింది కాదు అతడు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించాడు అతనికి భార్యలు ఇద్దరు దారిద్ర్యానికి తోడు అతని భార్యలిద్దరిలో ఒకతె చనిపోయి భార్యా వియోగ దుఃఖం కలిగింది ఆమె చావుకు కారణం ఆకలి 'అన్నం అన్నం' అంటూనే ఆమె ప్రాణాలు విడిచింది తుకారాంకు సాంసారిక జీవితంపైన విరక్తి జనించింది

ఒకనాడు కలలో 'గురుమహారాజ్' కనపడి 'రామకృష్ణ హరి' అనే మంత్రము ఉపదేశించాడు సంసార సాగరాన్ని తరించడానికి 'పాండురంగడ'నే ఓడను చూపించాడు ఈ గురువు 'బాబాజీ.' ఇతడు రాఘవ చైతన్య, కేశవ చైతన్య గురుపరంపరలోని వాడట దీనిని బట్టి 16 శతాబ్దం మొదట్లో బెంగాలులో బయల్దేరిన చైతన్య మతమూ, వైష్ణవ బోధనలు తుకారాంను ప్రభావితం చేసి ఉంటాయని పండితుల భావన

తుకారాం సన్యాసాన్ని స్వీకరించడం బతికి ఉన్న భార్యకు దుస్సహమయింది భౌతిక ప్రపంచంతో సంబంధం లేని నిర్వికార జీవితంలో పడ్డాడు తుకారాం నామదేవుని వలెనే ఇతడు కూడ గుళ్ళపంచల్లో నివసించేవాడు తీర్థయాత్రల నితడు నమ్మలేదు కాశీకి

వెళ్ళే యాత్రికుల నుద్దేశించి ఒక చేదు ఆనపకాయనిచ్చి 'గంగలో ముంచి చూడండి, ఇది తీపి అవుతుందేమో చూద్దాం' అని ఎగతాళి చేసేవాడట. వేమన్నను గురించి కూడ 'రాగికాసు'కు సంబంధించిన వాడుక కథ నొకదానిని చూశాము.

తుకారాం పదాలకుకూడా ప్రక్షిప్తాలపరిస్థితి ఉన్నది. 4600 పదాలు వ్రాసాడని (?) వాడుక. కాని అన్ని పదాలు దొరకడం లేదు. ఇతని పాటలను 'అభంగాలు' అని అంటారు.

వేమన్నకూ తుకారాంకూ వారి మతాలను గూర్చి నిక్కచ్చిగా నిర్ణయించలేకపోవడంలో పోలిక ఉంది. పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు కొల్లలు.

అయితే ఆశుకవితా సంప్రదాయాలలోని వారికిది సహజలక్షణమని వెనక చర్చించబడింది. అద్వైతచ్ఛాయలతో తుకారాంలో అనేక పదాలు కనపడతాయి అయితే తుకారాంను మానవతావాదిగా నిర్ణయించబోవడంలో ఆటంకాలేమీ కలగవు

తుకారాం జీవితంలో శివాజీ, సమర్థ రామదాసుల దర్శనమొక మధురఘట్టం. ఇతని అభంగ రచనలలో లౌకిక, పారమార్థిక అనుభవాలెన్నో సుందరమైన శైలితో వివరింపబడ్డాయి[29] కరువుకాలంలో కుటుంబం పడ్డ కడగండ్లు, సాధనలో ఎదురైన యిక్కట్లు, మనోదార్ఢ్యాన్ని పరీక్షించే వివిధ ఘట్టాలు, దారుణమైన నైరాశ్యం, భావనాప టిమ, ఆత్మసాక్షాత్కారం, ఆనందానుభూతి మొదలైన విషయాలన్నీ అభంగాల్లో వస్తాయి. తుకారాం వాక్యాలు మహారాష్ట్ర భాషలో చావులేని చాటువులైనాయి మచ్చుకు కొన్ని ఉదాహరణలుగా ఇస్తున్నాను.[30]

నిద్రేసి ఆసన్ ఉత్తమ్ పాషాణ
వరీ ఆవరణ ఆకాశాచే
తే ధే కాయకరణే కవణాచీ ఆస్
వాయా హోయ నాశ ఆయుష్యాచా

(నిద్రించటానికి రాతిపానుపు మేలు ఉండటానికి ఆకాశమే మంచి కప్పు కోరికయేల? కోరిక జీవితాన్ని వ్యయపరుస్తుంది మరి!)

యాతిహీన నయే ఏకోజయావేద
తయా దిలే పద వైకుంఠి చే
అతా మీ సర్వధా నాహ్నేగా దుర్బళ
యాతిహీన కుళ దైన్యవాణ

(తక్కువ కులంలో పుట్టిన నాకు, వేదాలైనా తెలియని నాకు స్వర్గంలో చోటిచ్చావు నువ్వు నా ప్రియదైవమా! ఏమైనా నేనిప్పుడు దుర్బలుణ్ణికాను పుట్టుకవల్లకానీ, వంశంవల్లకానీ తక్కువవాణ్ణి కాను, దుఃఖితుణ్ణి కాను )

---

29 దక్షిణ భారత సాహిత్యములు- మహారాష్ట్ర సాహిత్య సంగ్రహము గుండేరావు హర్కారే, పేజీ 182 ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1962

30 TUKARAM (Makers of Indian Literature), by Bhalchandra Nemade, Sahitya Akademi, New Delhi, 1980

దయా తిచే నాప భూతాంచే పాళణ
అణికి నిర్దళణ కంటకాంచే

(కనికరం అంటేనే ప్రాణాలన్నింటిమీద సద్భావముందని అర్ధం, దుశ్చేష్టితులను దునుమాడటమని అర్థం)

## 12. త్యాగయ్య

త్యాగయ్య వాగ్గేయకారుడు సంగీతప్రపంచంలో ఆయన కృతులు ఆపాతమధురాలు 18 వ శతాబ్దం ప్రపంచానికి సమర్పించిన (క్రీ శ 1767–1847) అనర్ఘ రత్నం త్యాగయ్య వేమన్న తర్వాత దాదాపు శతాబ్దం తర్వాత త్యాగయ్య తంజావూరులో జీవించి ఉన్నాడు

ఇతడు గొప్పకవీ, సంస్కర్త అయినప్పటికీ మహా సంగీతవేత్త, భక్తుడుగానే రూఢికెక్కాడు. ఆధ్యాత్మిక దృక్పథంతో, భక్తి పారవశ్యంతో కృతులు రచిస్తూ కాలం గడిపినప్పటికీ త్యాగయ్య రచనల్లో నాటి సాంఘిక పరిస్థితులు చోటు చేసుకోక తప్పలేదు

త్యాగయ్య తంజావూరు వద్దగల తిరువారూరులో జన్మించాడు ఇతని తండ్రి కాకర్ల రామబ్రహ్మం, తల్లి సీతమ్మ కాకర్ల కర్నూలు జిల్లాలోని గ్రామం రామబ్రహ్మం తాతగారి కాలంలో ఈ కుటుంబం తిరువారూరుకు తరలి వచ్చింది త్యాగయ్య తాత యక్షగానాలు రచించాడు తండ్రి రామభక్తుడు తల్లి రామదాసు కీర్తనలను శ్రావ్యంగా పాడేది ఆమె తండ్రి గొప్ప సంగీత విద్వాంసుడు ఇటువంటి కుటుంబనేపధ్యం త్యాగయ్యను సంగీత సాహిత్యాల్లో నిష్ణాతుడ్ని చేసింది తండ్రి పూజచేసుకుంటూ వుంటే, రామపరమైన కీర్తనలు గానం చేసేవాడట 'నమో నమో రాఘవాయ' అనేది ఇతని మొదటికృతి అని ప్రతీతి

త్యాగయ్య రామాంకితంగా **'త్యాగరాజ నుత'** అనే మకుటంతో 24 వేల కృతులు రచించాడని వాడుక కాని వెయ్యి మాత్రమే దొరుకుతున్నాయి ఇతడు రాజులనెవరినీ సేవించలేదు – ఉంఛవృత్తితో జీవనం గడిపాడు ఇతని కృతులనేకం రామునితో ముఖాముఖీ సంభాషణలు జరుపుతున్నట్లుంటాయి

త్యాగయ్య కొన్ని కృతులను సాహిత్యబంధం నుండి తప్పించి, సంగీతానికే ప్రాధాన్యమిచ్చి రచించాడు అయితే సాహిత్య గాంభీర్యాన్ని దృష్టిలో పెట్టుకొని రచించిన వెన్నో వున్నాయి సంగీత ప్రపంచంలో త్యాగయ్య ఏర్పరచిన మార్గం వలన గాయకుని మనోధర్మాలు, భావోద్రేకాలు రసవంతంగా వ్యక్తం కావడానికి అవకాశమేర్పడింది

త్యాగయ్య కాలానికి పాశ్చాత్యుల అలజడి వ్యాపించింది పాశ్చాత్యుల పోకడలను గ్రహించి కొత్తమెట్లతో **'రమించు వారెవరురా'** **'శ్రీరామపాదమా'** మొదలైన రచనలు చేశాడు

త్యాగయ్య ఎంత భక్తుడై నివృత్తిజీవితం గడిపినప్పటికీ, ఎంత సంగీత దృష్టితో కృతులు రచించినప్పటికీ అప్పటి మత సాంఘిక పరిస్థితులపట్ల ఉదాసీనవైఖరి నవలంబించలేదు అతడు అనుపమానమైన రామభక్తుడు అయితే రాముడిని కేవలం ఒక అలౌకిక భావనగా కాక, ఒక పరిపూర్ణమానవుడిగా అతడు భావించాడు

"Tyagaraju was a person of great humility and utter self-effacement. He expresses the truths of the Upanishads and the Bhagavadgita in simple and appealing language. He addresses the supreme as Rama The kingdom of God acquired through devotion is the greatest of all treasures. Tyagaraju speaks of Rama as an integrated person"[31]

శ్రీ డి వి రాఘవన్ త్యాగయ్యపైని తమ సిద్ధాంత గ్రంథంలో త్యాగయ్య "Reformist zeal" అనే అధ్యాయం వ్రాశారు[32]

త్యాగయ్య ఎంతటి భక్తుడో, సంగీత నిధో అంతటి సంఘసంస్కార ప్రియుడు కూడా అయితే మొదటి రెంటికి వచ్చినంత లోకప్రచారం మూడవదానికి రాలేదు.

సంఘ దురాచారాలను వివరిస్తూ త్యాగయ్య రచించిన, లోక ప్రచారానికెక్కని రెండు కీర్తనలను మొదట ఉదహరిస్తాను. ఇవి తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో వహీప్రతుల్లో ఉన్నాయి దేవనాగరి లిపిలో వ్రాయబడి ఉన్నాయి.[33]

*1* రాగము–గుమ్మ కాంభోజి–అటతాళము

చదివితేనే జ్ఞాని ఆయెనా
పదిలమైన వాడే
పరమ జ్ఞాని గాని ॥ధృ॥

నీటికి చేటుగా
నిత్యస్నానములు
పాటించి చేసితే
పరిశుద్ధుడాయెనా ॥1॥

మాటికి తిరిగే
మనసు జూచి వొక
చోట నిలిపిన వాడే
శుద్ధుడింతేగాని ॥2॥

భారమంటూ యెంచి
పణతుల తినయుల
ఊరక విడిచితేనే
యోగి ఆయెనా ॥3॥

ఆరు దామరల
నంటిన కుండలి
వేరు చేసిన వాడె
వీర యోగి గాని ॥4॥

---

31 Dr S Radhakrishnan Forword to "The spiritual heritage of Tyagaraja", An intraductory thesis by D V Raghavan, Sri Rama Krishna Math, Mylapore, Madras

32 The spiritual heritage of Tyagaraja, P P 1, 84-108

33 వీటిని గూర్చి నాకు తెలియజేసినవారు లక్కడి తెలుగు పండితులు విశ్వనాథంగారు ఇవి అమానత్ బండల్స్‌లో ఉన్నాయి

సరగులు ఫలములు
సరస కందమూలములు
మురియుచు తింటెనే
ముక్తుడాయెనా ॥5॥

ఆరయ చంద్రమండలినున్న
అమృతపానము జేసి
పర త్యాగబ్రహ్మైన
వాడె ముక్తుడు గాని ॥6॥

2 విటగాళ్ళు తిరిగేరు
వేపుల చందమున
అటూ ఇటూ వెళ్ళాండ్లనె (వెలయాండ్రు)
హరిణుల వెతకుచు ॥ధృ॥

అముకొనిన మోహా
మను గొలుసుల గట్టి
కాముడనే వేట
గాడు ఉసి గొలుపగ ॥విటగాళ్ళు॥

చాగుడిచిన వెనుక
సతతము సిగ్గు లేక
చీకటి వేళలనక
సీమాటుల ఇండ్లలోన
ఒకని కొకడు తరుముచు
ఒకనిపై ఒకడు కవయుచు
ఒకడు మార్చి ఒకడు
ఒకతె పైకొనుచు
ఎంగిలి పేట వేశ్యలు
ఇల్లు వెడల గొట్టినా గాని
ముంగిళ్ళు తొంగి చూచెరా
మురియుచు త్యాగాధిరాజ!

మానవత్వం త్యాగయ్య ప్రధాన ఆశయం రామునితో అతడు చెప్పికొను బాధలన్నీ ప్రజలందరి బాధలవలె అనిపిస్తాయి **'నాదుపై బలికేరు నరులు'** అని పరులు తనను నిందించడాన్ని గూర్చి ఫిర్యాదు చేస్తాడు తన సమకాలీన పరిస్థితుల్లో త్వరత్వరగా మారుతున్న కాలగతి అతన్ని కలిచివేసింది కాలం విరుద్ధంగా పోతున్నదని బాధపడ్డాడు చిత్తశుద్ధి గలిగిన భక్తిమార్గం తెలియని డాంబికులు మొదలైనారని కలత చెందాడు ఎంతటి మధురగాయకుడైనప్పటికీ త్యాగయ్య ఈ చేదును కరిగించుకోలేకపోయాడు సకల భేదాలను త్యాగయ్య ఖండించాడు

1. సావేరి – రూపకం
బలము కులము యేల రామ
భక్తి కారణము
వెలయు సకల సిద్ధులెల్ల
వెంట వచ్చుగాని మేను ॥బ॥

నీట కాకి మీను మునగ
నిరతము దయ స్నానమా
తేట కనులు కొంగ గూర్చ
దేవ దేవ ధ్యానమా ॥బ॥

పత్రములను మేయు మేక
బలమైన యుపాసమా
చిత్రపక్షు లెగయ సూర్య
చంద్రులకు సామ్యమా ॥బ॥

గుహల వేసి కోటులంటే
గుణము కల్గు మౌనులా
గహనమునను కోతులుంటే
ఘనమౌ వనవాసమా ॥బ॥

జంగములు బలుకకుంటే
సంగతి మౌనులా
అంగము ముయ్యని బాలురు
యపుడు దిగంబరులా ॥బ॥

వలచు త్యాగరాజు వరదు
వరభక్తులు సేయుభక్తి
చెలగు సకల జనులకెల్ల
చెల్లిన కాసానుగా ॥బ॥

తీర్థస్నానాలను గూర్చి –

1 కోటి నదులు ధనుష్కోటిలో నుండగా
ఏటికి తిరిగేవే ఓ మనసా!

అనే తోడిరాగం, ఆదితాళంలోని కీర్తన చాలా ప్రసిద్ధి కెక్కింది

వేమనంత భావావేశంతో కానప్పటికీ, మధురంగానే అయినప్పటికీ చురకలు వేసేటట్టున్న మరో కీర్తన శ్రీమణి (ఆదితాళం) రాగంలో ఉంది మంత్ర తత్త్వాన్ని ఎరగనివారు, పొట్టకోసం వేదాంత ప్రవచనాలు చేయడం విచిత్రంగా ఉన్నదని ఆక్షేపించాడు త్యాగయ్య శ్రీమణి రాగంలో పాడుతుంటే ఆక్షేపణ బాగా ధ్వనిస్తుందట

ఏ మందునే విచిత్రమును
ఇలలోన మనుజులాడే
నీ మంత్రమహిమ నెరుంగలేక

సామాన్యులై బల్కేరు నీతో
తామసంబు చేత
తత్త్వము బలుకుచు
కామదాసులై
కరుణమాలి మదిని
భూమి సంచరించి
పొట్ట నింపుచును
తామె పెద్దలట
త్యాగరాజ నుత!

కాల పరిస్థితులనెవరూ తప్పించుకోలేరు పద్దెనిమిదవ శతాబ్దంలోని అస్తవ్యస్త రాజకీయ, మత పరిస్థితుల దృష్టితో పరిశీలిస్తే మనకు మరో త్యాగయ్య కనిపిస్తాడు అతడు భక్తితత్త్వాన్ని ప్రచారం చేయడానికి కూడా నాటి మత సాంఘిక పరిస్థితులే కారణం.

## 13. గురజాడ

పరిశీలనలోకి ప్రవేశించకముందే స్థూల దృష్టికి వేమన గురజాడల మధ్య కొట్టవచ్చినట్టు కనిపించే సామ్యమొకటుంది ఇద్దరిని కూడా కవులుగా అంగీకరించడంలో కొంత జాప్యం, కొంత మొరాయింపూ చేసింది సంప్రదాయక పండిత మండలి. వేమన్న **"కవేమిటి"** అన్న ఈసడింపు ఒక వర్గంలో కొంత కాలం రాజ్యం చేసినట్టే, గురజాడ **'కవా, అకవా'** అనే చర్చలు కూడ జరిగాయి[34] వేమన – గురజాడ లిద్దరు కూడా తమ పూర్వులకన్న భిన్నమైన పంథా నవలంబించడం చేత అనాదరణ మేఘాలు తొలగిపోవడానికి సహజంగానే కొంతకాలం పట్టింది

గురజాడ 'కవి కాదా?' అనే చర్చలు జరిగినట్టే 'గురజాడ యుగకవా? కాదా?' అనే చర్చలు కూడ జరిగాయి డా॥ సి నారాయణరెడ్డిగారు గురజాడ, రాయప్రోలు ఇద్దరూ యుగకవులే అని తీర్మానించారు[35] గురజాడ పైన వ్యాసపరంపరలు వ్రాసిన శ్రీశ్రీ, గురజాడ వ్యక్తిత్వ పరిశోధనలో అనేక విషయాల నిగ్గు తేల్చారు[36] తన దృష్టిలో ముగ్గురే మహాకవులని – తిక్కన, వేమన, గురజాడలను పేర్కొన్నారు అయితే ఈ ముగ్గురినే పేర్కొనడానికి వారి ప్రత్యేక ప్రతిభా వ్యక్తిత్వాలే కారణమా? లేక వారి ముగ్గురిలో సామాన్య లక్షణాలు ఏవైనా ఉండడం కూడా కారణమా అనే అంశాలను శ్రీశ్రీ వివరించలేదు

తిక్కన, వేమన, గురజాడలు ముగ్గురూ మూడు కాలాలకు చెందినవారు పురాణ కాలానికి చెందిన తిక్కన, వ్యవహారంలో ఉన్న తెలుగుపలుకుబడిని కొంత ఏరుకొని నుడికారపు సొంపుతో ప్రయోగించడం, సాహిత్యేతరమైనప్పటికీ నాటి సమాజ శాంతిని భంగపరిచే శైవ, వైష్ణవ కల్లోలాలను పట్టించుకొని, రాజీమార్గంగా హరిహరాభేదంతో సామరస్య తత్త్వాన్ని ప్రతిపాదించడం – ఇవి తిక్కన శ్రీశ్రీ దృష్టిని ఎక్కువగా ఆకర్షించడానికి కారణాలు కావచ్చు అయితే తిక్కన దృష్టి అప్పటికి అమలులో ఉన్న

---

34 "గురజాడ లప్పారావుగారు" – పొట్లపల్లి సీతారామరావు జయంతి, జనవరి 1959

35 ఆదునికాంధ్ర కవిత్వము ప్రయోగములు – సంప్రదాయము

36 గురజాడ, శ్రీశ్రీ

సంప్రదాయానికి భిన్నమైనది కాదు. వేమన, గురజాడలను శ్రీశ్రీ అభిమానించడం సహజమైన సంగతి

తులనాత్మక పరిశీలన చేయదలచినప్పుడు వేమన – గురజాడలకు కొంత కలుస్తుందేమో కాని తిక్కన విషయంలో మాత్రం అది కుదరదు

కవీ, విమర్శకుడూ అయిన కీ. శే నూతలపాటి గంగాధరం "గురజాడకు మార్గదర్శి వేమన" అని ఓ వ్యాసం వ్రాశారు. అయనే "వేమన వ్యక్తిత్వము" అని మరో వ్యాసం ప్రకటించారు.[37] ప్రజావ్యవహార భాషను ఎన్నుకోవడంలో కొన్ని భావాలలో ఇద్దరికీ సామ్యమున్నదని స్థూలంగా కొన్ని ఉదాహరణలు చూపారు. పైగా తన రచనా వ్యాసంగంలో గురజాడ వేమన్నను ఆదర్శంగా తీసుకున్నాడని గంగాధరంగారు తీర్మానించారు.

ఇద్దరు కవులను, పైగా వేరు వేరు కాలాలకు సంబంధించిన కవులను, సరిపోల్చి చూచేటప్పుడు బాహ్యస్వరూపాలనే కాక తాత్త్వికమైన సామ్యాల్ని కూడ వీలయినంత వరకు పరిశీలించవలసి ఉంది వారి రచనలకు నేపథ్యం, వారి చైతన్యంయొక్క స్వభావం, వారు నిర్దేశించిన శ్రోతలు (లేక పాఠకులు మొదలైన అంశాలపైన కొంతైనా దృష్టి ప్రసరించవలసి ఉంది.

వస్తుతః గురజాడ మంచి భావుకుడు, సాహిత్యవేత్త తన కాలంకన్న ముందుకు చూడగలిగిన ప్రగతిశీలి తనకాలంనాటికి సాహితీప్రపంచం నిర్జీవమైన 'కొయ్యబొమ్మ'ల స్థితికి దిగజారింది "పుస్తకంబులలోని మాట"లే కాకుండా వ్యవహారంలోని మాటల్ని కూడా ఎక్కువగా కలుపుకొని, చదువుకున్న సంగతులే కాకుండా 'అనుభవమ్ముల' నుండి క్రోడీకరించుకున్న తత్త్వంతో రచన ప్రారంభించాడు గురజాడ రచనలకు 'కోమలుల సౌరు' ఎక్కింది గురజాడ అనుభవం సమాజ జీవితంలో నిమగ్నం కావడంవల్ల సిద్ధించిన అనుభవమే

గురజాడ, వేమనల రచనా హేతువులలో మంచి సామ్యంగా చూడగలిగిన మొదటి లక్షణం సమాజ జీవితంలోని నిమగ్నత

అయితే సమాజనిమగ్నత కలిగిన వాడయినప్పటికీ, ఆ సమాజం నుండి గురజాడ పొందిన చైతన్యానికీ వేమన సమాజం నుండి పొందిన చైతన్యానికీ భేదం ఉంది

"గురజాడ అప్పారావు కలిగించిన చైతన్యం సాహిత్య సంబంధమైనది" అని వెల్చేరు నారాయణరావుగారు అభిప్రాయపడ్డారు [38]

వేమన్నకు సాహిత్యపు గొడవలేవీ పట్టలేదు వేమన్న దృష్టి పూర్తిగా సమాజపరమైనదే సమాజంలోని హెచ్చుతగ్గుల మోసాల మీదే ప్రధానంగా ఆయన తన పద్య రచనను కేంద్రీకరించాడు

---

37 సాహిత్య గంగాలహరి – వ్యాససంపుటి, నూతలపాటి గంగాదరం, చిత్తూరు జిల్లా రచయితల సహకార ప్రచురణ సంఘం, చిత్తూరు, మే, 1976

38 కవితా విప్లవ స్వరూపాలు – పేజి 70

గురజాడ కవితలోని ఆశుకవితా లక్షణాలను వెల్చేరు నారాయణరావుగారు తమ సిద్ధాంత గ్రంథంలో సోదాహరణంగా నిరూపించారు గురజాడ రచనలను అచ్చువేసిన తీరులో చూస్తే గతి కుంటుపడినట్టు అనిపిస్తుందనీ, పాడడంలో అది తొలిగిపోతుందని నారాయణరెడ్డిగారు చేసిన సూచనను39 నారాయణరావుగారు అభినందించారు. సాధారణంగా గురజాడకు రచన చేసేటప్పుడు ధ్వనుల దృష్టేకాని అక్షర దృష్టి లేదని నారాయణరావు అభిప్రాయపడ్డారు40 వేమన పద్యాల్లోని ఆశుకవితా లక్షణాలను గూర్చి వెనక చర్చించాను

అయితే అచ్చంగా వేమన్న వలెనే గురజాడ కూడ ఆశు సంప్రదాయానికి చెందిన వాడని నిర్ణయించడానికి అటంకముంది ఈ ఇద్దరి ఆశురీతుల స్వభావంలో భేదముందని నారాయణరావుగారు వ్రాశారు

**"గురజాడ తన కవిత్వాన్ని ప్రధానంగా విద్యావంతులకే ఉద్దేశించారు. మధ్యతర గతిగా రూపొందిన ఆ వర్గంవారు అచ్చుపుస్తక పాఠకులు అయ్యారు. అచ్చుయంత్రం సాహిత్య స్వరూపంమీద అంతకు ముందెన్నడు లేని ప్రభావాన్ని చూపించింది. ఆ ప్రభావపు ప్రథమ ఫలితం, లిఖిత సాహిత్య మార్గానికి వ్యాప్తి రావడం, అందులోనూ పాఠ్యశైలి రూపొందడం."41**

వేమన్న ప్రత్యక్ష శ్రోతలు చదువు సంధ్యలు లేని సామాన్య జనులే శ్రోతలను బట్టి వ్యక్తీకరణ వ్యవస్థ మారుతుందన్న న్యాయాన్ని అనుసరించి వేమన్నలో లేని జాగ్రత్త, స్పృహ గురజాడలో కొంత కనిపిస్తాయి "నాది ప్రజోద్యమం, ఎవరిని సంతృప్తిపరచడానికోసం దాన్ని వదులుకోలేను"42 అని అన్నప్పుడు గురజాడ ఉద్దేశించిన ప్రజలు మధ్యతరగతి ప్రజలే అది ఆయన తప్పుకాదు ఏదో ఒక వర్గాన్ని దృష్టిలో పెట్టుకోకుండా ఎవరూ రచన చేయలేరు కాబట్టి గురజాడ రచనోత్పత్తిని శాసించిన ప్రజలూ, వేమన్న పద్యాల పుట్టుకకు కారకులైన ప్రజలూ ఒక్కరు కారు

అయితే వేమన్న, గురజాడలు ఇద్దరూ సమాజం మారాలనే బలమైన ఆకాంక్షను తమ రచనలద్వారా వ్యక్తపరిచారు

గాంధీ తన దారిని బుద్ధుని బోధనల్లో వెతుక్కున్నట్టు వేమన నుండి గురజాడ ఉత్తేజం పొందాడని గంగాధరంగారు అభిప్రాయపడ్డారు కావచ్చును సంఘ సంస్కరణకోసం ఆవేదన పడ్డ గురజాడ వేమన్నను గాఢంగా అభిమానించి ఉండవచ్చు

వేమన్న పద్యాలన్నీ ఆటవెలదిలో సాగినట్టు గురజాడ కవితలు ముత్యాలసరం (పూర్ణమ్మ మినహా) గేయ ఛందస్సులో సాగినవి ఆటవెలదీ, ముత్యాలసరం రెండూ విదేశీ ఛందస్సులే ఆటవెలదిని ఎందరు రచించి ఉన్నప్పటికీ అది వేమన్న సొంతమైంది ముత్యాలసరానికి ఏ జానపద గేయాలు మూలమైనా అది గురజాడ పేరుతో ముడిపడిపోయింది

---

39 ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయము - ప్రయోగము పేజీ 230

40 కవితా విప్లవ స్వరూపాలు - పేజీ 104

41 తెలుగులో కవితా విప్లవ స్వరూపాలు

42 ముత్యాలసరాలు పీఠిక

నిస్సందేహంగా గురజాడ వెలిబుచ్చిన భావాలకు వేమన పద్యాలతో సామ్యం చూపవచ్చు. ఆ పని గంగాధరంగారు చేశారు వారు చూపిన పోలికలనే ఈ కింద ఉదాహరిస్తున్నాను.

"రాతిబొమ్మ కేల రంగైన వలువలు
గుళ్ళు గోపురములు కుంభములును
కూడుగుడ్డ తాను కోరునా దేవుడు?

అనీ

రాయి దేవుడైన రాసులు మింగదా!

అనీ వేమన్న విగ్రహారాధన నిషేధిస్తే –

"మనిషి చేసిన రాయి రప్పకి
మహిమ కలదని సాగి మొక్కుతు
మనుషులంటే రాయిరప్పల
కన్న కనిష్టం!"

అని పై వేమన్న భావాన్నే గురజాడ ధృవపరుస్తాడు

గుహలలోన జొచ్చి గురువుల వెదుకంగ
క్రూర మృగమొకండు తారసిలిన
ముక్తి మార్గ మదియె ముందుగా జూపురా!

అని వేమన్న తన సహజసుందరమైన వ్యంగ్యధోరణితో అంటే, దాన్నే –

'దేవుడెకడో దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడే వేలా?'

అని వాచ్యం చేసి, సూటిడ్డెగా, ఘాటుగా అనేస్తాడు గురజాడ

తనదు నాత్మయందు దైవంబు గలుగంగ
తీర్థ యాత్రల కిల తిరుగు నరుడు
గందపు తునకలను గాడ్దె మోసినయట్లు

అని వేమన్న అంటే –

కన్ను తెరచిన కనబడడో
మనిషి మాత్రుడియందు లేడో
ఎరిగి కోరిన కరిగి యీడో – ముక్తి!

అని గురజాడ అంటాడు

పై ఉదాహృతులందు శరీరాలలో కించిత్తు భేదం కనిపిస్తున్నా, ఆత్మలు మాత్రం ఏకమే ననటంలో ఎవరికి ఏ విప్రతిపత్తి లేదనుకుంటాను"

## 14. కాళోజీ

వేమన జీవించిన కాలానికి దాదాపు మూడు వందలేండ్ల తర్వాత కాళోజీ జన్మించాడు[43] కాని వేమన్న ఇప్పుడు పుట్టివుంటే అచ్చం కాళోజీలాగే ఉండేవాడు. ఇతని పూర్తిపేరు కాళోజీ నారాయణరావు మిత్రులకు, అభిమానులకు కాళన్న.

కాళోజీని గూర్చి వ్రాసేవాళ్ళు అతడు వేమన వంటి వాడు అని వ్రాయడం కద్దు[44] కాళోజీ 'ఆధునిక వేమన' అని కూడా ఉపన్యాసాల్లో బిరుదులిస్తుంటారు. కాళోజీని ఆధునిక వేమన అని పిలువవలసిన అవసరం లేదు. ఎందుకంటే – వేమన ఇంకా పాతపడలేదు. అద్యతనభావిలో, వేమన్న పాతపడిపోయి, అభినవ వేమనలు పుట్టుకొచ్చే అవకాశం కూడ కనిపించదు

కాళోజీని చూడగానే విమర్శకులకు వేమన్న గుర్తుకు రావడానికి కారణమేమిటి? కాళోజీ వర్తమానకాలంలోని అన్ని వ్యవస్థల మీద దాడి చేశాడు ఎక్కడ ఏ అన్యాయం జరిగినా దానిని కవిత్వంతో ఎదుర్కొన్నాడు చెవులు కిర్రుమనేటట్టు ప్రతిఘటనలు సృష్టించాడు ఈ లక్షణాలతో స్థూలంగా చూసినా కాళోజీ వేమన్నను స్ఫురింపజేస్తాడు.

అయితే తులనాత్మక పరిశీలన అంటూ మొదలుపెడితే వేమన పద్యాలకు ప్రతిబింబాలనదగిన కవితలేవీ కాళోజీలో మనకు దొరకవు.

వేమన్నలాగే కాళోజీ నాడి పట్టుకొని చూసి వెంటనే నిర్ణయాలకు రాలేము అయితే వేమన్నకూ, కాళోజీకి ఒక మౌలికమైన సామ్యముంది అదే వారి ప్రతిస్పందన విధానం (Mode of reaction) అన్యాయాలకు, దుర్మార్గాలకు వారిద్దరూ ఒకేరకంగా స్పందిస్తారు, యీటెల్లాంటి మాటలు విసురుతారు ఈ విషయాన్ని కొంత వాచ్యంగా చెప్పకున్నాడు కాళోజీ

అవనిపై జరిగేటి అవకతవకలు చూచి
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు
పరుల కష్టము చూచి పగిలిపోవును గుండె
మాయ మోసము చూచి మండిపోవును ఒళ్ళు
పతిత మానవు జూచి చితికి పోవును మనసు
ఎందుకో నా హృదిని ఇన్ని ఆవేదనలు

వేమన్న – (మైనస్) మతం = కాళోజీ అని చెప్పవచ్చు అయితే మతానికి బదులుగా కాళోజీ కవితలో రాజకీయాలు చోటుచేసుకున్నాయి, దానికి కాల పరిస్థితులు కారణం

ముప్పదేండ్ల క్రితం సిద్ధించిన స్వాతంత్ర్యం వల్ల అనుకున్న ఫలితాలు రాలేదు దేశసేవ పేరుతో జరిగే మోసాలు, రాజకీయ నాయకుల పదవులవేట, దగా, దోపిడీ, నైతిక విలువల పతనం – ఇవన్నీ కాళోజీని నిరాశకు గురిచేశాయి కలత చెందించాయి స్వాతంత్ర్యానికి ముందు నిజాం రాచరిక వ్యవస్థకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో

---

43 జననం 1911

44 అరవై యేండ్ల యోదుడు కాళోజీ – షష్టిపూర్తి సంచిక

ప్రాణాలకు తెగించి పోరాడాడు కనుక అనంతర పరిస్థితులను చూసి కాలరుద్రుడైనాడు. చిత్తశుద్ధి నశించింది. ఎటు చూసినా రెండు నాలుకలు, రెండు రూపాలు

మాయలోకము మాయ జనుల
మనసులోగల మాట యొకటి
పైకి నుడివెడు పలుకు ఒకటి
చేయదలచిన చేష్ట ఒకటి.

వేమన్న తన కాలంనాటి మతాచార్యుల మాయవేషాలను బట్టబయలు చేస్తే, కాళోజీ వర్తమాన సమాజంలోని రాజకీయనాయకుల గుట్టు రట్టు చేశాడు ఈ విమర్శలో కాళోజీకి నీ, నా అనే భేదం లేదు. అనేక 'ఇజాల'కు నిలయమైన అధునిక వ్యవస్థలో కాళోజీ ఇజం ఏమిటి అని ప్రశ్నిస్తే సమాధానం దొరకదు. వేమన్నలాగే ఏదో ఒక 'పిడికిలి'లో ఇమిడే తత్త్వం కాదు కాళోజీది. "నిర్వచనానికీ పరిధికీ గిరికీ లొంగని మనిషి కాళోజీ అయన సోషలిస్టా? కాంగ్రెసా? నాస్తికుడా? నక్సలైటా? గాంధేయుడా? అనే ప్రశ్నలు అప్రస్తుతాలు."

కఠిన/కరుణాత్ముడు కాళోజీ – సురమౌళి షష్టిపూర్తి సంచిక.

మత ప్రమేయమున్నవారూ, ప్రజాస్వామికులనేవారు, వామపక్షాలవారూ అందరి ఆదరాన్ని ఎప్పుడో ఒకప్పుడు పొంది ఉన్నాడు కాళోజీ. ఏదో ఒక స్పష్టమైన 'నిబద్ధత' కావాలనీ, సాహితీరంగంలో కూడ మురాతత్త్వాలు ప్రబలిపోయిన ఈ కాలంలో కూడా కాళోజీ అందరివాడుగా కనిపించడానికి కారణం ఆయనలో అత్యంత శక్తిమంతంగా పలికే మానవతే వేమన్నలాగే కాళోజీ ఎవరినీ మభ్యపెట్టడు తనకు తోచింది, తాను తలచింది నిక్కచ్చిగా, ఎవడన్నా నొచ్చుకుంటాడేమోననే లౌక్యం లేకుండా చెప్తాడు కాళోజీ ఎంత కటువుగా చెప్తాడో అంత నవనీతంగా కూడా చెప్తాడు

చెమ్మగిలని కనులు బ్రతుకు
కమ్మదనము చాటలేవు
చెమ్మగిలని కనులు బ్రతుకు
కమ్మదనము చూడలేవు,
దప్పితీర గ్రోలనిదే
విప్పారదు మనసు మబ్బు
తలపులన్ని తీరనిదే
తలుపులేవి తెరచికొనవు.

వేమన్న తనకాలంలోని రాజులను తిట్టాడు కాళోజీ ఆ రాచరిక వ్యవస్థ పతనానికి కృషి చేశాడు

కాళోజీ కవితలు సూటిగా, సరళంగా ఉంటాయి అందరికీ అర్థమయ్యే ప్రజల భాష కాళోజీది తెలంగాణా మాండలికంలోని అనేక పదాలు కాళోజీ కవితల్లో కొత్త సొబగులు సంతరించుకున్నాయి వేమన్న రాయలసీమలో పుట్టి ఆ ప్రాంతపు పలుకుబడులతో పద్యాలు రచించినప్పటికీ తెలుగు భాష వెలిగినంత దూరమూ స్థిరకీర్తిని పొందాడు కాళోజీ తెలంగాణా ముద్రతో కవితలు వ్రాసినప్పటికీ అఖిలాంధ్రకవి అయినాడు

కాళోజీ కవిత్వం పంక్తులనేకం సాహిత్యాభిమానుల రసనాగ్రాలను సూక్తులై అలంకరించాయి. కాళోజీ లిఖిత సంప్రదాయపు కవి అయినప్పటికీ ఆశులక్షణాలకు దగ్గరగా కనిపిస్తాడు. కాళోజీ కవిత అచ్చులో చదివినప్పటికంటే చదివించుకున్నప్పుడుగాని లేక ఆయనే చదువుతున్నప్పుడుగాని ఎక్కువగా రక్తి కడుతుంది. కొన్ని కవితలు చదువుకున్నప్పుడు ఒక పాదం పొడవు, ఒక పాదం పొట్టి, ఒకచోట విరిగినట్టు, మరోచోట గతి సారళ్యం కొరవడినట్టు అనిపిస్తాయి. కాని అవే కాళోజీ చదివినప్పుడు భాషయొక్క నిత్యవ్యవహారంలోని జీవమూ నిసర్గ రామణీయకతా ద్యోతకమవుతాయి.

కాళోజీకి ఒక ప్రాంతమని లేదు. దేశమంతా పర్యటించాడు. ఆధునిక కాలధర్మాన్ని అనుసరించి వేలాది సమావేశాల్లో ఉపన్యాసాలు చేశాడు. స్వీయ కవితాగానం కావించాడు. వాటిల్లో అవకతవకలు లేని సమాజంకోసం కలలు కన్నాడు. విశ్వమానవతా సందేశం వినిపించాడు. మనుష్యుల మధ్య సంపూర్ణ సహకారమూ, మైత్రీగల సంఘాన్ని వాంఛించాడు.

*కులముతో పనిలేదు, గుణముతోడను లేదు*
*అందచందాలతో ఆవశ్యకము లేదు.*
*వయసుతో పనిలేదు, వరుసతోడను లేదు*
*కలిమిలేములు రెండు కలిసి సయ్యాటాడు*
*నచ్చజెప్పుటెకాని, రచ్చకీడ్చుటలేదు*
*మానవత్వము మెరుగు, మర్త్యలోకపు వెలుగు*
*సంపూర్ణ సహకార సంఘంబు మైత్రి*

అదేవిధంగా తన దృక్పథాన్నిగూర్చి చెప్తూ –

*'నానా ఇజాల కడుగున చూడ*
*నా ఇజానికే అగుపడును జాడ'*

అంటాడు 'నా' అంటే మనిషి మనిషి ఇజం, మానవత్వమే కాళోజీ కవితకు జవం, జీవం

14 మంది వేమన్నను పోలిన కవులను గూర్చి నా అవగాహన కెక్కినంత వరకు చర్చించాను వారు ఇతర భాషా కవులైనప్పుడు కూడా సామ్యాలు నేను ఏరుకున్నవే వీటిలో కొందరు కవులనుగూర్చి వంగూరివారు, రాళ్ళపల్లి వారు ఇదివరకే చర్చించివున్నారు వాటిని కొంత నా దృక్కోణానికి అనుకూలంగా మార్చుకున్నాను కొందరు కొత్త కవులను చేర్చాను వేమన్నలోని విశిష్ట లక్షణాలను మరింత భాసింపజేయడానికే నేనీ ప్రయత్నం చేశాను వీళ్ళేకాక 17వ శతాబ్దంలోని మహారాష్ట్ర వేదాంతీ, సంస్కర్తా అయిన సమర్థ రామదాసు, తంజావూరు నేలిన శాహాజీ, తమిళ కవయిత్రి అవ్వాయి, గ్రీకుకవి ల్యూషియన్ మొదలైన వారినికూడ కొన్ని కోణాల్లో వేమన్నతో పోల్చవచ్చు

ఇతర భాషా కవులగురించి ఎక్కువగా నేను ఇంగ్లీషు పుస్తకాలే చదివాను కొన్నిసార్లు ఆ భాషీయులైన మిత్రులు దొరకనప్పుడు ఉటంకింపులు ఇంగ్లీషులోనే ఇవ్వవలసి వచ్చింది ఉదా గురు నానక్

ఇంకా వేమన్నతో పోల్చదగిన కవులు అనేకులు మిగిలిపోయారు. ముఖ్యంగా వాగ్గేయకారులైన అన్నమయ్య, క్షేత్రయ్యలు. తెలుగు పలుకుబళ్ళను వాడడంలో వారిని వేమన్నతో పోల్చవచ్చు.

ఈ కవులందరిలో సమానగుణం ఒకటుంది. వీరందరూ దేశంలో విస్తృతంగా సంచారాలు చేశారు. నానా రకాల ప్రజల జీవితాల్లో నిమగ్నమై ప్రజా కవిత్వ సంప్రదాయానికి ఒరవళ్ళు దిద్దారు. వీరందరూ తమ రచనల్లో వాడిన భాష సామాన్యుల కందుబాటులో ఉన్నట్టిదే. ఆయా కాలాల సమకాలీన పరిస్థితులు వీరిలో ప్రతిబింబించినంతగా లిఖితసంప్రదాయపు కవుల్లో ప్రతిఫలించలేదు. వీరిలో ఎక్కువ మంది అలిఖిత సంప్రదాయానికి చెందినవారు; కాబట్టి వీరు నివసించిన కాలాలు, నిర్వివాదంగా నిర్ణయించబడినవి కావు. వీరిని గురించిన వాడుకకథలే ఎక్కువ.

★ ★ ★

## అనుబంధం - 1

# వేమన్న చిత్రాలు



చిత్రం–1



చిత్రం–2

# వేమన్న చిత్రం

ప్రాచీనులైన ప్రసిద్ధ వ్యక్తుల ప్రతిరూపాలు చాలావరకు ఊహాచిత్రాలే అయితే అవి కొన్ని ఆధారాలతో సాధించబడతాయి కాలక్రమాన వాటికి ప్రచారం కలిగి ఆ చిత్రాలకన్న భిన్నంగా ఆ వ్యక్తుల స్వరూపాన్ని భావించలేని పరిస్థితి ఏర్పడుతుంది

ఉదాహరణకు ఇప్పుడు ప్రచారంలో ఉన్న శ్రీకృష్ణదేవరాయల బొమ్మను శ్రీ కొండపల్లి లక్ష్మణరావు సాధించారట

తిరుపతి కొండమీద కళ్యాణమండపంలో కృష్ణరాయలు ఇరువైపులా చిన్నమదేవి, తిరుమల దేవీలతో ఉన్న పంచలోహ నిర్మితమైన విగ్రహముంది దండయాత్రకు వెళ్ళేటప్పుడు రాయలు తిరుపతిని దర్శించాడని ఐతిహ్యం ఆ శిల్పంలో కృష్ణరాయలకు రూమీటోపీ (Conical cap) ఉంది శ్రీ లక్ష్మణరావు ఆ ముఖరేఖలను మనస్సులో ఉంచుకొని రూమీటోపీని తీసివేయించి ఇప్పుడున్నటువంటి తలపాగాతో పెయింటింగ్ వేయించారు. దానికి కావ్యాల్లోని కృష్ణరాయల వర్ణనను ఆధారంగా తీసికొన్నారట పాశ్చాత్య చరిత్రకారుడు సివెల్ చేసిన వర్ణనకు కూడ ఇది సరిపోయిందట ఈ పెయింటింగ్ ఇప్పుడు హైదరాబాదులోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో ఉంది ప్రచారంలో ఉన్న చిత్రాలన్నింటికి ఇదే మాతృక[1]

అదే విధంగా వరంగల్లులో ఓ చరిత్రకారుడికి ఓ శిలాశిరస్సు దొరికింది అది ప్రతాపరుద్రుడిదని రూఢికెక్కింది పూర్వకాలపు వర్ణనల్తో సరిపోవడం దానికాధారం

అలాగే హంపీలోని ఒక కుడ్యచిత్రంలో విద్యారణ్యుడు పల్లకీలో ఊరేగుతున్న దృశ్యం ఉంది ఆ గుంపులో ఉన్న విద్యారణ్యుడిని విడిగా చిత్రించి అదే రూపాన్ని ప్రచారంలోకి తెచ్చారు తెలుగు విజ్ఞానసర్వస్వంలో కూడ అదే స్వరూపాన్ని వాడుకున్నారు

ప్రచారంలో ఉన్న 'వేమనయోగి' చిత్రం పుట్టుకను తెలుసుకోవడానికి ఈమాత్రం బాహ్యాధారాలు కూడా లేవు 'యోగి'గా వేమనకున్న ప్రచారం, బట్టలు వదిలేసి దిగంబరంగా తిరుగాడనే వాడుకా ఈ రూపంలో వేమన్నను ఊహించడానికి కారణమై ఉంటాయి

తల్లి గర్భమందు తాబుట్టినప్పుడు
మొదలు బట్టలేదు తుదనులేదు
నడుమ బట్టకట్ట నగుబాటు గాదకో
విశ్వదాభిరామ వినురవేమ

1 ఈ సమాచారం కొండపల్లిజీవారి శతజయంత్యుత్సవ (1877-1923) సందర్భంగా Indian Express (1977)లో (కటింగ్ పైన రాసిపెట్టుకోక పోవడంవల్ల తేదీ, నెల ఇవ్వలేకపోతున్నాను) శ్రీ జి కృష్ణ రాసిన "No Coloured history for him" అనే వ్యాసంలో ఉంది

అనే పద్యమూ, "సిగ్గు" ఉండకూడదని బోధించే ఇతరపద్యాలూ వేమన్న నగ్నంగా తిరిగాడనే ఊహకు బలమిచ్చి ఉంటాయి వేమనబొమ్మకింద పైపద్యాన్ని ముద్రించడమనే ఆనవాయితీని దీనికి ఆధారంగా చూపవచ్చు

## చిత్రం - 1[2]

వేమన బొమ్మ ఫోటోను వావిళ్ళవారు వేసిన 1925 నాటి ముద్రణంలో ముద్రించారు 1955 నాటి వారి **"కడపటి ముద్రణం"** దీనిదే వావిళ్ళవారు మొట్టమొదటిసారి ఈ బొమ్మను ఎప్పుడు ముద్రించారు? నేను చూసినంతవరకు 1925 కన్న ముందు వావిళ్ళవారు వేసిన సంకలనాల్లో వేమన్న బొమ్మ ఉన్నట్టు గుర్తులేదు ఇప్పటివరకు 1925 లోనే మొదటిసారి ముద్రించారని భావిస్తున్నాను

చిత్రం కింద తంజావూరి రాచనగరు నందలి చిత్రపటము నుండి తీసినది "By the Courtesy of Rao Sahib R Krishna Rao Bhonsle, M R A S" అని ఉంది

తంజావూరులో ఉన్నదని చెప్పబడే ఈ చిత్రమే బహుళప్రచారాని కెక్కింది తంజావూరు సరస్వతీమహల్ లో ఇప్పుడా చిత్రం లేదు ఇప్పుడక్కడ ఉన్నవారిలో దానిని చూశామని చెప్పినవారు కూడ లేరు అయితే ఎప్పుడైనా ఆ చిత్రం అక్కడ ఉండేదా? ఉంటే ఏమైపోయింది? పోతే ఎప్పుడు పోయి ఉంటుంది? అనేవి వేధించే ప్రశ్నలు

తంజావూరులో ఆ బొమ్మ ఉండేదని చెప్పడానికి ఆధారాలు లభిస్తున్నాయి వావిళ్ళ ప్రతికన్న మూడేళ్ళకు ముందు (1922) వేమన పైన గ్రంథం ప్రకటించిన శ్రీ వంగూరి సుబ్బారావుకు ఈ బొమ్మ తంజావూరులో ఉండటం తెలుసు ఆ ఫోటోను తమ గ్రంథంలో ముద్రించుకున్నారు 1924 డిసెంబరు రెడ్డిరాణి సంచికలోని Advertisement కూడ దీనిని బలపరుస్తున్నది[3]

అంతేకాక శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి తాను స్వయంగా తంజావూరులో వేమన చిత్రపటాన్ని చూసినట్టుగా 1928 లో శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మకు రాసిన ఓ జాబులో తెలిపారు[4]

---

2 ఈ బొమ్మలో వేమనకు మొలతాడుంది దిగంబరి కాదు కౌపీనధారి

3 రెడ్డిరాణి డిసెంబరు 1924, వెనక అట్ట, లోపలి ప్రక్కన "వేమన చిత్ర పటము (తంజావూరు రాచనగరు చిత్ర పటము నుండి తీసినది) ప్రతి 1 కి వెల రు 0-20, రెండు ప్రతిమలకు తక్కువ పంపబడవు క్యాటలోగు కోరినవారి కుచితము వెంటనే పై విలాసమునకు వ్రాసికొనుడు కమలాకుటీరము, నరసాపురము" 1926 నాటికే వేమన జయంతుల్లో వేమన చిత్రపటమును ఊరేగించడం కనిపిస్తుంది (చూడు - రెడ్డిరాణి, జనవరి 1926) 1929 లో ఏప్రెల్, జూలై, ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు సంచికల్లో "వేమన యోగీంద్రుని పటము" advertisement కనిపిస్తున్నది శ్రీ మరుపూరి కోదండరామిరెడ్డి 'వేమన-పాశ్చాత్యులు' అనే తమ అనువాద గ్రంథానికి '1920 ప్రాంతంలో వెలువడిన రెడ్డిరాణిలోని బొమ్మను ముఖచిత్రంగా వేసుకున్నా' మని చెప్పారు కచ్చితమైన రెఫరెన్సు లేదు గుర్తులోంచి రాశారా? రెడ్డిరాణి సంచికలన్నింటిని నేను చూడలేదు కాబట్టి ఆ బొమ్మను ఇంకా చూడవలసే ఉంది అయితే అది తంజావూరి బొమ్మే

4 A letter written to Rallapalli Ananta Krishna Sarma from Bangalore Camp 17 Viviani

"Vemana's picture appears in Vanguri Subbarao's 'Life of Vemana' which you ought to read Some time ago I discovered the fact that this picture has been widely current in some of the Bazaar editions also.... Probably the present Secretary of the Tanjore Palace Library is ignorant of the existance of Vemana's picture in the Library. When I visited Tanjore I was shown a picture myself and, though I do not know whether it was genuine or not, it was the original from which all the other current pictures have been derived. The Secretary who was there some ten years ago told me it was authentic and pointed out that there was a legend of Vemana having travelled in the southern districts also establishing disciples and mutts But being a confirmed anti-Vyasa I do not believe it, as evidences of this kind are very untrustworthy. The only fact about that picture is that it has been regarded as genuine and widely copied. As it is reproduced in Vanguri Subbarao's book, you need not trouble that Secretary with further correspondence."

పదేళ్ళక్రితం నాటి సెక్రటరీ చెప్పాడంటే 1918 నాటికి కూడ ఆ చిత్రం అక్కడుంది [5]

---

Road, Richard town Dated 11th May 1928 1928 లో రాళ్ళపల్లివారు 'వేమన' ఉపన్యాసాలకోసం నియమితులైన సందర్భంగా సలహాలిస్తూ, సూచనలు చేస్తూ, అభిప్రాయాలు తెలుపుతూ కట్టమంచివారు రాసిన ఐదులేఖల తాలూకు జిరాక్స్ కాపీలు నా దగ్గరున్నాయి వాటిని శ్రీ అశ్వత్థ నారాయణద్వారా శ్రీబంగోరె సేకరించారు

5 26-3-1972 న భారత ప్రభుత్వం విడుదల చేసిన తపాలాబిళ్ళ (20 పైసలు) పైన కూడా తంజావూరు బొమ్మే ఉంది శ్రీ అంట్యాకుల పైడిరాజు దానిని గీశారు (విశాఖలో గురజాడ కాంస్య విగ్రహం చెక్కింది ఈయనే) వేమన స్టాంపు వెలువడటానికి విశాఖ రచయితల సంఘం చాలా కృషి చేసింది 24-10-1971 నాటి 'వేమన గోష్ఠి', 26-3-72 నాటి 'వేమన జయంతి'లో వేమన తపాలాబిళ్ళ ముద్రించడానికి తీర్మానం, విజ్ఞప్తి చేయబడ్డాయి తలసాని ప్రసాద్, నార్ల, వాకాటి పాండురంగారావు, రావిశాస్త్రి, డా ద్రోణప్ప, పురిపండా, అంట్యాకుల పైడిరాజు, కృష్ణబాయి, అనంతం, కీ శే సంజీవయ్య మొదలైనవారు వేమన స్టాంపుకోసం చేసిన ప్రయత్నం ఓ ఉద్యమంలా సాగింది అప్పటి కేంద్ర సమాచారశాఖ మంత్రి బహుగుణ వేమన స్టాంపుతో పాటు బెట్రాండ్ రస్సెల్, టంగుటూరి ప్రకాశం, భాయీ వీర్‌సింగ్ కూడ అదే రోజున వెలువడ్డాయి వేమన స్టాంపూ, first day coverతో పాటు వెలువరించిన first day bookletలో వేమనను గురించి ఈ కింది విధంగా రాశారు

"A poet of the people, a philosopher of equality and a fighting Saint Vemana was unique in many ways His teachings have much contemporary relevence for he was a dreamer of One World and of the universal brotherhood of man "

వేమన స్టాంపు వేమన మూడవ శతజయంతి సందర్భంగా వెలువడింది

## చిత్రం - 2

వంగూరివారు తమ పుస్తకంలో ఇచ్చిన చిత్రం - 2 కింద ఈ కింది విధంగా రాశారు:

**"ఇది 1907 లో పమ్మి త్యాగరాయ శెట్టి కంపెనీవారు వేమన పద్యముల పీఠిక 14 వ పుటలో ప్రకటించిన దానికి నకలు. ఇది మన ప్రస్తుత చిత్రపటము తంజావూరు ప్రతికి దగ్గరగానున్నది. కాలు మాత్రం మణచియున్నది. ఇందున్నట్లే తంజావూరి పటమునందును పండ్లున్నవి. (ముఖచిత్రముననున్న ఫోటోలో రాలేదు). ఇది సదరు కంపెనీ వారొక సిపాయి యింట చూచిన రంగుల ప్రతిమకు నకలుగా దీసితిమని చెప్పిరి."**

తంజావూరు పటానికి సిపాయి ఇంట్లో దానికి పెద్ద తేడా లేదు. తంజావూరు పటంలోలా కాక, వేమన్న ఇందులో పూర్ణ దిగంబరుడు 1907 నాటి త్యాగరాయశెట్టి కంపెనీవారి వేమన పద్య సంకలన గ్రంథంలో తాము చూసినట్టు వంగూరివారు చెప్పారు 1908, 1901 లలో కంపెనీవారే వేసిన సంకలనాల్లో కూడ ఈ బొమ్మ ఉంది. 1908 నాటిది మూడవకూర్పు అయితే 1901 నాటిది మొదటికూర్పై ఉండాలి.

పమ్మి కంపెనీవారు సిపాయి ఇంట్లో చూసిన రంగులబొమ్మా, తంజావూరు బొమ్మా ఒకటే అని నా అనుమానం. సిపాయి రెఫరెన్సు పమ్మివారు కచ్చితంగా ఎందుకివ్వలేదు? తంజావూరు బొమ్మ అప్పటికే ప్రచారంలో ఉండి దానికన్న వేరే సోర్సునుండి సంపాదించిన ఘనత పొందాలని ఈ పని చేశారా? ఏవో చిన్న తేడాలు తప్పిస్తే రెండింటిలోని వేమన భంగిమ ఒకటే నకలు చేసిన చిత్రకారుని హస్తలాఘవంలో కొన్ని మార్పులు సిద్ధించాయేమో![6]

## చిత్రం - 3

ఇది 1913 లో రాయవరపు పూర్ణయాచారి బందరుప్రతిలో ఉన్న చిత్రానికి నకలు "దీనికి మాతృక ఎద్దియో తెలియదు వేమన్న దిగంబరి కాకపూర్వ మీస్థితిలో నుండెనేమో!" అని వంగూరి సుబ్బారావుగారు రాశారు దీనిని పూర్ణయాచారే వేయించారని నేను భావిస్తున్నాను ఒకరకంగా దీనికి కూడా చిత్రం-1 మాతృక పక్కఫోజులో మనం చూసే వేమనను ఎదుటినుంచి చూస్తే ఇట్లాగే కనపడుతాడు కాకపోతే చిత్రం-1లో వేమనకు కుడిమోకాలు పైన కుడిచెయ్యిని ఆనిస్తే, ఇందులో ఎడమ మోకాలు చుట్టు రెండు చేతులను అల్లుకొని ఉండటం కనిపిస్తుంది

## చిత్రం - 4

1926 లో దురైస్వామి మొదలియార్ వేమనపద్యాలకు తమిళవ్యాఖ్యానంలో రచించిన 'వేమనపద్దియమ్' అనే 315 పేజీల గ్రంధానికి ఇది ముఖచిత్రంగా ఉంది నడుందాకా వేలాడే

---

6 ఆ రోజుల్లో బ్లాక్ మేకింగ్ ఇప్పటి పద్ధతిలో ఉండేది కాదు చిత్రాన్ని బ్లాక్‌షీట్ మీద ట్రేస్‌చేసి దానిమీదే చెక్కేవారు ఆ చెక్కటంలో ఎట్లా సులువయితే అట్లా ఏర్పడ్డ అసమగ్రరేఖలివి అని శ్రీ శీలా వీర్రాజుగారు అంటున్నారు

కేశాలతో, కడుపుదాకా సాగిన బారెడు గడ్డంతో అభిముఖాసీనుడైన వేమన్నరూపమిది కాపీనమున్నది. వేమన్నకు జంధ్యం వేసిన ఘనత వీరికి దక్కుతున్నది. తిరువళ్ళువరును మనస్సులో పెట్టుకొని వేసిన చిత్రం కావచ్చు నిది

ఇవేకాక ఇంకా అనేకరకాల వేమనచిత్రాలు కనబడుతున్నాయి. వీరబ్రహ్మంలా (?) వేసినవి వాటిలో ఎక్కువ. పోతన్నలా వేసిన చిత్రాన్ని ఈమధ్య ఓ ఇంగ్లీషు పత్రికలో చూశాను. అన్నీ ఊహాచిత్రాలే కాబట్టి వేమన్న భావాలకు విరుద్ధంగా ఉండనంతవరకు వేటినీ ఖండించవలసిన పనిలేదు. అన్ని చిత్రాల్లో తంజావూరు చిత్రానికే ఎక్కువ ప్రచారముంది ఇదమిత్థమైన అర్థం చెప్పలేకున్నా వేమన్న మకుటం ఎట్లా ప్రజాదరణ పొందిందో, ఈ చిత్రం కూడ ప్రజల మనస్సుల్లోంచి తీసివేయలేనంతగా ముద్రించుకుపోయింది.

## ముఖచిత్రం

'ప్రజాకవి వేమన' పుస్తకం ముఖచిత్రంలో రెండు మార్పులు జరిగాయి తంజావూరు చిత్రంలో వేమన కూర్చున్న భంగిమ అసౌకర్యంగా తోస్తుంది. దీర్ఘాలోచనలో మునిగి ఉన్నవాడు ఎంతసేపని అట్లా కూర్చుంటాడు? కాబట్టి వేమన్న తలను మోకాలుపై ఆనింపచేయక తప్పలేదు తంజావూరుచిత్రంలో పక్కఫోజువల్ల ముఖం సగమే కనిపిస్తున్నది. వేమన్నభావాలు కనబడతాయేమో అనే ఆశతో ముఖాన్ని మనవైపుకు తిప్పటం జరిగింది.

★ ★ ★

# అనుబంధం - 2

# కటారుపల్లె వేమన సమాధి

(ఆంధ్రపత్రిక నుండి పునర్ముద్రితం. తేదీ నవంబరు 9, 1980)

*"బేట్రాయ్ సామిదేవుడా - నన్నేలువాడ*
*బేట్రాయ్ సామి దేవుడా*
*కదిరీ నరసింహుడా - కాట్రాయ వేముడా*
*యేటైన వేటకాడ - నిన్నే నమ్మితిరా!"*

కదిరి నరసింహస్వామి దేవాలయం వందల సంవత్సరాల చరిత్రకూ, తరతరాల రాజుల సాంస్కృతిక శిల్పవైభవాలకు సాక్ష్యం ఎత్తైన ఆకాశ గోపురాలు, సువిశాల ప్రాంగణంతో ఉన్న ఈ దేవళం అనంతపురం జిల్లాలోని కదిరి తాలూకా ప్రజల భక్తిప్రపత్తుల సాధనం కదిరినరసింహుడే ఉగ్రనరసింహుడని ప్రతీతి సుదీర్ఘంగా సాగిపోయే పై జానపదుల భక్తిగేయం చాలా ప్రసిద్ధమైంది ఇప్పటికీ కదిరి పల్లెల్లో మార్మోగుతున్నది. ఈ పాటలో కదిరి నరసింహుని సరసన కాట్రాయ వేముడు (కాడు+రాయ=అడవి రాజు; బేట్రాయ అంటే పెద్దరాయి రాజు లేక పెద్దతిప్పకు రాజు 'దొడ్డ బెట్ట' అనే పర్వతం కర్నాటకలో ఉంది అంటే పెద్ద దిబ్బ మన ప్రసిద్ధదేవుళ్ళందరూ పెద్ద తిప్పల స్వాములే) కూడ చోటు చేసుకున్నాడు ఎవరీ వేముడు? నరసింహునికే ఆ పేరుందా? పద్యాల వేమన్న కాదుగదా! అతడే అయితే నరసింహుని అవతారంగా అతనిని కొలిచేవారా? ఉగ్రత్వంలో వేమన దిట్ట

కదిరికి ఆరుమైళ్ళ దూరంలో కటారుపల్లె (కాట్రాయపల్లె?) అనే గ్రామంలో వేమన్న పేర ఓ సమాధి ఉంది

వేమన్న పేర్లు పెట్టుకున్నవాళ్ళు ఈ ప్రాంతంలో ఎక్కువ వేమారెడ్లే కాదు - వేమ నారాయణ, వేమనారి, వేమక్క వగైరా

*కదిరి తూర్పునందు ఘనత శోభిల్లగా*
*బరగు వర కరారుపల్లె వెలసి*
*యచలనిష్ఠ గూడ నమరి యుండెదరయా*
*విశ్వదాభిరామ వినురవేమ*

కదిరిలో ఎవరిని కదిలించినా ఈ పద్యం పాడుతున్నారు వేమన్నను కటార్లపల్లెకు ముడివేయడానికి ఆధారం ఇదొక్కటే తాటాకుపత్రుల్లో వేటిలోనూ ఈ పద్యం కనపడదు అందుకే కాబోలు కటార్లపల్లె వృత్తాంతం బ్రౌన్ దృష్టిలోకే రాలేదు అయన విచారణలు ఎక్కువగా కడప, కర్నూలు జిల్లాల్లో జరిగినయ్

నేటికి 82 ఏళ్ళకిందట (1898) డబ్ల్యూ హెచ్ క్యాంబెల్ అనే క్రైస్తవ మత బోధకుడు కటార్లపల్లెకు వెళ్ళి వేమన్నను గూర్చి విచారణలు జరిపి మద్రాసు క్రిస్టియన్

కాలేజి మ్యాగజైన్‌లో ఓ వ్యాసం ప్రకటించాడు. బ్రౌన్‌కన్నా కూడ లోతుగా వేమన పద్యాలను అర్థంచేసుకున్న పాశ్చాత్యుడీయన. 1928 లో శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ కటారుపల్లెకు వచ్చారు. మళ్ళీ ఇప్పటికీ అవే తెగని సమస్యలతో, అవే ఆశలతో, అవే సందేహాలతో నేను..

చుట్టూ చిక్కటి కొండల వరుస, ఎత్తైనబండలు, గుండులు...మాజీ అడవి అందాం.... వీటిమధ్య ప్రయాణం చేస్తుంటే ఈ ప్రాంతంలో వేమన్న తిరిగి ఉన్నాడన్న తలపులు ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి దారిని పొయ్యేవారిని ఆపి 'వేమన్న ఇప్పుడెక్కడున్నాడు?' అని అడగాలనిపిస్తుంది. కటారుపల్లె పక్కన క్యాంబెల్ వర్ణించిన కాలవ, రెండు చెరువులు ఉన్నాయి వర్షాకాలమైనా ఇప్పుడు వాటిల్లో నీళ్ళు లేవు. వానల్లేక నీటిబొట్లకు కటకటలాడుతున్నారు ప్రజలు. వేమన సమాధిని లక్షలుపెట్టి పునరుద్ధరిస్తే నిజంగా నీటి ఎద్దడి కూడా సమసిపోతుందని ఆశించుదాం.

వేమన సమాధి ఓ గుడి ఒకప్పుడు ఈ ప్రాంతమంతా అడవిగా ఉన్నప్పుడు సమాధి మాత్రమే ఉండేదట గర్భగుడీ, మిగిలిన కట్టడమంతా ఇటీవలివి గర్భగుడిని 70 ఏండ్ల కిందట రాయవెల్లూరు నివాసి శ్రీ సత్యాచారి కట్టించాడు గుడిముందరి భాగాన్ని 1933 లో గ్రామస్తులు చందావేసి కట్టించారు. గుడిలో సమాధేకాక వేమన్నవి అనుకుంటున్న పాంకోళ్ళు (వాటిపై ఇప్పుడున్న రేకు తర్వాత అతికించింది), వేమన ధ్యానం చేసుకున్న పీఠం (సత్యనారాయణ వ్రతం పీటలాంటి చెక్కబల్ల) ఉన్నాయి. ఈ సమాధి వేమన్నదేనని గ్రామస్తులు చెప్తున్నారు రాళ్ళపల్లివారు ఈ వేమన అసలు వేమన కాదని, తుంగ వేమన అని మరొకడున్నాడని సాక్ష్యాలతో నిరూపించారు. వారు చూసిన 'వేమన యోగీంద్ర చరిత్ర' తాటాకు ప్రతి ఇప్పుడు లేదు

గ్రామస్తుల ప్రకారం తుంగవేమన్న అనేవాడు వేమన్న శిష్యుడు పాతర్లపల్లె (పాత–రేపల్లె) నుండి కటారుపల్లెకు వచ్చి ఇక్కడ ధ్యానం చేసుకుంటున్న వేమన్నను కొలిచాడట కాబట్టి ఇది వేమన సమాధేకాని తుంగ వేమనది కాదు "తుంగ" వంశంవాళ్ళే వేమనగుడికి ధర్మకర్తలు అలయ ప్రాంగణం ముందరున్న సమాధులు తుంగవంశం వారివి వాటిలో ఒకదానిని చూపి అది తుంగ వేమన దన్నారు తర్వాత్తర్వాత తుంగ వేమనను వేమన్న అవతారంగా భావించే సంప్రదాయం నెలకొన్నది తరంనుంచి తరానికి వాడుక కథలు ఎట్లా మారిపోతుంటాయో, విప్పి చెప్పకోలేని అనేక కారణాలు వీటికెట్లా దోహదం చేస్తుంటాయో చూడడానికిదొక మంచి ఉదాహరణ వేమన కనికెళ్ళ గోత్రం వాడని చెప్పే పద్యాలు, ఇతర వేమన పద్యాలూ ఓ వ్యవసాయ కూలి పాడి వినిపించాడు వేమన పద్యాలను అంతటి స్ఫూర్తితో పాడటం నేనింతవరకు ఎక్కడా వినలేదు

చైత్ర శుక్ల పక్షంలోని మొదటి ఆదివారంనాడు కటార్లపల్లెలో వేమన బ్రహ్మోత్సవాలు నిర్వహిస్తారు (జయంతా, వర్ధంతా? వేమన జయంతులు జరుపుకోటానికి తేదీ నిర్ణయంకోసం రెడ్డిజన మహాసభల్లో రెడ్డిరాణి సంచికల్లో జరిగిన తర్జనభర్జనలు ఇన్నీ అన్నీ కాదు) చైత్రంలో వచ్చే గంగమ్మజాతరనూ దీనినీ కలిపి చేస్తారు నిజంగా గంగమ్మ ఇక్కడి ప్రజలను కరుణించాలి

ఈ ప్రాంతంలో క్యాంబెల్ విన్న ఈ కింది కథను ఇప్పుడెవ్వరూ చెప్పకోటం లేదు 12 ఏండ్ల వయస్సప్పుడు వేమన తన సావాసగాండ్లతో కొండల్లో ఆడుకుంటుండగా

ఓ సన్యాసి పిల్లల్ని పిలిచి దాహానికి నీళ్ళు తెమ్మన్నాడు. పిల్లలు భయపడి దగ్గరికే పోలేదు వేమన్న మాత్రం ధైర్యంగా ముందుకు వచ్చి, గుహకు వెళ్ళి, సన్యాసి కుండను వెతికి పట్టుకొని నీళ్ళుతెచ్చి దాహం తీర్చాడు. (ఎవరన్నా సాహసకార్యం చేస్తే "వాడు వేమన్నరా" అని చెప్పుకోటం తన చిన్నతనంలో కర్నూలు జిల్లాలో ఉండేదని శ్రీ గుట్టం వెంకటరెడ్డి చెప్పారు.) అతడు వేమన్న తలపై చెయ్యిపెట్టి జ్ఞానివవుతావనీ, పద్యాలురాసి ప్రసిద్ధుడవవుతావనీ ఆశీర్వచించాడు తర్వాత వేమన్నకు జ్ఞానబోధ చేశాడు కూడ. సంప్రదాయంలో ఉన్న లంబికాశివయోగేనా ఇతడు?

కటారుపల్లె వెళ్ళేటప్పుడు కలిగిన అనుభూతి వదిలివెళ్ళేటప్పుడు లేదు. వేమన పద్యాల చైతన్యం కన్న వేమన్న స్పృహ ఎక్కువ. కదిలిస్తే కథలు చెప్తారు.

వేమన్న గుడి నల్లచెరువులో కూడా ఉంది. ఇదికూడ సమాధేనట కాని దీనికి ప్రాధాన్యం రాలేదు. "పిడుగు పడిన స్థలం" అంటారు దీన్ని కదిరికి మరోవైపున 6 మైళ్ళ దూరంలో నల్ల చెరువు గ్రామం దీనికీ ఓ కథ ఉంది. పుల్లారెడ్డి అనేవాడు రాజైన అన్నతో కలహించి తల్లితో కూడ నల్లచెరువుకు వలస వచ్చాడు. అక్కడ సేద్యం చేసుకుంటుండగా మార్గంలో అతని తలపై పిడుగుపడి మరణించాడు. తర్వాత తల్లికి కలలో కనిపించి ఏడురోజుల తరవాత పునర్జీవుతుణ్ణి అవుతానని చెప్పి ఎనిమిదోరోజు బతికి వచ్చాడు "ఎట్లా బతికావు పుల్లారెడ్డీ?" అని అందరూ అడిగితే "నా పేరు పుల్లారెడ్డికాదు - వేమన" అని చెప్పాడు అప్పటినుండి మహాత్ముడై "తూర్పు" దేశమంతా సంచరించి అనేక మహిమలు చూపాడు ఇంగ్లీషు దొరలు కూడ అతని అద్భుతాలు మెచ్చి గౌరవించారు పుల్లయ వేమారెడ్డి కథ మిగతా వేమన కథల్లాగ మెకంజీ రాయించిన కొండవీటి కైఫియత్‌లో గాని, పూర్ణయాచారి, పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి, సి రామకృష్ణారావుల వేమనయోగి జీవితచరిత్రల్లోగాని లేదు

నల్లచెరువు రోడ్డుకు ఎడమవైపున ఉన్న ఊరు, కుడివైపు వేమన్న గుడీ, దేవళం వారి ఇండ్లు కటారుపల్లెలో కన్న పెద్దగుడి పట్టెనామాలతో, కుడిచేతి ముద్రతో, రూమీటోపీతో, నేలకానించి కిందికి మడచిన ఎడమకాలు, నిలువుగా మలిచినట్టున్న కుడికాలూ – ఇదీ వేమన్న చెక్కవిగ్రహం వర్ది కోణప్ప అనే పద్మశాలి కులస్తుడు (65 ఏళ్ళు) ఇప్పుడీ గుడిపూజారి 50 ఏళ్ళక్రితం అనంతకృష్ణశర్మగారు కలిసిన నల్లచెరువు చెన్నయ్య ఇతని తండ్రి తండ్రి కాలంపోయి కొడుకు కాలమొచ్చినా వేమన్న జీవితాన్ని గురించి కొత్త ముచ్చట ఏదీ వెలికి రాలేదు

నల్లచెరువులో కూడ వేమన్నజాతరలు జరుగుతాయి వేలాది జనం వస్తుంటారు వేమన్న బాధలను, రోగాలను తీరుస్తాడనే నమ్మకం ఉంది వేమన్న వేటినైతే నమ్మలేదో అవన్నీ జరుగుతున్నాయిక్కడ!

తుంగ వేమన, వేమన ఒకరు కాదు ఇతడు స్వోద్ఘాటిత (self-styled) వేమన లాగే కనిపిస్తున్నాడు ఇంకా ఇట్లాంటి వేమనలెందరో రాయలసీమలో దొరుకుతారని నాకు నమ్మకముంది, బ్రౌన్ అనేకస్థలాలు వేమన ప్రాంతాలుగా విని ఉన్నాడు కర్నూలు జిల్లాలోని క్రిష్టపాడు, గుంటూరుజిల్లాలోని ఇనుకొండ, కడపజిల్లా చిట్వేల్ మొదలైనవి.



వేమన సమాధి – ఆలయదృశ్యం

మూగచింతపల్లె ఎక్కడుందో ఇంకా స్పష్టంగా తేలలేదు చంద్రగిరి తాలూకాలో 'మూగచింతల' అనేది ఇదేనని ఆరుద్ర గారంటున్నారు మూగతనం, చింత మినహాయిస్తే 'పల్లె' కుదురుకొనని ఊహ

పై ప్రాంతాల్లో ఇంకా వాడుక కథల సేకరణ జరగాలి ఆ ప్రాంతాల్లో దొరికే జానపద గేయాలను సేకరించి వాటిలో వేమన ప్రసక్తి ఉందేమో పరిశీలించాలి అన్ని కథలనూ చిలికి నిగ్గు తేల్చాలి వేమన కటారుపల్లెవాడు కాకపోతే అక్కడ సమాధి, అంతటి జనశ్రుతి ఎందుకు ఉంటాయని ప్రశ్నించేవారికి ఒక్కటే జవాబు రాముడు మాయ లేడిని 'ఇక్కడే' కొట్టాడని భక్తులు చెప్పుకునే ప్రాంతాలు భారతదేశంలో 50 దాకా ఉన్నాయి వాడుక కథలను నిక్కమైన చరిత్రగా భావించటంలో చాలా చిక్కులున్నాయి

కొన్ని పద్యాలను ప్రజలలో చల్లి తాను ఇతిహాస అంతరాళాలలో ఎక్కడో దాక్కుని పోయాడు వేమన్న ఇప్పటికీ అతనిస్వరూపం పద్యాలే

# ఆధార గ్రంథాలు

1. వేమన పద్య సంకలనాలు
2. వేమనపైన రచనలు
3. ఇతర ఉపయుక్త రచనలు

# వేమన పద్య సంకలనాలు

(1829 నుంచి ఇప్పటి వరకు వందలాది వేమన పద్య సంకలనాలు వెలువడి ఉంటాయి. నా చిన్నతనంలో ప్రతి తెలుగింట్లో గూళ్ళలో, అటకలమీదా కనిపించేవి. నా దృష్టికి వచ్చిన గ్రంథాలపట్టికా, తెలియవచ్చినంతవరకు వివరాలూ ఇవ్వబడ్డాయి. అముద్రిత తాళపత్ర, కాగితం ప్రతుల వివరాలు పుస్తకంలో ఇవ్వబడ్డాయి కాబట్టి ఇక్కడ ప్రత్యేకంగా ఇవ్వటంలేదు. కొన్నింటి వివరాలు అసంపూర్ణంగా ఉన్నప్పటికీ భావి పరిశోధనకు ఉపయోగకరంగా ఉంటుందని చేర్చడం జరిగింది. అసంపూర్ణతకు కారణాలు మూడు: 1. శిథిలం (వెనకాముందూ అట్టలో, పేజీలో పోవటం లాంటివి), 2. చూసినవాటి వివరాలు నోటు చేసుకోవటంలో లోపం. 3. చూడనివి లేక విన్నవి (ఏ ఉటంకింపులోనో, క్యాటలాగులోనో, వ్యాపార ప్రకటనల్లోనో దృష్టికి వచ్చినవి). అయితే ఇవి చాలా తక్కువ.

ఆ కాలపు పుస్తకాల స్వరూప, స్వభావాలను కొంత ఊహించటానికి వీలుగా Inner cover details యథాతథంగా ఇవ్వబడ్డాయి. మొన్నటి వరకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు లండన్ నుంచి తెప్పించేదాకా బ్రౌన్ ద్వితీయ ముద్రణం (1839) దేశంలో అలభ్యమని నిరాశపడ్డాము. ఆశ్చర్యమేమిటంటే అదిన్నాళ్ళూ, ఇక్కడే మారువేషంలో దొరుకుతున్నదని తెలియటం! ఈ పట్టికలోని పదికిపైగా సంకలనాలు బ్రౌన్ ముద్రణకు నకళ్లు. ముద్రాపకులెవ్వరూ ఆ విషయాన్ని పేర్కొనకపోవటం అన్యాయం, శోచనీయం!)

1 1829 Translated by Charles Philip Brown of the Madras Civil Service THE VERSES OF VEMANA, Moral, Religious and Satirical Printed at the College Press Number of Poems 694 (బ్రౌన్ మొదటి ముద్రణ ప్రతి)

2 1839 Second Edition - Greatly Extended by C P Brown THE VERSES OF VEMANA, Moral, Devout, Mystical and Satirical in the original TELUGU Printed by R TWIGG, At The American Mission Press, POPHAM house, MADRAS దీనిని ఇండియా ఆఫీసు లైబ్రరీ నుండి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగుశాఖవారు మైక్రోఫిల్మ్ చేయించి సేకరించారు యోగి వేమన తెలుగు విజ్ఞాన కేంద్రం, ఎండోమెంట్సు కమీషనర్ కార్యాలయం, తిలక్ రోడ్, హైదరాబాదు – 500 001 వారు 1980 జూలైలో పునర్ముద్రించారు సంపాదకుడు బంగోరె (బ్రౌన్ రెండవ ముద్రణం ప్రతి)

3. 1843. **వేమన శతకము** 2న్ను. లండన్ మిషన్ ప్రెస్, విశాఖపట్నం. పద్య సంఖ్య 202. ఇది 1859 లో పునర్ముద్రించబడిందని తెలుస్తున్నది.

4. 1852. **వేంకట కృష్ణశాస్త్రుల గారిచే పరిష్కరించబడింది వేమన పద్యములు.** ప్రభాకర ముద్రాక్షరశాల యందు అచ్చువేయబడింది. పద్యసంఖ్య 1164. బ్రిటీషు మ్యూజియం క్యాటలాగును బట్టి 1859 లో పునర్ముద్రించబడినట్టు తెలుస్తున్నది.

5. 1857. (నళ సంవత్సర, ఫాల్గున శు॥ 8 కి సరియైన) వేంకటకృష్ణశాస్త్రులు గారి వల్ల లేఖక ప్రమాద జనిత దోషంబులు లేకుండా పరిష్కరింపబడినది. ప్రభాకర ముద్రాక్షరశాల. మూడు విభాగములు. I=417, II=467, III=279; మొత్తం=1163. బ్రౌన్ రెండవ ముద్రణకు నకలు.

6. 1858. **వేమన పద్యములు.** Selections from the Verses of Vemana (in the text and translation of C. P. Brown) P.P. 23, 23. See MORRIS (J.C) Telugu Selections etc. pt, iv. 8°. 1417 n.12. దీని రెఫరెన్సు బ్రిటిషు మ్యూజియం క్యాటలాగులో ఉంది.

7. 1859. **వేమన.** See Joyes (W) and Seshacharyulu N Ch. Telugu Series First Poetical reader..with Selections from the Vayamana Pathyam బ్రిటిషు మూజియం క్యాటలాగులో ఉంది

8. 1863. "**వేమన పద్యములు**" చిన్నస్వామిరాజు; సూర్యాలోకప్రెస్, మద్రాసు

9. 1867. "**వేమన యను మహాకవిచే నీతి-భక్తి-రహస్యశాస్త్ర సంబంధముగా రచియింపబడినవి" వేమన పద్యములు.** నేలటూరి సుబ్రహ్మణ్యం గారిచే విద్యావిలాస ముద్రాక్షరశాల యందు ముద్రింపబడియె మూడు విభాగాలు I=417, II=474, III=280 మొత్తం 1171 బ్రౌన్ ద్వితీయ ముద్రణానికి నకలు. అదనంగా 7 పద్యాలు చేర్చబడ్డాయి

10. 1871. వేమన పద్యములు "బళ్ళారిలో ఉండే చిత్తూరు లోకనాథ మొదలారిగారి కవిరంజనీ ముద్రాక్షరశాల యందు ముద్రించి ప్రచురింపబడియె." చెన్నపట్టణం మూడు విభాగాలు I=415, II=475, III=280 బ్రౌన్ ద్వితీయ ముద్రణానికి నకలు 6 పద్యాలు అదనం

11 1873 "Selections from VEMANA FOR THE USE OF SCHOOL & C TELUGU వేమన శతకములు మూడు. ఇది పాఠశాలల నిమిత్తము అచ్చువేయబడినది. FOURTH EDITION Published by order of the Director of Public Instruction, MADRAS Printed by W Pushparaatha Chetty, Kalaratnakaram Press, 103, Armenian Street, 50 Pages, 196 Poems, Price Anna 2"

12 1879 వేమన పద్యములు "నీతి భక్తి వైరాగ్య ప్రతిపాదకంబుగ వావిళ్ల రామస్వామిశాస్త్రులు &సన్స్ వారిచే ఆది సరస్వతీనిలయ ముద్రాక్షర

శాలయందు ముద్రించి ప్రకటింపబడియె." మూడు విభాగాలు. పద్య సంఖ్య 1172.

13. 1887. "వేమన పద్యములు" Verses of Vemana a Telugu Classic with word for word meaning and studies by Atmakamananda Paramahamsa, C. Narayana Pillai, Madras.

14. 1891. త్యాగరాయశాస్త్రి.బి. 'వేమన పదములు', టౌన్ హాల్ ప్రెస్, మద్రాసు.

15. 1892. వేమన పద్యంగళ్ (తమిళం) "100 Telugu stanzas of Vemana on religious, moral and philosophic themes. Edited in Tamil Characters with Tamil paraphrases, by Sitaram Prasad."

16. 1892. వేంకటసుబ్బ పిళ్ళె.ఎ. "వేమన నీతి వేన్ప." వేమన నీతి సూక్తులు. తమిళానువాదం పి. మంగపుట్టి నాయుడు. మద్రాసు.

17. 1892. శ్రీ వేమన పద్యములు సంపాదకుడు: పార్థసారధి అయ్యా. మద్రాసు.

18. 1894. వేమన పద్యములు. "MORAL STANZAS" by the great Telugu Poet Vemana. వేమన పద్యములు. వేమన యను మహాకవిచే నీతి భక్తి శాస్త్ర సంబంధముల ననుసరించి రచింపబడిన ఇయ్యది తత్త్వ సిద్ధోపాసకులకు సత్యంతోపయుక్తం బగునటుల పండితులచే పరిష్కరింపబడి పమ్మి–త్యాగరాయశెట్టి కంపెనీ వారిచే శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షర శాలయందు ముద్రించి – ప్రచురింపబడియె, చెన్నపురి." పద్యసంఖ్య 1172. బ్రౌన్ ద్వితీయ ముద్రణకు నకలు.

19 1898 వేమన పద్యములు. సంపాదకుడు దేవశంకర్ విశ్వనాథ్, మద్రాసు.

20 1900. వేమన పద్యములు. "లోకోపకారముగా ప్రసిద్ధి బరచిన పద్యములు ౧౧౫ కి – ఇది వేలూరు – కన్నయ్యదాసు గారిచే మొదటిభాగము తాత్పర్యంబులు రచియింపబడి ఈ గ్రంథము స్వతంత్రము పొందిన మద్దాల – వేలూరు భాష్యం మొదలారివారి శ్రీకురుమూర్తి శ్రీనివాస ముద్రాక్షరశాల యందు ముద్రింపించి ప్రచురింపబడియె." ప్రచురణ కర్తలు తేదల్చుకున్న ఎనిమిది సంపుటాల్లో ఇది మొదటిది "శ్రీమాన్ బాలస్వరూపానంద స్వాముల పౌత్రుడైన వే – కన్నయ్య దాసుడు" చేత 10 పేజీల వేమన జీవిత పరిచయం ఉంది తాత్పర్య సహితం.

21 1900. వేమన పద్యములు. "వేమన యను మహాకవిచే నీతి భక్తి రహస్య శాస్త్ర సంబంధము ననుసరించి రచింపబడిన ఈ గ్రంథము, తత్త్వసిద్ధోపాసకులకు సత్యంతోపయుక్తం బగునటుల కంభంపాటి వేంకటరత్నం గారిచే – ఇంచూరి సుబ్బారాయుడుగారి శ్రీకమలానంద ముద్రాక్షరశాల యందు ముద్రింపబడినది." (తాటాకులతో సరిపోల్చిన వివరాలు) పద్యసంఖ్య 1172

22. 1901. వేమన నీతి వేదాన్త రత్నావళి. (తెలుగు పద్యమ్. అంగ్లానువాదము.) సి. రాజరత్నం నాయుడు, మద్రాసు.

23. 1901. వేమన పద్యములు. "కొల్లాపురం అగ్రహారం నివాసియగు" పమ్మి త్యాగయశెట్టిచే ప్రచురితం మూడవ కూర్పు. పద్యసంఖ్య 1800. దీనిలో వేమన బొమ్మ ఉంది.

24. 1903. వేమన వేదాంత సిద్ధాంతము. జ్ఞానానందయోగి తత్త్వార్థబోధిని. త్యాగరాయ శెట్టి పీఠిక పద్య సంఖ్య 500.

25. 1903. వేమన పద్యమ్. (తెలుగు పద్యాలు-తమిళాచ్చు) "Edited on the basis of C. P. Brown's edition - with Tamil prose translation by పూడువాయి నారాయణదాసర్, మద్రాసు."

26. 1906. వేమన జ్ఞానమార్గ పద్యములు. ముత్యాల నరసింహయోగి అకారాది క్రమంలో కూర్చబడింది. సి. వి. కృష్ణాబుక్ డిపో. మద్రాసు-2. పద్య సంఖ్య 3002.

27. 1908. SELECTIONS FROM VEMANA. Published by P. Thyagaraya Chetty, Printed at Sri Rajarajeswari Nikethan Press, Old Washer man pet, MADRAS పద్యసంఖ్య 277.

28 1908. వేమన రత్నములు. పరిష్కర్త రెంటాల వేంకట సుబ్బారావు, మైలాపూర్, మద్రాసు పద్యసంఖ్య 200

29. 1908. వేమన పద్యములు. "టి. పార్థసారథి అయ్యవారిచే బరిష్కరింపబడి చెన్నపట్టణము [illegible] పేట యందుండు పమ్మిత్యాగయసెట్టి గారిచే స్వకీయ శ్రీ [illegible] నికేతన ముద్రాక్షరశాల యందు ముద్రింపబడియె." [illegible] పేజీల వరకు 1763 పద్యాలున్నాయి

30. 1908 వేమన పద్యములు. "శ్రీ మదుమారమణ చరణారవింద నిష్యందమా నమరంద తుందిల మత్తేందిరాయమాన సన్మానసులును వేదాంత పండితులునగు వేమనగారిచే రచియింపబడిన... లేఖక ప్రమాదజనిత దోషంబు లేకుండునటుల టి. పార్థసారథి అయ్యగారిచే బహిష్కరింప" బడినది ముద్రణ పమ్మి త్యాగరాయశెట్టి [illegible] 1792 పద్యాలు

31 1909 వేమన పద్యములు. "యెల్ల జనులకు [illegible] బగునటుల వేమనపద్యములకు అప్పలదాసు విరచిత పద్యములు" ఇచ్ఛాపురము

32 1909 వేమన పద్యములు. టి గోపాలయ్య (శాంతానందయోగి), మద్రాసు పద్యసంఖ్య 3002

33 1910 వేమన పద్యములు. వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, చెన్నపట్టణము పద్యసంఖ్య 1173 (బ్రౌన్ ద్వితీయ ముద్రణం నకలు)

34. 1911. వేమన పద్యములు (The verses of Vemana. Moral, religious, and Satirical). Translated by Charles Philip Brown of the Madras Civil Service, Madras. V. Ramaswamy Sastrulu & Sons. 1829 నాటి బ్రౌన్ సంకలనానికి పునర్ముద్రణ. 214 పేజీలు. పైన పద్యాలు, కింద అనువాదం. I–200, II–214, III–279.

35. 1913. వేమన సూక్తి రత్నాకరము. ఇది "సరస చతుర్విధ కవితా సామ్రాజ్య దురంధరులగు నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రులు గారిచే పరిష్కృతము." రాయువరపు పూర్ణయాచారి (బందరు) సేకరించిన పద్యాలివి. పద్య సంఖ్య 4035.

36. 1915. వేమన పద్యరహస్యార్థ తాత్పర్యబోధిని. పూడిపెద్ది సాంబశివరావు. పమ్మి – త్యాగరాయ శెట్టి కంపెని. చెన్నపట్టణం.

37. 1916. వేమనార్యుని పద్యపద శబ్దార్థము. "ఇయ్యది నెల్లూరుజిల్లా, మైపాటి గ్రామ నివాసియగు శ్రీకాళికా వరప్రసాద కవి విశ్వబ్రాహ్మణ శివజీవైక్య సంధానుయోగి, శ్రీమత్కూరూరి బంగారయ్య గారిచే రచియింపబడి రాఘవాచార్యులవారి ధనసహాయము వలన చెన్నపట్టణము పాత చాకలిపేట యందు ముద్రింపబడియె." దీనిలోని వేమనబొమ్మ కింద "వెర్రివేమన" అని రాశారు

38. 1916. వేమన పద్యములు. "శ్రీ వేమనయోగీంద్రకృతము. చెన్నపురి: వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటితము." మూడు విభాగాలు పద్యసంఖ్య 1173 బ్రౌన్ ద్వితీయ ముద్రణకు నకలు.

39. 1919 వేమన పద్యములు (ఆంధ్ర తాత్పర్య సహితము) వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ – మద్రాసు పద్య సంఖ్య 2457 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ పీఠిక (పైంగళ, భాద్రపద కృష్ణత్రయోదశి శనివారము – శ్రీ మహారాజావారి కాలేజీ. మైసూరు)

40 1920. శతక రత్నావళి. సంపాదితము, రెంటాల వేంకట సుబ్బారావు, బి ఏ; బి ఎల్; హైకోర్టు వకీల్, విక్టోరియా డిపో–మైలాపూర్–మద్రాసు "2000 పద్యములు 3000 పద్యముల నుండి యేరినవి." ఆంధ్ర పత్రికా ప్రెస్‌లో ముద్రించబడిన పుస్తకమిది

41 1921. వేమన పద్యములు. పరిష్కరణ. పార్థసారథి అయ్యవారు ప్రచురణ పమ్మి త్యాగరాయశెట్టి కంపెనీ చెన్నపట్టణము

42 1921 వేమన పద్యములు. "ఇది పండితులచే పరిష్కరింపబడి వేలూరు కుప్పుస్వామి మొదలారి వారి స్వకీయ అమెరికన్ డైమన్‌డు ముద్రాక్షరశాల యందు ముద్రింపించి ప్రచురింపబడియె." చెన్నపట్టణము, మూడు భాగాలు. పద్య సంఖ్య 1172. 56 పేజీలు

43. 1922 వేమన వాక్యార్థానుభవ శిరోమణి. "ఇయ్యది శ్రీ సద్గురు శంకరమంచి లక్ష్మీనృసింహ రాజయోగీంద్రుల వారి ప్రియ శిష్యుండగు గంజాం జిల్లా-బ్రహ్మపుర నివాసుడు, శ్రీ తారక బ్రహ్మానుభవి, పూడిపెద్ది సాంబశివరావు గారిచే రచియింపబడి, చెన్నపట్టణము పాత చాకలపేట యందు ముద్రింపబడియె." పేజీలు 56.

44 1923 వేమన జ్ఞానమార్గ పద్యములు. సి. వి. కృష్ణా బుక్ డిపో. మద్రాసు.

45 1925 వేమన పద్యములు (తాత్పర్య సహితము). వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్. రాళ్ళపల్లివారి పీఠిక, శేషాద్రి రమణకవుల "వేమన జీవితము."

46. 1926. వేమన పద్దియమ్ (తమిళానువాదం) వ్యాఖ్యానం: నారాయణ దాసన్, భారతీప్రెస్, చెన్నపురి, ముద్రాపకుడు - ఐ దొరైస్వామి మొదలియార్, చూలై, మద్రాసు

47. 1927 వేమన పద్యములు వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, మద్రాసు.

48 1928 వేమన పద్యములు వావిళ్ళ రామస్వామి అండ్ సన్స్, మద్రాసు

49. 1928 వేమన రత్నములు. "పండితులచే సరిచూడబడినది." రెండవ కూర్పు కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రితము పద్యసంఖ్య 1500

50 1929 వేమన రత్నములు. పసుపులేటి వెంకట్రామయ్య అండ్ బ్రదర్సు, బుక్ సెల్లర్స్ రాజమండ్రి కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రితము పద్యసంఖ్య 1277

51 1929 నీతి శతక సంపుటము. దీనిలో 100 వేమన పద్యాలు చేర్చబడ్డాయి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ ప్రకటితము శేషాద్రి రమణ కవుల పీఠిక

52 1931 వేమనయోగి పద్య రత్నములు. కొండపల్లి వీరవెంకయ్య, శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి పద్యసంఖ్య - 1200

53 1933 వేమన పద్యములు. పబ్లిషర్సు పులిపాటి రంగయ్య, శ్రీ రంగా బుక్ డిపో, చీరాల "రాజమహేంద్రవరమున శ్రీ చింతామణి ముద్రాక్షరశాల యందు ముద్రింపబడియె." పద్యసంఖ్య 1000

54 1934 వేమన పద్యములు. రామా బుక్ డిపో ప్రకాశితము

55 1934 వేమన పద్యములు. ఆర్ వేంకటరమణ శాస్త్రి గారిచే పరిష్కరణ పబ్లిషర్సు చందా నారాయణ శ్రేష్ఠి, సికింద్రాబాదు పద్యసంఖ్య 1200

56 1935 వేమన పద్యములు. "యన్. వి. గోపాల్ అండ్ కో. ఆనంద భారతి పవర్ ప్రెస్‌యందు ముద్రింపబడియె" పద్యసంఖ్య 3200

57. 1937. **వేమన పద్యములు.** టీకాతాత్పర్యసహితము (ప్రథమ భాగము) "The verses with meanings by Atmakamananda parmahamsa swamy. Part I. శ్రీ మదఖండ పరిపూర్ణ జ్ఞాన వైరాగ్యులైన ఆత్మకామానంద పరమహంస స్వాముల చేత, దృష్టాంతశ్లోకములతో రచింపబడినది. (2nd edition). వెస్టువార్డు అండ్ కంపెనీ వారిచే అమెరికన్ డైమండ్ ముద్రాక్షరశాల యందు ముద్రింపించి ప్రచురింపబడియె. చెన్నపురి." పుస్తకం మొదట్లో ఇండెక్సు ఇవ్వబడింది.

58. 1937. **వేమన పద్దియమ్** (తమిళానువాదం) వ్యాఖ్యానం: శ్రీ సీతారామ ప్రసాద్. ముద్రణ: ముత్తు వడివేల్ మొదలియార్, పూమగళ్ ప్రింటింగ్ ప్రెస్, స్టేషను మద్రాసు.

59 1941. **వేమన పద్యములు.** నేదునూరి గంగాధరం (?)

60 1949. **వేమన నీతిపద్య రత్నావళి.** కూర్పు: నేదునూరి సోదరులు. ప్రింటర్ అప్పలస్వామి.

61. 1955. **వేమన పద్యములు** తాత్పర్య సహితము. వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ వారిచే ప్రకటితము, మద్రాసు. పద్యసంఖ్య: 2728. రాళ్ళపల్లివారు వావిళ్ళవారి కడపటి ముద్రణమని పేర్కొనినదానికిది పునర్ముద్రణం.

62 1956 **వేమన పద్దియమ్** (తమిళానువాదం) యోగి శుద్ధానంద భారతి, అడయార్, మద్రాసు, తిరువన్మియూర్

63 1956 **వేమన శతకము** కొండా వీరయ్య అండ్ సన్స్

64 1957 **వేమన నీతి రత్నావళి.** మొదటి కూర్పు సి వి కృష్ణా బుక్ డిపో, మద్రాసు–1, పద్యసంఖ్య–1116

65 1958 **వేమన పద్య రత్నములు** నేదునూరి గంగాధరం గారి తాత్పర్యం పబ్లిషర్సు కొండపల్లి వీరవెంకయ్య, రాజమండ్రి, పద్యసంఖ్య – 680

66 1960 **వేమగీత.** ప్రథమ సహస్రము శ్రీరామ నృసింహమూర్తి కవులు (గంధం శ్రీరామమూర్తి, ఇట్టింకి నృసింహమూర్తి) శ్రీరామనృసింహ గ్రంథమాల, తోలేరు పద్యసంఖ్య – 1000

67 1960 **వేమన పద్యములు** (అకారాది కూర్పు) నేదునూరి గంగాధరం అద్దేపల్లి అండ్ కో, రాజమండ్రి పద్యసంఖ్య – 5000 ఈ గ్రంథానికి అభినందనము వ్రాసిన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ "వేమన్న పద్యములు ఒక దిశయొక్క సమగ్ర రూపము" అని వ్రాశారు

68 1961 **వేమన నీతి పద్య రత్నావళి.** గ్రంథ సంధాతలు నేదునూరి వేంకటాద్రి, వేంకట రామానుజం రెండవ కూర్పు సి వి కృష్ణా బుక్ డిపో, మద్రాసు పద్యసంఖ్య – 1116

